# తెలుఁగు రాజు కృతులు.

మొదటి భాగము.

కవిరాజు, విద్వాన్ పండిత

పెనుమెచ్చ సత్యనారాయణ రాజు.

జయపుర సంస్థానాస్థానకవి.



పబ్లిషర్సు:

రౌతు బుక్కు డిపో.,

ప్రొప్రయిటర్సు:

రౌతు చంద్రయ్యా అండ్ సన్సు,

రాజమండ్రి.



1954.
4, మార్చి.

మూల్యము
రూ. 5/-

# విషయసూచిక

# భూమిక.

Dr. S Bhagavantam
Vice-Chancellor



Osmania University
Hyderabad-Dn.-7

16 - 2 - 1954

రామకృష్ణము అను పేరున ప్రఖ్యాతి పురుషుఁడును, ఒకప్పుడు జయపురం వారి సంస్థానమున దివాన్‌గా ఉండినట్టియు శ్రీ రామకృష్ణగారి జీవిత చరిత్రమే యిమిడ్చి పండిత సత్యనారాయణ రాజుగారీ గ్రంథమును చక్కగా మంజరీ ద్విపదలలో వ్రాసియుండిరి. యీ గ్రంథములో జయపురాధీశుల యొక్కయు జయపురము యొక్కయు చరిత్రకూడా కొంత యున్నది. నేను ఆంధ్ర విశ్వకళాపరిషత్తునందు పదిసంవత్సరములకుపైగా జయపురము వారి త్యాగబుద్ధి వలన ఏర్పడిన రామచంద్రదేవ ప్రొఫెసరు పదవియందుండియుంటిని. శ్రీ విక్రమదేవవర్మ మహారాజులంగారికి నాయందత్యంత ప్రేమాభిమానము లుండెడివి. అట్టి నన్ను, నాకు చిన్నప్పటి గురువులైన సత్యనారాయణ రాజుగారు, యీ కృతులకు పీఠిక వ్రాయుమని కోరగా, సంతోషముతో అంగీకరించితిని.

సత్యనారాయణ రాజుగారు యిప్పటికి 35 సంవత్సరములకుపైగా ఉపాధ్యాయ పదవిలో నుండి, అనేక గ్రంథములు రచించి, ఆంధ్ర వాఙ్మయమునకపారమైన సేవచేసి, ఆంధ్రదేశమందంతను అసమాన ఖ్యాతిని సంపాదించిన మహాకవి. వారి రచనల ప్రాశస్త్యమును గురించి వ్రాయుటకు నాకర్హత లేదు. కాని వారింతకు పూర్వము రచించిన గ్రంథములలోని పద్యములను, యీనాడు ఈ రాజు కృతులలో నొకటైన రామకృష్ణములోని పద్యములను యిప్పుడప్పుడు చదివి ఆనందించితిని.

వారి కీర్తి చిరస్థాయిగనుండి వారి గ్రంథము లాంధ్రదేశమంతటను వ్యాపించుగాక.

సూరి భగవంతం

నార్ల వెంకటేశ్వరరావు,
ఎడిటర్ 'ఆంధ్రప్రభ'

మదరాసు,
25-3-49.

పండిత సత్యనారాయణరాజుగారు నాకు చిన్ననాటి గురువు. వారిశిష్యకోటిలో నేనొకడను. గురువుగారి కావ్యానికి శిష్యుడు పీఠిక వ్రాయడం లోకవిరుద్ధమైనానన్నీ కార్యానికి నియోగించడం ఆయనశిష్య వాత్సల్యానికి తార్కాణం. నేనిందుకు సాహసించడం కేవలం నా గురుభక్తిప్రాబల్య ప్రేరేపణతోనే.

పాఠాలుచెప్పి పరీక్షలు ప్యాసుచేయిస్తూనే దేశభక్తిని, ప్రగతి శీలాన్ని నూరిపోయగలవారు బహుకొద్దిమంది. అట్టివారిలో ఎన్న దగినవారు మాగురువుగారు. చిన్నయసూరి వ్యాకరణసూత్రాలను విశదీకరిస్తున్నా ఆయన దేశభక్తిని ప్రేరేపించగలరు, ప్రగతిదృష్టిని పెంపొందించగలరు. అందువల్లే ఆయన ప్రతికావ్యం నిష్కళంక దేశ భక్తికి కర్పూరనీరాజనం, నిరంతర ప్రగతిమార్గానికి జాజ్వల్యమాన కరదీపిక.

కలాన్నిపట్టినా మాగురువుగారు కఱ్ఱును మూలపడవేయలేదు. ఆయన పండితరాజు మాత్రమేకాదు, పండితరైతుకూడా.

అందువల్లే సాహిత్యరంగంలో పండితుని ప్రాగల్భ్యంతోపాటు జీవితరంగంలో కర్షకుని సన్నిహితత్వాన్ని కూడా ఆయన ప్రదర్శించ గలరు. అవసరంవస్తే ఆయన కత్తిపట్టగల ధీరులుకూడా.

కలంపోటు, కఱ్ఱు ఒడుపు కత్తి పదును— వీటి సమ్మిశ్రమమే ఈ 'ఆరాధన'.

ఇంతేకాదు 'పాత క్రొత్తల మేలుకలయికల'ను కూడా వీరి కావ్యంలో చూడవచ్చును. మూస పాతది, దానిలో పోయబడ్డ లోహం క్రొత్తది. కథాసంవిధానం పాతది. కథద్వారా చాటబడిన సందేశం క్రొత్తది. ఈ వైశిష్ట్యం శైలిలో సైతం ప్రస్ఫుటమౌతున్నది. అంతలో సంస్కృతపుజిగి, అంతలో తెలుగు తియ్యదనం, అంతలో ప్రబంధ ప్రౌఢిమ, అంతలో నవకవితాలాలిత్యం.

వీరి కృతులన్నీ ఆధునిక సాంఘిక వైజ్ఞానిక రాజకీయ మతాది సమస్త విషయములను రసవత్తరంగా లోకాని కందిస్తాయి.

నార్ల వెంకటేశ్వరరావు.

# నతి.

శ్రీమహిళాంశజాత యగు సీత నిజాంక మలంకరింప విం
జామర వీవ లక్ష్మణుఁడు; ఛత్రము నా భరతుండు వెట్టఁగాఁ
బ్రేముడి రాజదండము ధరించి నుతింప సుమిత్రపుత్త్రుఁడున్
శ్రీమహనీయు వాయుసుతు సేవలఁ జొక్కు విభుం దలంచెదన్

కరుణాకరు చర్లకులా
భరణున్ మత్సంస్కృతాంధ్రభాషాగురునిన్
ధరణీసురవంశ సుధా
కరునిన్ నారాయణాఖ్యు గణుతింతు నెదన్.

అస్మదీయజనకుఁ డైన వేంకటపతి
రాజమౌళి భక్తిఁ బ్రణతి సేసి
తల్లి రాఘవాంబ నెల్లవేళలయందు
నెడఁదఁగొల్తుఁ బ్రీతి కడలుకొనఁగ.

జననీజనకుల కంటెను
ననుఁ బ్రేముడిఁజూచినట్టి నాకాలయ స
ద్గుణగేహ మత్పితామహి
ననుపమసద్భక్తి నీలమాంబఁ దలంతున్.

కన్నబిడ్డ లట్టు గాపాడి ప్రజలను
స్వర్గవాసి యైన జయపురేశు
రామచంద్రదేవు రాజతామలభావు
సాధుమధురజీవి సంస్మరింతు.

పూజాపాత్రుఁ డఖండ నిర్మలయశఃపుంజుండు ధర్మాత్ముఁడున్
వ్యాజాభావుఁ డనంతదానయుతుఁ డష్టైశ్వర్యసంపన్నుఁడున్
రాజన్యాన్వయభూషణంబు జయపూరాజ్యాంచితుండౌ మహా
రాజా విక్రమదేవవర్మ నృపతిన్ శ్లాఘింతు నశ్రాంతమున్.

శ్రీరామకృష్ణదేవ కు
మారమహారాజచంద్రు మహితగుణాఢ్యున్
భూరితరాయుర్ధనవి
స్తారుం గావించి సాఁకు చంద్రకలాపా!

పసరములిచ్చి భూములిడి వాసమొనర్ప గృహమ్ముఁగూర్చి సాఁ
పెసక మెసంగఁ గోరికలనెల్ల ముదంబునఁ దీర్చుచుండు ని
ష్టసఖుని వెల్లపూడి కులసాగరసోముని రామకృష్ణు న
య్యసదృశసద్యశస్వి సుకృతాత్ముఁ దలంతు నుతింతు నిచ్చలున్.

తొలుత నుద్యోగమున నన్ను నిలిపి నట్టి
బండి శ్రీహరి రాయనిఁ బ్రస్తుతించి
నాదు క్షేమంబుఁ గోరు సన్మాన్యమతుల
హితులఁ గీర్తింతు సంప్రీతి నతి యొనర్చి.

---

# స్వవిషయము

పండితాకరమ్ము పశ్చిమగౌతమీ
మండలాంతరాళ మండితమ్ము
తణుకు తాలుకందుఁ దనరు కాఁకరపఱ్ఱు;
మామకీన జన్మభూమి కాఁగ.

మని రచ్చట మా పూర్వులు,
ధనంజయ సగోత్రులును వదాన్యులు కాత్యా
యన సూత్రులు శశికులజులు,
మనుమార్గము వీడనట్టి మాన్యగుణాఢ్యుల్.

పెను మెచ్చఁగ జనవారము,
ఘనతర కార్యంబు లెలమిఁ గావించుటచేఁ
బెనుమెచ్చ యింటి పేరును,
గొనినా రదె మాకు నాఁటఁ గోలెన్ జెల్లున్.

కావ్యములు చదువునాఁడే
నవ్యకవిత్వము సలుపుట నా కలవడియెన్
దివ్యమగు కవనకళచేఁ
గావ్యములు రచింతుఁ బద్య గద్యాత్మకముల్.

కోటపాడు నాఁగ గొమరొప్పు జయపుర
ప్రాంతసీమ నేఁడు వఱలుచుండు
రస్మదీయ జనకుఁ డాత్మీయజనయిత్రి,
సుతులు హితులు గలుగు సోదరులును.



కృతికర్త:
శ్రీ పెనుమెచ్చ సత్యనారాయణరాజు.

ముమ్మొదటన్ గుడివాడను,
బిమ్మట నీ తెణుకునందు విద్యార్థులకున్
గమ్మని తెనుఁగుం జెప్పుచుఁ,
గ్రిమ్మఁగ నా యశము "తెలుఁగురా" జనఁ బొలుతున్.

శక్రసమానవైభవుఁడు చారుకవిత్వ కళాప్రపూర్ణుఁడౌ
విక్రమదేవవర్మ సభ విశ్వజనీన కవీశ్వరుండనై
యక్రమమార్గముల్ దొఱఁగి యార్షకవిత్వ మహత్త్వసంపదన్
చక్రిగ రామకృష్ణునిఁ బ్రిసన్ననిఁ జేయుదుఁ గావ్యమాలలన్.

రాజులు పూర్వమందుఁ గవిరాజుల నేనుఁగు నెక్కఁజేసి ని
ర్వ్యాజవుభక్తి రాజనగరంబులఁ ద్రిప్పిరి పౌరులెల్ల నీ
రాజనమెత్త; నేను గవిరాజును గావుటఁ దఃఖ్ఖలో మహా
రాజును దిప్పినాఁడ రథరాజముమీఁదను విక్రమేశ్వరున్.

మేడయు పంటభూములు నమేయుఁడు విక్రమదేవవర్మ న
న్నీడిత సత్కవీంద్రునిగ నెంచి యొసంగుటఁజేసిగాదె నే
నోడల గాలిమోడల మహోత్సుకతం జరియించి యెన్నియో
చూడఁగఁదగ్గ దేశములఁ జూచితి భారతభాగ్యసీమలన్.

ఊటీకొండలు దొట్టి ఘూర్జర కళిం గోర్వీస్థలుల్ మెట్టితిన్
లాట బ్రిహ్మ మరాట వంగ కురు సౌరాష్ట్రాంగ కాశ్మీర క
ర్ణాటాంధ్రాది సమస్తదేశ నగరీనద్యబ్ధి రా ణ్ణిర్ఝరీ
కోటీ కాననశైలశృంగతతి గన్గొంటిన్ మహోత్సాహినై.

ధరణీపాలురు, మంత్రిపుంగవులు, నర్థంబున్న భూస్వాములున్
నిరతంబున్ జనుదెంచి నాగృహములో నీరాని బోసేసి నా

సరసాలాప సహాయసంపదలు విస్తారంబుగాఁ గాంచుటల్
పరిపాటౌటలు రామకృష్ణుని కృపావాల్లభ్యదృష్టాంతముల్.

అవధానంబు లొనర్చి మానితి వృథాయాసంబుగా నెంచుటన్
నవభావంబుల నాశురీతికవితల్ నానాఁట వ్రాయుచ్చితిన్
స్తవనీయుండగు విక్రమేశుని సభాస్థానంబు నందుండితిన్
కవిరాజన్ బిరుదంబు గాంచితి, జగత్కళ్యాణముల్ గూర్చితిన్.

చంటిబిడ్డలు దొరఁకొని శాస్త్రవేత్త
లంపటులు గూడ జదువఁగా నర్హమైన
పద్య గద్య ప్రబంధముల్ వ్రాసి వ్రాసి
ప్రజల విజ్ఞానదీప్తికై పాటుపడితి.

శతకములన్నఁ గొందఱికి శాస్త్రములన్నను గొంతమందికిన్
కతలనఁ గొంతమందికిని గావ్యములన్నను గొంతమందికిన్
మతకృతులన్నఁ గొందఱికి మక్కువలౌట లెఱింగియుంట, నే
స్తుతమతి నెల్లవారలును జొక్కెడు పొత్తములెల్ల వ్రాసితిన్.

చిత్తు 'సాఫ'ను వ్రాఁత నాచేత గాదు
తలఁపు కలిగిన వెంటనే కలము తీసి
గద్యపద్యాత్మకములైన కావ్యములను
వడిగ వ్రాయుట నాకు స్వాభావికంబు.

శతకం బల్లితి భీమనాథుపయి రాజస్థానగాథా కవి
తృతయావేదనముల్ రచించితిని గాంధిం బ్రీతిఁ గొండాడితిన్
బతిభక్తిన్ హారికారికావళిని భవ్యప్రక్రియం బల్కితిన్
రతిశాస్త్రమ్ము రసాలమున్ సలిపితిన్ జ్ఞానాంజలిన్ వ్రాసితిన్.

చంపకమాలినీచరిత జాను తెనుంగున సంతరించితిన్
ఇంపెసలారు పద్ధతి నహీనముదంబుధి రామకృష్ణు దే
లింపఁ దదీయ జీవితచరిత్ర లిఖించితి ఖండకావ్యముల్
సొంపులు గుల్కఁ బల్కితిని సూరివరేణ్యుల మెప్పుగాంచితిన్.

రాజానందము తెల్గుచేసితి మహాలంకారికుల్ మెచ్చఁగాఁ
బూజాపాత్రముగాఁగ వ్రాసితిఁ దపోభూమిన్; గళాతీర్థవి
భ్రాజద్దీమెయి శ్రీమదుత్తరమహా రామాయణాఖ్యాకృతిన్
నా జన్మంబు తరింపఁగా నుడివితిన్ ధన్యుండ నే నన్నిటన్.

నవకథావళి నవజీవనంబు మొగలి
రేకు గోరువంక విజయశ్రీయు రత్న
సుందరీ మనస్వినులు సుశ్లోకమైన
విక్రమదేవ శతక మాలపించినాఁడ.

విజ్ఞాన సాగరులు, ప్ర
తిజ్ఞాంధ్రోన్నత్యములును ధీశక్తి మెయిన్
విజ్ఞులు మెచ్చఁగ వ్రాసితి
ప్రజ్ఞాధన మినుమడించు వాగ్వైఖరితో.

నారలయును, భగవంతము
శ్రీరామారావు ప్రభృతి శిష్యులవలనన్
పేరొందిన నా గురుతకు
వేరే వ్యాఖ్యాన మేల వివరింపంగన్.

—

# కృతి సమర్పణము.

శ్రీరస్తంచుఁ ద్వదీయ వంశమునకే క్షేమంబు కాంక్షించుచున్
భూరస్తంచుఁ ద్వదీయవంశమును నే భూషించి వాగ్భూషలన్
ధీరస్తంచుఁ ద్వదీయవంశమును నే దీవించి రమ్యోక్తులన్
ప్రారంభించెద రామకృష్ణ! నవకావ్యాలంకృతుల్ నీకిడన్

ముప్పదియేండ్లనుండియు నపూర్వ కవిత్వ రసానుభూతిమై
నిప్పటిదాఁక నేను రచియించిన కావ్యకళావిభూషలన్
కుప్పగఁజేసి నేఁడిడెదఁ గోమలమైన త్వదీయకీర్తికిన్
మెప్పుగ రామకృష్ణ! కొనుమీ! భవదీయ జయంతి వర్ధిలన్

ఏఁబదియెన్మిదైన భవదీయ జయంతికి నంకితంబుగా
నేఁబదియైదు వత్సరముఃలించ జనించిన నాకుమారికన్
కూబర వృత్తరీత గుణగుంఫితరత్నమయూఖదీపితన్
నీబహుమానహస్తమున నే నిడితిన్ గొను రామకృష్ణుఁడా!

ఢిల్లీకోటలుదాఁటి నీదుగుణ వల్లీమల్లికల్ హిందు భూ
వాల్లభ్యధ్వజ దండమండనకళాపాండిత్య మార్జించుటన్
సల్లాపామృత రామకృష్ణ! సతిగా సాహిత్య సాహిత్య సం
పల్లావణ్యవతిన్ కృతీంది నిడితిన్ బాణిం గ్రహింపంగదే

దుర్గాంబాదరహాస చంద్రికలలోఁ దూఁగాడుచున్ గూడ శ్రీ
స్వర్గంగాలహరీ ప్రభావకవితా భామారమాకేళిమై
దుర్గాగంగలతోడి యీశుఁడటు సంతోషంబు రేకెత్తఁగన్
దిగ్గన్ వచ్చును రామకృష్ణ! కైకో నీ తెల్గురాట్పుత్త్రికన్



కృతిభర్త :

శ్రీ వెలగపూడి రామకృష్ణ

ఐ. సీ. యస్సు నటంచు నాదు సుత నీవాలంబుగావించి తేన్
గాసిం జెందితిఁ జేరరమ్మనిన యక్కాలంబునం దానునున్
ఐ. సీ. యస్సనియే జవాబునిడు శ్లేషార్థంబుగాఁ గాన నీ
వేసాలిచ్చుట చూపఁబోవక సఖా! ప్రేమించు మత్పుత్రికన్

గోదావరీతీర కేదారములు పోవ
ఇందాంవతీభూము లిచ్చినావు
'కాఁకరపట్టు'లోఁ గల గృహంబునువీడ
కోటపాడున ఇల్లు కూర్చినావు

యుద్ధకాలమునందు నుద్యోగ మొసఁగూర్చి
దోసిళ్ళతో సొమ్ము పోసినావు
నరసిన నాతల నరసి సోడాగ్యాసు
'నేజన్సి' యిచ్చి పోషించుచుంటి

విన్ని యుపకారములు చేయుచున్న కతన
నస్మదీయాంధ్రకృతికన్య నాత్మసఖుఁడ
వైన నీకిచ్చినాఁడ నే నంకితముగఁ
బ్రేమతో వెల్లపూఁడి శ్రీరామకృష్ణ!

ఆరాధనంబుతో నీరాజనంబిచ్చి
యావేదనంబును నందఁజేసి
విజయంపు శ్రీతోడి ఋజుభావ మందించి
చంపకమాలినీ చరిత మొసఁగి

పండితరాట్స్వాటు భావాలఁ గైసేసి
సరస రసాలంపుఁ జవులఁ జూపి
భీమేశశతకంబు నామెతగావించి
విక్రమశతకంబు విశదపఱచి

ప్రేమతోడ జ్ఞానాంజలిపెట్టి దీని
'రామకృష్ణము'గావించి రామకృష్ణ !
దేశదేశాల నీకీర్తి తేజరిల్ల
నంకితముచేయుచుంటి నీకందికొనుము.

పుత్త్రుని 'రామకృష్ణ' యని ముద్దిడుకొంచును నీదుపేరుతోఁ
బుత్త్రికఁ దెల్గురాట్కృతిని మోదముతోనిడి నీకు, జన్మతా
పత్రయమీఁగఁగంటి, భవబంధములన్నియుఁ ద్రెంచుకొంటి స
న్మిత్త్రమ! రామకృష్ణ! కనుమీ! ధనధాన్య చిరాయురున్నతుల్.

ఇ తి శి వ మ్.

శ్రీ శ్రీ జయపురేశ! శ్రీ విక్రమేశ!
మత్కావ్యకన్యక మంజుళాకార
మంజరీ ద్విపదను మధుర సువృత్త
సకల భూషణయుక్త సద్భావసక్త

సురుచిర వర్ణసంస్థానమానాత్మ
సరసగుణాన్విత సల్లక్షణాఢ్య
నుపగతవివయ నుద్యోతమానార్థ
రేఖను, గళ్యాణిఁ బ్రీతి తత్కాంత

గ్రహియించి సుఖపడు రసికాగ్రగణ్య!
తలకళింగ క్షత్త్రతనయా వతంస
నుత్కళింగ క్షత్త్రియోత్తంస నీవు
పరిణయంబాడుట భావికాలమున

నుభయదేశములకు నోదవు వియ్యంబు
సత్కళా పరిపూర్ణ చంద్రుండ వౌట
సత్కళా పరిపూర్ణ సతియె లభించెఁ
గావుట వియ్యంబు గాంచెను సమత

వార్ధక్యమున సుఖపడెడు నాతండె
ధన్యజీవనుఁ డని తలఁతురు బుధులు
ప్రాయంబు కై వ్రాలు వయసు రాకుండఁ
బడసిన నాకన్య పరిభువరా! నీకు

సకలోపచారముల్ సలుపు సద్భక్తి
నీదు సామ్రాజ్యంబు నీదు సంపత్తి
గాంచి నిన్ నాకన్య కాంక్షింపలేదు
నీదు పాండిత్యంబు నీ కవనంబు

నీదు విజ్ఞానంబు నీదు త్యాగంబు
తిలకించి పులకించి తివిరెను గాని;
దిగ్వధూ దరహాస దీప్తులతోడఁ
జెలికారమును సదా చేయుచునుండు

నీకీర్తి యెందాఁక నెలకొనియుండు
నందాఁక నాకన్య యశమును నుండు
అల్లుఁగుఱ్ఱఁడ వౌట నాడితిఁ గాని
వివరింపఁగానేల వేఱుగా నీకు
కావ్యకృద్వర్మ! విక్రమ దేవవర్మ!

# తెలుఁగు రాజు కృతులు.

## రామకృష్ణము.

శ్రీ రామకృష్ణ దేవా!
కారుణ్య రసార్ద్రీభావ! ఘనతర విభవా!
నీ రమ్యచరిత వినిచెదఁ
బ్రారిప్సిత కావ్యసిద్ధి వర్ధిల్లంగన్.

### రామకృష్ణ జన్మస్థానము.

శ్రీమధురకుఁ జెంత వ్రేపల్లె వోలె
రేపల్లెకుం జెంత రేకెత్తు చుండుఁ
బ్రిభువరా! బెల్లమువాని పాలెంబు
అందెందుఁ గనుఁగొన్న హర్షంబు గూర్చు
పదము కందనియట్టి వాలుకా స్థలులు
పిల్ల కాల్వలఁ బాఱు విమలంపు నీళ్ళు
గుబురుగాఁ బెరిఁగిన గున్నమామిళ్ళు
పసరముల్ మేసెడు పచ్చిక బీళ్ళు
కొక్కొరోకో యని కూసెడు కోళ్ళు
గుట్టలఁ గోరాడు కోడెల జోళ్ళు
కోయిలల్ గమిచెడు గొనబుఁ జివుళ్ళు
పెట్టని కోటలై పెరిఁగిన తాళ్ళు
సోపాలు దీర్చిన సొగసు లోఁగిళ్ళు

బంతి చేమంతులఁ బరఁగు మునిగిళ్ళు
భక్తులఁ దనిపెడు బంగారు గుళ్ళు
బాగుగాఁ బండిన ప్రాసంగి మళ్ళు
పాలముంతల తోడ వఱలు కావళ్ళు
ఆలమందల తోడ నలరు సావళ్ళు
పడమిముగ్గిడి నట్టి మొగలి పువ్వాళ్ళు
చెంగల్వ పూలతోఁ జెన్నారు కోళ్ళు
గోనెసంచులు నేసి కొనఁబేను తాళ్ళు

తా త సం ప ద.

కొనలొత్తు నాయూరి కోలఁకు చెంగటన
గోశాల పక్కఁగాఁ గొదవేమి లేని
మందువా లోఁగిలి మానవా ధీశ!
తనకునిక్కపట్టుగా ధన్యజీవనుఁడు
సకలార్థ యుక్తుఁడు సజ్జన నుతుఁడు
విపుల భూస్వామియు విజ్ఞాన ఖనియు
వెలఁగ పూఁడింటి పేర్వాలయు నాతోడుగ
రామయ్యయను కమ్మ రాజొకఁ డుండెను
కొలుచులు కొట్లలోఁ గొల్లఁగా నరుదఁ
దొట్టులు దొడ్డిలోఁ దులఁదూఁగు చుండ
గృహలక్ష్మి యొరిమతో నిలుదిద్దుచుండ
హాయిగాఁ గాఁపురం బుండెరు నాసామి

తా త సం తు లే క వ్య గ చు టః

పూలుఁగాయలు లేని భూమిజమ్ములను
వలపుఁ జల్కులులేని పంజరమ్ములను

దీప కళికలేని దివ్యాలయములఁ
గాంచి యాతఁడు సిగ్గు గాంచుచునుండుఁ
దనయులు లేరని తపియించుచుండుఁ
దనయులు లేనట్టి తనదు జీవితము
తనయులు లేనట్టి తనదు సంపదలు
వ్యర్థంబుగా నెంచి భావంబునందు
నాలితో యోజించి యాలయమందుఁ
దనకులమునవారు దరియింతు రంచుఁ
దనపేరు పుడమిపైఁ దనరారు నంచుఁ
దన సిరి సంపదల్ దైవారు నంచుఁ
దన పాఁడిపంటలు దళమగునంచు

తా త పెం ప క ము.

నొంగోలు తాలూక నుండిన యట్టి
దొడ్డవర పురాన దొరవోలె నున్న
కాట్రగడ్డాన్వయ కంధి సుధాంశు
వేంకట సుబ్బయఁ బెంపకం బందెఁ
బ్రథిత గుణాఢ్యుఁడౌ రామయ్య తాను
నేమూరుతమునందు నెంతేనిఁ బ్రేమ
వేంకట సుబ్బయఁ బెంచు కొన్నాఁడొ
తామర తంపరై దత్తుని వల్ల
నాతని కులమెల్ల నభివృద్ధి చెందె
నాతని డెందంబు నానంద మొందె

త ం డ్రి — కు టుం బ ము.

యార్లగడ్డప్పయ్య యనువాని కూఁతు

శాంతగుణ కదంబ శాంతాంబ నెమ్మి
వేంకట సుబ్బయ్య పెండ్లాడి నాఁడు
వెన్నుండు భూదేవిఁ బెండ్లాడి నట్లు.
ఆ లేమగర్భసుధాంబుధియందు
రామయ్యయును మఱి రామకృష్ణుండు
రామమ్మ పున్నమ్మ రాజయ్య యనెడు
సుతరత్నములు పుట్టి శోభిల్లినారు
ఆణిముత్తెము లన హావణిల్లి నారు
దోసకాయలువోలెఁ దులకించి నారు
గుమ్మడి పండ్లట్లు గోమరొంది నారు
శాంతమ్మ తనయిల్లు శాంతమ్ము తోడఁ
బార్వతీసతివలెఁ బరికించు చుండ
దోసతోఁట యనంగఁ దోఁచుచు నున్న
తనసంతుఁ గనుఁగొని తనువెల్లఁ బొంగ
నింగిముట్టిన యట్టి నిండు మోదమునఁ
బట్టిన దెల్లను బంగారముగను
గట్టుతోట్టుల నమ్మి కాయ కష్టానఁ
బట్టుభూములు దున్ని పైరు పచ్చలను
గనుల వైకుంఠమై క్రాలఁగాఁ జేసి.
రామయ్య చేయంది రాఁ బెత్తనంబు
వానిచేతను బెట్టి పదిలమ్ము గాను
రాజయ్యఁ గర్షక రాజుగాఁ జేసి
సుఖపడె వేంకట సుబ్బయ్య గారు.

రా మ కృ ష్ణ రూ పు రే క లు.

అన్నయుఁ దమ్ముఁడు నారీతి నుండఁ

## రామకృష్ణము

జీకు చింతయు లేక శ్రీరామ కృష్ణుం
డశ్రాంత దీక్షతో నరుగుచు బడికిఁ
గర మనురక్తితోఁ గఱచువిద్యలను
హాటకమ్ము సలాక యట్టిసంగయష్టి
యతి నిర్మలానంద మైనట్టి దృష్టి
పూర్ణిమా చంద్రునిఁ బోలు నెమ్మోము
వెన్నెలన్ వడదాఁకు పెనుపైన గోము
సిరియొల్కుచుండెడు చిన్నారి నవ్వు
చీఁకటుల్ గ్రమ్మెడు చిప్ప కూఁకట్లు
వదులుగాఁ గట్టిన ఒలు పంచెకట్టు
గల తనయందమ్ము గలిగింప ముద్దు

## విద్యాభ్యాసము.

సందుగొందుల యందుఁ జరియింపఁ బోక
బీడీలు సిగరెట్లు పీల్చఁగాఁ బోక
సైకిలైనను నెక్కు సరదాలు లేక
వీడెముల్ వేసెడు విధములు లేక
చోద్యముల్ గలవంచుఁ జూడఁగాఁ బోక
వెడవెడ వేషాలు వేయఁగాఁ బోక
యింట వంచినతల నెత్తుచు బడిని
రేపల్లె నాంగ్లంబుఁ బ్రీతితోఁ జదువు
ఫస్టు ఫారమ్మును బఠియించు నాఁడె
సౌభాగ్యవతి యను సత్కన్యఁ దెచ్చి
పెండ్లిగావించిరి వేడ్కనాతనికి
స్కూలుపైనలు క్లాసు గుంటూరు నందుఁ
జదువుచు నాతండు చనుదెంచి నాఁడు

తెలుగు స్వరాజ్య కృతులు

సెలవులు.

క్రిస్టమస్ సెలవుల కింటికిఁ బోదిఁ
దల్లిదండ్రులఁ గాంచఁ దహతహఁ బొడమ
అక్కచెల్లెండ్రకై యంగళ్ళ లోన
దవనమ్ము మరువమ్ము దానిమ్మ పండ్లు
బంగాళ దుంపలు పచ్చంటి పండ్లు
రిబ్బనుల్ సబ్బులు ప్రీతితో విలిచి
కొని తెచ్చి తల్లినిఁ గుదురుగాఁ గాంచి
యభివందనము చేసి యవియెల్ల నిచ్చె
అల్లారు ముద్దుగా నరుదెంచి నట్టి
కొడుకుఁగుఱ్ఱను గాంచి కొండంత ప్రేమ
నక్కునఁ జేర్చుక యాశాంత మాంబ
యానంద బాష్పమ్ము లక్షులం దొరఁగ
మిరెపకాయలు దెచ్చి మెటికలు విఱిచి
దిగఁదుడ్చి వైచి మే ల్దీవన లిచ్చి
సిరమంటి బొట్టిడి సిచయమ్ము గట్టి
పరమాన్నమును బెట్టి పండుకోఁ బెట్టి
మగనిచెప్పుల కిట్టు మగువ యాలించి
యెదురుగా నే తెంచి కృష్ణుఁడీ పొద్దు
గుంటూరునుండి వీడ్కొని యేగుదెంచెఁ
బండుకొన్నాఁడ దెట్లు ప్రశ్నించండి
యనిచెప్పి చెంబుతో నీళ్ళను దెచ్చి
పతిపాదములు తొల్చి పైపంచె చెంగు
దడిగొత్తి యుత్తరీయంబు తా దెచ్చి నంచు
బగిలిన దానిమ్మ పండు నందీయ

మొగమునఁ జిఱునవ్వు మొలకెత్త నతఁడు
పడకకుర్చీలోన వ్రాలిల్చి యున్మాను
నొక్కొక్క గింజనే యొలుచుకొం తినుచుండు

## జాతక పరిశీలనము.

గూర్చున్న యంతలోఁ గోవిదుం డొకఁడు
'కార్తాంతికుం డను ఖ్యాతి గలాఁడ
జాతక భాగంబు చక్కఁ జెప్పెదను'
అరయుఁడు నన్నంచు నరుదేర నంత
నాసనంబున నున్న యతఁడు సుబ్బయ్య
లేచి జోతలు వెట్టి లియ్యావా భక్తిఁ
గూర్చుండుఁడని చెప్పి కుర్చీని జూపి
కృష్ణుని జాతకం బెందున్న దోసి!
పట్టుక రమ్మని భార్యను బిలిచి
తెప్పించి యిచ్చి యా ధీవరాగ్రణికి
ఫలితముల్ చెప్పఁగాఁ బ్రార్థించి నాఁడు
ఆజాతకము గాంచి యా బ్రాహ్మణుండు
వ్రేళ్ళను లెక్కించి విన్యాంకఁ గాంచి
తలయూఁచి కనులార్చి తా నిట్లు పలికె
*మిథునలగ్నమున జన్మించిన వాఁడు
గురుఁడు రెండిట, మూఁటఁ గోదకోనఁ గేతు
వయిదింట శనియును సబ్జారియు మఱి
బుధ కుజ శుక్రులింపున నెన్మిదింటఁ
దరణి రాహువులు తొమ్మి దవయింట నుండి

* 4—3—1896.

తెలుఁగు రాజుకృతులు

రీజాతకుఁడు మేదినీశునిఁ బోలి
యడరు సందియమింత యైనను లేదు
దత్తుఁడై యుండు నీ తండు నిక్కముగ
ధనశాలియై మించు తన బంధువునకు;
నచిర కాలంబులో నరుగు నీతండు
అంబుధులను దాఁటి యాంగ్ల సీమకును
నున్నతోన్నత విద్య లూర్జిత శక్తి
నార్జించు నచ్చట నంతియే కాదు
ఉన్నతోద్యోగి యై యొడఁగూర్చు మేల్లు
ఆత్మ దేశంబున కందఱు మెచ్చ
ఆస్తిక్య బుద్ధియై ననిశం బితండు
ఎవ్వారే దడిగిన వృథపుచ్చకుండు
మంత్రిత్వమునఁ గూడ మంతెక్క నితఁడు
కవిగాయకులఁ గూడఁ గాపాడు నితఁడు
కులభేదముల జోలి గొనఁబోవఁ డితఁడు
చెలిమికాండ్రను గావఁ జెవిఁగోయు నితఁడు.
అన్నియుఁ దిన్నఁగా నడరును గాని
కనఁ గళత్రస్థాన కళ—యనియేమొ
చెప్పఁబోవుచు నుండ జీఁకటి పడియె
శాస్త్రిగారూ! మీరు చనిరం డటంచు
వేంకట సుబ్బయ్య వెంటనే వాని
కర్హంబులగు కాన్క లందిచ్చి పంపె.

రామకృష్ణ తిరిగి గుంటూరున కేఁగుట.

పదినాళ్లు లింటను వసియించి కృష్ణుఁ

డరిగెను గ్రమ్మఱ నరుసంబు తోడ
గుంటూరులో విద్య కొంట్కై యంత

తండ్రి ఆలోచన.

నాతని నిజపిత యనుకొని యెదియొ
ఆలికి మేనమామైనట్టివాఁడు
రామకృష్ణుని ననురాగంబుతోడఁ
బెంచికొన్నట్టిఁ డౌ పెదలక్ష్మ యార్యుఁ
గబురంపి రావించి గదిలోని కరిగి
పాఁడిపంటలఁ గూర్చి ప్రశ్నంబు చేసి
వ్యయము నాదాయంబు పరికించి చూచి
కన్నుల నరమోడ్చి కంఠంబు సాఁచి
తలకాయ పైకెత్తి తడ వూరకుండి
వెంటనే లక్ష్మయ్య వీఁపుపైఁదట్టి
రామకృష్ణుని సీమరాజ్యంబు లోనఁ
జదివింపవలె నన సరె యనె నతఁడు.
సరసనే యున్నట్టి శాంతమ్మగూడ
భర్తతో మామతో బాగులెం డనియె
సంపన్న లౌటచే సర్వంబు నొక్క-
క్షణములో సిద్ధంబు గావించినారు
రామకృష్ణుని వేగ రావించి నారు
తమ యభిప్రాయంబు తగ వించినారు
ఆప్రొద్దె పయనమై యరుగు మన్నారు

ఇంగ్లండునకుఁ బ్రయాణమగుట.

అట్టులే యని వారి కంజలి చేసి
తలి చరణాబ్జముల్ తలఁదాఁక మ్రొక్క-

# తెలుఁగు రాజు కృతులు

## తల్లి హితోపదేశము.

శాంతమ్మ బాష్పముల్ జడివాన గాఁగఁ
గన్న కుమారునిఁ గౌఁగిటఁ జేర్చి
వెడలి వత్తువె తండ్రి! వెడలి రావోయి!
గంగమ్మతల్లి నిన్ గాపాడుఁ గాత
రామచంద్రుఁడు నిన్ను రక్షించుఁ గాత
విఘ్నేశ్వరుఁడు నీకు విజయంబు లిడుత
దేవతలెల్ల నిన్ దీవింతు్రి గాత
వెళ్లిరా నాతండ్రి! వెళ్లిరాతండ్రి!
దారిలో భద్రంబు, తండ్రి నీవెప్పుడు
బీడీలు, సిగరెట్లు పీల్వఁగాఁ బోకు
దార్లిక్షాసవంబులు త్రావఁగాఁ బోకు
తెల్లపిల్లల తోడఁ దిరుగాడఁ బోకు
పోయిరా నాబాబు పోయి రావోయి
అనితల్లి ముద్దాడి యనిపి నంతటనె

## బొంబాయి చేరుట.

అన్నను దమ్ముని నక్క చెల్లెండ్ర
నామంత్రణము చేసి యరిగె బొంబాయి
కూర్పు తండ్రియుఁ బెంచుఁ గొన్న తండ్రియును
జనుదేర వెనువెంటఁ జనువునం జేసి
బొంబాయిలో సీమ పొగయోడ నెక్కి
రేవును విడనాడి రేయుచో నోడ
డెక్కుపై నిలుచుండి డెప్పరం బైన
యెడఁబాటు కతమున నే తెంచు చున్న

# రా మ కృ ష్ణ ము

కన్నీరు మున్నీరు గాఁగార్చు కొంచుఁ
జేమొత్తి జనకుల సెలవును గొనియె.

## ఓ డ లో ది న చ ర్య.

అలల తాఁకునఁజేసి యటునిటుఁ గదలు
నోడపై భాగాన నొప్పారెడు గది
లోపలి కరుదెంచి లోలత వీడి
రత్నకంబళముల రాజిల్లు చున్న
మృదుతల్పమునయందు నేటవాలుగను
సుఖముగాఁ గూర్చుండి శోధించి చదువు
నాయాయి పొత్తము లత్యంత దీక్ష.
ఉబుసు పోకకు నోడ నున్నట్టి వారు
పేకాడు కొనుచుండ వెళ్లఁడా వైపు
భోజనంబును జేయఁ బోయినయపుడు
తల్లిమాటఁ దలంచి తాఁకఁ డేపూఁట
బల్లపై నున్నట్టి బ్రాంది సీసాల;
ఆ నావ నుండిన యాంగ్లేయు లెల్లఁ
దనుఁగాంచి మోముల దరహాస మొలయ
నొండురుల్ గనుఁగొంచు నున్న యవ్వారిఁ
గొండొకచీరికిఁ గొనఁబోవ కెపుడు
నాత్మ జాతీయత నరసి కాపాడు
నెపుడేఁ బరిసంగంబు లెవియేని నైన
నతఁ డాంగ్ల దేశంబు నాచార సరణి
విపులంబుగా నడ్గి విశదంబు గాను
పూవు కందకయుండఁ బొందుగాఁ దేటి

# తె లుఁ గు రా జు కృ తు లు

తేనియ గ్రోలెడి తెలుఁగు దోఁపంగ
నాయూయి విషయంబు లారయు చుండు
నెదిరి హృదయ మింత యెరియక యుండ.
అంతకుఁ దోఁచని యప్పు డాతండు
డెక్కుపై కరుదెంచి డిండీర సహిత
వీచికా వితతితో వియ్యంబు నొందు
చందమ్ముఃకాంతుల సరణి వీక్షించి
బంగారుమయముగ భావించి దాని
యలలతో గగనంబు నంటగా లేచు
వాలుగలం గాంచి బలుమోద మొంది
లెల్లనాభావముల్ కేళ్లుదాఁటంగ
స్రష్టసృష్టికిని విస్మయమును జెంది
తనభావమున కంటెఁ దరణి భావంబు
అతి గభీరమ్ము గాదనెడుపోలికగ
నొక్కొక్క యపుడేమి యూహించు కొనునొ
తెలియ రాకుండఁగాఁ దిలకించు చుండు
సంద్రంబు లోపలి చాయల నతఁడు.
సమయమ్ము గనిపట్టి సరసర నేగి
కష్టాను సరసకుఁ గలమునం గల్గు
జంత్రమ్ములన్ని నిశ్చలబుద్ధిఁ గాంచు
నైజయాంత్రిక భావ నానంత శక్తి
నాంధ్ర దేశమ్ము తా నభివృద్ధి చేయ.

ఎ డిం బ రో చే రు ట.

పక్షము దినము లీ పగిది నేఁగంగ
లండను పట్టణ ప్రాంతాన నున్న

రా మ కృ ష్ణ ము

హార్బరునం దోడ యాఁగి నంతటనె
యరుసాన దిగి కారు నద్దెకుఁ దీసి
కొని యెక్కి యద్దానిఁ గొనక్కొని కృష్ణుఁ:
డేఁగె హుటాహుటి నెడ్డింబరోకు

ఎ డిం బ రో వి శ్వ వి ద్యా ల య ము.

వెళ్ళి యచ్చటి విశ్వ విద్యాలయమున
గణితశాస్త్రమ్మును గడన యొనర్చి
తత్త్వశాస్త్రమ్మును దరియించి మించి
యాంగ్లభాషార్ణవ మంతయు దాఁటి
గురు లాత్మ క్షేమమిం గొండాడు చుండ
ఎమ్మె పట్టమ్మును హేలగాఁ బొంది
భూగర్భ శాస్త్రమ్ము, పూతపదార్థ
విజ్ఞానశాస్త్రము, విమలరసాయ
నికశాస్త్రమును గల్గి నీకాశ మొందు
బీ యె స్సి క్లాసులో విజయంబుఁ గాంచె.
సత్కళాశాల లోఁ జదివెడు నపుడు
పనికిమాలిన యట్టి బాట్ మెంటు గాని
కీరవాణులకించు కేరమ్ము గాని
యాడఁగాఁ బోవక యశ్వాల నెక్కి
బంతుల నాడుచు బలశాలు లదర
భావి భాగ్యోన్నతిఁ బ్రకటించు చుండు.

శీ ల ప రి శీ ల న ము.

నూనూఁగు మీసాల నూత్న యావనుఁడు
సుందరాంగులు మెచ్చు సొగసు గలాఁడు

## తెలుఁగు రాజు కృతులు

కవులకుఁ బనిచెప్పు కళ లీనువాఁడు
ఉన్ని సూటుల హొయ లొలికించు వాఁడు
కాంచువారికి మరుల్ గలిగించు వాఁడు
మన రామకృష్ణుండు మలి సంజవేళఁ
జంద్రశాలోపరిస్థలి నొక్కనాఁడు
చలువరా తిన్నెపై సఖులతోఁ గూడి
సరస సల్లాపముల్ సలుపుచు నుండఁ
ముసి ముసి నవ్వుల మురియుచు నుండఁ
గండయుండలఁ బ్రీతిఁ గముచుచు నుండ
ఆంగ్లకన్యలు కొంద ఱచటికి వచ్చి
రామకృష్ణునివంక రహిమీఱఁ జూచి
కులుకుందనమ్ముతోఁ గూర్చుండి చెంతఁ
బలుకు పల్కున యందుఁ బ్రభవింపఁ దేన
నర్మగర్భమ్ముగా నయగార మొప్పఁ
జిఱునవ్వు మోములన్ జిందు లాడంగ
భావంబు లిగురొత్తఁ బల్కెనా రఘుడు
'రామకృష్ణా! చూడు ప్రణయ రాగంబు
మిన్నంది యేరీతి మెఱయుచు న్నదియొ
మేడయందే యెప్డు మెలఁగెద వేల
ఆడుకో రారాదె యందందు నీవు
పాడుకో రారాదె పడఁతులం గూడి
జలయంత్రముల యొద్దఁ జరియింప వచ్చుఁ
బచ్చిక బయళులఁ బన్నుండ వచ్చు
ఇసుకతిన్నెల యందు నెసరేఁగ వచ్చు
వారిపీచికలందు [illegible]

# రామకృష్ణము

బొదరిండ్లలోపలఁ బొర్లాడ వచ్చు
గున్నమావుల మీఁదఁ గూర్చుండ వచ్చుఁ
గోయిల కూఁతలఁ గూయంగ వచ్చు
క్షితిధరమ్ముల మీఁదఁ జెరలాడ వచ్చు
రావోయి! మాతోడ రామకృష్ణయ్య
జడధియయ్యును దాను సంద్రింబు చూడు
ముదయచంద్రునిఁ గాంచి యుప్పొంగు చుండె
రాజుచేతులు సోఁక రాళ్ళయ్యుఁ గూడఁ
జంద్రికాంతము లెట్లు జాలువాఱెడినో
సహకార మబ్బుట జాతీ లతాంగి
తులకించి పులకించి తోరంపుఁ బూల
తొడవులన్ ధరియించి తూఁగాడు చూడు
ప్రియాసపు వేల్పుతోఁ బ్రేమంబు నెఱపి
గొజ్జంగి కన్నియ కులికెడుఁ గాంచు
మాయొప్పు చొప్పును హావ భావములు
కిలికించితములు చక్కిలిగింత లీవు
మాసీమ కొమ్మల మార్దవంబులును
మాసీమ పూవుల మకరందములును
మాసీమ తావుల మాధుర్యములును
నీ చిత్తమున కించు నిక్కమ్ముగాను
రావోయి వాహ్యాళి రావోయి కృష్ణ!
వెన్నముద్దలఁ బోలు వెలఁదులం గూడి
మునిమాపు వేళలఁ బూఁదోఁటలందుఁ
జరియించుకంటె నీ జన్మంబునకును
జరితార్థ మేముండు సాగి రావోయి!

# తెలుఁగు రాజు కృతులు

నావుడు కృష్ణుఁడు ననఁబోఁడు లాడు
పోఁడిమిమాటలన్ స్ఫురియించు నట్టి
ధ్వనులు వ్యంగ్యమ్ములు పరికించి చూచి
మోమడ్డముగఁ ద్రిప్పి మోఱకు వోలెఁ
జిఱుచెమ్మటలు గ్రమ్మఁ జిత్తమ్ము కలఁగ
వెడవెడ చూపుల వెలఁదులఁ గాంచి
తడఁబడు మాటలఁ దానిట్టు లనియె
మంచిది సఖులార! మన్నింపుఁ డమ్మ
మీ మృదూక్తులు నన్ను మిగులగాఁ దనిపె
రా దీర దిప్పుడు రారాదు గూడ
మిముఁ జూచినంతనే మీనాత్మ లార!
మత్ప్రేమ సామ్రాజ్య మానోజ్ఞ రాజ్ఞి
సౌభాగ్యవతి నాదు స్వాంతానఁదగిలె
యగ్నిసాక్షిగఁ గొన్న యర్ధాంగి వీడి
పెఱకాంతలం గూడి విహరింపఁ జనుట
హైందవాచారమర్యాదకు లోచ్చు
అన్యథా తలఁపక యరిగి రండమ్మ!
విశదభావమ్మున వెడలి రండమ్మ!
ప్రణయమ్మునకు లోటు రానీకుఁడమ్మ!
వచ్చుచుఁ బోవుచు వర్ధిల్లుఁ డమ్మ!
యనుచును గైలాగు లందిచ్చి నంత
గుడ్బై యటంచును గుమిగూడి కూడి
కేకసల్ కొట్టిరా కిసలయ పాణు
లొత్తిలి నత్తిరా జొకనవ్వు నవ్వె
గోపాలకృష్ణయ్య కూడహసించె

గున్నముసుబ్రావు గూడఁ జేచఱచె
సి. వి. రావు తానును చిర్నవ్వు నగియె
అంతట గృహమాత యరుదెంచి యటకుఁ
బోసేయ రమ్మనఁ బోయి రెల్లరును

## స్వదేశమునకుఁ దిరిగివచ్చుట.

ఈరీతి దినముల నెల్లను గడపి
బిరుదముల్ రెండింటి నెలయుఁగాఁ బొంది
రామకృష్ణుఁడు వచ్చె రారాజు వోలె
మాతృదేశమునకు మాతయున్ బితయు
నన్నదమ్ములు నాలి యక్క చెల్లెండ్రు
నీడుజోడును నైన యెల్ల స్నేహితులు
చుట్టముల్ పక్కముల్ చుట్టును మూఁగి
సీమనుండిన నాఁటి క్షేమంబునరసి
యెవరియిండ్లకు వార లేగినా రంత.

## స్వతంత్ర వృత్తి.

రామకృష్ణుఁడు తన ప్రతిభకుఁ దగిన
నుద్యోగ మొదవమి నొకనాలు గేఁడు
లూరకుండఁగ లేక యూహించి పెట్టెఁ
బదిమంది బ్రతికింప వచ్చు నటంచు
కౌంటూరు సర్వీసు మాటమాట లేక
సక్కనున్నను బెట్టు జతనంబు చేసె
మిలటరీ కంట్రాక్టు మేల్గూర్చు నంచు
తఱచుగ మద్రాసు తరలుచు నచట

# తెలుఁగు రాజకృతులు

జయపురయువరాజచంద్రునితోడ
స్నేహంబు గావించె స్థిరభక్తితోడఁ
గాలంబు వృథపుచ్చఁ గడఁగరు ఘనులు.

ఐ. సి. యస్, గా నామినేటు చేయఁబడుట.

దుర్దినంబులుపోయె దోఁతెంచె సీతు
జొన్నచేలను గాఁపుజోటి కేకిడియెఁ
గోడెలు గొమ్ములఁ గోరాడె గట్లు.
పసుపుఁదోఁటల చుట్టు బంతులు పూచె
మిరెపకాయల నోర మెల్లఁగాఁ గమిచి
శారికల్ గుంపులై చదలకుఁ బఱచె
అత్తింటియందున్నయట్టి కోడలికి
సంక్రాంతి దినములు చనుదెంచి యుంటఁ
బుట్టింటి మీఁదికిఁ బోయెను బుద్ధి
తీర్థంపు బిందెను దిరమైన భక్తి
మూర్ధంబునం దిడి మొరయఁ దూర్యములు
తెచ్చి పెర్మాళ్లకుఁ దిరుమజ్జనంబు
భక్తితోఁ గావించె వైష్ణవస్వామి,
మూడి కదలఁబట్టి ముసలమ్మ గూడ
ముంగిళ్ళ సలికి బల్ ముగ్గులు పెట్టె,
ముసలమ్మ పెట్టిన ముగ్గుల మీఁద
గొబ్బిళ్ళు పెట్టిరి కొమిరెలు ప్రీతిఁ;
బాలి పాలియంచుచు బొబ్బల నిడికి
వకకుప్పలనునూర్చు పాలేళ్ళ చేల,
మదురుపై నిల్చుండి మార్గోష్ఠిగా దెసలు

## రామకృష్ణము

కొక్కొరో యని కూసెఁ గుక్కుటరాజు,
బిందెకు నామాలు వేడ్కతోఁ బెట్టి
నెత్తిపై నద్దాని నేర్పుతో నిల్పి
గజ్జెలుచిఱుతలు గరమునఁ దాల్చి
యింటింట సాతాని యెలుఁగెత్తి పాడె,
ధాన్యంపుఁగుచ్చుల దండెలఁ గట్టి
యూరెల్లఁ గర్షకు లూరేగి యేఁగి
యశ్వత్థశాఖల కవి యంటఁ గట్టి
రట్టి చక్కనినాళ్ళ నట్టిశుభదిన
ముల రామకృష్ణుని పూర్వపుణ్యంబు
పండె నై. సీ యెస్సు పదవికి నామి
నేషను జేసిరి నెఱజాణ యనుచుఁ
దమయంతనే దొరతనమువా రరసి,
రత్నంబుఁ గొనువాఁడె ప్రయతించి దాని
వెదకును రత్నంబు వెదకదు గాదె!

## తండ్రుల మురిపెము.

శుభవార్త వినఁగానె సుబ్బయ్య యుబ్బి
పెదలక్ష్మయార్యనిఁ బిలిపించి వేగ
మనబాబు కృష్ణుండు మననోముపంట
మనకన్నుల చలువ మనపుణ్యఫలము
మనయింటివెలుతురు మనదు మతాబ
వెలఁగపూఁడింటి పేర్వెలయించి నాఁడు
సివిలు సర్వీసులోఁ జేర్పఁ బడ్డాఁడు
ఈనాఁడె యార్డరు లేతెంచెఁ జూడు

# తెలుఁగు రాజస్మృతులు

ఆసెమ్మ బూసెమ్మ లధమ మానవులు
ప్యాసు కా లేదంచు నధరముల్ విఱచి
నిన్న మొన్నటి దాఁక నేరమ్ము లెన్ని
మనవాని నిందింప మనము లోలోన
ననుమానమును జెందినా మిదె చూడు
మని చెప్పి కాగితం బందించు చేతి
కయ్యది చేకొని యబ్బాయి చదువు
మని రామకృష్ణుని కవి యాయు సతంబు
పఠియించి యందలి భావంబు దెల్ప
నానంద బాష్పము లతిమాత్ర మురలఁ
గౌఁగిటిలోఁ జేర్చి కాయంబు నిమిరి
తనదు పెంపకము సార్థకమాయె ననుచుఁ
దలపోసి పులకించి తలమారుకొనుచు
నాస్తిపాస్తుల నెల్ల నతనిచేఁ బెట్టె
నన్నరామయ్యకేఁ దని యొప్పఁజెప్పి

## రామకృష్ణ మరల నింగ్లాండున కేఁగుఁ

రత్నాలమూటయా రామకృష్ణుండు
క్రమ్మఱ నింగ్లాండు కరిఁగెన నేఁగి
వత్సరద్వయమటఁ బఠియించి శ్రేష్ఠ
హిందుదేశమునుండి యేతెంచి నట్టి
ముప్పది నల్వుర పుణ్యాత్ములందు
నాల్గవవాఁడుగా బరిగణింపఁ బడి
చెన్నరాష్ట్రానకు శ్రేష్ఠుఁడై మించి
ఐ సి యెస్సునయందు నంది జయంబు

# రా మ కృ ష్ణ ము

## చె ం గ ల్ప ట్టు న అ సి స్టె ం టు క లె క్ట రు.

హిందుదేశమ్మున కేతేరఁ గానె
చెంగలపట్టసిస్టెంటు కలెక్ట
రుగ దొరతనమువారు నియమించి రట
కాలినిఁ గొనిపోయి యాత్మలు దనియ
దాంపత్యసుఖము యథామతిఁ గాంచ
నెంచియుఁ దీరిక యిసుమంత లేక
నొంటరిగా నుండి యుద్యోగసరణిఁ
బాలక పాలితుల్ వహ్వా రే యనఁగఁ
గార్యనిర్వాహంబు గావించు చుండె.

## రా మ కృ ష్ణ భా ర్య ని య మ ము.

ఇంగ్లాండు కేనాఁట హృదయ నాథుండు
చనినాఁడొ యానాఁట సౌభాగ్యవతి వి
చారమున మునిఁగి సలుపఁ దొడంగెఁ
బతివృద్ధిఁ గోరుచుఁ బలు వ్రతమ్ములను
ఒంటి పూఁటశనంబు నుర్విపైఁ బడక
నియమంబు చేసుక నీరజాక్షునకు
నాకులఁ బూవుల నర్చలు చేసి
దినమున కొకరీతి దివ్య పదార్థ
ములు దెచ్చి నైవేద్యమును బెట్టుచుండు
ఏకాదశీతిథు లేతెంచె నేని
నుపవాసముల చేయు చుండుటే కాదు
జాగరమ్ములుగూడ సలుపుచునుండు
నత్తయు మామయు నమ్మయు నాన్న

వలదనిచెప్పిన వదల కా వ్రితము
నిరత సద్భక్తితో నెఱపుచుండుటను

భా ర్య ని య తి చేఁ గృ హిం చు ట.

పుత్తడిం బోలునా పూఁబోఁడి మేను
ఇత్తడిఁ బోలుచు నెసలార కుండె
తమ్మి రేకులఁ బోని తరుణి నేత్రములు
తుమ్మిపూలను బోలి తోఁచెఁ దళ్తళలు
నిండుచందురుఁబోలు నెలఁత నెమ్మోము
పండువెన్నెల గాయఁ బ్రాల్మాలి యుండె
బిసకాండములఁ బోలు వెలఁది బాహువులు
చొప్పదంటులఁ బోలి చొకచొకల్ వీడె
సొగలై సొగసులై శోభిల్లు కురులు
మూఁగలై ప్రోఁగులై మొగి జడల్ గట్టె
పూవుఁదేనియ చిల్కు పుష్పాంగి నుడులు
కావుకావను రీతి గాఁదోఁచు చుండె
రెన్నాళ్లు మూన్నాళ్లు లేమ యట్లుండ
బంధువర్గం బామెఁ బరికింప వచ్చి
బిక్క మొగమ్ముల వెడవెడ నూర్చి
కనుఁగొలంకుల జలకణములురాల్చి
చీరచెఱంగులచే ముక్కు లొత్తు
కొనుచుండ సెలవిడి గొబ్బున రామ
కృష్ణుఁడు చనుదెంచె నెలనాగఁ గాంచఁ
బతిఁగాంచి సౌభాగ్యవతి చేయిసాఁపఁ

రా మ కృ ష్ణ ము

ప్ర థ మ క ళ త్ర వి యో గ ము.

బ్రక్కపైఁ గూర్చుండ రామ కృష్ణుండు
వణఁకెడు పలుకుల వనిత యిట్లనియె
మనసులో మనసును మాటలో మాట
కలుపక సౌఖ్యంబు గాంచఁగా లేదు
మీ కష్టసుఖముల మీ చేతలందు
సమభాగినిగ నేనుఁ జరియింప లేమ
అర్థాంగి ననుమాట వ్యర్థమై చనియె.
దోసఁగు లెన్నేనియుఁ దోఁచు నాయందు
క్షమియింపుమా నాథ క్షమియింపు నాథ !
యేజన్మ మెత్తిన హృదయేశ ! నీవె
భర్తవై ననుఁగావ వలయును జుమ్మ
ననుఁ బాసినావని నాథ! నీ వెడఁదఁ
గుములక సోలక కొఱలు ముదమునఁ
గనకదుర్గాంబికాకారమ్ము నొంది
యాతల్లి పేరిట ననమాన మైన
కన్యకామణి కరకంజమ్ము పట్టి
సౌఖ్యవారాశిలో స్నానంబు చేసి
నిత్యోత్సవంబుతో నెగడ నీగృహము
దబ్బపండుల వంటి తనయులఁ గాంచి
రాచకార్యములఁ బరాయణుఁడ వయి
వర్థిల్లుమో నాథ వర్థిల్లునాథ !
ఋణముతీరెను విచారింపకు నాథ !
యనిపల్కి పతిదేవు నడుగుఁ దమ్ములకు
నసువుల నర్పించి నాకంబు చేరె.

సతిపోక :కెదఁబొక్కి సారెకు స్రుక్కి
దిరిసెనపువునకు దీటైన తనదు
భావంబు పాషాణభావంబు దాల్ప
నశ్రుతర్పణమిచ్చి యరిగి పదపడి
చెంగలపట్టును జేరె శీఘ్రముగ.

* * *

సాహిత్య సామ్రాజ్య సచ్ఛత్రపత్రి !
సత్కవీశ్వర నుత సౌజన్యమూర్తి !
కలితాచ్ఛ ధర్మ ! విక్రమ దేవవర్మ !
అవధారు నీమంత్రి యావలి గాథ !
వఱదతై పాఱు స్రవంతి యొడ్డు
తిప్పలు పడుటయుఁ దేజంబ కాదె
పూవులఁ గాయలఁ బొలుచు వృక్షంబు
ఆకు రాల్చుటయును నందంబు గాదె
మృదుభాషి మనరామకృష్ణుఁడు నట్లె
భార్యయన్ బుష్పంబుఁ బాసె నానాఁటఁ
బూవురాలిన యంతఁ బొడసూపు ఫలము
ఫలముతో పాటుగాఁ బలుపలు మొలక
లావిర్భవములొంది యంతంత పెరిఁగి
పెద్ద భూజములయి పెదసాదలకుఁ
బిన్న పెద్దలకును విశ్రాంతి నొసఁగు

గుడివాడ సిద్ధాంతము.

ఏయూరి పాటిపై నీనాఁటఁ గూడ
గౌతమపుత్రి విఖ్యాతాంకు లైన

శాతకర్ణుల ముద్ర జాతంబు దొరకు
నేయూరి మట్టిలో నే ప్రొద్దు గనినఁ
దొంటి వీరులశక్తి తోఁచుచు నుండు
నేయూరిలోఁ దొల్లి యేవాడఁ గన్న
నా వాడ వేన వే లాలయాలుండె
గుడులు వాడలయందు గుఱుతుగా నంట
నాయూరు గుడివాడ యనుపేరఁ బరఁగె.

గుడివాడకును రెండు క్రోసుల మేర
సిద్ధాంత మనునొక్క చిన్నయూరుండె
శుద్ధాంత మది కంధి సుతకన్నఁ జాలు
దాని సంపద వేఱ తడవంగ నేల
అందొక్క సౌధంబు నావుల సాల
దేవతా సన్నుత దేవాయతనము
నడుమిల్లి కులజు లత్యంత లక్ష్మీశ
కానవాలుగ నుండు నాపల్లెకు దొర

## అడుమిల్లి గోపాలకృష్ణయ్య.

గోపాలకృష్ణయ్య గోపాలమూర్తి
దీర్ఘమౌ దేహంబు దీర్ఘనాసికయుఁ
జామన చాయయు జలద గంభీర
మౌ వాక్కు నెదురు భయంపడునట్టి
మగసిరి గలిగి శ్రీమ మెఱుఁగనట్టి
కర్మఠుఁడై పనుల్ గావించు పొంకెఁ
దఱచుగా గుడివాడఁ దా, నివసించు

## మామగారి వసతులు.

రైలుమార్గము పోవు రహదారి పొంత
నున్నతోన్నత మైన యొక మేడగలదు
తచ్చంద్రశాల క్రింద నలత్రా లడరు
ధాన్యంపుఁగొట్లు తత్ ధాన్యము లాను
తండుల యంత్రము దానికి నెదుర
మందడి గోశాల మల్లసాలయును
గనుమేర దూరంబు గాంచఁగా నైన
వేలాది యెకరాల విమలంపుఁబొలము
లతని సంపదచాటు ననిశంబు సంపు
పాఁడిపంటలు గల్గి వర్ధిల్లు వాని
సౌధానసుండని సజ్జనుఁ డరుసు
వాని యాతిథ్యంబు పడ ననివాఁడు
గుడివాడ సీమ నొక్కఁడు గూడ లేఁడు
లక్ష్మి సరసమాంబ తానుగాఁ దనకు
గోపాల కృష్ణాఖ్య గేహంబొంపుచుండు

## దుర్గాంబ సౌందర్య సౌశీల్యములు

ఆ దంపతు [illegible]
దుర్గాంబ యుదయించె దుర్గాంబ యనుచు
లోలత విడనాడి లోకైక మాతఁ
గాళిదాసుఁడు తొల్లి గణియించి నట్లు
మాతల్లి దుర్గాంబ మధురరూపంబు
వర్ణింతు నిశ్చలభావంబుతోడ
[illegible]

## రామకృష్ణము

గాటుక పూసిన కరణిగా నామె
కనుఁగవ లేలేటి కనుఁగవఁ బోలి
సిరులొల్కు చుండును జిన్నారి మోము
నిండుచందురుసౌరు నెక్కొల్పుకొనియె
నేవేళఁ జూచిన యీసింత లేక
కలకల నవ్వుచుఁ గళ లీను చుండుఁ
జిన్నారి పొన్నారి చిఱుప్రాయమందె
పదిమంది కన్నంబు పడవేయుఁ డంచు
దాస దాసులతోడఁ దఱచుగాఁ జెప్పు
దీపకళికవోలె దీపించు నాకె
మీఁగడ తఱకనా మెఱయు సల్లీల.
వెన్నముద్దయె యాపె విశదభావంబు
వెన్నెల తేటలై వెలుఁగొందు నామె
తియ్యని తలఁపులు తేపతేపకును
మల్లెపూ పోలిక మలయు నాతల్లి
పండితరాజుతోఁ బఠియించి నేర్చె
సంస్కృతాంధ్రమ్ముల సాహిత్యగరిమ;
సాహిత్యగరిమతో సంగీతకళయు
జంత్రగాత్రములపై సాధన చేసి
మోడులు చిగురింప మొదుకరాల్ కరఁగఁ
గాకలీధ్వనులతోఁ గంఠము నెత్తి
పంచమస్థాయిలోఁ బాడుచు నుండు.

## దుర్గాంబ రామకృష్ణను వరించుట.

ఎంతో దూరమున రహించెడు జాజి
తీవ తేఁటిఁ దివిచెడు తెఱఁగు తోఁపఁగ ని

సర్వసౌందర్యవిస్తారసారమున
దుర్గాంబ కనకాంగి తోయజనేత్ర
యాకర్షణముచేసె నారామకృష్ణు
గుజగుజల్ పోయిరి కూడి బంధువులు
ఆత్మబంధువులఁ బెం డ్లాడుమీ యనుచు
మేనయత్తలు చాల మెలి పెట్టినారు
తప్పదు నీకని తగవాడి నారు
ఒప్పుకొమ్మని చాల నూరించి నారు
చిన్నదానవు విను చెడుదు వన్నారు
దూరసంబంధంబు తొలఁగు మన్నారు
ఊరూరఁ దిరిగెద వోసి యన్నారు
కడుపులోపలి చల్ల కదల కుండంగఁ
గూర్చుండఁగా వచ్చుఁ గోరుకోవమ్మ
మనవాండ్ర నెవరినే మాయమ్మ! యనుచు
నయమున భయమున నాడెంపునుడుల
లాభనష్టాల నాలాపించి నారు
గోపాలకృష్ణయ్య కూఁతును బిలిచి
శ్రీరామకృష్ణునే చేపట్టు మమ్మ
బహుళసౌఖ్యమ్ములు పడయంగ వచ్చు
మాఋ మాటాడకు మాతల్లి కాన!
మాముద్దు చెల్లించు మాయమ్మ! యనియె
పండితరాజును భావంబు విప్పి
రామకృష్ణుని కరగ్రాహంబు చేసి
పూవును దావినాఁ బోలుపారు డంచు
దీవించి పల్కెను దేట తెల్లముగ
గురువులాజ్ఞను దుర్గ కుదురుగా నెడఁద

## రా మ కృ ష్ణ ము

రామకృష్ణునె కోరి రాగిల్లు చుండె
సందియంబులనెల్ల సాగఁగాఁ ద్రోలి
యెఱుకగల్గిన యట్టి యేకన్యయైన
గురువుల మాటల గుఱితప్పదు గద

## పెం డ్లి బే ర ము లు.

లక్షల కట్నముల్ లాంఛ నమ్ములును
గోరిన రీతిగాఁ గుమ్మరించెదము
వందల యెకరాలు పరశుల్కముగను
సీమలోపల నీవు చెల్లించి నట్టి
ధనమంతయును మేము ధార పోయుదుము
కోరిన కారులు కొనియిత్తు మయ్యా !
మాపిల్లఁ బెండ్లాడు; మాపిల్ల ననుచుఁ
గమ్మవా రందఱుఁ గలయంగఁ ద్రొక్కి
రామకృష్ణునిఁ జాల రాపాడి నారు
ఎంత బాధించిన నెవరికిఁ గూడ
నుత్తరం బీయలే దొకమాఱుఁ గూడ
నింతకుఁ బూర్వమే హృదయంబు నందుఁ
బ్రేమించి యుంటచే వెలఁది దుర్గాంబ;
వలపును గొలిపెడు బలుమల్లె పూవు
వలచునే కాని తా వలవఁడు గాదె
రసికుఁడు మోదుగు ప్రసవంబు నెపుడు.

## వ సం తో ద య ము.

గందపుఁ దావులఁ గలయఁగాఁ గూడి

జల్లఁగా మెల్లఁగాఁ జరియింపఁ దొడఁగెఁ
జివురు జొంపములలోఁ జిట్టు ముట్టాడి
కోయిలల్ కెరలుచుఁ గూయఁగా సాగె
విరుల గుత్తులమీఁద విహరించి తేంట్లు
పుక్కిటి పూఁదేనె పొలఁతుల కొసఁగె
ఎలమావి లతలపై నెగిరి వ్రాలుచును
కిలకిలారావముల్ కీరముల్ సలిపెఁ
బెరటిలోఁ బూచిన విరజాజి మల్లె
పూలకై కొమిరెలు పోరాడి నారు
ముంజెకాయలకునై పొలముల వెంటఁ
వడఁదీర్చుకొన నెల్లవారును జనిరి
ఖరకరు వేఁడికిఁ గంజంబు నీడఁ
దలదాచుకొన నేఁగెఁ దాఁ బెంటితేఁటి;
డొక్క కొట్టుకయాడ డొల్లుచుఁ గుక్క
నాలుక పైకిడి నక్కెను మూల,
ఆవపిండిని గొట్టు సలవాటు లేక
క్రొత్తకోడలు చాలఁ గొట్టుమిట్టాడ
నత్తగారది గాంచి యావలి కరుగు
కోడలా నేకొట్టికొందు నంచఱచెఁ,
బ్రక్కనే నిలుచున్న పతి యది గాంచి
కనుసైఁగ నిల్లాలి గదిలోకిఁ బిలిచె.
చిలుకలు కొట్టిన చిఱుమావి పండ్లు
చీకుచుఁ బీఁకుచుఁ జెట్టుల క్రింద
నాలకాపరి కుఱ్ఱ లాడి రాటలను.
గోరువెచ్చఁగ నున్న కూడు గూరలను
భుజియించి కమ్మగా [illegible]

## రామకృష్ణము

స్పెన్సర్సు సోడాలు పీల్చి నారెలమిఁ
జెట్టునఁబండి యిర్ పీలికల్ వాటి
కమ్మని వాసనల్ క్రమ్మెడు పనస
తొనలను మక్కువతోఁ గడుమెక్కి
కడుపు నొప్పప్పఁగాఁ గ్రిస్మాఱ నొక్క
తొన నూనెలో ముంచి ద్రోల్గించినారు
చల్లఁగా వాఁపిరి జనములు నోళ్ళ,
దోర మామిడికాయతో గంజుమీల
ముక్కలు పులుసిడ భూపతుల్ గ్రోలి
యూవేఁడి తగ్గఁగా నసలు సంజలను
ఎడనీళ్లు త్రావినా రిసుకలోఁ బాఁతి,
బత్తెలు నీళ్ళలోఁ బడిమున్గు చుండ
నావులు ఛాయల యాశ్రియ మొంది
నెమరుచు చలిమోఁకు నేత్రాల తోడఁ
దోఁకల నీఁగలఁ దోలుచు నుండె.
ఇల్లువాకిలి లేని హీనులౌజనులు
తర్మారుహంబుల నీడ శయనించి నారు.
మాధవుఁ డే తేర మగువల కెల్ల
సింగారపుల మీఁదఁ జేరెఁ జిత్తంబు.
ప్రకృతి వసంతోత్సవంబులతోడ

## దుర్గాంబ వివాహము.

దోబూచు లాడుచో దుర్గాంబ పెండ్లి
గోపాల కృష్ణయ్య కోరి చేయంగ

బంధుమిత్రులఁ బిల్వఁ బంపించినాఁడు
వెల్లల నిండ్లకు వేయించినాఁడు
పందిరుల్ బాగుగాఁ బఱపించినాఁడు
తోరణాల్ గుమ్మాలఁ దొడిగించినాఁడు
వివిధ పదార్థముల్ విలిపించినాఁడు
చవికెను జక్కఁగా సవరించినాఁడు
రామకృష్ణుని వేడ్క రావించినాఁడు
విద్యున్మయంబులై వెలుఁగు దీపాల
నడుమఁ బెండిలిపీఁట ననిచెడు ప్రేమ
వధువును వరుఁడును వరుసఁ గూర్చుండ
బ్రాహ్మణుల్ మంత్రముల్ పఠియించు చుండ
దీక్షతో బంధువుల్ దీవించు చుండ
శ్రీరామచంద్రుఁడు సీతమ్మ మెడను
దాళిగట్టిన యట్లు తా రామకృష్ణుఁ
డర్మిలి దుర్గాంబ యఱుతఁ దగిల్చె
మంగళసూత్రంబు మధురతూర్యములు
దిగ్విజయోద్ఘోషింపఁ దివురుచు నుండఁ
బగలెఱుంగని కృష్ణువదనచంద్రుండు
దుర్గాంబ కనుఁగల్వదోయి విప్పారఁ
బంధుజనస్త్రీల హాసె భావాబ్ధి పొంగ
దుర్గాంబికాంబక స్తుతిచకోరికలు
రామకృష్ణునివక్త్రరాట్కాంతిఁ గ్రోలె.

ఓ వ న లు.

అయ్యాది కని యుత్సవాగత జనులు
వధువు సంపన్నునివరపుత్రి యనుచుంట

వరుఁడై సి యెన్నంట వహ్వారే యెంత
పుణ్యంబు చేసిరో పూర్వ మిర్వురును
ఇఁకమీఁదఁ బరిణయమ్ము లేకమ్ము గాఁగఁ
బాలు మీఁగడవోలె భావముల్ గలియఁ
బూవుఁదావియు వలెఁ బొలు పొందుఁడయ్య!
పైఁడియు రత్నమై వర్థిల్లుఁ డయ్య!
రసమును జెఱకునై రాగిల్లుఁ డమ్మ!
వాక్కును నర్థమై బ్రతుకుఁడో యమ్మ!
యనుచు దీవనలీయ హర్షాసఁ బొంగి
గోపాల కృష్ణయ్య కోర్కె నల్లునకు
వేనూట పదియార్లు వెండినాణెములు
కట్నంబుగా నీయఁగా రామకృష్ణుఁ
డారూప్యములఁ గొని యప్పుడే వానిఁ
గమ్మసంఘమునకుఁ గానుకగా నిచ్చె
సంద్రమ్ములో నుండి జలముల నినుఁడు
పరుల కీయనకాదె పడయుచు నుండు
వైవాహికోత్సవప్రక్రియ లెల్ల
కడచిన వెంటనే కరిమ్మాఱఁ గృష్ణుఁ
డరిగెఁ జెంగల్పట్టు కరుసమ్మెసంగ
అటఁ బుష్పవతిగాని యాతీవబోఁడి
నాంగ్లంబు నేర్వఁగా నర్షుఁడౌ గురుని
యొద్దను జదువఁగా నొప్పంగఁ జెప్పి
మొగ్గను విడలేక మోహంబు పెర్మిఁ
జను రసముగ్ధుని చందంబుగాను.
గొన్నాళ్ళకును దుర్గ గురువుల యొద్ద
నాంగ్లంబు చక్కనధ్యాయనంబు చేసి

సర్వాంగసంపూర్ణసాహితీ కళల
నీడే తెెఁ బతిరాక నేప్రొద్దు గనుచు

రివిన్యూ బోర్డు నకండరు సెక్రిటరీ.

ఇంతలో మనరామకృష్ణుఁ డేతెంచె
అండరు సెక్రటరైె రెవిన్యువను
బోర్డునకును జెన్నపురికిని వేడ్క
నాదినంబులయందు నా స్థాన మందు
టబ్బురం బగుటను హైెందవోద్యోగి
కన్ని పత్రికలు నత్యంతంబు మెచ్చి
ప్రకటించెఁ గృష్ణుని ప్రజ్ఞాతిశయము
ఆంధ్రదేశమ్ము మహానంద మొందె
బాగులో బాగులు పరుగెత్తి వచ్చెఁ
బూర్వపుణ్యము పండు పుణ్యాత్ములకును
బరులకు మేల్ చేయు భవ్యాత్ములకును
విశ్వ కుటుంబులై వెలయు వారలకు
కోపశీలము లేని గోమలాంగులకు
నిర్మలభావులౌ నేర్పరులకును
మర్మ మెఱుంగని మానవులకును
తమ రెఱుంగని యట్టి ధర్మంబు గలదె
విక్రమభూపాల! విబుధాళిలోల!

***

శ్రీరామచంద్రదేవు యాచన.

హిమకళంక మ్మించు కేనియు లేని
రత్నాలయుఁడు కొండరాజు గలండు

# రా మ కృ ష్ణ ము

జయపురసంస్థాన సార విస్తార
వసుమతీ స్థలమున పదునాల్గు వేల
చదరపుమైళ్ళ వైశాల్యంబు గలుగు
దాని కధిపతి వదాన్య వరుండు
శాంతస్వరూపుఁ డాజానుబాహుండు
నిర్మలహృదయుండు నేర్పరి రామ
చంద్రదేవుఁ డతఁడు సప్తాశ్వకులుఁడౌ
స్వాంతమ్ము నందొక్క సాయాహ్న వేళ
మందమారుతములు మలసెడు వేళ
నీరీతిఁ దలపోసె నెంతయో నేర్పు
ఇంత సామ్రాజ్యంబు నిచ్చెనా కజుఁడు
పనికిరానిది గాని పట్టియుఁ గాని
యంగుళం బంతైన యవనిలే దిచట
పలుకుటాళ్ళను గూడఁ బైరులు పండుఁ
గొండ కొనలఁగూడఁ గోనేళ్ళు గలవు
పలుపలు వృక్షముల్ ఫలియించు నిందు
పంటలు ముక్కారు పండుచు నుండు
నేమూల చూచిన నేఱులు పాఱుఁ
బారెడు నేఱుల ఫలితంబు లేదు
ఎన్నెన్నొ ఖనిజము 'లిందుండ వచ్చు
వానిఁగన్గొను మహాప్రాజ్ఞుండు లేఁడు
జలపాతములుగూడఁ జాలఁగాఁ గలవు
వాని లాభముతీయు వాఁడును లేఁడు
కొట్లలోఁ బడిమూల్గు కొలుచుకు విలువ
వచ్చు నుపాయంబు పలుకఁ డొకండు

పగ్గాలు తిరుగని బలుతేఁకుచెట్లు
మున్నగు వృక్షముల్ బోలెఁడు గలవు
వానికి ధర తెచ్చు వాఁడును లేఁడు
ఏప్రక్కఁ గాంచిన ఋతుషట్కమందు
ఫలియించు చక్కని బంజరుల్ గలవు
వానిరైతుల కిచ్చు వాఁడైన లేఁడు
క్రొత్త పోకడలతోఁ గ్రొత్త యూహలను
క్రొత్త సాధనలతోఁ గ్రొంగ్రొత్త రీతిఁ
గ్రొత్త యంత్రములతోఁ గోటకు నాకు
సౌఖ్యంబు చేకూర్చు చతురుఁడు లేఁడు
లాభంబు గూర్చులాలాటికుఁడు సహి
యభివృద్ధి నొడఁగూర్చు నను మంత్రి లేఁడు
రైతులు పేదలు; రాబడి లొచ్చు;
ప్రాచీనభావుఁడౌ ప్రగ్గడవల్ల
నెన్నాళ్ళకును నాదు నీరాజ్యలక్ష్మి
వర్ధిల్లు దారిచూపట్టక యుండె
నూతన రీతి ననూన ప్రతిభను
సామ్రాజ్య భాగ్యంబు జాస్తి చేయంగఁ
జాలెడు సివిలియన్ జాణ నొక్కరుని
మంత్రిగా నిండని మద్ర పురంపు
దొరతనమును గోరుమనుగాక యనుచుఁ
దలపోసి యొకలేఖ తా వ్రాసియంపె.

దొరతనమువారి సిఫారసు.

ఆకమ్మఁ గనుఁగొని సంతసనే దొరత
నమువారు తమదు మనంబున యందు

## రామకృష్ణము

యోజించి మంత్రాంగ ముర్వీనాథునకు
నెఱపెడు ధీశాలి నెఱిగల్గు వాఁడు
రామకృష్ణుఁడ యని వ్రాసిరి జాబు
జార్ఖండపాదుషా జయపురేశునకు;
జాబును కనుచును సంతసం బొంది
రామకృష్ణునిశక్తి ప్రజ్ఞయుఁ దాను
స్వయముగ నెఱుఁగుట వైరిచ్చినాఁడు
సమ్మతంబని రాజు సత్వరమ్ముగను
తంతి నంపుక దొరతనమున వారు
రామకృష్ణుని చేర రావించి యప్పు
డెల్ల విషయములు నెఱుఁగంగఁ జేసి
టెండ్ చేసి సర్వీసు ప్రేమంబు మీఱ
వెళ్ళిరమ్మనినంత విన్నను వొప్ప
నెన్నెన్నియో స్కీము లేక కాలమున
తన శిరంబున నుండి తడవు తడవుకు
క్రేళ్ళు దాఁటుచునుండ శ్రీరామ కృష్ణుఁ
డరుసాన జయపురి కరుగుచుఁ దొలుత

## రామకృష్ణ జయపురమున కరుగుట.

సాలూరులోపలఁ జరణంబు నిడియె
సాలూరులోఁ గారు సయ్యాన నెక్కి
మలఁకలు మలఁకలై మలయునా దారి
గుండఁ జనుచును బై కొండను గ్రింది
లోయను ఒరికించి లోహాదు లైన
ఖనిజము లెవియేని గలవేమొ యనుచు

శాంకియన్ దొరపేర సన్నుతి గాంచు
శంకిరేవును దాఁటి శోధించు చచటి
భూములఁ జటియలఁ బొట్టంగి జేరె.

స్వా గ త ము.

అంత మహారాజు నచటి కేతెంచి
యెదురుకోల్పచరించి పృచ్ఛింప నేమ
మచటి తాణాఫీసు నధికారి వర్గ
మడఁకువ దోఁపఁగా నాడకు వచ్చి
సిరములఁ గరములు చేరిచి మ్రొక్కి
రామకృష్ణుల కంధరమ్ముల భక్తిఁ
బూలహారమ్ములు పోలఁగా నిడిరి
రామకృష్ణులను బూర్వము భక్తితోడ
యదువృష్ణికులజను లర్చించి నట్లు.
ఆరీతిఁ బూజించి నట్టి వారలను
బరికించి సన్మంత్రి పలికినాఁ డిట్లు
ఈతాణ రాబడి యెంత ? యిద్దాన
నేమేమి పైరులు హెచ్చుగాఁ బండు
నెటనేని ఖనిజము లేవేని గలవె ?
నావుడు వారు విన్నాణంబు తోఁప
నాదాయ మొకలక్ష, యపరాలు పండుఁ
గొండలపై నుండి కొండొక్క వేళఁ
గడువడి జాఱెడు గండశైలముల
ఖనిజ సంపదలున్న కళలు కన్పట్టు
కాని దివాన్‌బాబు! కలదొక్క బాధ

ఒక్కపూఁటిచ్చట నుండినఁ జాలుఁ
జలివేఁకి తలమెక్కి జాడించి తన్ను
బల్లకడ్డున లేని వాఁడులేఁ డిచట
అనవుడు మంతిరి యందఱఁ గాంచి
గండరించును రాళ్ళ ఖనిజము లనుచుఁ
బలికిన మీరలు భయపడ నేల ?
జ్వరముల బాధకు జంకఁగా రాదు
ధీశక్తిచే మించి తేజంబు గాంచి
మొత్తగావలె మిత్తి మూర్ధాన మీరు
రైతుల రాపాడి అంపాన నిడక
ప్రాఁత బాకీలను వసూలు చేసి
మీ తెల్వి తేటలు: మేము మెచ్చంగఁ
జూపింపుఁడని చెప్పి చూడ డ్రైవరును
హారను నొత్తుచు నాతఁడు కారు
సమతలం బగుటచే సరసర నడుపఁ
బాడువా క్రాస్ రోడ్డు వడివడిఁ గడచి
మెడనెడఁ గల్గిన యెల్ల పల్లియలు
మంత్రియు రాజును మక్కువఁ గాంచఁ
జనుదెంచె నాకారు జయపురా టవికిఁ
దలమానికంబుగాఁ దసరారు నట్టి
ప్రోలుకోరాపుట్టి పురవరమునకుఁ;
జిన్నారి పొన్నారి క్షితిధరములును
జుట్టును నొలిసె పూసొగసులు గులుక
నాగుట్టలకు మధ్యమందు వివిక్త
మగు పదమునయందు నక్షులం దనుపు

ముత్తెపుఁ బేటలఁ బోలెడు నట్టి
పేఁటలు వాటమై వెలుఁగొందు చుండు
రాచబాటకుఁ బ్రక్క— ఱా నేల యందుఁ
జనస చెట్టుల నీడపట్టులఁ జేరి
యాటవి కాంగన లమ్ముచు నుండ్రు
కాబేజి నూలుకోల్ కారట్టులాది
వివిధశాఖమ్ముల వేర్వేఱు గతుల
కారులచ్చట నాఁగఁగాఁ, గడువడిని
అందలి యుద్యోగు లందఱు వచ్చి
ప్రసవహారమ్ములు భక్తిమై వైచి
చేతులు ముడ్చుక చెంతనే నిలువ
రామకృష్ణుఁడు తన ప్రక్కఁ గూర్చున్న
యట్టి సబేజెంటు నారసి వాని
హస్తంబు హస్తాన నందుక లాగి
యేమేమి యభివృద్ధు లెందెందుఁ దాను
సలుపంగ వలయునో చనవుమై నడిగి
యారీతి నొనరింతు ననిచెప్పి నంత
నల్లన డ్రైవరు హారను నొత్త
దేవు ఘాటునుదాఁటి తీవ్ర వేగమున
జయపురమ్మునకును సవిధస్థలానఁ
దుఱఁగలించెడు మావితోఁట దగ్గఱను
ఆఁగెను కారంత నచటికి జేని
బలఁగంబు చనుదెంచి బత్తిమై నెరఁగి
కర్పూరహారముల్ కంఠాల వైచి
దేశకాలోచిత దివ్య పద్ధతిని

గై సేసి తెచ్చిన కడు రమ్యమైన
నాలుగు గుఱ్ఱాల నాఁణెంపు బండిఁ
గూర్చుండుఁ డని వేఁడ క్షోణీంద్ర మంత్రు
లద్దానఁ గూర్చుండి యరుగుచో మొదట
రామకృష్ణుల నేత్రరాజీవములకుఁ
జెలువుగాఁ దోఁచెంచె శ్రీఠాకు రాణి
యాలయశిఖరమ్ము నందున్న యట్టి
శాత కుంభమ్ములు సరికొ త్త రీతి
వానిని గనుఁగొని వసుమతీశుండు
రామకృష్ణా! చూడు రాణుల రాణి
శ్రీఠాకురాణి మా క్షేమమ్ము గోరు
కోటదేవత సుమ్ము కోర్కులు తీర్చు
కామధేనువు సుమ్ము కాపాడు మమ్ము
ఆతల్లి బిడ్డల మయ్యా మేమెల్ల
ఆమెయే యెడ్డడ యగు మనకెల్ల
నావుడు కృష్ణుఁడు నవ్వుచుం బల్కె
నంకురించిన యట్టి యాకడిమివలెఁ
బులకలు మేనెల్లఁ బొడతెంచి మించ
ఓ మహారాజేంద్ర! యో రామచంద్ర!
మాతను దొలుతగ మనము దర్శించి
పిమ్మటఁ గోటకు వెళ్ళంగ వచ్చు
ననవుడు భూధవుఁ డట్టులే యనఁగఁ

జ య పు ర ప్ర వే శ ము.

దేజులు వీథులఁ దీరిచి నడవ
బండిలోఁగల రాజవర్యుని మంత్రిఁ

పౌరనారులు నేత్రపద్మాలతోడ
నర్చించి పేలాలు హర్షానఁ జల్ల
రారాణి శ్రీతాకు రాణి కోవెలకుఁ
జని బండిదిగి యామెచరణాబ్జములకు
సాష్టాంగనతులను సలిపినా రపుడు
దేవకీదేవికి దేవతా విభులు
రామకృష్ణులు తొల్లి ప్రణతు లిడినట్లు
లంతట నర్చకుఁ డాతల్లి సుప్ర
సాదంబు గొని తెచ్చి స్వాముల కీయఁ
గన్నుల కద్దుక గ్రహియించి వారు
సూర్యమహాలు లోనఁ జొచ్చిన యంత
భూనభోంతరములు భోరు గలుగఁగ
మ్రోఁగె ఫిరంగులు పోరిఁబోరి నాఁడు
విభునియొద్దనె మంత్రి విందారగించి
కార్యరంగమ్మునఁ గాలును బెట్టె

కార్యరంగము.

కన్నార నిద్దురఁ గాంచఁగాఁ బోక
కడుపార నన్నంబు కాంక్షింపఁ బోక
ఆరాజ్యమున సరిహద్దు లన్నింటి
నరసి యందుండిన యాయాయి ఖనిజ
సంపదలను గాంచి సామ్రాజ్యగరిమ
హెచ్చింపఁగా నెంచి యెదలోన నప్పుడె
తనకు సహాయులై తగుపనుల్ సేయఁ

గానవాధ్యక్షుని; ఖనిజశాస్త్రజ్ఞు;
వాస్తు శాస్త్రజ్ఞుని; వరకార్యదర్శి;
సాహాయ్యమంత్రుల; సరవిమై నిల్పి;
వాస్తుశాస్త్రజ్ఞుని; వనకళానిపుణుఁ;
దనవెంట బెట్టుక, తగుసేవకాళి
తోడనే చనుదేరఁ దోలు దొల్త నేఁగె
యేనుఁగుపై నెక్కి యెంతేని ఠీవి
నేఁగుచో దారిలో హేలగా దాఁటెఁ
గొల్లాబువాఁగును గొండలం బోని
గజముల వంతెనగా నొనరించి
చైత్రయాత్రను మున్ను సలుపఁగా నెంచి
రఘుమహారాజు తా రమణీయ కరుల
పైఁ గపిశానది బలముల తోడ
దాఁటిన యట్లుగా దర్పంబు తోడ.
రామగిరికిఁ బోయి తాళ్ళు రప్పలును
చెట్టుచేమలు గూడ స్థిరదీక్ష తోడఁ
బరికించి బరికించి బయనంబు చేసె
మలకసగిరికిని మానని పూన్కి
బ్లాకువాటరు పేరఁ బరఁగెడు జ్వరము
లచ్చటి తాళ్ళకు హావడి గూర్చు
చున్నను గలఁగక యుత్సాహ మడర
దండకాటవికిని దమ్ముఁడో యన్న
యనఁ జను నందలి యడవినిఁ గాంచి
టేకుచెట్టులఁ గను తేవతోఁ గొల్చి
వానికి నెంబర్లు వరుస వేయించి

గాననాధ్యక్షుని; ఖనిజశాస్త్రజ్ఞు;
వాస్తు శాస్త్రజ్ఞుని; వరకార్యదర్శి;
సాహాయ్యమంత్రిల; సరవిమై నిల్పి;
వాస్తుశాస్త్రజ్ఞుని; వనకళానిపుణుఁ;
దనవెంట బెట్టుక, తగుసేవకాళి
తోడనే చనుదేరఁ దోలు దోల్తనేఁగె
యేనుగుపై నెక్కి యెంతేని ఠీవి
నేఁగుచో దారిలో హేలగా దాఁటెఁ
గొల్లాబువాఁగును గొండలం బోని
గజముల వంతెనగా నొసరించి
చైత్రియాత్రను మున్ను సలుపఁగా నెంచి
రఘుమహారాజు తా రమణీయ కరుల
పైఁగపిశానది బలముల తోడ
దాఁటిన యట్లుగా దర్పంబు తోడ.
రామగిరికిఁ బోయి ఱాళ్ళు రప్పలును
చెట్టుచేములు గూడ స్థిరదీక్ష తోడఁ
ఒరికించి ఒరికించి బయనంబు చేసె
మలకనగిరికిని మానని పూన్కి
శ్లాకువాటరు పేరఁ బరఁగెడు జ్వరము
లచ్చటి ఱాళ్ళకు హావడి గూర్చు
చున్నను గలఁగక యుత్సాహ మడర
దండకాటవికిని దమ్ముఁడో యన్నొ
యనఁ జను నందలి యడవినిఁ గాంచి
టేకుచెట్టులఁ గడు శేవతోఁ గొల్చి
వానికి నెంబర్లు వరుస వేయించి

గానవాధ్యక్షుని; ఖనిజశాస్త్రజ్ఞు;
వాస్తు శాస్త్రజ్ఞుని; వరకార్యదర్శి;
సాహాయ్యమంతుృల; సరవిమై నిల్పి;
వాస్తుశాస్త్రజ్ఞుని; వనకళానిపుణుఁ;
దనవెంట బెట్టుక. తగుసేవకాళి
తోడనే చనుదేరఁ దొలు దొల్త నేఁగె
యేను గుపై నెక్కి యెంతేని శీవి
నేఁగుచో దారిలో హేలగా దాఁటెఁ
గొల్లాబువాఁగును గొండలం బోని
గజముల వంతెనగా నొసరించి
జైత్రయాత్రను మున్ను సలుపఁగా నెంచి
రఘుమహారాజు తా రమణీయ కదుల
పైఁగపిశానది బలముల తోడ
దాఁటిన యట్లుగా దర్పంబు తోడ.
రామగిరికిఁ బోయి తాళ్ళు రప్పలును
చెట్టుచేమలు గూడ స్థిరదీక్ష తోడఁ
బరికించి బరికించి బయనంబు చేసె
మలకనగిరికిని మానని పూన్కి
బ్లాకువాటరు పేరఁ బరఁగెడు జ్వరము
లచ్చటి తాళ్ళకు హావడి గూర్చు
చున్నను గలఁగక యుత్సాహ మడర
దండకాటవికిని దమ్ముఁడో యన్న
యనఁ జను నందలి యడవినిఁ గాంచి
టేకుచెట్టులఁ గడు శేవతోఁ గొల్చి
వానికి నెంబర్లు వరుస వేయించి

రాజ్యపరిశీలనము,

మోటు పురానికి ముదమునఁ బోయి
యచ్చటి శబరిఁ గన్నార వీక్షించి
యంపలోఁ గల పిడ నది క్రమంబుగను
గోదావరీనదిగుండఁ జనిచని
రాజమండ్రినిఁ జేరు లక్కలు దాన
రాబడి వచ్చును రాజేంద్రునకును;
అంచును యోజించి యంపెను వైరు
ఇంజనేయరుఁ దన యేఁగిన యెడకు
వైళంబ రమ్మని వైరందఁ గానె
లెక్కలు గట్టుక రిప్పాన నతఁడు
రెణ్ణాళ్ళు పయనించి రిప్పా లేకుండ
సచివునిఁ గలియ నచ్చటికిని వచ్చె.
ఈలోన మంత్రితా నిందంపుఁ దిరిగి
గుట్టలు మెట్టలు గుబురైన చెట్లు
మట్టియు ఱాళ్ళును మఱిమఱి చూచి
యెట్టెట్టి పనులకు నివియెల్లయవియుఁ
బనికివచ్చునో యంచు భావనచేసి
యింజనేయరుఁ గాంచి యీశబరినది
వెడలుపు చేయఁగా విడిముడి యెంత
కావలెనో లెక్క కట్టుమని యని
శబరిలోఁ గలనావ సరసకు నేఁగి
దానిపైఁ గూర్చుండి తనతోడ నున్న
యుద్యోగులను గూడి యొక్కొక్క మైలు
శబరినిఁ జూచుచుఁ జనిచని యంత
గోదావరినిఁ జొచ్చి గొండంత వేడ్క

## రా మ కృ ష్ణ ము

### ఇం ద్రా వ తీ న ది.

స్టీములాంచిని నెక్కి శీఘ్రముగా గతిని
భద్రాద్రి మీఁదుగాఁ బయనంబు చేసి
యింద్రావతీనది యీగోద తోడఁ
గలిసెడు చోటునఁ గాలూని నేలఁ
గ్రమ్మఱ వేఱొక్క కడుచిన్న నావ
నెక్కి బస్తరుగుండ నింద్రావతీనదిఁ
బయనంబు సాగించి బరికించినాఁడు
ఆనది కిరుతట్ల నారఁగాఁ బండు
ధాన్యంబు రైలుకు దగ్గఱ నున్న
యూరికిఁ జేర్పించి యురవైన వెలకు
నమ్మించి రాబడి యభివృద్ధి చేయఁ
జిన్ననావలు దానఁ జేర్పించి నడప
వచ్చు నటంచును భావించినాఁడు.
ఈరీతి పదిరోజు లేఁగిన యంత

### కొ ట్వా డు తా ణా లో.

కొట్వాడు తాణాకుఁ గొండొక్క చోట
నుండిన 'యూసనా' యూరి చెంగటను
బడవను దిగియట బంజరుఁ గాంచి
కోటపాడును జేరుకొని యటనున్న
యట్టి తాణాఫీసు కరిగి వేళ్ళిమ్మడిని
గూర్చుండి కుర్చిపైఁ గుదురుగాఁ దనదు
తోడి యుద్యోగులతోనిట్టు లనియె.
కన్నారె యిచ్చటఁ గల కొల్చుకొట్లు

వేలాది గరిసెలు వెలయును వీన
నీధాన్యము మఱాడి యెగుమతి చేయ
నాదాయ మినుమడి యగుఁగాన నొక్క
తండులయంత్రంబు తడయ కిచ్చోటఁ
బెట్టింతునని చెప్పి వేవేగ వ్రాసె
నాత్మ సఖుండైన యా దంతులూరి
లక్ష్మీ నృసింహుఁడన్ రాజుపేరిటను
రైసు మిల్లొక్కటి రాజ! శీఘ్రంబ
పంపించి కొట్ట్వాడు పాటిపై దాని
నెలకొనఁ జేయుము నీనేర్పు చూపి
మఱియొక్క విషయము మఱువక పంపు
మినుపపడవయొక్కటింద్రావతీనది
నడపఁగాఁదగుదాని, నయవేది వాట
వేఱుగా నీకునే విశదింప నేల?
కొట్ట్వాడు ధాన్యంబుఁ గొనిపోవుటకును
బదినాళ్ళు సాలూరు పయనంబు పట్టు
ఆబాధ తలగింప నంబు యానంబు
లింద్రావతీనది హేలగా నడపఁ
గా రాజమండ్రికి, గాదుల నున్న
కొల్చుకుఁ దగువెల గొనవచ్చు మనము
అని లేఖ లిఖియించి యామీనుఁ గాంచి
బంజరు భూములు వరుసతో సర్వె
చేయింపుమని నచ్చఁజెప్పి యాతాణఁ
గల కొండపిండునఁ గలయంగఁ దిరిగి
సిమ్మెంటు నినుమును జేయంగఁ దగిన

## రా మ కృ ష్ణ ము

ఊళ్ళను గనుఁగొని రత్నాల మూట
దొరకినయట్లు సంతోషంబు చెంది
చుట్టుమూఁగిన జనస్తోమంబుఁ గాంచి
యేమి కావలయునో యెఱుఁగంగఁ జెప్పుఁడి
నావుడు వార లానససీమలందు
నానందమయరేఖ లంకురమెత్తఁ
జేతులు జోడించి చెప్పినారిట్లు.
చిత్తము సత్ప్రభూ! చిత్తగించండి
బస్తరు రాజుల బవరమ్ము నందు
గెలిచి మారాజులు కీరితి చాటి
మావులిదేవిని మాయూరు తెచ్చి
నిల్పినారాతల్లి నిల్చుట కొక్క
నిలయంబు గట్టింపు నెఱదంట నైన
నీకీర్తి కియ్యది నిలయమా మంత్రి!
యన విని వెంటనే యార్డరు నిడియె
రెండువేల్ రూప్యముల్ శ్రీదేవి గుడికి
వెచ్చించు కొనుఁడని వివరించి పలికె
యదివిని యచ్చటి యాజన వితతి
బాపురే! యెంతటి బాగైన యీవి!
చాఁగురే! యెంతటి చక్కని యీవి!
యందంబునకుఁ దగ్గ త్యాగి యీతండు
కోపం బెఱుంగని కోమల హృదయుఁ
డని కొనియాడుచు సందలి కొండ
అంకాన కరుదెంచి యర్థించినారు
'వ్యవసాయమును వృద్ధిసఱచి కొనుదుము

మాకు కోరినవ్వాలనింపు మా ప్రభూ ! యనుచు
వారు కోరినయట్లు వారివారికిని
ఋణముల నిడి చనె హృష్ట పుష్టాత్మ
జయపురమ్మునకును సచివేశ్వరుండు

ఖ ని జా దు ల క ను ఁ గొ ను ట.

చనియచ్చటను గల్గు క్ష్మాధరేంద్రముల
నలయిక యెఱుఁగుక యలవోక నరిగి
యల్యూమినుము గల్గి యలరెడు గనులు
నెలజాళ్ళు గలిగిన నేలలుం గాంచి

జ య పు రా భి వృ ద్ధి.

సచివుల హోదాకు సరిపోవు నట్టి
సౌధంబు నొకదాని క్ష్మాపతి మెచ్చ
మంచి గందపుఁదోఁట మధ్య భాగమునఁ
గట్టించి యామేడ కడగదియందు
నన్నుతోఁ గూర్చున్న యప్పుడు గూడఁ
జిత్రింబుతా గిరి శిఖరాలమీఁద
ఖనిజముల్ మణులును గలవేమొ యనుచుఁ
గాంక్షతోఁ దలచుగాఁ గాంచుచు నుండు
వినువను మాటయే విస్మృతిఁ జెంది
తన తనిఖీకిని దగునట్లు తనదు
మేడ కెదురుగ సామిల్లునొకండు
పలు తెఱంగుల చెట్లు పఱియ వాపంగఁ
గట్టించి దానికిఁ గల శక్తితోడ

నిప్పనూనియ తీయు నింకొక్క జంత్ర
మచ్చోట నెలకొల్పె నందఱు మెచ్చ
బ్రహ్మాండ భాండముల్ బ్రహ్మదేవుండు
కనుపాప లోపలఁ గడు నేర్పుతోడ
నిముడంగఁ జేసిన హేల తోఁపంగ
జయపుర కానన స్థలమునఁ గలుగు
వస్తుజాతం బెల్ల భద్రింబు చేసి
పోలఁగాఁ బారెష్టు మ్యూజియం బొకటి
కట్టించె మిక్కిలి కష్టాన కోర్చి
కార్యంబు సాధింపఁగానెంచు ఘనులు
స్వార్థరహితమగు భావము గలరు
కష్టసుఖంబులు గణియింపఁబోరు.
అంతియె గాకుండ హార్మ్యాలు రెండు
కట్టించెఁ దనచేతికడ నున్నయట్టి
చిన్నదివాను వసింపఁగా నొకటి
కార్యదర్శి వసింపఁగా నొక్కటియును
'సర్వము స్త్రీరైన' సచివుండు గాన
దనకలంబున కడ్డు తగిలెడు వారు
లేకుంటఁ దడఁబాటు లేకుండ నతఁడు
రాష్ట్రింబు వర్ధిలు లాగుగా నెన్నొ
యార్డరుల్ సతతము ప్యాసు చేయుచును
బండ్లకొల్దిగ నున్న 'ఫైల్సు' నన్నిటిని
చిటికెలో 'డిస్పోజు' చేయుచు నుండు
రామకృష్ణుని భావరాజీవమందు
మెఱసెడు తలఁపులన్ మెఱపులగములు
తారకా వీధికిఁ దరలి నిలఁబడి

వైద్యుతోన్నత దీప పఙ్క్తిగా వెలుఁగుఁ
బ్రాసాదములయందు రాజవీధులను
మేడల మిద్దెల మిలమిల మెఱచి
వీక్షించి యయ్యాది వివిధ జనంబు
రామకృష్ణుని కీర్తి రాత్రియుఁ బవలుఁ
దెల్లనై వినువీథి దీపించు నదిగొ
కనుఁగొనుఁడీ! యని కాంక్షలు దీఱఁ
దమలోనఁ దాము నక్తంబుల యందుఁ
బడకకుర్చీలలో వ్రాఁగొనుచుండు.

కొల్లాబువాఁగు.

అంతతో సంతృప్తి నందక మంత్రి
కొల్లాబువాఁగులో కొండలోయలను
మిక్కిలి లోఁతుగా మింటిపై నుండి
పడుచుండుటను గాంచి పడయంగవచ్చు
విద్యుత్తునని వ్రాసె విశదంపుఘణితి
మదప్రభుత్వంబు మనసున కెక్క
నదిగాంచి దొరతన మానని మెచ్చి
యార్థిక సాహాయ్య మడిగిన యంతఁ
చేయంగలారము చీకాకు లేక
భవదీయ రాజ్యానఁ బడయంగ నైన
ఖనిజంబు లేమేమి కలవు కనుఁగొని
మెఱఁగింపుమని జాబు నిడనాత్మఁ బొంగి
కొల్లాబు నిసుకలో గుందనమున్న
చాయలు పొడగాంచి స్వర్ణమ్ము దీయు

రా మ కృ ష్ణ ము

యంత్రముల్ దెప్పింప యత్నముల్ చేసెఁ
బత్రికలందునఁ బ్రకటన చేసె
మానవపతికిని మనవిని చేసె.

భె గా రా జ ల పా త ము.

బంగారమును జేయు బలు యంత్రములును
అల్యూమినుము చేయునట్టి యంత్రములు
నవి యివి యన నేల యన్నియంత్రములు
అధికమౌ ధనమును వ్యయపెట్ట కుండ
విద్యుత్సహాయాన వివిధరీతులుగ
నడపఁగ వచ్చునన్ గాఢ యోచనను
గావించి కొండల గాలించి కాంచె
జలపాత మొక్కటి జయవెట్టఁ బ్రజలు
'భెగరా' యనెడు నూర విన్నుననుండి
పాతాళమునయందుఁ బడుచున్న దొడ్డ
జలపాత మొక్కటి జయపుర మంత్రి
మన రామకృష్ణుండు మన యిష్టసఖుఁడు
జయపురమ్మున నుండి సాలూరు కేఁగు
రోడ్డునకును నైదు క్రోసుల దూర
మందున్న దానిని నరసి వచ్చుటకు
గారులేఁగెడునట్టి ఘనమైన రోడు
నొకదాని నిర్మించె నున్నతోద్యోగు
లేనాఁటఁ జనియట కెంతేనిఁ దన్ను
మెచ్చుక నిచ్చలు మేలని పొగడ
నీరీతి నెన్నియో హృష్టుఁడై. కృష్ణుఁ

డాసాయమును గొండలందునఁ గాంచ
నాతని సత్కీర్తి యాసేతు శీత
నగమధ్య మందున్న నాడెల్లఁ బ్రాకె

ఆతిథ్యము.

నుద్యోగ మిమ్మని యొక్కఁడే తేర
నుపకారమును గోరి యొక్కఁడే తెంచు.
చిత్రకారుఁడనని చేరరా నొకఁడు
కవివతంసుఁడనని కనవచ్చు నొకఁడు
హితుఁడను నేనని యే తేర నొకఁడు
సతికిఁ జుట్టమనంచుఁ జనుదెంచు నొకఁడు
ఈ రీతి జనముచే కృష్ణమందిరము
విధి విరామము లేక వెలుఁగొందు చుండ
నర్థాంగలక్ష్మియౌ నా దుర్గమాంబ
సేవకుల్ సేవలు సేయఁగా నున్న
వంటకంబులు సేయ వంటవారున్న
భర్తకుఁ బరిచర్య భక్తిమైఁ జేసి
వచ్చిన యతిథులఁ బంచ భక్ష్యములఁ
దృప్తినిఁ గాంచఁగా నేర్పాటుచేసి
యన్నపూర్ణాదేవి యను పేరుగాంచె.
ఇసుక రాలకయుండ నింటిలో నిండ
నతిథుల తండంబు లనిశంబు నుండ
నాదంపతుల పుణ్య మదియేమొ గాని
వినుగును గనరు హృద్వ్యథుల నెప్పుడుఁ
బదిమంది బ్రతికించు ప్రకృతియే గాని

## రామకృష్ణము

ఒంట్రెత్తు బ్రతుకుపై నూహయే లేదు
యేనుఁగు పాఁడిగా నిచ్చుచే కాని
విసుగుడుపాటన్న పేరైన లేదు
తనపంక్తిఁ బదుగురు తనివి దీఱంగ
బోసేయ వలెనను బుద్ధియే గాని
మానిసి వెగటింత మనమున లేదు
ఊపిరాడని పని నుండుచే కాని
పనియున్నఁ జీకాకు పడుటయే లేదు
ఎవ్వ రేదడిగిన నిచ్చుచేకాని
లాకేత్వ మిడునట్టి లాంగిత లేదు
అతిథులు మేడపై నలరారుచుండ
నర్ధాంగియును దాను నామేడ క్రింది
గదిలో నివాసంబు గావించు చుండు.
తానింత వాఁడనన్ దర్పంబు లేదు
ఈరీతి నతిథుల నెల్లయర్థులను
గల్పవృక్షమువోలెఁ గాపాడు వాఁడు
బుడుకుఁ గల్లునుబోలెఁ బోషించు వాఁడు
నగు రామకృష్ణుని నర్వమారీతి
వర్ణించు కవిరాజె వరుఁ డన్నిగతుల.

## రైల్వే లైను.

సంస్థానమున రైలు సాగింపనెంచి
బెంగాలు నాగపూర్ పేరను బరఁగు
రైలువేయధికారి ప్రతతితోఁ దనదు
స్కీమును జర్చింపఁ జిత్తాన నెంచి

తనరాజ్యమున రైలు దారినిఁ దానె
స్వయముగ నీక్షింపఁ బయనమై నాఁడు
జయపురి, బొరిగొమ్మ సరవినిఁ గాంచి
నవరంగపుర భూమి ననిచెడు వేడ్కఁ
బరికించి యచ్చటి ప్రజ లతిసూక్ష్మ
పద్ధతి లక్కతోఁ బ్రతిమలు మఱియుఁ
బెట్టెలు, బరిణెలు వివిధరీతులుగ
సలుపుట వీక్షించి సన్నద్ధు లిచ్చి
వారికి లక్కను వనములయందుఁ
గడుస్వల్పమగు పన్ను కట్టుచుఁ బడయ,
అటనుండి యుమరుకోటను నూరు కరిగి
యచ్చటి కానన మంతయుఁ గాంచి
రైలును నడపెడు.రథ్యలఁ గనుచు
నడ్డుదారుల గుండ నరిగినాఁడపుడు
విజయనగరమున వెడలిన యట్టి
రాయపూర్ రైలువేశైనున కాని
కాకిలు రాయఘుడయన్ గ్రామంబునకును.

పంచదారము.

అరిగి యచ్చటి భూములారసి చెఱకుఁ
దోఁటలు నాటింపఁ దోరమౌ లాభ
మగు నంతియేకాదు యంత్రము నొకటి
పంచదారను జేయఁ బాదు కొల్పెదను
ఈసీమ నెఱవేర్ప నెంతేనిఁ దగును
గున్నము సుబ్రాపు కుదురైనవాఁడు
వానిని బిలిపించి వలయు భూములను

## రామకృష్ణము

దరఖాస్తుపై నిచ్చి ధనమిచ్చి పైఁగఁ
బోరిత్సాహమును జేసి పోషింతు జనుల
నని యెంచి సుబ్రావు నాక్షణమ్మునను
రావించి పొలమిచ్చి రావు తమ్మునకుఁ
గూడను బొలమిచ్చి గుణపురమునకు
నేఁగి యచ్చటనున్న పృథ్విని గాంచి
తన కసిస్టెంటును దగు బంధువైన
రామశేషయ్యకు వ్రాసిచ్చె భూమి
సుఖపడుమని చెప్పి శూరుఁడాతండు

## కల్యాణసింగపూరు పితూరీ.

కల్యాణసింగపూర్ కడ పితూరీలు
రేఁగినవని విని రివ్వున నేఁగె
ఏజెంటునకు వ్రాసి యే తేరఁ దనదు
వెంటఁ బటాలముల్ వేలకొలంది
ఏఁగియేఁగినతోడ నెల్ల మూలలకు
నాపటాలమ్ముల నంపి యెందెందుఁ
జెలరేఁగి దుండగుల్ చెలఁచుచున్నారో
కనిపట్టి కడువడిఁ గాల్చుఁడీ యంచు
నానతిచ్చెనిడి వారి హావడి నాఁగి
రైతులఁ బిలిపించి ప్రణయమ్ము మీఱ

## ముస్తాజరీ రద్దు.

కష్ట నిష్ఠురములఁ గనుఁగొని వారిఁ
గాపాడి సభయంబుగాఁ బల్కెనపుడు.

ఆతపాగ్నులు తాఁక నగుఁగాని వేఁడి
సహజంబుగా నీరు చల్లని దెగద.
ప్రాఁతబాకీ లీయవలదని చెప్పి
ముస్తాజరీవల్లఁ బూర్వమునుండి
రైతులు పడుచున్న రాపిడిపోవ
ముస్తాజరీ రీతి పూర్తిగ నపుడు
పోఁగొట్టి వారికిఁ బూర్ణమోదంబు
కలిగించి శాంతిని గలిగించి ప్రజకుఁ

కలకత్తా ప్రయాణము.

గ్రిచ్చలు చనినాఁడు కలకత్త పురికి
రైలువేయధికార్ల రావించి నాఁడు
వారికి విందులు పచరించి నాఁడు
విందుకుడ్చిన వెన్క వివరించినాఁడు
రాయఘుడ్‌లో నున్న రైలున కంటి
యుమరుకోటను దాఁటి యొయ్యాన నద్ది
నవరంగపురమును నట బోరిగొమ్మ
రామగిరియును బరాబరి దాఁటి
మల్కనగిరి మోటు మఱి కూనవరము
భద్రాద్రి దాఁకను బఱవంగ ప్రైను
జేయుఁడు భూమియు స్లీపర్లు మేము
ఉచితంబుగా మీకు నుత్సాహ మొప్ప
నిత్తుము, భద్రాద్రి యేలూరుల నడు
దారి మహారాష్ట్ర దక్షిణ రైలు
కంపెని వారలు కావింతురి రైలు.

నావిని వార లనంతమోదంబు
చెంది యారీతినే చేయుదు మనుచు
వాగ్దాన మొనరింప వల్లె యటంచు
మన రామకృష్ణుఁడు మఱిమఱి పొంగి
వాల్తేరునకు వచ్చె వచ్చి నంతటనె

వి శా ఖ ప ట్ట ణ ము హ వా మ హ ల్.

రాచఠీవికిఁ దగ్గ రమ్య సౌధంబు
తనఱేని కచ్చుటఁ దనరారకుంట
దర్జాకు లోచ్చని తలపోసి యెడఁద
సంద్రంబుప్రక్కనే చక్కఁ గట్టించె
బ్రాసాద మొక్కటి వర్ణింప వశమె
దాని యందంబును దానిదౌ తీరు
పదితాళ్ల యెత్తుగా వసుధాస్థలంబు
పూడ్పించి దానికి ముందును వెనుక
బ్రహ్మాండమగు ఱాతిప్రహరినిఁ బెట్టి
ప్రహరికి మధ్యగాఁ బ్రాసాదవరము
గట్టించె నాగ్రాను గల నెలఱాళ్లు
వేనవేల్ తెప్పించి వెల్ల వేయకయ
తెల్లఁగా మెఱసెడు దివ్యమౌ శిలలు
అరుణకాంతల నీను నట్టివౌ శిలలు
ఆకుపచ్చగనుండు నట్టివౌ శిలలు
నీలిరంగులఁ గ్రక్కు నెఱవైన శిలలు
వానిపై నడిచెడు వారల రూపు
లగపడు నిగనిగ లడరెడు నట్టి

కుట్టిమ స్థలములు కోమల శిలలు
గలుగు నాప్రాసాద గరిమంబు గాంచి
హాళిమై మింటిపై నరిగెడు నట్టి
వైమాని కావళి వైజయంతముగ
వగచి గ్రద్దన వచ్చి పరికించి చూచి
రామకృష్ణాక్షరరాజి వీక్షించి
వెలువెలఁ బాఱుచు వెడలుచు నుండు.
వైటుహాలును గాంచి వచ్చిన యట్టి
వైస్రాయి యంతటి వాఁడును గూడ
నామేడ షోఁడిమి నారసి నంత
మెచ్చెరుపాటు తా నాత్మలోఁ జెందు.
ప్రాసాద రాజమై వఱలు నద్దాని
పైభాగమునయందు బారులు దీరి
నృత్యముల్ కాంతలు హేలమై సలుప
దారుఫలకములు దాపిన పెద్ద
హాలును గట్టించె నందఱు మెచ్చ
సౌధాన కెదురుగా సాయాహ్నములను
విశ్రాంతి గైకొన వివిధ జనంబు
సొగసైన రంగులసోఫాలు దీర్చె
సోఫాలపైఁ గూరుచుండిన వారి
కబ్ధితరంగాలయందుండి వచ్చు
చల్లని గాలులు శ్రమదీర్చుచుండు.

సంస్థానాభివృద్ధి.

శ్రమమెఱుంగని మన రామకృష్ణుండు
ఆ హావామహాలునయందుఁ గూర్చుండి

## రా మ కృ ష్ణ ము

తరతరంబులనుండి తగవుల తెగక
బాధించుచున్నట్టి వ్యాజ్యంబు లెల్లఁ
బ్రాడ్వివాకత్వంబు వాక్చతురతయుఁ
గనుపర్చి తీర్పఁగా గాంక్షించి యపుడు
మాడుగుల జమీాయు మఱి పాచిపెంట
బిసముకటకక్కుల విభులకుఁ దమకుఁ
గల తగాదాలదా కల రూపెఱింగి
యాయాయి రాజుల నందఱఁ గలిసి
కుడిచిన చోటునఁ గూర్కఁగాఁ బోక
కూర్కిన చోటునఁ గుడువఁగాఁ బోక
పవలును రాత్రియుఁ బయనముల్ చేసి
యాజమీాందారుల కలవెన్ను లిచ్చి
క్షితిపతికిని వాని చెలియలి కున్న
తగవులఁ దీరిచి తగురీతి గాను
తన రాజ్యసీమలోఁ దద్రాజ్యములను
గలుపుక; సంతృప్తి గాంచక మంత్రి

## స ం స్థా నా దా య వృ ద్ధి.

సామ్రాజ్య భాగ్యంబు సాలుసాలునకుఁ
బండ్రెండు లక్షలు పై దాఁట దన్న
మాటను బోఁగొట్టి మఱియారు లక్ష
లాదాయ మరుదెంచు నట్లుగాఁ జేసి
గౌతమీాగంగను కంఠ మాలికగఁ
దనరాజ్య లక్ష్మికిఁ దగఁజేయ నెంచి
భద్రాచలము రాజు పజ్జకు నరిగి

యమ్మఁగా నెంచిన యతని రాజ్యంబు
చేరంబు సాగించి వీలుఁగా నెంచి
యాతని యభిమత మంతయు నెఱిఁగి
కరిమ్మలు వచ్చెదగా యని పలికి
సంతోషవీచికా సమితిపైఁ దేలి

## ఆంధ్ర విశ్వకళా పరిషత్తు.

చెన్నపురమ్మును జేరఁగాఁ జనిరోఁ
జేరిన తోడనే చిత్ర మదేమొ
శ్రీరామచంద్రదేవ్ క్షితిపేంద్రు పటము
పత్రికలందెల్లఁ బ్రకటింపఁ బడిరెు.
ఆంధ్ర విశ్వకళాలయసభకు నతని
పోషిపాన్నలరుగఁ బరిభుత్వము నిలిపె
నని యది కాంచుచు నాంధ్రదేశంబు
నందలి వారెల్ల హర్షించి నారు
రామకృష్ణుని శక్తిఁ బరిణుతించి నారు.

## జయపురాగమనము.

అటనుండి పయనమై యరుదెంచె నతఁడు
జయపురంబునకును జయవెట్ట జనులు
దారిలో గుడివాడ దగ్గఱనున్న
పచ్చి బాలెంతయూ భార్యను గాని
పసిపాపనుం గాని పరికింప లేదు
కార్యభారంబునఁ గాిలుచు నుంట.

రా మ కృ ష్ణ ము

శ ర దృ తు వు.

కుంభజన్ముఁడు మింటి కొమ్మునఁ బొడమె
నిందుగు దీసినట్లేటు లన్నియును
గలఁకలు విడనాడి కడు నిర్మలముగ
మడికాసు నీళ్లుల మాౘ్రదిగాఁబాఱె
శారద కాలమన్ జనుఁడు మంత్రికిని
విరిసిన తెల్లుపూ వింజామరముల
వీచెను మెల్లఁగా విశదభావమున
ఆరఁగాఁ బండిన యా వరిచేలు
కై వారిలి మంత్రికిఁ గావించె నతులు
పంకంబు లింకఁగా బాటలు పొలిచెఁ
బంకమింకిన యట్టి వారి చందమున.
తడిపొడి ధాన్యంబు తట్టలోఁ బోసి
కొనివచ్చు కాంతలు కొంప చేరకయ
చిత్తజల్లునఁ దల చీరలు దడియఁ
జెట్లమాటున కేఁగి చీరలు పిడిచి
రంతలో నెండరా నరుసంబు చెంది
క్షణములో నింటికి సరసర నరిగి
యుత్సాహమునఁ గొల్చు నడకంగఁ బెట్టి
యెండలోఁ జాఁపపై నెండఁగాఁ బెట్టి
యాకాశమున మబ్బు నట్టె వీక్షించి
పాల కేడ్చెడు చంటి పాపల నింటఁ
బడవైచి కడుఁ దడఁబాటును జెంది
లబలబ లాడుచు లంఘింప నటకు
నింతలోఁ బెంపుడు నిట్టు లాకొల్చు

బొక్కచుండఁగ దారిఁ బోయెడు పుష్ప
లావిక లది కని రావం బెసంగఁ
గలువకాఁడల వాని గద్దించి మోఁద
నానందమున వారి నగ్గించి తడయ
కాధాన్యమును దట్ట లందుల నింపి
పరుగున నింటి లోపలవైచి కొనిరి.
గోరాజు కొమ్ములఁ గోరాడ గట్టు
పులు కడ్గినంతనే పొలిచెడు కత్తి
కరణిగా గగనంబు గనువిం దొనర్చె
గాడవళ్ళచే నీఁకఁ గోతురన్ భీతి
వరిచేలు మింటికిఁ బఱచెనో యనఁగఁ
బఱచెను జిలుకలు వదనంబు లందు
వరివెన్ను లిటునటు వ్రాలి పీఁగంగ.
సత్తు ముంగరలతోఁ జనుచున్న స్త్రీలు
గ్రుడ్లతోఁ జను చీమ గుంపట్లు తోఁచె.
భాసుర శారద వాసర నిశలఁ
బుచ్చపూవుల నారఁ బోసిన యట్లు
వెలుఁగొందె వెన్నెల విశదంబుగాను
బిండారఁ బోసిన విధముగా నున్న
పండు వెన్నెలలోన బాల బాలికలు
వెన్నెల వత్తుల వేడ్కతో నాడ
నత్తింటి యందున్న యల్లుఁ గుఱ్ఱంపు
పండుకొండని వారిఁ బదరంగ సాగె
మాఁజోలి నీకేల మాబావ! నీవు
పండుకో మాయక్క పాపము తాను

## రా మ కృ ష్ణ ము

నిద్ర లేకుండఁగా నీరాక వార్చు
నని వెక్కిరింపఁగా ననుఁగు మఱఁదలు
తలవాంచి యాతఁడు తనగది కేఁగె.
అంతలో ముసలమ్మ లావులింతలకు
చిటికెల తాళముల్ చిక్కన వైచి
రండట్రా మీరింక రండు లోపలికి
మంచులో నాడుట మంచిది కాదు
అంచు వాకొనుచున్న యవ్వల నవ్వి
పిల్లలు గంతులు వేసిరి మివుల
పిల్లలు కేకలు వేయుచు నుండ
నిద్దుర పట్టక నింపాదిగాను
చుట్టలు ముట్టించి చూడఁగా వచ్చి
యరుఁగులగోడలె యాసాను గాఁగఁ
గూర్చుండి పెద్దలు గునికిపాటులను
దీయుచు నుండఁగాఁ దెలతెల్లవాఱె.

## ద స రా వే డు క లు.

మంగళ గీతముల్ మధురమ్ము గాను
బాడుచు వందులు వసుధాతలేశు
మేలుకొల్పుచు నుండ మేళ తాళముల
దేవినిఁ బూజింపఁ దివిరి యర్చకుఁడు
సాగరమ్మున నుండి జలములు తెచ్చె.
అంతలో మంత్రి తా నచటికి వచ్చి
కోటలోబురుజుపై కొమ్మున నెత్తె
సూర్య పతాకంబు చూపఱు పొగడ

దసరాకు నయ్యాది తగు చిహ్నమాట
జయపుర పౌరులు జయవెట్టి నారు
చుట్టాల రమ్మనుచును వ్రాసినారు
కొంపలు కై చేసికొన్నారు నెమ్మి
కుప్పలు నూఱిచి కొల్తుము గాని
గుడ్డల నరువిమ్ము కోమటిబాబు !
దసరాలు వెళ్ళుటే తడవుగా బాబు !
బారంగిచేల్ కోసి పట్టుక వత్తు
కోకగుడ్డొక్కటి కోడలిదాని
కివ్వండి యనుమాన మింత లేకుండ
నాసంగ తీయూరి నడిగడ్డ నున్న
యందఱు మీరిప్పు డడుగంగ వచ్చుఁ
దిరకాసు లేకుండఁ దెచ్చి యిచ్చెదను
సెట్టిగారూ ! వేగఁ జీర యివ్వండి;
మారాజు దసరాకు మామూలు లిచ్చు
మామూలు మీకిత్తు మావాని కొక్క
కోటుగుడ్డీయుఁడీ కుదురు లేకుండ
వేఁపించుచున్నాఁడు వేగిర మిడుఁడి
సెట్టిగారూ ! లెండు శీఘ్రంబుగాను
బదిగంట లాయెను బనియున్న దండి
అని కోమటిండ్లపై నందఱు జనులు
నీఁగలు మూఁగిన క్లైగఁ బ్రాఁకుచుండఁ
నంగడి వీథుల నలబల మెచ్చె
పేఁటలఁ గోటను వేడుకల్ హెచ్చె
ఉద్యోగు లాకరిపై నొక్కఱు పడుచు

నిటునటు వడివడి నేఁగుచు నుండ
నుత్సవంబులఁ గాంచ నుత్సాహ మడరఁ
బలుస్థలంబుల నుండి పలువిధజనులు
కారులు దారులు గానరాకుండ
రేఁపుచు ధూళిని రివ్వున రాఁగ
మింటిపై నాధూళి మేఘముల్ గాఁగఁ
గనుఁగొని నెమ్మలు క్షామాధ రాగ్రిములఁ
బింఛమ్ములను విప్పి పెంటులం గూడి
స్వేచ్ఛగా నృత్యముల్ చేయఁగాఁ దొడఁగె
సారస పక్షు లాఛాయలఁ గాంచి
వార్షి కాబ్దములుగా వగచుచు లోన
ఱెక్కల నల్లార్చి ఱిక్కించి మెడలు
గొంతెత్తి కేంద్రించి కూయఁగాఁ దొడఁగె.

భి ల్లు లు, ప ర దే శా గ తు లు,

అదికాంచి భిల్లులు స్వాత్మ లుప్పొంగఁ
గోటను గాంచఁగా గుంపు గుంపులుగ
సత్తుతోఁ జేసిన సరికొ్రొత్తసగలు
గాళ్ళను జేతులఁ గంఠాలఁ దాల్చి
స ప్త వర్ణంబుల జానొందు నట్టి
చాలిచాలని వస్త్ర చయములఁ దాల్చి
చెవులలోఁ బూవులఁ జెరివి చక్కఁగను
ఆముదమ్ముల రాచి యంటఁగా నొక్కి
తల కొక్కరీతిగాఁ దలకాయ దువ్వి
ఛాఱల కంచుకాల్ చక్కఁగాఁ దాల్చి
చిఱుచిఱు నవ్వుల చిఱుతపాపలను

నడ్డికి కట్టుక నడువీధులఁ బడి
వచ్చుచుఁ బోవుచు బారులు దీర;
నన్యదేశా గతు లైనట్టి వారు
వారల సొబగులు వారల భాష
వారల వేషాలు వారల కులుకు
వారల గరగర వారల హొయలు
వారల భావాలు వారల రుచులు
వారల వన్నెలు వారల కందు
వారల నడకలు వారల చూపు
వారల యేపులు వారల కోపు
వారల నృత్యంబు వారల పాట
వారల కేకలు వారల పనులు
వారల కట్టులు వారల బొట్టు
వారల హావాలు వారల పసలు
వారల తెలువులు వారల తీరు
వారల తియ్యముల్ వారల నీటు
అచ్చెరుపాటుతో నారయు చుండ
బాజా బజంత్రీలు వాయిదమ్ములను
ఉత్కళాంధ్రమ్ముల నొత్తుచు నుండ
మండల నృత్యముల్ మగువలు సలుప
గెష్టుహౌసుల నున్న కేవ లాంగ్లేయ
సోదరుల్ చకితులై చూచుచు నుండిరి.

పరదేశీయులకు విందులు.

సత్రమ్ములందున్న సకలలాతిథులును
గుణుపుర పప్పులు గూడారి గుడము

## రామకృష్ణము

జయపుర బియ్యము శాకపాకములు
మాద్గుల నేతులు మామిడి పండ్లు
కొట్నాపు గోధుమల్ గుమ్మడి పండ్లు
బొరిగొమ్మ బీఅలు పుట్ట కొక్కులును
కొరఘుట్టివి నూలు కోళ్ళు కేరట్లు
లాదిగాఁ గలయట్టి యఖిలపదార్థ
ముల వంటకమ్ములు పొలుపుగాఁ జేయఁ
గడుపార భుజియించి గట్టునఁ దేంచి
గమగమ వలచెడు కర్పూర వీటు
లారగించిన తిండు లరగెడు దాఁక
నమలుచు నిటునటు నడయాడుచుండఁ

## దసరా దర్బారు.

బూర్వము జయపుర భూపాల వరుల
కాదిపీఠం బౌచు నలరారి నట్టి
నందాపురము నుండి న్యాయైక మతులు
రాజ పురోహితుల్ రాఁ బ్రసాదములఁ
గైకొని మంత్రియు క్ష్మానాథవరుఁడు
దుర్గార్చలకును సంతోషంబు తోడ
ముదల యొసంగఁగాఁ బూజారు లంత
రక్త వర్ణాంచిత లాజలతోడ
నర్చించి దేవిని నా ప్రసాదంబు
ఱేనికి మంత్రికిఁ బ్రీతిమై నీయ
దేవీ ప్రసాదంబు దివ్యాత్ములకును
అద్దుక భుజియించి యామీఁద వారు

'రక్తగద్దియ' నను రక్తిమై నెక్కి
రాజు, దర్బారెల్ల రక్త వర్ణములఁ
జెన్నొందెఁ జెంగల్వ చెన్ను వహించి.
రక్త దీపమ్ముల రక్త వస్త్రముల
రక్తకాంతుల నీను రాజలాంఛనల
నాసభా మండప మంతయుఁ గూడ
నరుణ కాంతలఁగూడి వ్యాపించు నట్టి
సాంధ్యకాలమువోలె సాక్షాత్కరించె.
గైరికరసమట్లుగాఁగ దైవాజ్ఞె
లాక్షా ద్రవంబునలాగున మెఱసెఁ
జిఱువేరు రంగుల శ్రీని వహించె
మందార పూవుల మాద్రిగా వెలిఁగె.
మంకెన పుష్పంబు మాడ్కిగా నడరె
నారక్త కాంతిలో నారక్తకంఠ
నాదముల్ పంచమ నాదమ్ములట్లు
మనములఁ దనియింప మంజులఫణితి
గణికా సమూహముల్ గానమ్ము చేసె;
గానమాధుర్యముల్ కర్ణాలఁ గ్రోలి
రూపమాధుర్యముల్ చూపులఁ దాగి
సభ్యులు సంతుష్టి సారము గనిరి.
సప్తమి యష్టమి చన నిట్లు హాయి

వార్తాకయంత్రము.

నవమి నాఁడేన్గులు నడ గొండలట్లు
బారులు తీరిచి ప్రాఁగోట నుండి

రా మ కృ ష్ణ ము

తొంబది తొమ్మిది; తోరంపు తీవి
నుత్సవంబులతోడ నూరేఁగ సాఁగె.
రామచంద్రుండును రామకృష్ణుండు
బలరామ కృష్ణుల పగిదిగాఁ దాము
బంగరు టంబార్ల పైఁగూరు చుండ
నేన్గుల ముంగట హేపలు చెలఁగఁ
బంచధారలతోడ వాజులు నడవఁ
బౌరాంగనామణుల్ బారులు తీరి
యెడనెడ హారతు లిచ్చుచు నుండ
దసరాల దిబ్బను స్థలము నొద్దకును
ఊరేగుచును కరి యూధమ్ము లేఁగఁ
బ్రభుమంత్రు లిర్వు రంబారుల నుండి
యల్లనఁ గ్రిందికి నవతరింపంగ
జన సమూహంబులు జయవెట్టినారు
అచ్చోట నున్నట్టి యాసనంబులను
రాజు దివానును బ్రఖ్యాత జనులు
ఏజెంటుదొరయును హృష్ట పుష్టాత్ము
లై కూరుచుండిన యంతట నొక్క
సన్నని దారంబు సాగఁగాఁ గట్టి
దారంబునకు నడి తావున నొక్క
వంకాయ వ్రేలగా వైచిరి దాని
నేకఘ్ని చేకొని యేజగాజెట్టి
ఒక్కటే దెబ్బకు నూడంగఁ గొట్టు
నాజెట్టి ఘనుఁడని యగ్గింత్రు ప్రజలు
ఒక్కరి వెంబడి నొక్కరు గాఁగఁ
జనుదెంచి వంకాయ సరిదాఁకు నట్లు

కొట్టె దుపాకులు గురివెట్టి కొట్టి
రెవ్వరు కొట్టిన యేనియుఁ గాని
వంకాయ పక్కకేఁ బఱవవు గుండ్లు.
ఒక్కరు వెంబడి నొక్కరు గాఁగఁ
దెల్లమతాబులు తెగఁ గాల్చినారు
పప్పులో నడుగులు పడవైచినారు
ఇంతలో శ్రీరామ కృష్ణుండు లేచి
కేళిమై నేకఘ్నిఁ గేలను దాల్చి
యాలీఢపాదుఁడై యచ్చట నిలిచి
వామనేత్రము మూసి వలపటి కంట
గుఱిచూచి వంకాయఁ గొట్టెఁ దుపాకి;
నయ్యది ముక్కలై యవనిపైఁ బడియె.
దారంబు తెగకుండ దానినిఁ గొట్టు
టాశ్చర్య మాశ్చర్య మని యెల్లవారు
కరతాళములు వైచి కరము నుతింప
శ్రీమహారాజును చిఱునవ్వు నవ్వె.
ఆనాఁటి కాసభ యారీతిఁ గడవ
నెవరియిండ్లకు వార లేఁగుచుఁ దాము
సచివాగ్రగణ్యుని చాకచక్యంబు
అన్ని విషయముల నపరిమేయంబు
అంచును వాకొని రాత్మలు దనియ
విజయదశమినాఁడు విభుఁడు దర్బారు
తీర్చెడు సొబగును దిలకింప నెంచి
నవమీ విశేషముల్ నానా విధాల
నాలుబిడ్డలఁ గూడి యన్యోన్య మైత్రిఁ
జెప్పుక సుఖనిద్ర చెందినా రంత

## రా మ కృ ష్ణ ము

తెల్లవాఱంగనే తేనీళ్ళు ద్రావి
పడక కుర్చీలలో వ్రాలిచి మేను
యుల్లాసమున నాఁటి యుత్సవంబులను
గూరిచి వచియించు కొనుచుండఁ గానె
కోటలో నాలుగు కొట్టినారంచుఁ
బనివాండ్రు వచియింప బద్ధకమ్ములను
బోనాడి శిరములు పొల్పుగా దువ్వి
కొంగ్రొత్త దుస్తులు కోర్కెమైఁ దాల్చి
బారుల దీరిచి పౌరులందఱును
దర్బారు గాంచఁగాఁ దరలినా రంత

## ద ర్బా రు వ ర్ణ న ము.

స్వర్ణకాంతుల నీను సరిగంచు లొప్పు
నల్లని కోటులు నల్ల లాగులును
నల్లని టోపీలు నల్లని జోళ్ళు
నల్లని నడికట్లు నవకంబు తోడ
ధరియించి దేవిడీ దగ్గఱ నిల్చి
తౌర్యత్రికంబు లతెందరిత నెఱపు
చుండంగ మంత్రియు నుర్వీధవుండు
దుర్గా ప్రసాద మస్తోకంపు భక్తిఁ
గైకొని దర్బారు గావింప రాఁగ
జనులెల్ల నిలఁబడి జయవెట్టినారు

## రా మ చ ం ద్ర దే వ మ హా రా జ వ ర్ణ న ము.

నవరత్న ఖచితమై నయనముల్ దనుపు
బొమ్మిడీకమ్మది మూర్ధాన వెలుఁగ

మంజులా కారముల్ మకర కర్ణికలు
కర్ణశష్కులికలఁ గ్రాలుచు నుండఁ
గిమ్మీర కాంతులు కెలఁకులం బ్రాఁకఁ
జేసెడు మాణిక్య శృంగార హార
ములు కంఠమందునఁ బొలుచుచు నుండ
జలతారు పనితోడఁ జక్కులు దనుపు
మొకమలుకుబుసము మురిపంపులాగు
జిలుగుచెడావులు చెంగలింపంగ
రతనాల యుంగరాల్ రాణించు కేలఁ
గనకంపు టొఱగల కరవాల మడర
నెలరాలవేదిక నిండఁ బఱచిన
రత్నకంబళముపై రమణీయకాంతిఁ
జెలఁగు సాలగ్రామ సింహాసనమున
శ్రీరామచంద్రుండు క్షితితలేంద్రుండు
ఆసుధర్మా మధ్యమందు భాసిల్లు
సింహపీఠికయందుఁ జెలువొందు నట్టి
దేవేంద్రుఁ డట్లుగఁ దేజరిల్లంగ

రామకృష్ణవర్ణనము.

కాశ్మీర కాంతలు కరపల్లవముల
జిలుగైన జలతారు చేరిచి నేసి
నట్టి గులాబిరం గడరు నుష్ణీష
మొకచెంగు వీఁపుపై నూఁగాడు చుండ
నొకచెంగు మీఁదికి నొప్పారు చుండ
రాజపుత్రుని మించు రంగైన శీవి

సొగసుగా సోకుగాఁ జొప్పడఁ జుట్టి
ఉన్ని నూటును దాల్చి యొసపరికాసెఁ
దగిలించి వేలిఁగాఁ దరవారి యొకటి
మంత్రి యుగంధరు మాడ్కిగా రామ
కృష్ణుఁడు తనచేని కెలన నిల్చుండి
పాదఖేటును బెట్టి పరికించి సభను
గవులకుఁ గనుసైగ గావించి నంత

సత్యనారాయణరాజు కవితాగోష్ఠి.

తనయాత్మ కాత్మయై తనరారు వాఁడు
కవివతంసుండన్న ఖ్యాతిగలాఁడు
మూర్తీభవించిన పుష్పబాణుండు
పుంభావ వాణియై పొలుచు నాతండు
బహువిధ కావ్యముల్ వ్రాసిన వాఁడు.
పండిత రాజనఁ బరఁగెడు వాఁడు
తెలుఁగురాజనుపేరఁ దేజుగలట్టిఁ
డైన సత్కవిలేచి యట వ్యక్త మధుర
కంఠముతో నిట్లు కమ్రభావముల
భాసిల్లు పద్యముల్ పఠియించినాఁడు
ఏరాజమంత్రుల యీడితకీర్తి
హంసలు స్వర్ధునియందున మునుఁగు
నేరామకృష్ణుల యొసఁగెడు త్యాగ
మీక్షించి కల్పక మికిలించు పంక్తు
కామధేనువు సదా గడ్డినే మేయుఁ
బుడుకుఁగల్లెప్పుడుఁ బుడమినే యుండు

నా రామకృష్ణుల నారసి నంతఁ
గవులు గర్ణులుగాఁగ గణియించు చుండఁ
బొలతులంగజులుగాఁ బొగడుచు నుండ
యాచకుల్ మరుదేశమందలి ప్రపలు
గాఁ గీర్తనము చేయుఁ; గర్ణుందు లెల్ల
వారి యుదారత వారిధార్మికత
వారి శూరతయును వారి ధీరతయుఁ
గాంచి కాంచినతోడఁ గారణ జన్మ
మెత్తిరి వీరని మెచ్చుచు నుందు
రనుచు సాలంకృతి వ్యామిశ్రితముగ
వర్ణించినంతనే ప్రభువరు నాజ్ఞ

కవిరాజసత్కారము.

శేముషీధుర్యుఁడౌ శ్రీరామకృష్ణుఁ
డచ్చటి తనకృషి యంతయుఁ గూడఁ
దేటతెల్లంబుగాఁ దెలియంగఁ జేసి
వెంటనే యీరీతి వినిచె మృదూక్తి
నాకును మిత్రుఁడు నాసతి గురువు
సత్యనారాయణ సద్రాజ కవికిఁ
గొట్టాడు గ్రామంబు కుఱుఁగట నున్న
ఆసనా గ్రామంబు నందొక నూఱు
ఎకరాల భూమిని నిచ్చె నృపుండు
మఱియు ననుప్లవ మంత్రియై నాకుఁ
జిననాఁట మిత్రుఁడౌ సీ వి రావునకు
మంకిడి యనునూర మఱి నాల్గువంద

# రామకృష్ణము

లెకరాల భూమిని నిచ్చె భూభుజుఁడు
వీరిద్వరును నిట వివిధరీతులుగ
సాగులు చేసెడు సరణి చూపింత్రు
పిల్లి పెసరచేలఁ బెట్టెడురీతి
ఇనుప నాగళ్ళచే నిల దున్ను తెఱఁగు
లగపర్చి వీర లీయాటవికులకు
నగుదురు బాసట వ్యవసాయమందు
ననవుడు సభయెల్ల నానందవార్ధిఁ
దేలుచుఁ జప్పటుల్ తీవిరి వాయింపఁ
బ్రాంత బాకీలతో పాటుగా నెల్ల
శిస్తు వసూలును జేసినయట్టి
యధికారులను బిల్చి యాదర మొప్ప
నొక్కొక్క నెలజీత మొక్కొక్కరికిని
బారితోషికమిచ్చి పలుచోట్ల నుండి
వచ్చిన కవులకు వరగాయకులకుఁ
జిత్రకారులకును సీమదొరలకుఁ
కాశ్మీర శాల్వాలు కౌశేయకములు
గుబుపుర కత్తులు గుఱుతుగా నిచ్చి
యాసాయమునుగూడ నత్తఱి నచట
జరిగిన యుత్సవాల్ జరిగినయట్లు
ఫోటోలు తీసిన బుద్ధిమంతులకు
వెచ్చు పసదనము లిచ్చిన యంత
సభలోన నున్నట్టి సభ్యుల కెల్లఁ
గర్పూర హారముల్ కమ్మ కస్తురులు
కప్పూర వీడెముల్ గందంపుఁ బొట్లు

పన్నీర నీరముల్ వరుసతో నిచ్చి
దర్బారు సాలించి ధరణీంద్రు సెలవు
గైకొని-మేడకుఁ గ్రన్ననఁ జనియె.

గుడివాడ ప్రయాణము.

ఇంతలో నాకాశ మెల్లయు విఱిగి
పైఁబడు నట్లుగాఁ బట్టెను మబ్బు
ఉఱుములు మెఱుములు నుప్పతిల్లంగఁ
గరికర ధారలఁ గరకల తోడఁ
గడవలఁ బోసిన కరణిగా వాన
నేఘలు నూళులు నేకమౌనట్లు
జోరునఁ గురియఁగాఁ జొచ్చె న త్తఱినిఁ
గార్యభారముననో కాకున్న దృష్టి
దోషమ్ముచేతనో తొలిజాము నందె
చలివేఁకిఁ గృష్ణుని సద్దేహ ఃమంటె
మామూలు నాళ్ళనె మక్కువ తోడఁ
గుదురుగా నన్నంబు గుడువని యతఁడు
బానసీఁ డిడినట్టి వంటకంబులను
జిహ్వాగ్రమునయందుఁ జేర్పకుండఁగనె
చేకడ్డుకొని లేచి స్నేద దేఱంగఁ
బడకకుర్చీలోన వ్రాలెచ్చె నెమ్మేను
అరమోడ్పుఁ గనులతో సటునిటు దో
యేమియుఁ దోఁచక యీాక్షించు చుండ
సేవకుఁ డొక్కఁడు చెచ్చెర వచ్చి
'బేబీకి జ్వరబాధ పీడించు చుండె

# రా మ కృ ష్ణ ము

వెంటనే గుడివాడ వెడలి రావలయు,
ననియున్న తంత్రిని నందంగఁ జేసె;
నదికాంచి యించుక యదవద చెందు
నంతలో వేఱొక్క యడియరి వచ్చి
వంగి సలామును భక్తినిఁ బెట్టి
'ప్రియ ! రామకృష్ణుఁడా బెజవాడ యందు
ఆంధ్రవిశ్వకళాలయ స్నాతకోత్స
వము జరుగునుగానఁ బదినాళ్ళలోన
ప్రోఛాన్సలరు కిర్ది పూర్తిగాఁ జెప్పి
మాసభ కరుదెంచు మద్రాసు గొర్న
రధ్యక్షుఁడుగ నిట్టు లతివినయమున
విన్నవించు నతఁడు విను; రిజిష్ట్రారు
అనియున్న నొకకమ్మ నందిచ్చె నద్ది
పఠియించి యచ్చోటు పాసి వేఱొక్క
కార్యాలయమునకుఁ గదలిచని యట
వేడ్కల నందడిఁ జేరొకని యున్న
ఆఫీసు పైల్సుపై నక్షులు త్రిప్పి
సరసర కలమును సాగించినాఁడు
నిల్చియున్న సిపాయి నిల్చియే యుండె
నింతలోఁ గోటలో నెలుఁగెత్తి పాడె
సద్వంది గణము లుషఃకాల గీతు
లదివిని గడియార మారసి మంత్రి
కార్యకృత్యమ్ములు గడువడిఁ దీర్చి
రాజును దర్శించి రానెంచి కోట
కరిగి నృపాలున కన్ని సంగతులు

విన్నపం బొనరించి వేవేగ వచ్చి
కారులోఁ గూర్చుండి కదలె విశాఖ
పట్టణమ్మున కేఁగఁ బ్రక్కఁ గూర్చుండఁ
బండితరాజు సద్భావంబుతోడఁ

జ్వ ర బా ధ — సే వ.

గారులోఁ గూడను గాగితంబులను
జూచుచుండుటఁ జేసి సుఖనిద్ర లేమిఁ
గూఁతు బెంగయుఁ గారు కుదుపును నెడఁదఁ
గాయంబుఁ దద్దయుఁ గాఁజియవెట్ట
హోవామహల్ కేఁగు నంతలో జ్వా ర్తి
యగ్గలంబాయెఁ దానట్లుండి గూడ
గుడివాడకునుజని కూఁతును గాంచి
రావలె నని యెంచి ప్రయతించెఁ గాని
తొలినాఁట బడినట్టి తోరంపు వాన
రాకపోకలు లేవు రైళ్ళకు నపుడు
తంతివార్తలు గూడ స్తంభించిపోయె.
ఝంఝానిలమ్మచే సంక్షుభితమగు
వారాశి పోల్కిఁగా భావంబు కలఁగ
ధీరుఁడైన దివాను దిగులును జెంది
మంచము పట్టెను మఱుక్షణమందె
పరిమితి దాఁటెనా పాడు జ్వరంబు
పరిచర్యలను జేయ భద్రంబు గాను
దాదులఁ బెట్టె వైద్యవిభుఁడు వచ్చి
నిలుగుచు ములుగుచు నెంజలి పడుచు

## రా మ కృ ష్ణ ము

నున్న మిత్రునియొద్ద నోపికతోడఁ
గవిరాజు గూర్చుండి గనుపెట్టియుండి
పవలునురాత్రియు బహుభక్తితోడఁ
దలకాయ తడవుచుఁ దగుసేవ చేసె.

## చం ద్ర గ్ర హ ణ ము.

నాఁడు చంద్రగ్రహణంబు కావుటను
జయపురంబుననుండి క్ష్మాపతీంద్రుండు
కంధిలో స్నానంబు గావింప నెంచి
తన యమాత్యుండున్న తన యవాసమహాలు
నకువచ్చి మంత్రి యాననము వీక్షించె
రాజరుదేరఁగా రామకృష్ణుండు
కందోయినిఁ దెఱచి కరములు మోడ్చి
మ్రొక్కి నిట్టూర్చి నృపుండొకపాఱు
క్షణములో రావించి గ్రహణకాలమున
రామకృష్ణునిచేతఁ బ్రవిమల భక్తిఁ
దిలదాన మిప్పించెఁ దేవులు నశింప
నభవుని కరుణయో యాదాన మహిమొ
వైద్యు హస్తగుణమ్మొ వచియింప లేము
మఱునాఁటి కావేఁకి మటుమాయమాయె.

## ఆం ధ్ర వి శ్వ క ళా ప రి ష త్ప ట్ట ప్ర దా నో త్స వ ః

బాటలేర్పడె రైళ్ళు పఱతెంచుటకును
సుఖముండె శిశువనుచున్ వచ్చెఁదంతి.
క్రమముగాఁ గోల్కొని రామకృష్ణుఁడు మ
హారాజుతోడ నేకాంతమునందు

నెద్దియో యోజించి యెంతేని ప్రొద్దు
పట్టప్రదానోత్సవంపుఁ గార్యములు
ముందుగాఁజని సరి పుచ్చంగవలయు
నంచును బెజవాడ కరుదెంచి నారు.
దాసదాసుల తోడు తను; రాజమంత్రు
లారాధ్య వర్యుఁడౌ నా కాశినాథు
నాగేశరాయు ఘనవదాన్యవరుని
దుర్గా విలాసంపుఁ దుంగ సౌధాన
విడిసిరి పదపడి వేగిన వెంటఁ
బట్టప్రదానోత్సవంబును నెఱప
దుర్గా కళాలయా స్తోకాచ్ఛ భూమిఁ
గై సేయఁగా జేసెఁ కళలీన నంత
నడుచక్కి గొర్నరు నాణెంపుఁ బీఁట
గూర్చుండ జయపుర క్షోణినాథుండు
వానికి వలపట వరపీఠమందుఁ
గూర్చుండె డాపలి కుర్చీలలోన
రామలింగారెడ్డి రామకృష్ణుండు
నుపవిష్టు లై రెంతో యుత్సాహమొప్ప
వారికిఁ జుట్టును వరుసలు దీర్చి
స్నాతకుల్ గూర్చుండ్రి సరసాసనముల
నెదుటను జక్కఁగా నేర్పర్చినట్టి
మంచెలఁ జూపఱు మలయుచునుండి
రంత మహారాజు హాలులో నున్న
పదిమంది కందువ పరికించునట్టు
లిటునటుఁ జూచుచు నీక్షింప మంత్రి

వెంటనే యాతండు విభుఁడు గ్రహింప
జేబులోఁ బత్రంబు చేకొని సైగ
చేయంగ, వెంటనే క్షితిపుఁడు లేచి
పఠియించె స్వాగత పత్రంబు నంత
మద్రాసు గౌర్నరు మధురాతి మధుర
వాక్కుల స్నాతక వరులకు నీతి
బోధకోపన్యాస మునుజేసి యంతఁ
బట్టముల్ బిరదముల్ వరుసమై నీయ,
రామలింగారెడ్డి, రాజు, గౌర్నరును
అగ్గించి తనచేత లన్నియుఁ దెలిపె.
రామకృష్ణుండంతఁ బ్రభువరు నాజ్ఞఁ
బరికించి సభ్యులఁ బలికినాఁ డిటుల
తేనీటి తేట నెంతేఁ బ్రీతిఁ గ్రోల,
మాపటివేళను మాచేయునట్టి
విందును గుడువంగ వేంచేయవలయు
ననవుడు నందఱు నానంద మొంది
యెవరియిండ్లకు వార లేఁగినారంత

టీ పార్టీ.

మధ్యాహ్న వేళను మానవాధీశుఁ
డొసఁగెడు టీపార్టీ కొక్కరొక్కరుగ
నరుదెంచి కుర్చీల యందుఁ గూర్చుండ
స్పెన్సరు సోడాలు శీధురసములు
పోర్కులు బిస్కట్లు పోషణింపంగఁ
దేనీటితోపాటు త్రేంచుచుఁ గ్రోలి
రామకృష్ణుని కీర్తిఁ బ్రణుతించి చనిరి.

విందు.

క్రమ్మఱఁ దొమ్మిది గంటల వేళ
రాతిరి విందుకై రా, వారలెల్ల
నొక్కొక్క పీఁటపై నొక్కొక్క సబ్బు
నొక్కొక్క తువ్వాలు నొక్కొక్క 'మెనొ' యు
పెట్టిరి తొలుదొల్తఁ, బిమ్మట నతిథు
లాసీనులైనంత నాకులఁ బఱచి
గుంటూరు గోంగూర గుడివాడ వెన్న
మైసూరు పాకాలు మైసూరు రసము
అరవల సాంబారు నావకాయలును
కాబేజి పప్పును గమ్మని పులుసు
అప్పడాల్ వడియాలు నమలాన్నములును
గారెలు మండెఁగల్ కాఁగిన నేయి
రసగుల్ల చెఱకుపాల్ రవ్వలడ్డులును
వైష్ణవు పులిహోర వ్యాపారిచట్ని
పిచ్ఛిలదధియును బెసరట్టు కూర
మామిడి పండ్లును మధుర మధురస
లరఁటిపండులు మంచి హల్వాలు చారు
లుక్కెఱ చక్కెర బొబ్బట్లు 'కాలి'
పూలు బటానీలు పొరిఁటిన కూర
తిమ్మనంబులు నాది దివ్యపదార్థ
ములతోడ విందిడ మొగమోట లేక
భుజియించి యందఱు బొజ్జలు నిమురు
కొనుచును నెడనెడ కొబ్బరి నీర
ములు మంచును గులాబి పూరసము గలు.

## రామకృష్ణము

గం దాౘివి వడిలేవఁ గాలేక లేచి
గమగమ వలచెడు కమ్మని వీడె
ములు చొరుక్కొట్టుచు ముట్టించి నారు
రష్యా పొగాకుతో లాహిరిఁ గూర్చు
సిగరెట్లు కాౘిపులు చే దువ్వుక్కొంచు.
కాల్చి వీధులఁబడఁ గానిడి నట్టి
యాసిగరెట్టుల నారసి వీధిఁ
బోవువార్ మిణుఁగురుఁ బుర్వులు గాఁగ
వగచి దగ్గఱ కేఁగి పట్టుక్కొని తమ
చేతులు చుఱ్ఱనఁ జిన్నవోవుచును
సందుగొందులగుండఁ జనినారు పిదప
విందు కుడ్పులయొక్క వేడ్కల తోడ.

కనకదుర్గపూజ.

వెలవెల వేగఁగా విభుఁడేగి నాఁడు
జయపురి కంతట సచివాగ్రిగణ్యుఁ
డిను నాజ్ఞఁ గైకొని యేఁగి దుర్గాల
యమునకు నాతల్లి నర్చించి యనియె
"అస్మదీయాన్వయ మభివృద్ధి చెందఁ
గనకదుర్గాంబికా కైంకర్య మిచట
మున్నాఁట యఱవది పూఁటలు గూడ
నాదు గోత్రమ్ముతో నాదు పేరిటను
జరిగింపుఁడీ నాదు జన్మ మున్నంత
దాఁకను బ్రతినెల తప్పకుండఁ గను
ముప్పది రూప్యముల్ పుత్తెంతు నంచు."
అదివిని యర్చకు లాశీర్వదించి

జయపురమరుగుట.

రంతట గుడివాడ కరిగెను భార్యఁ
గూఁతును గానఁగాఁ గోర్కె లిగుర్ప
జ్వరపడి లేచిన భర్తను భార్య
ప్రణయార్ద్ర దృష్టులఁ బరికించుచుండఁ
జచ్చిబ్రతికిన నిజసుతను దండ్రి
ప్రేమామృతాత్ముల వీక్షించుచుండ
వారి యగాధంపు భావాబ్ధులుబికి
బాష్పాంబువులు గాఁగ బాఱంగఁ దొడఁగె.
అన్నము పున్నము నరయని చిన్ని
పాప తల్లికరాలఁ బన్నుండి జనకుఁ
గాంచి చేతులుచాఁచి కలకల నవ్వెఁ,
జిన్నారి నవ్వుతోఁ జెలఁగెడు బిడ్డ
నక్కున నదుక యానంద మొంది
రెన్నాళ్లు లచ్చటఁ బ్రీతితో నుండి
ప్రియురాలి బిడ్డను వెంట నిడుకొని
జయపురి కరిగెను జనములు పొగడ.

ఓడినెల్ కమిటీ.

ఇంతలోపలఁ దన యినురాష్ట్రమెల్ల
నుత్కళ రాష్ట్రమం దొగిఁ జేర్పనెంచి
యుత్కళుల్ సలిపెడు నుత్సాహ యత్న
మునఁజేసి యరుదెంచెఁ బాలిపాలి మంచు
'వోడెనల్' సంఘము త్యుత్సాహ మొప్పఁ
దత్సంఘమ్మును గొని తనరాజ్య మెల్లఁ

ద్రిప్పిన స్థలమునఁ ద్రిప్పకుండఁ గను
దిప్పి ప్రజలు తమ జేని సంస్థాన
మెన్నఁడు నుత్కళు లిచ్ఛించు రాష్ట్రి
మందుఁ జేర్పంగరా దని యనఁజేసి
జయపురికిని వచ్చి సర్వ విధాల
వారలఁ దనియించి ప్రభువరుతోడ
మంతనముండి యా మఱునాఁడు సమితి
శ్రీమహారాజేంద్రు చెంతకును గొని
వచ్చి యడ్గుడు ప్రభు వాంఛిత మనుడు
వారు రాజేంద్రునిఁ బ్రశ్నింప తేఁడు
మృదుమధురోక్తుల నెఱిఁగించె నిట్లు
వినుఁడయ్య సభ్యులు విశదంబుగాను
కాశ్మీర దేశ భూజానులవంశ
మందుద్భవించుట నాది మావారు
మే మాంధ్రులముగాము మీరెంచినట్లు
నా యేలురాజ్యమునందున్న యట్టి
జను లుత్కళులు గారు చర్చించి చూడ
నాటవికులు గాని; యంతియే గాదు
మూఁడుభాగము లాంధ్ర భూమియె నాది
తెలుఁగు దివానుల ధీశక్తిచేత
నే, యభివృద్ధి యెంతేనియుఁ బొందెఁ
దరతరంబులనుండి తత్తమైన నాదు
సంస్థానమంతయు సన్మతులార !;
కాన మీరాంగల స్వామినాథులకును
నాదురాజ్యమును నేనాఁట నుత్కళము

నందుఁ గలుపఁగరా దంచునా ప్రార్థ
నంబుగా వేగ మనవి చేయుఁడనుచు
లిఖితరూపంబుగా లేఖను వ్రాసి
వ్రాలిడి మంత్రిచే వ్రాలిడఁ జేసి
వారి కొసంగఁగా వారు చేయునది
లేమినిఁ జనిరి బల్ శీఘ్రంబు గాను
మంత్రి శేముషికిని మదులందుఁ బొంగి.

మహారాజు పెండ్లి ప్రయత్నము.

తనదు ధీశక్తి నత్యంతంబు వృద్ధి
సర్వతోముఖముగా క్ష్మాపతి పొందు
చున్నను సంతతి యొదవమి జేసి
కెదలోనఁ జింతిల్లి యెగ్గతమందుఁ
బ్రభువుతో యోజించి పయనమై చనియెఁ
గలకత్త యనియెడు ఘనపురంబునకు
వెళ్ళినయంతనే విన్నాణి యతఁడు
హాోదాకుఁ దగినట్టి యున్నతసౌధ
మొకదానిఁ గైకొని యుండి తా నంపు
నేపాల రాజేంద్రునిసుతను దనమ
హారాజునకు వివాహమును జేయింపఁ
గానెంచి తన్మంత్రిఁ గలకత్త కరుగు
దెమ్మనుచును బ్రతి దినమును దంతి
పైఁదంతి నిడి వడి వాని రాఁజేసి
సంతు లేకుంట మాక్ష్మాపతి మరలఁ
బెండ్లాడ నెంచె మీవిభుకూఁతు నిచ్చి

## రా మ కృ ష్ణ ము

యుద్వాహ మొనరింపఁ డొండనఁబోకుఁ
డార్యరాజన్యుల నగ్రగణ్యుండు
సూర్యవంశోద్భవ శూరుండు నగుట
మారాజవర్యుండు; మంత్రిందరి! మీర
లన్యథా యోజింప నక్కఱలేదు
ఉభయతారకముగా నుండునీపెండ్లి
నావుడు నేపాల నాథుని మంత్రి
తనరాణికంతయుఁ దంతిమూలమున
నెఱింగింప నాతండు హృది సంతసించి
తనపుత్త్రు నొక్కనిఁ దనమంత్రి యున్న
నెడ కంప శ్రీరామకృష్ణుఁడు వారి
దర్శనకుఁ దగునట్లు తన తెల్వి చూపి
విందులు వేడుకల్ వివిధరీతులుగఁ
గావించి యొప్పించెఁ గావింపఁ బెండ్లి.

## వై ప్రా యి య ను మ తి.

సర్వస్వతంత్రుఁడై క్ష్మాయేలుచుంట
నేపాల సామ్రాజ్య నేత యవ్వాని
వియ్యంబు జయపుర విభుఁడొందుటకును
రాజప్రతినిధి వరంబు నందవలెఁ
గానఁదదాజ్ఞను గైకొన నెంచి
నేపాలరాట్సుతు నేపాలమంత్రి
నామంత్రిణముచేసి యచ్చోటు వీడి
మద్రాసు చనుదెంచి మధ్యాహ్న వేళ
గార్నరుదర్శించి కథయెల్ల వినిచి

గొర్నరు నొప్పించి గొర్నరుద్వార
మున వైసురాయికిఁ బుత్తెంచి తన మ
హారాజు పెండ్లికి నాజ్ఞయిడుఁడని
విజ్ఞాపనమ్మును; వెంటనె వచ్చి
చేరి జయపురముఁ, జేరినతోడ
నే కోటకేఁగి యావృత్తాంతమెల్లఁ
బూస గ్రుచ్చినరీతి భూపాలుతోడఁ
దెలియఁగాఁ జేసెను దేహముప్పొంగ
ఊఁకొని భూభుజుఁ డోంకారమొంది
రామకృష్ణునిఁ జాలఁ బ్రస్తుతియించె

మహారాజ్ఞి.

కోటలో మంత్రియుఁ గువలయేశుండు
మంతనంబుండి యేమాటలాడికొని
రో యవి యెల్లయు నూరెల్ల పొక్కె
నానోట నానోట, నందురు గాదె
కలుగు గోడలకును గర్ణంబులంచు.
ఊరెల్లఁ బ్రాఁకిన యుబుసాఁగు నొక్క
యంతఃపురమ్మున యందున్న రాణి
చెవిలోన నెవతెయో చెలికత్తె యూఁదెఁ
దనభర్త వేఱొక్క తరుణిఁ బెండ్లాడు
ననువార్త రాజ్ఞికి నటమట గూర్ప
దల్లికి వివరించి తగులేఖ వ్రాసెఁ
గూఁతులేఖను గాంచి కొఱకొఱ లాడి
బలరామపురినుండి వడిబయల్దేఱె

జయపురంబునకు క్ష్మాపతి యత్త.

గాసిపాత్రుఁడు.

ఇంతలో నిక్కడ నిదియెల్లఁ దెలిసి
క్ష్మానాథు నెయ్యుఁడు గాసిపాత్రుండు
పానకంబున నడ్డు పడుపుల్లవోలె
నడ్డుగోలుగ వచ్చి యనియె నీరీతి
భూపాల! నేపాల భూపాల పుత్రిఁ
బరిణయంబాడకు బహుదూరమయ్యా
మంత్రిమాటలు నీవు మన్నింపకయ్యా
తనపనితీరిన తదనంతరంబు
తనదారిఁ దానేఁగుఁ దమమంత్రిగారు
మనలాభనష్టముల్ మనయోగుబాగు
లాతని కేటికి నరయుమోరాా
నామాట పాటింపు నామైత్రి తలఁపు
కాదంటివాచూడు కాఁగలగతులు
అంచును బడిబడి యవనీంద్రితోడఁ
జెవి నోరు గట్టుక చెప్పుచు నుండ
వైద్రాయి కడనుండి వచ్చె ననుమతి

మహారాజు అత్తగారు.

ఆసమయమునందె యవనీతలేంద్రి
నత్తగారరుదెంచి యల్లునితోడఁ
దెరచాటుగానుండి తెలిపె నీరీతి
సంతానమునుగోరి జామాత! నీవు

పెండ్లాడఁదలఁచితేఁ బెండ్లాడవచ్చు
నీ భార్యచెల్లెలి నీలాబ్దవేణి
నీరాజసీమయే నీకునుఁ జాలుఁ
గట్నాల కోసమై కాంక్షింపఁ బోకు
నేపాలభూపాలునికొామా ర్తె; మేము
నాపాటి కట్నాల నర్థించి తేని
నీయఁగాఁ గలమయ్య యింకేల బెంగ
అనుచు మహారాజు నానసం బెత్తి
కొండొాక యోజించుకొని యావులించి
సేవకునిం బిల్చి శీఘ్రంబ పోయి
పెద్దదివానును బిల్చుకరమ్ము
అని యానతీయఁగా నాతఁడు వోయి
రాజాజ్ఞ తెలుపఁగాఁ బ్రొజ్ఞుఁడౌ మంత్రి

మహారాజు అశ్లీల వాక్యములు.

కథ యడ్డు తిరిగెనుగాఁ దలపోసి
వెంటనే కారుపై వెడలెఁ గోటకును.
మంతిరి గనుఁగొని మానవనాథుఁ
డుల్లంబు కుతకుత యుడికిపోవంగ
హీన స్వరంబుతో నిట్లులుపలికె
రామకృష్ణా! నీవు రాత్రియుఁబవలు
నిల్లువాకిలి నాక యెల్లదేశములు
తిరిగిన యూరును దిరుగకుండంగఁ
గూర్చిన యూరను గుడవకుండంగ
నావృద్ధిఁ గోరుచు నానావిధాలఁ

౦౯ వ కృ ష్ణ ము

గష్టముల్ పొందితి కాని యోనాఁడు
సుఖపడి యెఱుఁగవు సుంతైనఁ గాని
యాలిబిడ్డలతోడ నానంద మొప్ప
క్షణకాలమైనను గడపలేదీవు
నేర్పరివైనట్టి నీపాలనమున
నాతితీక్ష్ణమ్మును నాత్యుష్ణ మౌచు
మలయుచు నుండెడు మలయమారుతము
సోఁకునఁ దద్దయు సుఖపడు నట్లు
నాప్రజలంద అనంత సుఖంబు
పొందిరి నీవింత పొందవు సుఖము
త్రిప్పితి నిన్ను నే దిన మొక్కయూరు
నీస్కీములన్నియు నిలిచియే యుండె
నేనెప్డు చూతునో యెఱుఁగంగరాదు
అడవిఁగాసిన వెన్నె లాయె నీచేఁత
లని నోవఁగాఁ బోకు మయ్య నీవెప్డు
నీఋణంబును దీర్ప నేర నేనైన
దైవతంత్రమ్మును దాఁటగారాదు.

మ హా రా జు ల క్నో చే రు ట.

అనుడు ప్రగ్గడ ప్రభు వాడిన మాట
లాలించి యందలి యర్థంబు లెల్ల
విపరీత భావముల్ వెలయించుచుంట
కాత్మలో దడదడ లాడుచు ననియె.
ఇదియేమి రాజేంద్ర! యిట్లందువీవు
ఉదధిగాంభీర్య! యోయుర్వీంద్ర! నీవు

ప్రాకృతు నట్లుగాఁ బలుకంగఁ దగునె
వచ్చినలోశేమి వసుమతీనాథ !
వివరింపు నాతోడ విషయంబదేమొ
దలను దాకట్టిడి దాని సాధింతు
తామన్యథా యెంచి తలఁకంగ వలదు
అనవుడు నృపతితా నట్టె నిట్టూర్చి
చిడిముడి పడుచును జెప్పెనీరీతి
శేముషీధన ! నీవు చేసిన చేఁత
లెన్నండు కాదని యేనన లేదు
కాని మహారాజ్ఞిఁ గన్నమ్మ వచ్చి
సంతతికై నాదు చాన చెల్లెలినె
పెండ్లాడు మనియెన్నొ విధములఁ గాను
బలవంతమును బెట్టె వలదన లేక
యూఁకొంటి వేఱుగా నూహింప కీవు
నంగీకరింపుమా యనవుడు మంత్రి
తా యథా రాజా తథా మంత్రి యనెడు
పలుకూఁది యిట్లనె పసుధేశుతోడ
నాలస్య మైనచో నమృతంబె విషమ
వునెదరు గనుక భూపతీ ! యిపుడ
మూరుతంబును బెట్ట భూదేవు నొకని
రావింతు ననిచెప్పి బ్రాహ్మణు నొకని
రావించి పెట్టించె లగ్నంబు నంత
భూపతి తద్దయు మోదంబు నొంది
యిట్లనె మంత్రితో నింపు దీపింప
ముందు మేమేఁగుదుము వెనుక నీవు
బనులెల్ల సరిదీర్చి పయనమై రమ్ము

## రా మ కృ ష్ణ ము

రామకృష్ణా! యనఁ బ్రణతులు చేసి
ప్రభువును బ్రిభ్యానిఁ బ్రిభున త్తగారిఁ
బయనంబు చేయించి పంపించె మంత్రి.

### అ ప శ కు న ము లు.

దేవిడి విడి కారు దేవు ఘాటునకుఁ
జనెనొనో లేదో యచ్చట టైరు పగిలె
నాఁగిన కారుపై నటవంగఁ దొడఁగె
నుత్తర దిక్కుగా నొక్కటే రీతి
మాలకాకుల మూఁక మార్మోయ దెసలు
సమయమ్మునను బట్టి శకునముల్ గలుగు.
నెట్టిలో నాటైరు నిటునటు నతికి
నడపించె డ్రైవరు నరనాథుఁ డంత
రైలుపై నరిగెను లక్ష్మణపురికిఁ
బదినాళ్ళలో నింకఁ బరిణయోత్సవము
సర్వమంగళముగా జరుగంగఁ గలదు
అత్తవా రింటిలో హాయిగా నుంటి
నన్మదీ యాన్వయ మభివృద్ధి చెందుఁ
బదిమందిలో నేను బ్రస్తుతిఁ గాంతు
ననుచు లోలో రాజు నానంద మొందు.
ప్రసవ ఫలోపేత వసుమతీజంబుఁ
గాంచి పాంథుఁడు దానిగాటంపునీడ
విశ్రాంతిఁ గొననెంచి వెడలును గాని
తద్వృక్ష కోటరాంతరభాగ మందుఁ
గాకోల విషవహ్నిఁ గ్రక్కెడు త్రాచు
గలదంచుఁ దలఁచునే కలనైనఁ గాని.

మహారాజు సన్నిపాత జ్వరము.

అది యయోధ్యాభూమి యందలి భాగ
మాటచేఁ గాఁబోలు నారామచంద్రి
దేవుని గొనక్కొని తెచ్చె నక్కడకుఁ
గాలపురుషుఁ డెంత గడుసరివాఁడొ
కళ్యాణదినములు కడు దగ్గఱాయె
శేషా మాషో యింక రిప్పున వచ్చి
వ్రాలు దివానును బ్రిభుసవిధమున
నించి తా మ్రొక్కఁగా నెంచినగుడియె
విఱిగి పైఁ బడినట్లు వెచ్చని వేఁకి
విభు దేహమును బట్టి పీడింపఁదొడఁగె.
ప్రతిఘటికను నది పాముకాటట్టు
లాపాదమస్తకం బలమి బాధింప
స్మృతిదప్పి యేలిక సారెసారెకును

మహారాజ కలవరించుట.

రామకృష్ణా! రావె రా రామకృష్ణ!
స్మృతి తప్పిసారెకు నేలిక తాను
ఎక్కడ నున్నాఁడ వేమనుచుంటి
జయపురిం జేర్పవే సరగ నన్నిపు
కోపమా నామీఁదఁ గూడ రావేమి?
తాపమా నామీఁదఁ దడయుదు వేల
యింతికి లొంగిన యినుఁడనటంచుఁ
గాంతాళమును జెంది కదలిరావొక్కొ
మంచి చెడ్డెఱుఁగని మామూలు మనిసి

# రామకృష్ణము

గాసిపాత్రుఁడు వానిఁ గాదన లేక
యీకొంటి నీపెండ్లి కేనంచు నెంచి
నామీఁదఁ గనలితే న్యాయమే నీకు
రావోయి! వేగమే రా రామకృష్ణ!
యనుచును సంధించి యడలుచు నుండఁ
బల్లాయనము వారు పరికించి చూచి

తంతివార్త.

లాభంబు లేదని రామకృష్ణునకు
క్ష్మాపతి చాలఁగా జబ్బుగా నుండె
వెంటనే లక్నోకు వెడలి రమ్మంచుఁ
దంతివార్తిడినారు తలఁకుచుం జాల.
ఇంతలో లక్నోకు నేఁగఁగా నెంచి
పెండ్లికి స్వయముగా విక్రమదేవ
వర్మ! నిన్ బిల్వఁగా వార్తేరునకును
బయనమై చనుదెంచి ప్రార్థింపఁ బోవు
సమయాన మీరు మీజాతక చక్ర
మప్పుడే వచ్చిన యట్టి జోస్యునకుఁ
గనుపర్చ నాతఁడు కాఁగల వీవు
నెలనాళ్ళ లోపల నిక్కముగా మ
హారాజ వనవుడు నది విని రామ
కృష్ణుఁ డెడందలో నెంతేనిఁ గలఁగి
పల్లటిల్లిన యట్టి వదనంబుతోడ
నిశ్చేష్టుఁడై యట నిలుచుండి తమ్ము
నాహ్వానమును జేసి నంతలోఁ దంతి

వార్తరాఁగాఁ గాంచి భావంబు పగులఁ
గన్నీరు మున్నీరుగాఁ గార్చుచుండ
రామకృష్ణా! వెళ్ళిరా! భీతి లేదు
మావాఁడు జీవించు మఱి బెంగ గొనకు
మనఁగానె రైలెక్కి యరిగె లక్నోకు.

రామచంద్రదేవమహారాజు నిర్యాణము.

మంత్రివచ్చిన వార్త మానవేంద్రునకు
నెఱిఁగింప బంధువు లించుక తెప్ప
లల్లార్చి వీక్షించి హస్తంబు సాఁచి
మంత్రిపుంగవు తన మంచము మీఁదఁ
గూర్చుండ సైగను గొండొక్క చేసి
చేతిలోఁ జేయిడి చెప్పఁగ నెదియొ
ప్రయతించి విడనాడెఁ బ్రాణవాయువులు.
మంత్రియుఁ జుట్టలు మగువయు నత్త
గొల్లు మం చేడ్చిరి గోలుగోలునను
వసుధ యంతయుఁ బాడువాఱిన యట్లు
తోఁచఁగాఁ బ్రగ్గడ దోదూయ మాన
మానసుండై బట్ట మాటు గావించి
కొని మోమునకు; నెడఁ గుతకుత యుడికి
గుండె రాయిగఁ జేసికొని లేచి యప్పుడ
గవర్న రేజెంటుకు క్ష్మాపతి మరణ
వార్తను దెలుపుచు వైరిచ్చి దాను
బ్రభునిమృతకళేబ రమును బ్రయాగ
కును దీసికొనిచని కుతపకాలమున

నాత్రివేణీ సైకతామలస్థలిని
మంచిగంధపుఁ జితి మానవాధీశు
నపఘనమ్మును జేర్చి యంటించినంత
బగబగమని యగ్నిభట్టారకుండు
క్షణములో రాజేంద్రు కాయంబు బూది
గావించె నదిగాంచి గంగలోకేఁగి
శ్రీరామకృష్ణుఁడు చేసి స్నానంబు
అశ్రుతర్పణమిచ్చి యరుదెంచినాఁడు

రామకృష్ణ, గవర్నరేజెంటు,

వాల్తేరు పురికిని వచ్చినవెంట
గవర్నరేజెంటును గలసికొన్నాఁడు
తిన్నఁగా విక్రమదేవవర్మ! తమ
సన్నిధానమునకుఁ జనుదెంచినాఁడు
ప్రాజ్ఞులౌ తమరు శ్రీరామకృష్ణునకు
స్వాగతం బిడి చాల చల్లనినుడుల
నాదరించిన యంత నాతండు తమ్ము
గనుఁగొని కాయంబు గగ్గురు పొడువఁ
దజ్ఞులు, జ్ఞానులు దైవజ్ఞులైన
తమజాతకపుఁ జర్య తథ్యమై పొలిచెఁ
బండితో వాక్యము పార్థుని శరము
వ్యర్థము కాదని వాక్రొంద్రు గాదె
గుణలుబ్ధముల్ సిరుల్ గుణితించి చూడఁ
గావుటనే మిమ్ముఁ గ్రచ్చఱ వచ్చి
జయపుర సంస్థాన జయలక్ష్మి కోరి

వరియించెఁ గైకొని వర్ధిల్లుఁడేను
సెలవును గైకొందుఁ! జెన్నపురికిని;
జని నాదుత్రోంటిచా సన్నుతపదవిఁ
జేకొని సుఖియింతు సెలవిండనంగ
విక్రమేశ్వర! నీవు వెళ్ళఁగా వలదు
మావానియొద్దను మసలిన యట్లె
నాయొద్దఁ గూడ ననారత మీవు
సర్వాధికారివై చరియింప వచ్చు
నీచేత కెన్నండు నేచేయ నడ్డు
నావుడు నీమంత్రి నగి యిట్టు లనియె

శ్రీ విక్రమ దేవ వర్మ.

విక్రమేశా! విను విన్నపం బొకటి
మీకుమారుఁడు రామమేదినీశ్వరుఁడు
వచియించె నాతోడఁ బలుమాఱు లిట్లు
ఆంధ్ర విశ్వకళాలయ మభివృద్ధిఁ గన
టెక్నాల్జి కాలేజి శేవమైఁ బెట్టఁ
గలవాఁడ నని కాని కాలగర్భమున
నాతఁడు గలియుట నది జర్గ లేదు
తత్కార్యములు మీరు తడయకుండఁగను
గావింతురేని మీ కాంక్షనే దీర్తు
మీకొల్వుకాఁడనై మెలఁగుదు నేను
ననవుడు మీరును హర్షంబు నొంది
రామకృష్ణుని విశాలమతికి మెచ్చి
యట్టులే తప్పక యాచరించెదను

# రా మ కృ ష్ణ ము

ఆంధ్రాభివృద్ధియే యాత్మాభివృద్ధి
గానెంచు మనకును గంజనేత్రుండు
సాయమై కార్యంబు సాగించుఁ గాత
మనుమానమును వీడుమా ! రామకృష్ణ !
పూఁటలోనె యరిగి పోయెడు నన్న
దానంబె ఘనమని దలఁతురు బుధులు
జన్మజన్మంబున జను నంటి వచ్చు
జ్ఞానదానము చేయఁగాఁ గల్గుపుణ్య
మెంతని వచియింప నెవ్వరు నేతు
రట్లాట నీవాంఛ యాంధ్ర లోకంబు
అగ్గింప నొనరింతు నని పునరుక్తి
గాఁ బల్కుచుంటినిఁ గానఁ బ్రియంబు
గల్గి తొంటివిధముగాఁ జరింపుమన
మన రామకృష్ణుఁడు మది ముద మొంది
విక్రమేశా ! మిమ్ము వెంట నిడుకొని
వచ్చె జయపురికి బలుమూరుతెమున.

## శ్రీ వి క్ర మ దే వ వ ర్మ ప ట్టా భి షే క ము.

శ్రీశ ! నీ పట్టాభి షేకంపు గాథ
వివరింతు సంగ్రహా విధముగా వినుము
నీదురాకను గోరి నిఖిల వృక్షములు
ననురాగమును జెంది నట్లు చిగిర్చె.
పులకరించినరీతిఁ బూలఁ గాయలను
ముద్దు మురిపెమునే ప్రొద్దును గూర్చె
సహకార శాఖపై సఖితోడఁ గూడి

సకల జనములకు సహకారి వైన
నినుఁగూర్చి కంఠంబు నింగికిఁ జాఁచి
పంచమంబునఁ బాడెఁ బంచమ మ్మప్పుడు
సింహాసనమ్మున శీవిక్రమేశ !
కూర్చుండ నీవు నీకుడిప్రక్క రామ
కృష్ణుఁడు డాపల నేజెంటు నుండ్రి
నీకును నెదురుగా నిఖిలాప్త జనులు
నుద్యోగి బృందంబు నూర్జిత మతులు
పండితుల్ గవులును బంతులు దీర్చి
యాసీనులై యున్న యంత శ్రీరామ
కృష్ణుఁడు నిలఁబడి హృష్టాత్ముఁ డౌచు
సభ్యుల కిట్లనె సరసోక్తు లడర
జనకమహారాజు చందాన మనల
సాఁకంగ నిత్తఱిఁ జనుదెంచి సట్టి
విభుధాగ్రగణ్యులు విక్రమదేవ
వర్మమహారాజె ప్రజలార మనకుఁ
బ్రభువులు వీరు శ్రీరామచంద్ర సర
విభునకు సాక్షాత్తు పినతండ్రిగారు.

### దానములను బ్రకటించుట.

వీరి త్యాగంబును వీరి దానంబు
విరించుచున్నాఁడ వినుఁడాఁగన్య మీరు
ఆంధ్ర విశ్వకళాలయాభివృద్ధి కయి
యేఁటేఁట నొకలక్ష యిత్తురు రూక
లాఁడుపిల్లలు విద్య నందఁగా నొక్క.

# రామకృష్ణము

భవనంబు జయపుర ప్రభువర్యుఁ డిచ్చె
శ్రీలకు వైద్యంబు చేయించు కొఱకు
వైద్యాలయ మొక్కండు వసుధేశుఁ డొసఁగెఁ
గొట్టాపుడులో నున్న సూల్కు పిల్లలకు
సారంగపురములోనంగల పేద
పిల్లల కుచితమా విద్యఁ జెప్పింప
మనరాజవర్యులు మాటిచ్చినారు
ఇఁకఁ గవిరాజులు హృద్యపద్యములు
వినుతురు పిమ్మట విభుఁడు వచించు
సావధానంబుగా సభ్యులు వినుఁడు!

సత్యనారాయణరాజు పద్యములు చదువుట.

అన మంత్రికనుసైఁగఁ నంది యీగ్రంథ
కర్త నీయాస్థాన కవినగు నేను
వచియించితి నిటులు వసుధాతలేంద్ర!
గౌతమీతీరానఁ గాఁకరపఱ్ఱు
నానొప్పు గ్రామంబు నాయూరుగాఁగ
బహుకావ్య కర్తనై ప్రఖ్యాతిఁ గంటిఁ
గులముచేఁ గవితచేఁ గూడ మీకేను
బరిణుతింపఁగాఁ దగ్గ బంధువుఁడఁజూఁడి
నీమంత్రిగా నిప్డు నెగడుచున్న
శ్రీరామకృష్ణుని చెలికాఁడనయ్య
నీరాక మాకెల్ల నిగమాంతవేది!
శ్రీరాకగా నెంచి చెలఁగుచున్నాము
నీకీర్తి వల్లికల్ నిఖిల కంధులకు

నావలియొడ్లపై నల్లుకొనియెడి
నీదాన ధారలు నేలయంతటను
ఏఱులుగాఁ బ్రవహించుచునుండె
నీమంత్రిమాన్యుండు నెమ్మదిలోనఁ
దమరాజ్యమందునే తనయావనంబు
ధారపోసితి నంచుఁ దపియింపరాదు
విశ్వవిద్యాలయ వృద్ధికై యేఁట
లక్షరూప్యమ్ములు ప్రణుతింపఁ బ్రజలు
మీచేత నీఁజేసి మీపుత్త్రుఁడైన
స్వర్గీయ శ్రీరామ చంద్రదేవ విభు
ఋణమును దానీఁగె నీనాఁటఁగాన;
నావుడు మీరలా నాఁటి యాసభను
రాజధర్మముగూర్చి రాజతపక్ష్మ
నీరీతిఁ జెప్పిరి నేరుపుతోడ

శ్రీ వి క్ర మ దే వ వ ర్మ రా జ ధ ర్మ ప్ర వ చ న ము

కనులున్న ననదలఁ గాంచకయుండు
వీనులు గలిగియు వినఁడు మనవులు
వదనముండియుఁ జక్కఁ బలుకఁడేనాఁడు
చేతులుండియుఁ బనుల్ చేయకయుండు
పదములుండియుఁ గూడ బాటనడవఁడు
హృదయంబు గల్గియుఁ గృపఁ బూనఁడింత
లోకనిందకు మది లోఁగకయుండు
గర్వియౌ నృపతియేగా శవతుల్యుఁ
డనఁగానె మీకవి యనియె నీరీతి.

# రామకృష్ణము

## సమన్వయము.

కనులుంట ననదలఁ గాంచుచు నుండు
వీనులు గల్గుట వినును మనవులు
వదనంబు గల్గుటఁ బలుకుచు నుండు
చేతులుండుటఁబనుల్ చేయుచు నుండు
పదములుండుటఁ జేసి బాటను నడచు
హృదయంబు గల్గుటఁ గృపచూపుచుండు
లోకనిందకు మది లోఁగుచు నుండు
గర్వదూరుండైన ఘన విక్రముండు
అని పల్కినంతనే యాసభయంత
భూనభోంతరములు భోరు కలుగఁగ
జయ విక్రమేశ్వరా ! జయ రామకృష్ణ !
జయ జయ జయ యంచు సన్నుతుల్ సేసె.

## ఘనకార్యములు.

జయపురాధీశ్వరు సచిమత్వమల్లు
నెఱపిన పిమ్మట నేర్పరి యైన
శ్రీరామకృష్ణుండు చెన్న రాష్ట్రంపు
టున్నతోద్యోగియై యురుకీర్తిగాంచె
ఘన పరిశ్రమలకు గణనీయమైన
సర్వాధికారిగా సన్నుతిఁ గాంచె
లేబర్ క మీషనర్ విభుతను బొందె
గ్రామాభివృద్ధిని గావించు నట్టి
పెద్దయుద్యోగియై పేరునుగాంచె
ఆంగ్లజర్మను యుద్ధ మరుదెంచ నంత

భారత పరిభుతకు బద్ధుఁడై యతఁడు
తన నేర్పుచూప నేషనలు సర్వీసు
లేబరుటిరిబురినల్ విభుఁడౌచు మించి
దక్షిణ భారత ధరణి నెల్లెడల
వేన వేల్ సెంటరుల్ వెలయంగఁ జేసి
వివిధశాఖలలోన వివిధరీతులుఁగ
యుద్ధ యంత్రమ్ము లత్యుద్ధంతి జేయు
పనివాండ్ర పెక్కుర్ఁ దన పేరు మీఁద
నిపుణులఁ గావించి విపుల యుద్ధమున
ఆంగ్లరాజులచేత నందె సన్నదులు
కె. సి. ఐ. యను బిరుదుఁ గీర్తియుఁ గాంచె
పరిజలచేఁ బ్రభుతచేఁ బలు విధమ్ములుగ
మన్ననల్ పొందిన మన రామకృష్ణుఁ
డాంగ్లరాజ్యము పోయి యాత్మరాజ్యంబు
భారత దేశంబు వడసిన యంత
స్వేచ్ఛగాఁ గొన్నాళ్ళు సేవించి ప్రజల
విభుత కార్యంబుల విశ్రాంతి నొంది
ఉయ్యూరులోపల నుండిన యట్టి
శర్కరాయంత్రంబు సన్నిధియందు
'స్పిరుటును ఆల్కహాల్ సి. ఒ. టు గ్యాసు
పిప్పరుమెంటులు వెలయంగఁజేయుఁ
వివిధ యంత్రంబులు వెలయంగఁ జేసి
సిమ్మెంటు యంత్రము చేపట్టి మించి
వర్కుషాపులుకొన్ని వర్ధిల్లఁజేసి
జర్మనీ మున్నగు సకల దేశముల
నున్నట్టి యంత్రాలుకన్న శ్రేష్ఠముగ

తనయంత్రి జాలంబు దనరంగఁ జేసి
ఆంధ్ర దేశమునకు నఖిలభాగ్యములు
కలుగఁగాఁ జేయుచుఁ గాంచి కుబేరుఁ
డన్న విఖ్యాతిని, యాచకావళికి
పనులను గల్పించి తినఁగూడఁ; గట్ట
గుడ్డల నిచ్చుచుఁ గోటీశుఁ డతఁడు
విద్యాభివృద్ధికై విశదభావమున
లక్షయేఁబది వేల రౌప్యంబు లెంచి
తనతండ్రి పేరుతో ఘన విరాళము, తె
నాలికాలేజికి లీలమై 'నిచ్చె'
కడుపారఁగాఁ దన్ను కన్నట్టి తండ్రి
పేరు నా రీతిగా వెలయంగఁ జేసి
పెంచుకొన్నట్టి యా పిత పేరుకూడ
శాశ్వతంబై వెల్గ సర్వజ్ఞుఁ డాతఁ
డుయ్యూరిలోపల నున్నట్టి కార్మి
కావళి నివసింప నర్హమైనట్టి
లక్ష్మణ నగరంబు లక్షలు పెట్టి
కట్టించెఁ దన కీర్తి రెట్టించునట్లు
తన మామపేరును దైవారు నట్లు
'పోలిశెక్కిక'లను స్కూలును నిలిపె
కాలేజి ఉయ్యూరఁ గట్టించె నొకటి
కవిరాజులను బిల్చి కడు గారవమున
కనకాభిషేకమును గావించినాఁడు
కష్టజీవులఁ బిల్చి కష్టముల్ దీర్చి
ఆప్తబాంధవుఁడౌచునలరారినాఁడు
పని లేనివారికిఁ బనులు గల్పించి

యార్త రక్షకుఁడన్న యశమందినాఁడు
పట్టినదెల్లను బంగారముగను
మెట్టినదెల్లను మేరువుగాను
శ్రీరామ కృష్ణుఁడు చేయుచున్నాఁడు
సల్లాలితాకార యిల్లాలు దుర్గ
కొడుకులు మనుమలు కూఁతు రల్లుండ్రు
బావమఱఁదు లైన బాబు విశ్వేశుఁ
డరుసంబు గూర్పఁగా నాత్మీయుఁడైన
మైనేని వంశాబ్జుఁడై నట్టివాఁడు
తన కార్య దర్శియై దనరారు వాఁడు
బావ, సీతారామరావు విశ్వాస
పాత్రుఁడై తనచేయు పనులలో నెల్ల
దక్షిణ హస్తమై దనరారుచుండ
పండితరాజులు బహు విధంబులుగ
నిరతంబు దీవనల్ గురియుచు నుండ
మూఁడుకాయలు నాఱుపూవులై తనదు
జీవితం బంతయుఁ జెన్నారుచుండ
ఆశ్రిత కల్పకంబా రామకృష్ణ
నిండు చందురుఁడట్లు నెగడుచు నుండ
నతని యేఁబదియెన్మి దై నట్టి జన్మ
దినమహోత్సవపర్వమునయందు దీని
కాన్కగా నర్పించె కవిరాజు, సఖుఁడు
నై నట్టి సత్యనా రాయణరాజు
భవదీయసత్సభాకవివతంసుండు
శ్రీరామ కృష్ణుని స్థిరతర కీర్తి

# రా మ కృ ష్ణ ము

యాచంద్రతారార్క మడరారు నట్లు
కవిరాజ వర్మ! విక్రమదేవ వర్మ!
మీ కంకితమ్ముగా మేలొందుమయ్య!
రామకృష్ణా! నీవు పరిణయ మొల్కించి
యదియిది యననేల యఖిల సంపదలు
నొడఁగూర్చి నన్ను నీ కొడుకుగా, నెంచి
కాపాడి నందుకు నేపారు భక్తి
నీ చరిత్రము వ్రాసి నీ కిచ్చినాను
భావికాలములోని భారతీయులకు
వెలుఁగును జూపుచు వెలయ నీచరిత;
దీర్ఘాయురస్తు తే దీనబాంధవుఁడ!
ఆరోగ్యమస్తు తే యర్థార్థి కల్ప!
భాగ్యశ్రీరస్తు తే యోగ్యతా మూర్తి!
త్రుటిత దురితయాత్రా! దుర్గమాంబా కళత్రా!
స్ఫటిక శుచి చరిత్రా! శాంతమాంబా సుపుత్రా
కుటిలజన లవిత్రా!,కోవిదస్తోత్ర పాత్రా!
తటి దమలినగాత్రా! ధర్మ విస్తార నేత్రా!

---

# ఆ రా ధ న.

ఈవును నేను నొక్కపరి యేఁగుచు నుండఁగఁ గారులో ర్ఘుదీ
ప్లావితమైన రామగిరి రమ్యవనంబున మోటుబాటపై
నేవొ ప్రసంగముల్ గలుగ నేను వచించితి నంత "మిత్ర! నీ
క్రోవను నిల్పునట్టి కొడుకుం గననైతినటంచు నించుకేన్

లో వగ పొందఁబోకు రసలోలుపులెల్ల సెబాసటంచు సం
భావనసేయు సారగుణ, భవ్యపదన్, సరసార్థయుక్త, స
ద్భావ, నలంకృతన్, బ్రిణుతవర్ణ, సలక్షణలక్షి తాంగి నా
భావజ పుత్రికామణిని బావవు కావుట నీ కొసంగుదున్.

ఆవరవర్ణినీ తిలక మంతట నీకులగో త్రనామముల్
భూవలయంబునన్ మివులఁ బొంపిరి వోవఁగఁ జేయుఁ బంచభూ
తావృత సృష్టియందుఁ గృతి నందుట కంటె నుదాత్తకీర్తి పే
దీవఁబడాఁకఁ గావ్యముల నెవ్వరు పొందిరొ వారె నిల్చి రిం

కేవర కార్యముల్ సలిపిరేనియు నిల్వఁగలేవు మార్పు లే
వేవి ధరాతలానఁ బ్రిభవించిన నెన్ని 'యిజంబు' లేచినన్
పోవవు; నవ్యకావ్యము, లపూర్వముగాఁ బెనుపొందునంచు నే
నా వనమందుఁ బల్క చిఱునవ్వున నీవు రసంబు చిప్పిలం

గా, వలచేతితోడ నను గాఢముగా నొకమాఱుతట్టి" తా
భావమె భావమం దెనఁగ భవ్య, పబంధకుమారికామణిన్
భావుకు లెల్ల మెచ్చుకొన భద్రముగాఁ గయిచేసి కన్యకా
పావన దానమున్ సలుపవచ్చితిఁ బండిత రాజపుత్త్రి నీ

# ఆ రా ధ న

క్కై వలపొంది వచ్చినదికా తలపోసి యొకింత మంత్రి రా
డ్భావముతో నగౌరవము పాల్పడఁ జూడకు, చూతువే
ఈ విపులాంధ్రదేశమున కించిన నా కవితాకుమారి నా
నావిధ చిత్రభావరచనా పటిమంబున నిన్ను వేఁల్మిడిన్

దా వలపించుఁగాని వదనంబు ముడుంచక కూరుచుండ
ధీవర ! పూసపాటి కులదీపక ! 'రాజకుమారికామణుల్
కేవల మాత్మగౌరవమె కీర్తికి హేతువుగాఁ దలంతు ?'
చీవు నెఱింగినట్టి ప్రణయేప్సితభావుఁడవౌట వేఁటుగా

నే వచియింపనేల? యెటులేలిన నీయదె భారమింక నా
యీ వయసుందలంచి యలయింపక నింపుము నిండువేః
తావకవంశ మీ కృతికతంబున నిల్చుత సూర్యచంద్రు
స్థావరజంగమప్రవితతం బగు భూమిని వెల్గునంతకున్.

కుమారస్వామిన్ భో మధురిమగుణాం మామకసుతాం
నవోఢామేనాం శ్రీరుచిరకవితాం స్వీకురు విభో!
కళాపూర్ణాం రమ్యా మతి నవనవోన్మేష సుషమాం
సుఖాశ్లేషగ్రాహ్యాం శశివరకుల క్షత్త్రియభవామ్.

శత్రుభీకర భుజాశక్తి సంపన్నతా
పార శౌర్యులు పూసవాటివారు
కల్పవృక్ష దధీచి కామధేను సమాన
వరవదాన్యులు పూసపాటివారు

పద్య గద్యాత్మకహృద్య కావ్య సముద్ర
పారంగతులు పూసపాటివారు

ఆశ్రితావనకళావ్యాజ కృపాపూర్ణ
పావనాత్ములు పూసపాటివారు

సకల నరపాలమకుట ప్రశస్తరత్న
కోటి కాంతిపాదులు పూసపాటివారు
అట్టి పూసపాటికు లమహార్ణవేందుఁ
డౌఁ జుమీ కుమారస్వామిరాజు సుకృతి !

ఆభిజాత్యముగూర్చి యభివర్ణనం బేల
జలజాతవంశ సంజాతుఁ డనిన
సత్ప్రభుత్వముఁగూర్చి సన్నుతింపఁగ నేల
మదరిమండల మహామంత్రి యనిన

రూపసంపదగూర్చి రూపింపఁగా నేల
గండుమీఱిన మన్మథుండె యనిన
రాసిక్యమునుగూర్చి ప్రస్తుతింపఁగ నేల
నవరసకావ్య సనాథుఁ డనిన

అమ్మ! మత్కావ్యకన్యకా! యడుగువెట్టి
పూసపాటింట బంగారు పూఁతపూసి
భర్తకుండగ్గ భార్య యన్ బలుకుపుట్టఁ
గీరితిం గాంచు మాచంద్రతారకముగ !

కనకదుర్గా కటాక్షంబుచే నొకతాత
కురియించె బంగారు విరులవాన
చిచ్చులఱ పిడుగును ఛేదించె నొకతాత
కరవాఁడి తరవారి మెఱయఁజేసి

# ఆ రా ధ న

బొబ్బిలి బెబ్బులిఁ బోకార్చె నొకతాత
చండప్రచండ దోర్దండశక్తి
సత్కావ్యక ర్తయై సరిమించె నొకతాత
సాహిత్య సాహిత్యసారపటిమఁ

వెలఁగి మాధవవర్మయుఁ జిక్కభీమ
విజయరాయలు నానందవిభుఁడు నట్టి
పూసపాటిల్లు మెట్టి యపూర్వకీర్తి
భర్తతోపాటు గాంచుమా భాగ్యమూర్తి.

అగ్రహారములిచ్చి యాదరింతువటంచు
నీయగాలేద యీకృతిని నేను
గండపెండెరముచేఁ గైసేతువనియెంచి
యీయఁగాలేద యీకృతిని నేను

మదగజంబెక్కించి మన్నింతువనియెంచి
యీయఁగాలేద యీకృతిని నేను
రత్నాంబరములిచ్చి లాలింతువనియెంచి
యీయఁగాలేద యీకృతిని నేను

మనసు మనసునఁ గలియంగ మంచిచెడ్డ
యడిగి ప్రేమించు మిత్రుఁడ వగుటఁజేసి
యిచ్చినాఁడను కృతికన్యఁ బుచ్చుకొనుము
ప్రణయమునఁ గుమారస్వామిరాజ భోజ !

కన్యాకుమారికాగ్రంబునం గూర్చుండ
సరస ప్రసంగముల్ సలిపి సలిపి

కుర్తాలజలపాత కూలంబునందుండి
ప్రణయప్రసంగముల్ పలికి పలికి

మలయాద్రి సానుభూస్థలముల విహరించి
కూనిరాగంబులఁ గులికి కులి
యేలాలతా నవ్యడోలావళుల నూఁగి
కవితావిలాసముల్ కలపి కలపి

రాజకీయాతితర పరిశ్రాంతమైన
త్వన్మనసుఁ దేల్చుఁగాన చేపట్టుమయ్య
నవ్య నవరసభావయౌ నాదు పుత్త్రి
రమణమై కుమారస్వామి రాడ్ద్విజరాజ!

* * *

# ఆ రా ధ న.

జయ జయ మత్కావ్యపతీ!
జయ జయ శ్రీవెలఁగపూడి సద్వంశమణీ!
జయ జయ విక్రమ మంత్రీ!
జయ జయ శ్రీరామకృష్ణ! శామితతృష్ణా!

శ్రీకృష్ణుం డొకనాఁడు సూర్యతనయా రింఛోళికా వీచికా
నాకాయానము చేయుచో సుముఖయా నారాయణీదేవి భూ
లోకంబందలి చిత్రగాథలు వినన్ లో నెంచి ప్రార్థింపఁగా
సాకల్యం బగుమోద మొంది హరి ప్రస్తావించె నీరీతిగాన్

అభినవము లగుభావము లనువుపఱచి
నవరసంబులు చిప్పిలు నట్లుగాఁగ
తరుణి! నీకోర్కె తీర్ప సుందరకథాళి
తెలుఁగుదన ముట్టిపడునట్లు దెలుపువాఁడ.

అడ రెడునట్టు మంచియితిహాసము లెవ్వియునేని కోమలీ!
అడుగుము చెప్పువాఁడ నని యబ్జదళాక్షుఁడు మూదలించినన్
జడనిధికన్య యాస్యమునఁ జంద్రిక లీనఁగ నాథుమూఁపుపైఁ
గడువడి వ్రాల్చి శీర్షము వికావిక నవ్వుచుఁ బల్కె నీగతిన్.

హిమవత్ శైల శిఖాగ్ర నిర్గత ఝరీ హేరాళ వాగ్ధాటితోఁ
దమ రేమో సెలవిచ్చి రాంధ్రజనగాథల్ పెక్కుసూచించుచున్
అమలార్థ ప్రతిపాదనక్రమకళావ్యాసంగులౌ మీ కసా
ధ్యము లేదెందునుగాని సందియ మొకం డావంత వేధించెడిన్.

మీరును నేను నొక్కమరి మేదినికిం దొడవౌ హిమాగముం
జేరి తదీయ రత్నమయ సీమలఁ దత్కమనీయ వారి కా
సారములం దదీయ తరుషండములం దదనేక జంతుసం
చారములం గనుంగొని నిషణ్ణులమై సుఖగోష్ఠి నుండఁగన్.

వారువమైనగిత్త యిరువాగెలు లాఁగిన నాఁగకుండఁగాఁ
బాఱుచు వచ్చి నుచ్చిళు లపారముగా వెలి గ్రక్కి మీకడన్
జేరి తటాలునన్ నిలువ నింగిని గౌరియు శంకరుండు రో
షారుణమైన నేత్రముల చాయలు గన్పడఁజేయ నట్టియున్.

ఒడలును దొడలును నడునడు
నడఁకంగా వడఁకఁబాఱి నాలుక వెలికిన్
బడవిడిచి విష్ఠ వెట్టుచుఁ
జిడిముడితోఁపంగఁ జెమట చిందులువాఱన్

పాయనిభీతితో బెదరు పాయని చూపులరూపుతోడ నం
బాయనియార్చి మ్రొగ్గతిలఁ బాఱుడుఁ బార్వతి జాలిగుండెతో
జేయిడి తట్టి వీనులను జేరిచి కన్నులమీఁద మెల్లఁగా
మాయఁగ నందివాహనము మూత్రమువోసి నెమర్చినంతటన్

భూమికి డిగ్గి రాఁ దమరు మ్రొక్కిన వారువ మోరమోముతో
స్వామినిఁజూచి నాకి కనుసైగ గ్రహించి వహించి యాజ్ఞ మీ
కోమల పాదపద్మములకుం గడగా దిగి నిల్చిపొల్చినన్
తాము నేను భక్తిపరతన్ వరివస్య యొనర్ప బూనుడున్.

ఉరవడిమీఱఁ బర్వతమహోదధి కాననరాజిమీఁదుగాఁ
బరువిడి నందివచ్చుటను బార్వతి చాలఁగ డస్సిపోయె మీ

రిరువురుఁ గొంత సేపు శయనింపుఁడు మంగళ దేవతా! యనన్
బరమశివుండు; సంతసమునం జని గౌరియు నేను నొక్కెడన్

ఆరంబూచిన కొండమల్లియల లోయం జేరి పూఁబొన్నపైఁ
జేరన్ వైచి 'ఘటంబులన్' హిమగిరి శ్రీగంధ గంధా నిల
శ్రీ రాజిల్లఁగ సేద దేఱి ముఖముల్ శీతాంబుపూరంబులన్
సారుల్ దీరిచి చామరీ మధుపయ స్సారంబులం గ్రోలుచున్.

ఉత్సాహంబులు వెల్లివాఱ నెదియో యూసుల్ ప్రసంగించుచో
ఉత్సేధం బుబుకంగనున్న యుమతో 'ఓచెల్లి! గోరాజు తా
నుత్సేకంబు తొలంగ నేమిటి కనన్ న్యూనాతిరిక్తంబుగా
మత్సాంగత్యము మెచ్చి యామెయు సుధామాధుర్యధుర్యో
క్తులన్.

ఈరీతిఁ బలికె నాథా!
గారా మారంగ మేను గగ్గురుపొడవన్
సూరెల నివ్వల నవ్వల
లేరు గదా! యెవ్వరనుచు లేనగ వొప్పన్.

ఒకనాఁడిందుధరుండు పర్వత దరీవ్యూఢ ప్రదేశంబునం
దకలంకాత్మత నన్నుఁజేరి సుభగవ్యాసంగుడై సుందరీ!
సకలానంద వివర్ధనైకమతివై సంతోషమున్ గూర్చు నీ
పరికటప్రజ్ఞకు మెచ్చు వచ్చె నెదియోఁ బ్రార్థింపు చేకూర్చెదన్.

తృప్తితుండై మన్నాథుం
డప్పు డాడిన ముద్దుపలుకు లరుసము గూర్పన్
లపనంబు దెఱచి పలికిన
చపలోక్తుల ఫలము లవ్వి చెప్పఁగ నేలా!

నా విని నాలో నేనే
యేవేవో చింతఁజేసి యేకాంతమతిన్
భూవలయమెల్లఁ ద్రిమ్మరి
రావలయునటన్న తలఁపు ప్రకటింపంగన్.

ఔనె సుధాంబురాశితనయా! వచియించెద నాలకింపుమా!
మానిత మల్లికావకుళ మంజుల రంజిత పుష్పగుచ్ఛముల్
పూనిరచించి దండల నపూర్వముగా ధరియించి మేన నే
నానన సీమలో ధ్రిరజ మద్దిన నెద్దును బిల్చె నీశుఁడున్.

ఎదురుగా వచ్చి సాష్టాంగ మెరఁగి నంది
వినయ వినమిత గాత్రమై నెలయ శివుఁడు
పరమహర్షంబు నొంది నావైపుఁగనినఁ
ద్రప యొకించుక గదురఁ ద త్తనువు తట్టి

మోఁపుర మొక్కచేత ననుఁపుందన మొప్పఁగ నొక్కిపట్టి కా
లూఁపుచు నెక్కఁబోవఁ జెయియొయ్యనఁ గ్రిందికిజాఱిపోయె నా
దాపుననున్న శంకరుఁడు తానయి చల్లనిచేతులంటి న
న్నాఁపెఁ దలోదరీ! శకున మయ్యదిగాఁ దరువాతిగాథకున్.

మృడుఁడంతఁ గన్నుగీటినఁ
గుడికాలును మడఁచి నంది కొంచెము వంగన్
తడఁబాటు లేక యెక్కితి
మెడయుండును నేనుగూడ నొయ్యారముగన్.

ఎక్కినఁ దొక్కిసల్ వడక యించుక వాలము త్రిప్పి యెత్తినై
నిక్కఁగ వీను రిక్కఁగ ఖణిల్లని అంకియవెట్టి కొమ్ములన్

బ్రక్కకు నెట్టి జిల్గు మెడపట్టియ మువ్వలు ఘల్లుఘల్లనన్
రిక్కలదారిలో మెఱపు రేకొకకనురీతి దువాళివాఱుచున్.

ఏటవాలుగఁ జనుచుండ నెక్కిరింత
యేటవాలుగ మాతోడ నేఁగుదెంచె
నర్ఘ్యపాద్యాది పూజనం బాచరింప
వసధి పర్వత నద నదీ వనచయంబు.

మీఁదికిబోవఁబోవఁగ సమేరుదుమారము లాఁగిపోయె నా
మీఁదికిఁ బోవఁబోవఁగ సమీరకుమారక చారుచారణల్
మాదరి కేమి రామిని సమాంతముగా వృషభేందు్రిఁడాఁగె నే
నూఁదరపెట్టినట్టులుగ నూపిరియాడక కొట్టుకాడితిన్.

దైవికశక్తిచేతను సదాగతి వీవఁగఁజేసె శంకరుం
డావల నంది తేఱుకొని యంబుదమార్గముఁ జొచ్చి వచ్చుచో
స్థావరజంగమప్రితతి సయ్యన గోచరమయ్యె దృష్టికిన్
గేవల వామనాకృతులఁ గ్రీడలొనర్చు జగంబులో యనన్.

కుమ్మరి సారెమాదిరిగఁ గొండొకదూరము మండలాకృతిన్
గ్రుమ్మరు చేఁగ వారువము; గుట్టలు మెట్టలు చెట్టుపుట్ట లో
యమ్మకచెల్ల! మా యడుగులంటి భజించెను భక్తిభావముల్
ముమ్మరమైన యట్టియెడ మ్రొక్కుట లెంతయు సాజమేకదా!

క్రిందికిఁ బోక మీఁదికిని రేఁగక జిక్కి యొకేవిధంబుగా
ముందుకు సాఁగిపోవునెడ ముందుఁ బిఱుందను రెండుప్రక్కలన్
గొందల మింతలేక కనుఁగొంటిని దొంటివిధంబుగాద యో
సుందరి! యంతయున్ మిగులఁ జోద్యముగాఁగనుపట్టె గంటికిన్.

కనుగో ముంగటనున్న యెల్లయవియున్ గన్పట్టెఁ గొండంతలై
కనుగో వెన్కకు నవ్వి యెల్లయదియున్ గన్పట్టెఁ గోరంతలై
కనుగోఁ బ్రక్కలకవ్వి యెల్లయవియున్ గన్పట్టె మాతోడనే
చనుమానంబునఁ బర్వుపందెమున కుత్సాహించు నట్లంతలో.

మోక్షద్వారమటంచు సంతసముతో మ్రొక్కంగ గంగానదీ
సాక్షాద్ద్వార మటంచు సంతసముతో స్నానంబు గావింపఁగాఁ
బక్షాంతాబ్జ రుచిప్రకాశము హరిద్వారంబు నో యుగ్మలీ!
సాక్షాత్కారముచేసె నంది ధరణీ సంచార మేపారఁగా.

పాపంబు తొంటి పుట్టుల
లోపల నొనరించినట్టి లోలాత్ములకున్
తాపంబు లణఁచికొన దు
ష్ప్రాపం బా పురవరంబు రాజీవాక్షీ!

ఆయూరి చెలువమున కెద
మాయాయన మెచ్చుకొనుచు మంజులవాణీ!
స్వీయాంశమొకటి భక్త
ధ్యేయంబుగ నిల్పెనచట నే సేవింపన్.

సప్తాశ్వరుచిరమణిగణ
దీప్తి ప్రాకారమధ్య దేశస్థిత ఖ
వ్యాప్తోరు శిఖర నిలయ
ప్రాప్తాద్వైతానుభావ భావితమూర్తిన్.

రంగత్పన్నగరాజ రాజిత మణిగ్రైవేయ హారాళితో
లింగాకారమునన్ వసించు నెడ నిర్లిప్తాంతరంగుల్ రజో

లింగు ల్పంగవిభంగచంగులు సమాశ్లిష్టాపవర్గాంగనా
సంగుల్ శైవవిధానుషంగులు మమున్ సంప్రీతి సేవింపఁగన్.

గిరిశుఁడు నేనును వారల
పరిచర్యల కలరి సదయభావుల మగుచున్
పరిణత నైర్వాణశ్రీ
వరదాన క్రీడ నెఱపు వారము సతమున్.

పల్లవితంబులై కుసుమభార వినమ్రములైన తోఁటలన్
వేల్లితవల్లరీప్రణయ నిర్మలడోలల నూఁగియూఁగి సం
ఫుల్లలతాంతగుచ్ఛ పరిపూర్ణమధూళిక లానియాని యో
పల్లవపాణి! యాపురము పక్షులుపాడును శైవగీతముల్.

వ్యాపిత చంద్రకాంతమణిహారిహిరణ్మయ కుట్టిమస్థల
స్థాపిత భర్మహర్మ్యసువితర్దులపై సుఖముండి దంపతుల్
రేపును మాపు మాకును నిరీహపరీష్టి యొనర్చుచుంటచే
నాపురిఁ బాసిపోవ మనసాడకయుండె నరాళకుంతలా!

అంభోజాక్షి! నిరంతరంబటకు యాత్రార్థంబుగా నెందఱో
రంభోరుల్ చనుదెంచి భర్తల కరగ్రాహంబు గావించి భో
శంభో! శంకర యంచుఁ గ్రుంకు లిడి యాసాయంబుగంగానదిన్
గుంభింపందగఁ జేసి రీశ్వరునకుం గుంభాభిషేకంబులన్.

నాత్యుష్ణంబును నాతిశీతలమునై యాహ్లాదముంగూర్చు నా
శ్రుత్యంతస్తుతిపాత్ర రమ్యనగరీ శుద్ధాంత శుద్ధాంతమై
నిత్యంబేను సుఖింతు నెచ్చెలులతో నిస్తంద్ర భావంబుతో
సత్యానందముతో హృదీశ్వరపదాబ్జధ్యానపారీణనై.

తనిసి యిట్లిర్వురము హరిద్వారమందు
నుండఁ బూజారి యొకఁడు మాయందఁ జేరె
వాఁడు వాడుకకైన సేవకుఁడుగాని
పట్టి చూడంగ మాపాలి బందెకాఁడు.

ఆవగింజలువోని యక్షియుగ్మమువాఁడు
మొఱకుఁ దేఱిన పాడుమోమువాఁడు
పాఁచికంపునుగొట్టు పలు చాలుగలవాఁడు
వ్రేలాడుపెను తొట్టపెదవివాఁడు
గఱకైన జుంజుఱుఁ జిఱువెండ్రుకలవాఁడు
చీముగాఱెడు దొప్పచెవులవాఁడు
గడ్డిమోపునుబోలు మడ్డిదేహమువాఁడు
మండూక రుతిమించు మాటవాఁడు
గఱప గుమ్మడికాయంత కడుపువాఁడు
తాటిపట్టెలవంటి పాదములవాఁడు
పళ్ళపాఱల నగఁజాలు గోళ్ళవాఁడు
బ్రిహ్మబంధుండు మాపూజఁ బరఁగినాఁడు.

లేచినదాది యొక్క మొగి లిబ్బివి గుంజుకొనంగ నెల్లెడన్
యాచన చేసిచేసి యొక యంతటఁ దృప్తినిగాంచఁబోక యు
త్రోఁచముకోరి యాత్రికులతోఁ దగవాడి శివార్చనానిధుల్
పూచిక యింతలేక సరిపుచ్చుచునుండుఁ ద్రిసంధ్యలందునన్.

బోటులకు బుఱ్ఱగొఱిగెడు చోటులందు
నీరుకాసుల నిచ్చెడు నెలవులందు
తద్దినంబులు పెట్టెడు తలములందు
వాఁడె ప్రత్యక్షమగుచుండు వాడవాడ.

తిలదానం బిడువారల
తలవాకిలియందు వేచి తలక్రిందైనన్
వెలలంగ నీక యొండొరుఁ
గల మొత్తమునెల్ల గుత్తగైకొను తానే.

చినిఁగిన రాంకవంబు కుడిచేతి శిరంబున వ్రేలవైచి పైన్
దునిఁగిన యంగవస్త్రము వినూతనరీతిని జుట్టఁబెట్టి తా
మునిఁగినదెల్ల గంగయని మోఱకులం దగ నమ్మఁ బల్కుచున్
మనిఁగిన యింటికూటికయి మక్కువచేయు నతం డజస్రమున్.

రామశబ్దంబేని రానట్టి యాతండు
శబ్దార్థములు సెప్ప సాహసించు
రఘువంశమేనియు రాకున్న యాతండు
కావ్యార్థములు సెప్పఁ గాంక్షచేయు
సారమన్న యెట్టిదో యరయని యాతండు
వేదార్థములు సెప్ప వేడ్కపడును
అధ్యాత్మ మెట్టిదో యరయని యాతండు
గీతార్థములు చెప్ప బ్రీతిచెందు
యతియుఁ బ్రాసంబు నెఱుఁగని యట్టి యతఁడు
కవితలంగూర్చి తాఁ బ్రసంగంబుచేయు
గొల్లవారును మఱియును బల్లెవారు
వాస మొనరించుచుండెడు వాడలందు.

ఏ గృహంబునఁ దోరణం బెసఁగియుండ
నాగృహంబున పక్షియై యరుగు నతఁడు
ఈఁగకును దోమకును గూడ నేఁగరాని
యెడల గూడ నతండు గన్పడుచునుండు.

పాలును బంచదారయును బండ్లును గిండ్లును వెండిపైఁడియున్
దైలము చంద్రఖండమును ధౌతదుకూలము లుంగరంబులున్
బూలును రత్నభూషలును బోలగ భక్తులొసంగ మాకు; సా
బాలు హరించి తాను బురివైశ్యుల కమ్ముడువెట్టు నిత్యమున్.

ఆలుబిడ్డలుగలిగిన యట్టిఁడయ్యు
నింట నొకనాఁడు బోసేసి యెఱుఁగఁడతఁడు
బ్రాహ్మణార్థంబు పిలిచిన వారియిండ్లఁ
బూఁటకూళ్ళిండ్ల బ్రొద్దులుపుచ్చుఁగాని.

పుట్టినింటనె యిల్లాలి నట్టిపెట్టి
యెడపఁదడపను దా నట కేఁగివచ్చు
పబ్బముల నేడ్వఁ బిల్ల లప్పాలటంచు
వండనీఁ డెన్నఁడునుగూడఁ బిండివంట.

గుణనిధియైన పుత్రికుఁడు కోరినవిద్యల నేర్వ[illegible] దూ
షణములయందు ముష్టిగొని పట్టుకరమ్మని మాటిమాటికిన్
గొణుగును దిట్టుఁ గొట్టఁజనుఁ గోపముచూపును భీతిగొల్పు నే
కణమునొ తేకయున్నఁ గడగండ్లకు నగ్గముచేయు వేత్రిమిడిన్.

ఈడువచ్చిన కూఁతుల కెన్నఁ డొక్క
రైక గుడ్డైన నీయని ఱాఁగ యతఁడు
ముదిత కోరిక తీర్పని మూఁగ యతఁడు
దేవదేవునిఁ గికురించు దేబె యతఁడు.

చెడుగుల పుట్టినిల్లయిన చెన్నఁటి పూజరి శూద్రుఁ డెవ్వఁడేన్
గుడికరుదేర వానిఁ గని గుర్విష్ఠుల నిప్పులు గ్రక్కి లోనికిన్

అడుగిడరాదు పొమ్ము బడవా! యిది యాలయ మగ్రజన్ములే
యడుగిడ నర్హు లన్యులకు నంటఁగరా దిట పొమ్ముపొమ్మనున్.

'లోకారాధ్యుని సేవల
కో కుంకా! జాతిమతములుండునె యెందున్
వాకోక యూరకొ మ్మింక
వాకొంటివ యేని పండ్లు బడబడ రాలున్.'

అని యెవఁడేని కోపమున నాడిన నాడిక పోటుమాటలన్
విని విననట్లుగాఁ దలుపు వేసి తటాలునఁ బౌనవట్టపున్
వెనుకకుఁబోయి శైవతతి వెళ్ళినపిమ్మటఁ దల్పుతీయుచున్
వినయ వివేకశూన్యుఁడయి వీధులవెంటఁ జరించు నిత్యమున్.

ఏయెడనేని నెవ్వరికినేని నొకించుక రొంపపట్టె నం
చేయయ యేని వాకొనిన నేఁగి రయంబున వానియొద్దకున్
చేయిటు తెమ్ము నాడిగని చేయుదు వైద్యమునంచుఁ బల్కి మం
దీయ నికేఁమనన్ జెలియ! యిచ్చినమీఁదట వాని చైదముల్.

ఇంటిపై కొకసారి యీక్షించు నీక్షించి
యట్టుక సామగ్రి నరయు నరసి
పనివానితనమును గనునట్లు తలయూఁచు
తలయూఁచి తత్కథ తెలియనడుగు

నడిగి యింకొక తేప యడిగినదానినే
వేఱొక్కరీతిగాఁ బ్రచ్ఛచేయుఁ
జేసి బాగుగనుండెఁ జేయింతురా నాకు
వెలయిత్తునని చెప్పి పలుకుఁ బలికి

చేతితోడ నద్దానిని స్వీకరించు
స్వీకరించిన యంతనే వీధిఁ కేఁగు
నేఁగి క్రమ్మఱ వత్తునంచెలుగఁ బలుకుఁ
బలుకు నేగాని యారోగిఁ దలఁపఁ డెపుడు.

ఏగిన వీధి కేఁగకయ యీగతి నాతఁడు ప్రత్యహంబునున్
రోగుల యిండ్ల రొక్కములు ప్రోగొనరించుచు నీశ్వరేశ్వరున్
భోగము లిచ్చి తన్నకయ బొజ్జ కదల్చుచు సంచరించు-చో
మా గుడియొద్ద కొక్క- పెనుమానిసి బత్తుఁడు వచ్చెఁజెచ్చెరన్.

వచ్చినతోడనే తలుపువద్దకు వచ్చి శివార్చనంబు నే
ముచ్చట దీరఁజేయవలెఁ బోవగనిండని హెచ్చరింపఁగా
నచ్చటనున్న భక్తతతి యాతని వాలక మారఁగాంచి యీ
సెచ్చఁగ నర్చకుం బిలువ నేఁగిరి వాఁగిరి మూలమూలలన్.

ఆవాఁగుడు వినినంతనె
వేవేగమ యర్చకుండు వీధింబడుచున్
వావిడిచి యఱచి వచ్చెను
మావంతునిఁ జెనక వచ్చు మాతంగమటుల్.

వచ్చి రాఁగానె పంచమభక్తుఁ గాంచి
కటకటంబడి కనులెఱ్ఱగా నొనర్చి
కారములును మిరియములు నూఱి యఱచెఁ
జుట్టుమూఁగిన ఛాందసుల్ బిట్టువొగడ.

గోసంగితొత్తుకొడకా!
పూసితె! నీయొంటినిండ బూడిద పో! పో!

వేసాలు వేసి బాపన
బాసల నీశ్వరునిఁ గొలువవచ్చితివటరా?

నీయందము నీచందము
నీయయ్యాల కెల్లఁజూప నెంచితివటరా
నీయిల్లు వల్లకాడుగఁ
బో యింకను బోకయున్నఁ బొగరణఁచెదరా.

మా రేడుదళములు నేరేడు చివురులు
దూర్వాంకురంబులు తుమ్మిపూలు
కర్పూరఖండముల్ కస్తురిలప్పలు
వెదురుఁబ్రాలును గట్టిమొదవుపాలు
దాడిమీఫలములు ద్రాక్షాగుళుచ్ఛముల్
మల్లెపూవులు నిత్తెమల్లెపూలు
సాంబ్రాణివత్తులు సంకుమదంబులు
పట్టుతేనెలు నారఫుట్టములును
తమలపాకులు వక్కలు తమ్మిపూలు
గుడము ఖర్జూరపుంబండ్లు కుంకుమమ్ము
దొప్పలంబెట్టి తెచ్చితే దోసకారి
చంద్రశేఖరుఁబూజింపఁ జాలుఁ జాలు.

పంచముండఁట యీశ్వరభక్తుఁడంట
విన్న నవ్వొదరెవరేని వెడలు మింక
వెళ్ళకుంటివా! చూడు నీవీఁపు పగులు
పొమ్ము చండాలుఁడా లేచిపొమ్ము పొమ్ము.

పందులనంజుడుం దినుచుఁ బాయలు నిండఁగఁ గల్లుత్రావుచున్
బ్రమందినవారినేర్చుటకు బ్రామఁకులుమోయుచుగొడ్లనొల్చుచున్

సందులగొందులన్ నిశల సంచరణంబొనరించి యిండ్లకున్
బొందలువేయు నీచకుల! పోర మహేశ్వరు నంటరాకురా.

ఏచెట్టుకో యేపుట్టకో
నీచా! వొనరింపు పూజ నెఱిగలదేనిన్
ఆచారహీను లీశ్వరుఁ
జూచుటకేఁ దగరు పొమ్ము చూచెద వేలా!

శ్వపచా! చండాలుండా!
అపలాపుడఁ! యంటరాని యధముఁడ! పాపీ!
యిపుడేమి మునిఁగెరా నా
యపురూపపు దేవదేవు నంటెదవఁటరా!

వేదవేదాంగ విదులైన విప్రవరులు
నమకచమకాలచేత ననారతంబు
పూజచేయంగ నర్హుఁడౌ భూతమయుని
పరమచండాల! పూజింపవలదు పొమ్ము.

'శివ శివ' యెంతపాపమును జేసితిఁ జూచితి నీదుమోము నేఁ
బ్రవిమలచిత్తులౌ ద్విజులు పల్కఁగరానికొలంబు వాఁడ! నీ
వవలకుఁబొమ్ము యాలయము నంతయు శుద్ధియొనర్పఁగావలెన్
తవుదునటంచు వచ్చితివె తన్నెదు వారెవరేని లేరుగా.

పంచముఁడవగు నీమోము గాంచు కతనఁ
బంచగవ్యంబు పుచ్చుకోవలయు నింకఁ
గాశికిం బోయి విశ్వేశుఁ గానవలయుఁ
బాచితంబునఁ బాపంబు పాయవలయు.

గాయత్రీ మంత్రంబున
జేయంగావలయు జపము శీఘ్రిమ పోరా?
యాయతికాఁ డభవుఁడు కాఁ
డాయసభూషణుఁడ! యింటి కరుగర యింకన్.

'ఓ' కు వంకరలెన్నొ వాకొనంగాలేవు
రుద్ర సంస్తుతియేల క్షుద్రనీకు
అభిషేకమననేమొ యాకళింపఁగ లేవు
భూతేశు గొలువేల మూర్ఖ! నీకు

కైంకర్యమననేమొ కాంక్షింపఁగాలేవు
భవుసేవయేల శ్వపాక! నీకు
నైవేద్యమననేమొ యావంతకనలేవు
కటికంతు కొల్వేల కటిక!. నీకు

బ్రహ్మముఖ జాతులైనట్టి బ్రాహ్మణులకె
యర్హమగుఁగాని వామదేవార్చనంబు
కుక్కపాలయాన నేపార్ద్రుఁ గుతిలపడెదు
మాలవానికి నర్హ మేలీల నగును?

ఆముష్యాయణులైన బ్రాహ్మణుల కర్హంబైన దేవార్చనం
బోముష్టింపచ! యెట్లు చేయ మదిలో నూహించి యెంచినా
వేమీ యాడక యింటిదారిఁ జనుమీ యేమేని వాకొందువా
నీ మై చర్మము నొల్చువా రమిపుడే నిక్కంబుగాఁ జూడుమా.

కలికాల మింక రాలే
దలికాక్షుని సేవ కపుడె యంత్యకులుండా!

వలకాలి నిడితి గుడిలో
పల, నీతలకాయ యింకఁ బగులకయున్నే!

లొపరాతోడ నొప్పెడు రూపరాణి
ప్రక్క చేఁపలుపట్టుచు బ్రతుకుచుండు
మాలవానికి సర్వేశు జోలియేల
తలఁగి పోపొమ్ము మట్టమధ్యాహ్నమాయె.

హరహర శంభో శంకర!
నరహంతకుఁడైన మాలనాయఁకు నెటులీ
వరయుచునే గుడిలోనికిఁ
జరణంబిడనిచ్చినావు చాలుర సామీ!

నీపూజారిని నేను గల్గ నధముల్ నీపూజలేరీతిగాఁ
దాపుంజేరి పొనర్పవత్తురు ప్రభూ! తప్పైన నొప్పైన నే
నీపాదంబులు ముట్ట నర్హుఁడనుగానీ యన్యులెల్లొదు ర
య్యా! పాపంబును బుణ్యముందొలఁగెమిథ్యాభక్తు లే తేరుటన్.

కుడిచేయి యెడమచేయను
నుడులుడిగెను దేశమందు నూతనమతముల్
గడెకొకటి కుక్కగొడుగులు
వడువునఁ దలలెత్తఁ దొడఁగెఁ బరికింపు శివా!

దొంగను దేలది కుట్టిన
భంగిన్ నీప్రూరకున్న పాపాత్ములు నీ
రంగెల్ల బట్టబయలుగ
గంగాధర! చేయకుండఁ గలరే చెపుమా?

అని వాపోయి శివార్చకుండు ప్లవునత్యంతాగ్రహోదగ్రుఁడై
కని యోరీ! శివునాలయంబును వృథాగా మైలగావించి నా
వనయం బిట్టి దురాగతంబునకుఁ బ్రాయశ్చిత్త మే నిప్పుడే
యొనరింతుంగనుమంచుఁగజ్జిగొనమొత్తోయంచుమాలండునున్.

బాపనసాములు మీకిటు
కోపింపఁగఁ దగునటయ్య కోవిదవర్యా!
నాపాప మేమి పండెను
మాపతి పూజింపఁదగిన మానిసిఁగానే.

నాకుం జేతులుకాళ్ళను
వాకును దయచేసినాఁడు భర్గుఁడు! వానిన్
నాకనులగాంచి పూజలు
శ్రీకరముగ మనసుఁ దీర జేయందగనే.

ఈయూరియంద పుట్టితి
నీయూరనె పెరిఁగినాఁడ హిందూజనుఁడన్
హేయపుఁబనిసేయను న
న్యాయంబుగ నేలతిట్టుదయ్యా! నన్నున్

మీతల్లి నిన్నుఁ గనినటు
నాతల్లియుఁ గాంచె నన్ను నాయంబయ్యా!
వాతప్పి పలుక నిట్టులు
భూతేశుఁడు నీదు బుట్ట బూరెమె చెప్పుమా!

శ్రీకంఠుఁడు జనులందఱ
కేకారాధ్యుం డటంచు నెఱిఁగినవారల్
వాకొంటఁజేసి వచ్చితి
గేకలునిడి వెలికి నన్ను గెంటకుమయ్యా!

శివరాత్రి వాసరంబున
శివు నర్చింపంగవచ్చి శివశివ నీచే
నవమాన మిట్లుగాంచితిఁ
దవునయ్యా! తోఁడినరునిఁ దప్పులువట్టన్.

పంచముఁడు రుద్రుఁ డుండెడి
పంచకునే రాఁదగండు పదపొదమనుచున్
వంచింపఁ జూతు వేటికి
పంచజనుల మీావు నేనుఁ బరికింపంగన్.

మాతంగకన్య యెవ్వతె
మాతండ్రీ! చెప్పవయ్య మాతల్లియకా
నీ తల్లిదండ్రులందఱు
నాతల్లిని గొలుచుచుంట యాచారమకా!

గోసంగులు గోసంగులు
గోసంగులటంచు తిట్టుకొనియెద వేలా!
వ్యాసుండు వాని యయ్యయు
గోసంగులుకారొ యెంచుకొనుమా విప్రా!

వేదార్థం బన్నింటికి
మూదలయని యెఱిగి తేని భూసురవర్యా!
సోదరులమయిన మమ్మిటు
గాదందువె శివునిఁగాంచఁగా నిర్ఘృణతన్.

బాడబోత్తములెల్ల విహావావేళఁ
గాంచి మ్రొక్కు నరుంధతికథ తలంపు
మూరకే దేహమంతయునోరుచేసి
కొన్నమాత్రాన నేమగు నన్న! ఫలము.

గాధిసూనుఁడు చినపుత్రికలుగ నెంచి
మాకొలంబున కన్నెలనే కదయ్య
చక్రవర్తుల నాదిమచక్రవర్తి
యా హరిశ్చంద్రు మన్నన లందఁజేసె.

శర్వాణీప్రియుఁడే చరాచరములన్ సంసృష్టిగావించుచున్
నిర్వాహంబొనరించుచున్ దునుముచున్ లీలావిహారంబులన్
సర్వాంతర్గతుఁడై చరించుననుచున్ జాటుంగదా వేదముల్
గర్వంబేటికి సృష్టితత్త్వము నెఱుంగంజాలు మీబోంట్లకున్.

జననముపెంపు విద్యలపసందును మేనిబెడంగు నాఢ్యతా
ఘనతయుఁగాంచి గర్వమునఁ గల్పనచేయుదు రెచ్చులొచ్చులన్
దనువు లశాశ్వతంబు లవి తప్పక రూపఱు నేఁడొ రేపొ యీ
మనుజులు భేదభావములు మానరుగా సకలం బెఱింగియున్.

అగమాగమాగమాంతార్థామృతాంభోధు
లాపోశనము పట్టినట్టివాఁడు
దిక్చతుష్టయమధ్యదేశగద్వీపవ
త్యంతరంబుల మున్గినట్టివాఁడు
చంద్రమశ్చూడాంఘ్రిజలజరేణుప్రపు
ణ్యస్థలంబులు మెట్టి నట్టివాఁడు
సకల మార్గణ గణాశాపూరణ ప్రీతి
నఖిలస్వ మర్పించినట్టివాఁడు
పడయఁజాలఁడు నిర్వాణభవ్యపదము
నాబ్జసూతి పిపీలికానంత దేహి
బహుళదేహాంతరాళ దీపాయమానుఁ
డైన నాత్మేశుతత్త్వంబు నరయఁడేని.

మాయాతంతు నిబద్ధమానసుఁడవై మర్యాద లంఘించుచున్
హేయక్రూర దురంత కార్యరచనా నిర్నిద్రచర్యుండవై
చేయన్ రాదు శివార్చనం బనుచు నన్ శిక్షింపఁగా నెంచె దే
మోయీ! యర్చక! యింతవింత భువి నోహో! యెందునుంగల్గునే

శాంతాకారుఁడు వ్యోమకేశుఁడును నిస్సంగుండు నిర్లేపుఁడున్
స్వాంతాతీతుఁడు కోటిసూర్యకిరణ ప్రాభాసితుం డచ్యుతుం
డంతర్వేది నుతుండు చారుకవితా వ్యాసంగసంగుండు వే
దాంతాభ్యర్చిత పాదపంకజుఁడు లింగాకారుఁడై యిచ్చటన్.

ఉండం గాంచఁగ వచ్చినట్టి నను నీవుద్రిక్త భావుండవై
గండారించి యధిక్కరించి గుడిలోఁ గాలూనరాదంచు బ్ర
హ్మాండంబుల్ వగులంగ నార్చెదవు దార్మార్గ్యంబుదీపింపఁగన్
జండాలుండవు నీవొ నేనొ యెదలోనన్ సుంత యోజింపుమా.

ఎవ్వాఁ డజాతశత్రుఁడు నిరీహుఁ డహంకృతిదూరుఁ డాతఁడే
సువ్వెమనీషి, బ్రాహ్మణుఁడు, శూద్రుఁడు పంచముఁడంచు వేఱుగా
నెవ్వని మోము నందు లిఖియించె విరించి తలంచి చూడగా
గవ్వకుఁగాని వాక్యములఁ గాఱియవెట్టక పొమ్ము పూజరీ!

మలభూయిష్ఠము మాంసరక్తమయమున్ మజ్జావసాపూప గం
ధిలమాంత్రాస్థిక శేరుకాఘటిత మాధివ్యాధి బాధాధి కా
విల మీ మేనొక బుద్బుదంపు పగిదిన్ విధ్వస్తమౌ దీనికై
చెలఁగంబోరు కలంగఁ బోవరు మనీషిగ్రామణుల్ పూజరీ!

మమతాహంకృతు లోసరించి పరమాత్మ ప్రక్రమజ్ఞాన మా
ర్గముఁ జేపట్టుము సర్వభూతగతుని స్సన్గొమ్ము నీలోనఁ జి

త్తము నేకాగ్రముచేసి చూడు మింక భేదంబెల్ల నిర్మూలమై
సమతాభావము విస్తరిల్లు నదె మోక్షద్వారమో పూజరీ !

మాయామేయ జగంబె నిత్యమని సంభావించి నీవిట్లు మ
మ్మాయాసంపడఁ జేయఁ జూచెద వనంతాసూయ దీపింపఁగా
నీయజ్ఞానము మాయకున్న యెడ నిస్సీ! నీకు నీశంకరుం
డీయంజూచునె ముక్తి. వత్సరశతం బిట్లున్న నోపూజరీ !

హృదయకుఁ డెవ్వండేనియు
సదయాత్మత నన్నుఁ బోలె నన్యాయముగా
సదయాత్ము నీశుఁ గొలువఁగ
నొదవించునె యడ్డులిటుల నొడ్డలకెల్లన్.

శంయువుగ నెంచి నేవచ్చి శంభుమూర్తి
నర్చచేయంగ నెంచ సహాయ వయిన
యీవు తాఁకరాదని త్రోయ దేటికయ్య
గుణ్యుఁడగువాని కేటికిఁ గొలము గోల.

విద్వ దూర్జిష్యం డెవ్వఁడు
నద్వంద్వుండైన శర్వు నర్చించుటకై
హృద్వీథిఁ గోరివచ్చిన
యద్వైతుని మాలఁడంచు నాడఁడు విప్రా !

ప్రజ్ఞ యిసుమంత కల్గిన పర్జ్ఞిలుండు
కులము పేరిటఁ దనదగు గొప్పఁదనము
నిలుపుకొనఁ జూడఁ డన్యులఁ దలఁగఁద్రోయు
నది యలంపురుషీణమై నట్టి పనియె.

ఈశ్వరేశ్వరు తనయుల మెల్లరమును
తండ్రి సేవింపరానట్టి తనయుఁడున్నె?
యెఱుఁగఁ జెప్పు మది యపడక్షీణ మేని
తెలిసికొందును బూజారీ! కల నిజంబు.

వాత్రీనత శీతకతయు
నేతరి లేకుండ బ్రతికి యీశ్వర సేవా
పూతమగు మనసు తోడను
ఖ్యాతిం గనువాఁడె ముక్తుఁడగుఁ బూజారీ!

ఒక సూర్యుండె సమస్తజీవులకుఁ దా నొక్కొక్క రూపొంది య
ట్లొక జీవుండె సమస్తమానవులలో నొక్కొక్కరూపంబునన్
ప్రకటస్ఫూర్తి నుపాధి భేదమునఁ బూర్వంబైన స్వీయాంశచే
నకలంకస్థితి వెల్గుచుండు నిది పో యాదార్థ్యమూహింపఁగన్.

స్వప్రకాశంబు నిత్యంబు జ్ఞానమగుట
జ్ఞానమే యాత్మయని యెంచు మానవుండు
జడ మనిత్యము నగునట్టి బడుగు దేహ
మందు నభిమాన మెన్నండు నందఁ బోఁడు.

జీవుఁడు పరమానందుఁడు
జీవుఁడు ప్రేమాస్పదుండు జీవున కెపుడున్
చావును పుట్టువు కలుగవు
జీవ బ్రహ్మైకతత్త్వ జీవివి కమ్మా!

కడువడి సుడిగుండములన్
బడితిరిగెడు పురుగులట్లు పలు యోనులలో

బడి బడి పుట్టుచు జీవుఁడు
పడయఁడు సౌఖ్యంబు తొంటివాసన కలిమిన్.

తిరుగాడి యాడి కర్మల
పరిపాకంబుననుజేసి వరగురుసేవన్
నరులెల్ల నొక్క రూపని
యరయంగాఁ గల్గు జ్ఞాని యాత్మప్రజ్ఞన్.

మార్త్తికమగు శారీరక
కీర్త్తింగని మురియనేల కేవల గుణ్యుం
డార్త్తిని బెఱలకుఁ జేయం
డార్త్తత్రాణుండు శివున కంజలిచేయన్.

తండ్రిచే సృజింపఁగఁబడి ధవునిచేత
ననుభవింపంగఁ బడునట్టి యతివ వోలె
ననుభవింపంగఁ బడుచుండు నఖిల జగము
శివునిచేఁ గల్గి జీవునిచేత సతము.

కూఁతురుగ సతిగ స్నుషగ మాతగాను
మామ్మగా నొక్కయాఁడుది మాఱునట్లు
పంచముఁడు శూద్రుఁడు విశుండు బాహుజుండు
పాఱుఁడని యొక్క జీవుండు మాఱుచుండు.

ఈ యుపాధి భేదంబు తా నూహచేసి
జ్ఞాని యగువాఁడు లాఁతి నజ్ఞానియనుచు
నీసడింపఁడు తోఁవఁడు గాసి పఱుపఁ
డాత్మ నిత్యత తలపోసి నట్టేఁడగుట.

మాలం డీతఁడు మాదిగీతఁడనుచున్ మంద్రాట మేలయ్య శ్రీ
లీలావిగ్రహు నీశ్వరేశ్వరుని నాళీకాక్ష సంసేవ్యునిన్
కాళీనాథుని భక్తియుక్తి గొలువంగా వచ్చు నెవ్వారలున్
గోలంబెట్టక తెల్పుమాలి ద్విజ! కన్గోవయ్య తత్త్వార్థమున్.

చిదూపుండగు చంద్రమౌళి జనతాక్షేమంబె ముఖ్యంబుగా
నద్రీంద్రాత్మజతోడఁ గూడి యిట నవ్యాజానుకంపామతిన్
సద్రూపంబున వెల్గుచుంట విని పూజల్ చేయ నేరాఁగ నీ
వుద్రిక్తాత్మతఁ ద్రోసిపుచ్చఁ దగునే యుర్వీసుపర్వుండవే!

అక్రోధుఁడె బ్రాహ్మణుఁడఁగు,
సక్రోధుం డగును జూవె చండాలుం డీ
ప్రక్రియ యెఱిఁగిన యాతఁడు
వక్రోక్తులు నీకుఁ బోలెఁ బలుకఁడు గాదే.

క్షమయే మోక్షము స్వర్గము
క్షమయే వైకుంఠపదముఁ గైలాసంబున్
క్షమయే బ్రహ్మ పదంబును
క్షమరహితమె నిరయమయ్య చర్చింపంగన్.

కావున నర్చకా! విసువు గాంచక డెందము శాంతిదాంతులన్
పావనముం బొనర్చికొని భర్గునిఁ గొల్వఁగ నెల్లవారికిన్
నీవలె స్వామ్యమున్నదని నేఁటికినేని తలంచి మోక్షపుం
ద్రోవనుబొమ్ము వేరమునుత్రోయుము చేయుము భ్రాతృభావమున్

జాతులఁ గూర్చి భగవ
ద్గీతల వాకొనినయట్టి కృష్ణుని వాక్కుల్

నీతలకు నుంతయెక్కిన
నీతఱి నీవిట్టి చెయిది కెసఁగవుగాదే!

పుట్టినదియాది యీనేఁటి పొద్దుదాఁక
మంచియును జెడ్డయునుఁగూడ నెంచఁబోక
తీర్థకాకంబవై యిట్లు తిరుగునీకుఁ
గటగటా! యెట్లు మోక్షంబు కలుగ నేర్చు.

ఓ భిషక్పాశ! కోపంబు నుజ్జగించు
మోలగింపంగ నేరాఁగ వ్యోమకేశుఁ
గాదు కూడదు నా నీవు వాదులాడి
చివ్వకుం గాలు ద్రవ్వట చెల్లునోయి!

ఈవున్ నేనును నెత్తిఁబెట్టికొని యిందేమేని గొంపోదుమా!
చావున్ బుట్టువు లెల్లమానవులకున్ సాజంబు తప్పించు కో
నేవాఁడేనియు నేరఁడింతకు వృథాహీనప్రలాపంబులన్
నోవుం జెందఁగఁ జేయ నేల ననుఁ గన్గోయీ! యథార్థాంశమున్.

నిన్నున్ నన్నునుఁ బుట్టఁజేసిన భవున్ నీవెట్లు పూజింతువో
యన్నా! నేనటు పూజచేయఁదగనా యన్యాయమిందేమి యే
నున్నం జెప్పుము దిద్దుకొందు నిపుడే యోలాకు లేకుండఁగా
బన్నంబించుక లేదు నాకిట వృథావ్యాసంగ మింకేటికిన్.

భస్మీభూత దురేషణార్యజన లభ్యంబై మహాహంక్రియా
పస్మారాచిత దుర్జనప్రకర తీవ్రింబై జటాచంద్ర తే
జస్మిగ్ధ్యాంచితమై జగద్భరణదక్షంబై ప్రపుణ్యాంబునా
సన్మద్దైవత పూజనంబునకు నీవా కర్తవున్ భర్తవున్?

దుర్మాంసంబుల ముట్టఁబోకెప్డు సంతోషంబు దీపింపఁగాఁ
జర్మంబుల్ పదనార్చి, పెద్దలకుఁ బదిక్షుల్ సుతారంబుగా
నిర్మాణంబొనరించి యిచ్చి సుఖముల్ నెక్కొల్పు మాజాతికిన్
గర్మంబిట్టులు కాలెఁగావలయు లోకంబందు నోపూజరీ!

రసహీనంబులు నర్థహీనములు వ్యర్థక్రోధ కృద్వాక్యముల్
విసరంజూతువె యన్యజాతులపయిన్ వేరంబువాటించి, వా
సిసెడున్ లేదు ఫలంబొకింతె మితభాషిత్వంబు లేకున్న చో
రసనా చాలన చాపలంబు కడు గర్హ్యంబెట్టి ధీశాలికిన్.

అని మాతంగకులోద్భవుం డటు లుపన్యాసంబుగావింపఁగా
విని యాస్యంబునఁ గోపతాపకలనావిర్భూత రక్తచ్ఛవుల్
దొనఁకన్ గన్నుల నిప్పుకల్ గురియ నైర్ధుర్యంబు మేనంతటన్
గనిపింపన్ ధరణీసురప్పుఁడు వివేకభ్రష్టచేతస్కుఁడై.

కల్లలమారిమాల! నోడికారితనంబునుజూపి పార్వతీ
వల్లభునాలయంబుఁ జొరవచ్చితె చచ్చితి కాచికొమ్మటం
చుల్లనమాడి హస్తమున నుండిన తోల్లిటి దుడ్డుకఱ్ఱతో
భల్లున వాని మూర్థమును బ్రద్దలువాఱఁగఁ గొట్టినంతటన్.
భల్లని కోవెల తలుపులు
గొళ్ళెంబులు ముక్కలౌచు గొబ్బునవీడెన్
పిల్లలు మేకలు నందఱు
గొల్లున నోకపెట్ట యఱచి గోలయొనర్పన్.

మాలని నెత్తినుండి యతిమాత్రముగా స్రవియింప నెత్తురుల్
కాలువగట్టసాగెఁ కటకంతుని శీర్షమునుండి నెత్తురుల్
మూలకువ్రాలె బంచముఁడు, మూలకువ్రాలె శివుండు, నర్చకుం
డాలలిగాంచి బిచ్చవడి యంత్యజుపాదములంటి మ్రొక్కుచున్.

తండ్రీ! దోసముచేసితిన్ కుమతినై తప్పీవు సైరింపుమా!
గండ్రిల్ వల్కి యవాచ్యవాక్యముల బోకాల్మంటి నీవింతయున్
మంత్రాటంబును జూపఁబోక శ్రుతిమద్వాక్యంబు లెన్నాడినన్
తీంట్రన్ వీడక కొట్టినాఁడను వృథా ధీజాడ్య సంఛన్నతన్.

పూర్వాచార పరాయణత్వమున నిన్ బొమ్మంటిఁ బోకుంటచే
గర్వంబెంతయు నెత్తికెక్కి యిట్టులన్ గావించితిన్ బత్తుఁడా!
శర్వుండింతటి భక్తభావుఁడని యెంచన్ లేనినాయజ్ఞతన్
సర్వంబున్ క్షమియింప వేఁడెదను హస్తాల్ మోడ్చి నీ కాళ్ళకున్.

చేసితి దోసమున్ శివునిసేవ యొనర్పఁగనీక నిన్ను నే
గాసిని బెట్టి కొట్టితిని కర్మము నాకిటు కాలిపోయె నా
చేసినదోసమున్ సయిచి శీర్షమునంటఁగ నిమ్ము రక్తమున్
వాసముతోడ నెమ్మదిగఁ బాయగఁజేయఁగ నిమ్ము సోదరా!

భక్తమతి లింగపతియను ప్రాఁత మాట
మఱచి చేసిన దోసంబు మఱచిపొమ్ము
భవ్య భవదీయసేవయే భర్గసేవ
గా నెఱింగితి నీసేవ కాన యిమ్ము.

అంచు బ్రీతిమాలు చర్చకవంచకుండు
బత్తుగాయంబు చేతితో నొత్తి పట్టి
యంగవస్త్రంబు దానికి నదిమి చుట్టి
తేట తియ్యని నీరముల్ తెచ్చి యీయ.

కోరిలుక యాతఁడు మెల్లఁగఁ
గేలానుక కూరుచుండి కీస శ్రమంబున్

తోఁ్రిలంగఁ బుచ్చి నిలఁబడి
బాలేందుశిఖావతంసుఁ బరికింప వడిన్.

దుర్భర బాధం దలఁపక
నిర్భయమే యూఁతగాఁగ నీలగ్రీవున్
గర్భాలయముం జొరఁబడి
యర్భకుఁ డాత్మీయ జనని నరసెడురీతిన్.

ఇటు నటు గనుఁగొని మూలకు
నిట లాక్షుం డొరగి శిరము నెఱియలువాఱన్
బొటబొట నెత్తురు చినుకుట
దటుకునఁ గని గుండె మిగుల దడదడలాడన్.

దగ్గఱ కేఁగి చూచి యిరుదాడలనుండి స్రవించు నస్రమున్
దుగ్గడి తెల్లయొల్లె కొసతోడుత మెల్లగ నద్ది నెత్తిపై
మ్రుగ్గును బోసి నొక్కఁగనె ముందఱి కంటెను నల్ల పెల్లుగా
డిగ్గ దొఱంగుచున్ మిపుల దీనతతోఁపఁగ బత్తుఁ డేడ్చుచున్.

తీవలు గాయము మాన్పఁగఁ
దేవరె నీకనాలసింపఁ దీరద యనుచున్
దేవళపుంబ్రాచీనము
లో, వలముగ నలమి లుంగ లుంగలుగాఁగన్.

ఉండుటకనినట్టింటై
యుండక పరువెత్తి యచటి యోషధులెల్లన్
దండిగఁగైకొని క్రిమ్మఱి
పిండగఁ దద్రసము పుండు పెద్దదికాఁగా.

చిత్తం బురి యాడంగా
బత్తుఁడు తల నొక్కిపట్టి వస్త్రములోనన్
నెత్తురు నాఁపెడు నాకుల
బొత్తిగనిడి కట్టుకట్ట మున్నటికంటెన్.

ఎగఁజిమ్ముచుఁ గీలాలము
దిగఁ బాఱుచుఁ దనదుశిరము దిరదిర తిరుగన్
ఎగదిగఁ గనుఁగొని యెదలో
దిగులొందుచు వెగచి వెగచి దేవునియెదుటన్.

సాఁగిలిమ్రొక్కి బాష్పములు సారణులై ప్రవహింప నాత్మలో
లోఁగక ప్రక్కనున్నయొక లోడిని చేకొని "నాదుపుత్త్రి నే
యీఁగలవాఁడ నీకుఁ గొనుమీశ్వర ! పుత్త్రికుఁ బుత్త్రమందుకా
గాఁ గను భద్ర మీ వనుచు గట్టిగఁ గొట్టికొనంగ నెత్తిపై.

ఛిన్నంబై భిన్నంబై
సున్నపుఁ గాయట్లు శిరముచూర్ణముకాఁగాఁ
గొన్నెత్రుతోడి పునుకన్
విన్ననువునఁదీసి శివుని నెత్తికి నతుకన్.

అర్ధేందుమౌళితో నాకాశగంగతోఁ
గమనీయ నిటలాలకంబుతోడ
నీలకంఠంబుతో నీహారమూర్తితో
ఘన ఫణిగ్రైవేయకంబుతోడ
ముమ్మొనవాలుతో మువ్వన్నెతోలుతో
రక్షితాఖిలలోక కుక్షితోడ
సామేనిసానితో సారంగపాణితోఁ
బూతాతి పూత విభూతి తోడ

లింగముననుండి వెలువడి లేచి నిలిచి
యీశ్వరేశ్వరుఁడైన గౌరీశ్వరుండు
మందహాసంబు మోమునఁ జిందులాడ
నభయహస్తంబుతోడఁ బ్రత్యక్షమయ్యె.

సృష్టియగు శంభుఁ డాగతి
హృష్టుండై యెదుట నిలువ నేచిన భక్తిన్
స్పష్టాగ మాంత సూక్తుల
శిష్టుండై బత్తుఁడిటులు చేసె స్తవంబుల్.

నమ ఓంకారరూపాయ, శంకరాయ నమోనమః
నమ ఉగ్రాయ శర్వాయ, పింగళాయ నమోనమః

నమః పాటల వర్ణాయ, మందారాయ చ నమోనమః
నమః పీతస్వరూపాయ ధూమ్రాయ చ నమోనమః

నమోలింగ స్వరూపాయ, నమో బిందు కళాత్మనే
నమో ఘోరాయ భీమాయ, నమో వ్యంజనరూపిణే.

నమస్తారాయ లింగాయ నమో మీఢుష్టమాయ చ
నమస్థూలాయ సూక్ష్మాయ నమోదృశ్యాయ బ్రహ్మణే

నమః కృష్ణాయ రుద్రాయ, నమః కల్యాణకారిణే
నమో వేదాంతవేద్యాయ, నమో మంగళమూర్తయే.

నమో నానా స్వరూపాయ, పావనాయ నమోనమః
నమోవిస్తార రూపాయ కేవలాయ నమోనమః

నమశ్శ్వేతాయ పీతాయ పార్వతీ వల్లభాయ తే
నమశ్శర్వాయ సర్వాయ చంద్రసూర్యాగ్ని మూర్తయే

శ్రీకంఠాయ శివప్రదాయ భవతే క్షేమంకారాయోం నమో
లోకత్రాణ పరాయణాయ భవతే రుద్రేశ్వరాయోం నమో
పాకారిప్రముఖస్తుతాయ భవతే భద్రప్రదాయోం నమ
స్సాకారాయ మహేశ్వరాయ భవతే సాయుజ్యదాత్రే నమో

బత్తుఁ డీరీతిఁ గొండాడి పరవశత్వ
మొంది క్రిందికి నొరగఁగా నుంటఁగాంచి
చంద్రిమః కళామాళి విస్తార కరుణ
నమృత హస్తంబులన్ వాని నదిమిపట్టె.

అచ్చెరువేమి చెప్ప మృదుహాసిని ! బత్తుని దేహమంతలో
బచ్చనివిల్తు కాయమును బద్మవిరోధి శరీర యష్టినిన్
మచ్చరి కించి మించెఁ దను నమ్మినవారికి శర్వుఁడిట్టులే
యిచ్చు విభూతులంచు నుతియింపఁగ నచ్చటిపౌరబృందముల్.

వింతలకెల్లవింత యలివేణి! వినంగదె యొక్కమాట ను
స్వాంతుఁడు నాఁడు నాథవుని పావనహస్తము సోకినంతనే
గొంతుక నల్పుఁ బాములును; గొప్పునఁజంద్రుఁడుదివ్యగంగ;మే
నంతయు భూతి, హస్తమునయందుఁ ద్రిశూలముఁగల్గి వెల్గఁగా.

అర్చకుఁడు గాంచి యాతని
వర్చస్సును వెఱఁగుచెంది భవుఁ డాతండో
చర్చింప నతఁడె భవుఁడో
కూర్చుంగా లేక యూహ గొదకొను భీతిన్.

చేతులు దోయిలించి యెటు చేయఁగఁదోఁచక తత్తరంబునన్
వా తెఱ యెండఁ జెమ్మట లపారముగా మెయినిండ నిండఁగాన్

జేతలు దక్కి నిల్వఁబడి నీలగళుండొక నవ్వునవ్వి సం
ప్రీతమనస్కుఁడై పలికె విప్రునిగూర్చి సుధామృదూక్తులన్.

ఉంటే యర్చక! చెంత నీవిచటనే యుద్రిక్తభావంబుతో
గంటే విప్రుఁడ! నాదుభక్తు చెయిదిన్ గన్నారఁగా నిత్తఱిన్
వింటే బ్రాహ్మణ! నాదుభక్తు వినుతుల్ వీనుల్ సుఖంబందఁగా
మంటే బాపఁడ! యెప్పుడే నిటువలెన్ మాఁగింతలేకుండఁగా.

చదివితి సంధ్యావార్చితిని స్నానముచేసితి నన్నమాత్రనే
యొదవునె ముక్తి? యీశ్వరునియొంటికిఁదైలముమంచిగంధమున్
మెదవినయంతనే కలుగనేర్చునె మోక్షము! వెఱ్ఱిబాపఁడా!
చదువుల సారముం దెలియఁజాలని వానికి నెన్నఁడేనియున్.

కులములు పేరుచెప్పుకొని గొప్పఁదనంబులు నిల్పనెంచినన్
కలుగునె మోక్షమార్గములు జ్ఞానమయాత్మకుఁడెవ్వఁడేనియున్
తులువదనంబునన్ బరులతోడఁ బెనంగునె జాతిమాత్రకై
తలఁపక సత్య మిట్టి దని దండనచేసితి నాదు భక్తునిన్.

ఇరుప్రొద్దుల మల్లింగము
పరిచర్య యొనర్చినంత భక్తుఁడ వగుదే
పరమార్థ తత్త్వమెఱుఁగని
నరులకు నాతత్త్వమెఱుఁగ నగునే యెందున్.

పంచముఁడె ద్విజుఁడగు ద్విజుఁడె
పంచముఁడగు స్వీయకర్మ వలనన్ గానన్
వంచనములేక బ్రతికిన
యంచితమతి బత్తుజెసక నగునే నీకున్.

కోపాత్ముఁడె చండాలుఁడు
కోపము లేనట్టివాఁడె కోవిదుఁ డరయన్
కోపంబులేని యీతని
దాపం బొందించినావు తామస ! తగునే ?

నీళ్ళు గాలియు వెన్నెల నిఖిల జనము
లనుభవింపంగఁ దగినట్టు లనుభవింపఁ
దగును నాతత్త్వ మర్చకా ! ధరణి గల్గు
నెల్ల మానవలోకంబు లెఱుఁగు మిద్ది.

ఏకులమునవాఁడైనను
నాకున్ భక్తుండు గనఁడు నారకబాధన్
నీకంటె నితఁడె పుణ్య
శ్లోకుండని యెఱిఁగి కొని యసూయన్ విడుమా.

అనవద్యభోజి యీతఁడు
కన నర్హుఁడు కాఁడె నన్ను గావరమున నీ
వనరాని మాటలాడుచుఁ
గొనకొని నడినెత్తి పగులగొట్టం దగునే ?

తినరాని కూళ్ళు కుడవం
డనరాని పలుకులనండు హానికరంబుల్
పను లెవ్వి చేయఁ డెప్పుడు
నినుఁ బోటికి వీనిజోలి నెఱి యున్నదొకో !

పామరుఁడు తన్నె ఘనునిగ
నేమెయిఁ దలపోసికొంచు నితరుల నెల్లన్

సామాన్యులట్లు చూచుట
సామాన్యంబయ్యె జగతి జ్ఞానము లేమిన్.

జ్ఞానాత్ముఁ డెవ్వఁ డైనను
వానికిఁ గులగోత్రములకు బంధము లే దీ
మానిత ధర్మము నెఱుఁగక
పూనితి విటు కూ్రర కర్మమును సలుపంగన్.

కనుదెఱచి యింక నైనను
జనులందఱు నొక్కఁడఁ నెడు జ్ఞానముతోడన్
మనుమీ యర్చక ! వ్యర్థపు
టనుమానము పెట్టికొనిన నఘమొందెదుసూ.

నావాక్కులు వేదంబులు
గేవలముగ నంచు నెంచి కీన యసూయన్
నీవెప్పు డెవరియందును
నేవలనను జూపకుండ నెసఁగుము విప్రా !

చీమ మొదలుకొని యమర జ్యేష్ఠుదాఁక
నెల్లజీవులు మత్కళ వల్లఁబుట్టె
సత్య మియ్యది గ్రహియింపఁ జాలి తేని
మోక్షమార్గాన నీవును బోఁగలావు.

మూఢాచారపరాయణత్వమున నోపూజారి! నాభక్తు నిన్
గాఢప్రేమ మయాత్ము నిన్ కినుకమైఁ గాదంచు పోఁద్రోలి తీ
బౌఢాజ్ఞానఫలంబు నీవ కుడువన్ బైవచ్చు జన్మంబులో
గూఢాంఘ్రిఘోశ విభూషిభక్తి లోలఁగన్ గూడొందు పాషండతన్.

'నాస్తికులు నీకుఁ దోడుగ
నాస్తిక్యము తొఱఁగి జనములందఱితోడన్
నాస్తికవాదము సలుపుచు
శస్త్రేతర బుద్ధితోడఁ జరియింపు మనన్.'

పాఱుఁడు గడగడవణఁకుచు
గాఱఁగ మేనెల్ల నడికి ఘర్మజలంబుల్;
ఆఱని దుఃఖము తోడుత
నాఱడి తన జన్మమనుచు నసురుసు రవుచున్.

బామాలుచు బ్రతిమాలుచుఁ
కామితమందారు చరణకంజాతములన్
మోమును జేర్చుచు నార్చుచు
క్షేమం బొడఁగూర్చుమనుచు సిడిముడిపడుచున్.

వెఱ్ఱిచూపులు చూచుచు వెగచి వెగచి
బాపురని యేడ్వఁ బార్వతీ వల్లభుండు
చిత్తమునయందుఁ బ్రేముడి యుత్తమిల్లు
నర్చకునిఁగాంచి యిట్లని యానతిచ్చె.

ఓయీ! యర్చక! జాతినీతి గమనం బూహించితే లెస్సగా
మాయం జేసితె నీదుగర్వమును సమ్మాన్యార్యుఁగా నెంచితే
నా యీబత్తుని జ్ఞాననేత్ర మిపుడేఁన్ గాన్పించునే నీకు సా
నూయాభావము విచ్చిపుచ్చితె సుధీస్తోమంబు లగ్గింపఁగా.

నావుడు నీశ్వరార్చకుఁడు నాన మొగంబునయందుఁదోఁపఁగా
భావజవైరి భావమును భావమునం దలపోసి వెంటనే

పావనుఁడైన మాలపదపద్మములం దలమోపి మ్రొక్కఁగన్
పూవులవాన దేవతలు బోరన గుర్సిరి హర్షితాత్ములై.

ఆడిరి యచ్చర లేఁటులు
పాడిరి గంధర్వ వితతి బహుభంగులుగా
బాడబుని చిత్తశుద్ధికి
పోఁడిగ మది మెచ్చుకొనుచు పొంగుచు నింగిన్.

పాదముల వ్రాలియుండిన
భూదేవత లేవనెత్తి మ్రొక్కుచు బత్తుం
డాదర మేదుర వాక్కుల
నాదుదోసఁగున్నెఁపవే యనంగా నతఁడున్.

నీవలన దోసమున్న దె?
నావంటి యభాగ్య విప్రు నినిచిన యొరిమన్
గావంగఁగంటి వీశ్వర
సేవాహేవాక మధుర చిత్తముతోడన్.

అనవుడు బత్తుఁడీశ్వరుని యంఘ్రులకుం దలవంచి మ్రొక్కి యో
యనఘ! కృపామయాత్మక నిరంతరముం దమ సేవచేయుచే
పనిగ దినంబులంగడుపు బాపనసామిని నాస్తికుండుగా
జననము చెందుమం చిడిన శాపము త్రిప్పి యనుగ్రహింపవే.

నాకోరు వరములింతయ
కాకోదర భూషితాంగ! కావంగదవే
నావలెను విప్రుఁగూడను;
నా విని నగి యనియె శైవనాథుఁడు కరుణన్.

మెచ్చితి నీదు వాక్కులకు మేలొనఁగూర్చెద బాపనయ్యకున్
వచ్చెడు జన్మమం దితఁడు వ్రాయుచు నాస్తిక పుస్తకాలు రో
వచ్చెడు దారిలేక పనిపాటులు చేయఁగశక్తిలేక మీా
యిచ్చెడు బత్తెముంగొని క్రయించుత రోజులు కూటిపేదయై.

ఇటులొక కొన్నినాళ్ళు గతియించిన పిమ్మట నాస్తికత్వమున్
కటుకున విడ్చిపుచ్చు నొకతాపసి బోధలఁజేసి యంతటన్
కుటిలుల కందరాని ననుఁగూడు భవాంబుధి నుత్తరించి; నీ
కిట నిపుడే లభించుత సమీడిత దివ్యకళానుభావముల్.

అని యాగోసఁగి బత్తునిన్ శివుఁడు గాఢాశ్లేషముంచేయ, నా
తని నెమ్మేన ధగద్ధగాయిత మహోద్యత్కాంతి పుంజంబు సం
జననంబై నగజామనోహరునిలో సంశ్లిష్టమయ్యెన్ ద్విజ
న్మునిమేనన్ బులకల్ జనింపఁ గనులన్ మోదాశ్రువుల్ జాఱఁగన్.

పరుషవచనదూరా భవ్యకావ్యోపహారా!
సరళహృదయగమ్యా సారసౌహార్దరమ్యా!
సరసజనవరేణ్యా సన్నుతాఁగణ్యపుణ్యా!
వరకవిహితకారీ బాధలోపకారీ!

# కవిత్రయావేదన

అభ్రంవిహేందు సన్నిభ
శుభ్రయశస్వీ! యఖండశుభదమనిస్వీ!
విభ్రాడ్గుణ! కావ్యకాళా
దభ్రచణా! రామకృష్ణ! ధార్మికతృష్ణా!

నిండుమనంబు నవ్యనవనీతసమంబుగఁ గావ్యకల్పనా
ఖండతపోవిభూతిమెయిఁ గాల్పనికంబులు బౌద్ధ జైన దు
ర్మండలిబోధముల్ దెగడి వ్రాసితిఁ బంచమవేద మంచు రా
ణ్మండలి దండిగాఁ బొగడ మానిత భారత సంహితార్థమున్.

ఉదయాస్తాచల సేతుశీతనగమధ్యోర్వీపతుల్ తారు నా
పదలాలిత్యసమాసశయ్యల కపూర్వానందముం జెందుచున్
మద మాతంగ తురంగ కాంచనలసన్మాణిక్య గాణిక్య సం
పద లోలిం గొని తెచ్చి యిచ్చి ముదమొప్పం గాంచి లాలింపరే!

సారమతిం గవీంద్రులు ప్రసన్నకథాకలితార్థయుక్తిసో
నా రచియించినట్టి సుగుణంబుల నింబు వహించు శ్రీమహా
భారతసంహితారచన బంధురతం గని పిచ్చలించి నా
నారుచి రార్థసూక్తినిధి నన్నయభట్టని ప్రస్తుతించి రా

తీరులు తియ్యముల్ తెలియు ధీరులు మీరలు గారవించి మీ
మీ రచితాంధ్రభారతసమీకృతసూక్తుల రక్తిఁ గూర్చి పెం
పారెడు భావముల్ గురిసి యక్షరరమ్యత చూపి శేషుమై
నారహి నేటియాంధ్రకవులందు నొకింతయు లేదు నేనియున్.

ఎయ్యెనొక్కఁడు నాదు మీఁదుకవితా హేరాళధారాగతుల్
అయ్యోతావులఁ జూపి యేపు గన నయ్యర్థం బపార్థంబుగాఁ
జెయ్యయ్యల్ తలపోసి రోసి తుద కేవే నీచతామూలముల్
కొయ్యల్ పోని విమర్శలేశములు గైకోల్ లేక కావిం త్రిసీ!

భారతభారతీశుభగభస్తిచయంబునఁ జేసి ఘోరసం
సారవికారసంతమస జాలవిజృంభము వాపి సూరిచే
తోరుచిరార్థబోధనరతుం డగు నాదు కవిత్వసంపదన్
బోరునఁ దోఁచిరా జనెషు మోఱకులం గుఱి చేమి చెప్పుదున్.

బహువనపాదపాబ్ధికుల పర్వతపూర్ణ సరస్సరస్వతీ
సహితమహామహీతల మజస్రసహస్రఫణీందుచాడ్పునన్
బహువిధ భావచిత్రము లపారముగాఁ గనుపర్చి వర్ణనల్
అహహా! పొనర్చ వానిఁ గని వ్యాఖ్య లొనర్చెడ యొక్కఁ
డేనియున్.

దేవ మనుష్యలోకములఁ ద్రిమ్మరి సద్విపులప్రపంచసం
భావితశక్తిఁ గూర్చుకొని భారతసంహిత యాంధ్రభాష మో
దావహ మౌనటుల్ గడఁగి తా రచియించినదాన నింతకున్
జీవము లుండె నాంధ్రి కను నీతిపరుం డొకఁడేని లేఁడుగా.

గోత్రమహామహీధర నికుంజములన్ విపినంబులన్ గురు
క్షేత్రమునం బ్రకామగతి ఖేలనఁ జేసి చరాచరాత్మకం
బై త్రయి సద్గుణార్థదము నై పెనుపొందెడు సృష్టిచిత్రముల్
పాత్రముగాఁ దలంచి మన భారతసంహితయందు నింప నా

సూత్రము లాత్మ కెక్కమి ససూయలు నూతనభావదూరముల్
గాత్రవిహీనముల్ తెనుఁగు కావ్యము లెన్నియొ నేఁడు పత్రికా

పాత్రములం బొనర్ప నవి వారనిశ్రద్ధఁ బఠించి యర్థ మే
మాత్రము గాని సిగ్గుపడి మార్పులుకన్ వదనంబు రాక మూ

ర్తిత్రయకావ్యతాగరిమ రీతులకంటెను గ్రొత్త లంచు వే
పత్రములన్ వెలార్చి యొక భావము నేవియు లేమి జన్మతా
పత్రయ మార్పమిన్ విసివి భాకకవిత్వము నాఁగ నెంతయో
యాత్రముతో వచించెదఁట యజ్వ! కనుంగొను వారిపోఁడిముల్.

స్థావర జంగమ ప్రవితతంబగు భూవలయంబు నెల్ల సం
భావితబుద్ధిఁ జేసి సమ భావులమై ప్రకృతి ప్రలీనతా
ప్లావితదృష్టిమైఁ బొగడి పాడిన పాటలు భారతంబునన్
లేవొకొ! ఖండకావ్యముల రీతులు గావొకొ యవ్వి నేఁడ యాం

ధ్రావనిఁ గ్రొత్తగా వెలసెనా యివి యింతకు సంస్కృతాంధ్రభా
షావర కావ్యభావముల ఛాయలనేని మెఱుంగనట్టిరా
భావకవిత్వ తత్త్వపరి భావిత బుద్ధులు లక్ష్యలక్షణా
భావులు కేవల శ్రవణ భారకరంబులు విప్పి చెప్పఁగా

నేవియు నేని లేని రసహీనపదంబుల నేర్చి కూర్చి యే
వేవొ వచింపఁబూని తుద కేమియుఁ జెప్పఁగ నోరు రాని గో
దావరితుంగ భంగములఁ దారసిలంగల ఘుంఘుమార్భటీ
పావని సర్వశాస్త్రగుణ భాసిత సంహిత భారతంబు లో
పావహమైన దానిగఁ గటా తలపోయుదు రేమి చిత్రమో!

కాదన కిట్టిపాటి యపకావ్యవిభావకవిత్వవేదు ల
త్యాదర మొప్పఁ జేయునవియా నని పత్రిక లాదరింప ను
ర్వీధవు లాఁగమిం బ్రబలి వీరత శూరత మాపి భారతా
పాదితధర్మముల్ తెగడఁ బాల్పడుచున్నవిగాదె మిత్త్రముల్.

ప్రిల్లదురైన యిట్టి గతభావులు చేసినదాన భారతం
బెల్లను దూషితం బగుట యేమి యపూర్వము తిక్కయజ్వ! వా
జ్మల్లుఁడ! శంభుదాస! చెపుమా! యెదిమార్గమొ పాత్రకృతనాంధ్రమే
యెల్లెడ సుస్థిరంబగుచు నేపును గోపును జూపఁజాలఁగన్.

ఊరు మనంతవారి బలి యుండ్రిముకా తలపోసి తమ్ముఁ దా
ముఱవు దొఱంగిమెచ్చుకొను చుందురు మందులు సత్కవిత్వమే
యెఱఁగిరయేని యిట్లు రసహీనదురంత విభావకావ్యముల్
వెఱవక వ్రాయఁబూనుదురొ వేఱెమిపాటొదవం గుమారకుల్.

యతులుం బ్రాసము లుండిన,
గతికిని లోపంబు లొదవఁ గలవటె యిఁక ని
ర్యతిప్రాసముగ రస మొలుకఁ
గత లల్లెదరట్టి భావకవు లెల్లెడలన్.

శ్రవణ సుఖంబుగా సామగానంబులు
చదివెడు శుకముల చదువుఁ దగిలి
యాజ్యహవిర్ధృతపూజ్య సౌరభ ధూమ
వల్లి కాతతుల రూపముల నెఱిఁగి
చూచి యూఱడలేమి నేచి తనర్చి త
లిర్చిన క్రోవుల లీసతఁగని
యతిరుచిరాగతమైన శీతలవాత
పోతము లొగి పోడుముట్ట నాని
మనము సలిపిన సృష్టివర్ణనముపట్ల
వళులు గణములును రసప్రవాహమునకు
నేమి యడ్డులు గూర్చెనో యెఱుఁగ మైతి
మనుడుఁ గొండొక నేపు తా నట్టు చూచి.

చిడిముడిపడి యప్పలుకుల
కెడఁగల కోపంబు నాఁగ కెద్దెడు కవితా
జడమతి తిక్కన వలికెన్
నడయాడుమ గఁటిమి తొరను నన్నయభట్టున్.

భవదాజ్ఞాదృఢబంధ సంయమిత శుంభద్వేగమై కాక నేఁ
డవలీలం దమతిక్కనద్విపము క్రోధావేశదుర్దాంతద
ర్పవిలాసోద్భటభంగి నేపడరి దుర్భావాంబుజశ్రేణిఁ జి
క్కువడం జేయదె? యొక్క వ్రేల్మిడిన మీకున్ వేడ్క సంధి
ల్లఁగన్.

ధర్మనిరూపకత్వమునఁ దత్త్వవిధిన్ మహనీయవృత్తి స
త్కర్మవిధిజ్ఞతం జతురతామహిమన్ దృఢబుద్ధి నెందు నీ
పేర్మికి నీడు రాఁగల కవిం గనఁ జాలమ కాన నన్నియా!
దుర్మతు లాడిపోయు ఘనదూషణముల్ సహియింప నేర్తునే?

ధర్మతత్త్వజ్ఞులు ధర్మశాస్త్రం బని
యధ్యాత్మవిదులు వేదాంత మనియు
నీతివిచక్షణుల్ నీతిశాస్త్రం బని
కవివృషభులు మహాకావ్యమనియు
లాక్షణికులు సర్వలక్ష్యసంగ్రహ మని
యైతిహాసికు లితిహాస మనియుఁ
బరమపౌరాణికుల్ బహుపురాణసముచ్చ
యం బని మహిఁ గొనియాడుచుండ
వివిధ వేదతత్త్వవేదివి నీ వ్రాసి
నట్టి భారతంబునందుఁ గొంత

లేమి కలుగు నెఱుక లేమిఁ బెఱలు నోరి
కొలఁదు లాడిపోసికొండ్రు గాక.

ఇంతకు నేర్చునీకు నొక యింతటిలోన మదీయవాణి న
త్యంతవిభూతిఁ బెంపెసఁగునట్టి నిన్నుం గొనియాడఁ జేత దా
నెంతటిపెద్ద నీకరుణనిట్లు పదస్థుఁడ నైతి నింక దు
ర్దాంతవిభావకావ్యములఁ దార్కొని రూపఱఁజేయ నొప్పదే.

తెల్లంబు గాదె మీకెల్లను గుకవులు
సేసెడు కుటిల విచేష్టితమ్ము
లకట నాతో మీరు నాంధ్రీన నిడుమలఁ
బొందితి రొకభంగిఁ బోయెఁ గాల
మిది భావకవికాల మిట మన కజ్ఞాత
వాసంబు సలుపంగవలయు నోటు
గావరుల్ దెలుఁగును గేవలక్రోధులై
చెఱుపన వేతురు చెలసి కాన
వారిజృంభణమ్ము వారింపవలయు న
ట్లగుట మమ్ము నింక నతిపవిత్ర
వృత్తిమై నిరస్తవిఘ్నులరై చరి
యింపుఁ డని యనుగ్రహింపవలయు.

ఒకనాఁడే మన మాపద
లకు విడుమరగాంచి సుకవులం జుట్టలఁ బె
ట్టుకొని సుఖ ముండఁ బడయుదు
మొకొ [illegible]

నిషధాద్రియం దనిమిషపతి ప్రచ్ఛన్న
సంచరణమున వర్తించినట్టు
లదితిగర్భంబున నవతారమై ; వామ
నాకారమున హరి యడఁగినట్లు
జననియూరుప్రదేశంబున నతినిగూ
ఢంబుగ నౌర్వుండు డాఁగినట్లు
ధేనుశరీరవిలీనుఁడై యజ్ఞాత
చర్య మార్తాండుండు సలిపినట్లు
మనము నణఁగిమణఁగి మలయాద్రి వసియించి
తమకు నగ్గమైనతఱి జయింపఁ
గడఁగుద మొక్కొ యెదియొ నోడువుఁడ యట్టుల
సలుపుదము పదపడి కలఁగ నేల.

కలపంబు లభినవ గంధంబులుగఁ గూర్చి
తనువుల నలఁదెడు ననువు వోయె
మృగమదపంకంబు మృదువుగా సారించి
తిలకంబు దిద్దెడు చెలువు సనియెఁ
బువ్వులు బహువిధంబులఁ గట్టి ముడి కొక్క
గతి నిడునెత్తులు గడచి వెడలె
హారముల్ మెఱయ నొయ్యారంబుగాఁ దాల్చు
నందంబు వింతగా నరిగెఁ దిరిగి
వివిధ శిల్పములఁ బ్రవీణుల మగు తేమ
వలయు పనులవెంట మెలఁగ నేర్చు
కవులు తెలుఁగుసీమఁ గలుగకుండుటఁ జేసి
శబ్దశాసన! విను శంభుదాస!

ఎండకు వాన కోర్చి తనయిల్లు పరీవాసపుంజోటు నాక యా
కొందు నలంగుమున్ నిదురకుం దటి తప్పెడు డప్పి వుట్టె నో
క్కండన యెట్లొకో యనక కల్పనచేసితి భారతంబు నా
పండినపంట నేటికి నభావకపీశులచేతం జెల్లెడిన్.

దప్పులం జూచి మన్మవసుధాపతి యీ చనుదెంచుచున్నవాం
డెవ్వరు? తిక్కయజ్వయొకొ యెంతయు వేగయితోంచె నిట్లితం
డివ్విధిం జిక్కెనే? జగములెల్లను నేలంగంజాలు తేజ మా
ముప్పురతోడి జోడియగుమూర్తియిటేలొకొ విన్నంబోయెడిన్.

"నృపనయవిద్యకుం దగిననేర్పలవడ్డవలంతి వింత యే
వపుంగయితన్ వచింపం జనువారల నెద్దగలేవా తిక్కనా
ర్య! పరులసంగతిం దుద కరాతినిరాసనకృత్య మింతగాం
జెపుమ తొంటంగితొక్కొ" యను శ్రీమనుభూపతి కేమివల్కుదున్.

కరచరణాద్యంగకంబు లేలొకొ రత్న
భూషణపరికరంబు పొందు తొఱంగె
నుభయపార్శ్వంబుల నిభఘట లేలొకో
చనుదేవు సమదాళిసమితి మెఱయం
బాయు తొఱంగు మంచాయత వేత్రహ
స్తుల మొత్త మేలొకో తోడరాదు
ధవళాతపత్రముల్ దఱచుగా నేలొకో
పట్టరు మౌక్తికప్రభలు వెలుంగ
మీదు మూర్తిత్రయమునకు మిగుల నేడు
వేగి దేశవిశాలసద్వీథులందుం
జెప్పు మను మన్మసిద్ధికి శీర్ష మెత్తి
బదులు వలుకంగ రాకుండె వదనమార!

పఱమెయిల్ గప్పినఁ బాడఱి నునుఁగాంతి
గదలిన యమృతాంశు కళయుఁ బోలెఁ
బెనుమంచు మీఁద బర్విన వికాసము దప్పి
చెలువు గుందిన సరోజిని విధమున
ధూమంబు వొదలినఁ దుఱఁగలి మెఱుఁగులు
నలఁగి మాసిన దీపకళిక పగిది
ధూళి పైఁ బొరసినఁ దొంగలించుట మాని
లావణ్య మెడలిన లతికభంగి
నుజ్వలత్వంబు మఱుపడి యున్న తెలుఁగు
బాస తెఱవ తెఱఁగు గనఁ బగులువాఱ
కెటులఁ జెలులార! మన వగు నెడఁద లుండు
నార! వింత లెంతలు గనినార మిపుడు.

వెఱవకు మనువారు వెలయమి నెదఁ గలు
షించిన నొండొండ చెమట వొడమ
ననుచితకృత్యంబు లొనరించు కుకవుల
బలిమికి నివ్వెఱపాటు దోఁప
నెచ్చట దిక్కు లే రెవ్వరు నా కను
భయమున మేనఁ గంపంబు వుట్టఁ
జేయఁగ నేమి యుపాయంబు లేమి నా
ననమున వెల్లఁదనంబు గదుర
నున్న యాంధ్రిని గనుఁగొన నన్నలార!
కడుపు లగులవొ భావముల్ కలఁత గనవొ
గ్రిక్కురాదొకొ దినఁబోవఁ గడియుఁ గూర
యేమి పలుకుదు నల్లవొ మెఱుఁగఁ జెపుఁడ!

నెత్తమ్మిరేకుల మెత్తఁదనము దెచ్చి
యచ్చునఁ బెట్టినట్లందమొంది
చక్రవాకంబుల చందంబు గొనివచ్చి
కుప్పలు సేసినట్లొప్పు మెఱసి
చందురునునుఁగాంతికం దేర్చి కూర్చి బా
గునకుఁ దెచ్చినయట్లు గొమరు మిగిలి
యళికులంబుల కప్పు గలయంతయును బుచ్చి
నాఱు వోసినభంగి నవక మెక్కి
యంఘ్రితలములుఁ గుచములు నాననంబు
గచభరంబును నిట్లున్న రుచిరమూర్తి
కెల్లు త్రిప్పులు గలిగెనో యిన్నినాళ్ళ
కెఱుఁగ శక్యమె నన్నయా! యేరికేని.

ఎలదీఁగఁ గప్పిన లలితపరాగంబు
క్రియ మేన మేదినీరేణు వొప్పఁ
జంపకంబున నవసౌరభం బెసఁగెడు
కరణి నాసిక వేఁడిగాడ్పు నిగుడఁ
దోయజదళముల తుది మంచు దొరఁగెడు
గతిఁ గన్నుఁగవ నశ్రుకణము లురల
నిందుబింబముమీఁది కందుచందంబునఁ
గురులు నెమ్మొగమున నెరసియుండ
అఖిల కవివంద్య శ్రీభారతాంధ్రవనిత
లక్ష్యలక్షణశూన్యుల వ్రాఁతఁ జేసి
తనకుఁ గలిగిన నెగులున దైన్య మొంది
యెటుల నున్నదొ చూడుఁడీ చటులమతులు.

క్రోధం బ్రతిరోధమై హృదయముం గుందింప నత్యంతచిం
తాధూతాత్ముఁడనైన నాకుఁ బరమోత్పాతంబు సంధిల్ల దు
స్సాధంబైన విరుద్ధకావ్యతతి నే సాఁగింపఁగా సంఘటిం
త్రే ధృష్టాత్ములు తమ్ము నెవ్వ రిఁక సాధింపంగఁ దా నల్పమే.

అవనీచక్రము సంచలింపఁగ దివంబల్లాడ నాశాచయం
బవధూతంబుగ గోత్రశైలనికరం బాకంపముం బొంద న
ర్ణవముల్ ఘూర్ణనమొందఁ గ్రోధముగ్ర తార్థత్వంబునోలదించి చి
త్రవిధిప్రౌఢివహించి కాకవులకాద్రం బేర్పడం ద్రోయుదున్.

దుర్వారోద్యమకావ్య విక్రమ రసాస్త్రాక ప్రతాపస్ఫుర
ద్గర్వాంధప్రతివీర నిర్మథన విద్యాపారగుల్ సత్కవుల్
గీర్వాణాంధ్రికవిత్వదూరు లగుతత్కింకావ్యనిర్మాతలన్
వేర్వేర్పట్టి జయింపఁజాలరొకో గర్వీభూతచేతస్కులన్.

అజ్ఞులు కొంద ఱిప్పు డపహాసము చేయుచు భారతంబు భా
షాజ్ఞత లేమి నెవ్వియొ విచారవిదూరవిమర్శలేశముల్
ప్రాజ్ఞులు నవ్వఁ జేయుటకుఁ బొల్పడుచుండ సహించియుందుమే
ప్రజ్ఞలు సూపి వారిపని పట్టక ముట్టక మిన్ను వ్రేల్మిడిన్.

పెట్టనికోట గాఁడె కవిభీముఁడు చోళుఁడు నాంధ్రభాషయం
దొట్టినమంట, యాకొలఁది యోధుల భాస్కరసోమనాధులుం
జుట్టపుమేరు వగ్రపద శోభితుఁ డా కవిరాజు నిన్ను ని
ట్ట ట్టనవచ్చునే సురలకైనను నొల్లవుగాక చివ్వకున్.

ఘనుఁ గులబ్రాహ్మణు ననురక్తు నవిరళ
జప హోమ తత్పరు విసులశీలు

శాసను సంహితాభ్యాసుఁ బ్రహ్మాండాది
నానా పురాణ విజ్ఞాననిరతు
మిముఁ గేవలము పురాణమును లని తలంచి
కావలయు నిపు డభావకవులు
బాలకవులుఁ జనుఁబాలకవులు నాఁగ
నెందఱో వెలసి యాక్రందనంబు
చేయుచున్నారు క్రొంగ్రొత్త చేష్టితముల
మెలఁగుచున్నారు బాపురే మెడలు తిరిగి
నేల ప్రౌఢిఁ జూడంగక వినఁజాలనట్టి
కుత్సిత సుద్దులవ త్తిరికల్ చిమ్ముకొనుచు.

నన్నియ నిన్నుఁదొట్టి కవన మ్మొనరించిన యట్టి రెందఱో
యున్నను వారు వేరు మన మొప్పుఁగఁ జేసిన భారతంబు సం
పన్నగృహస్థులట్లు సమభావతఁ జూచిరి గాని యింతలే
సెన్నఁడుఁ బన్నుకోఁగనము యేవప్పఁజేశలకైత లల్లుటల్.

జ్ఞానానందమయ స్వరూపుఁడు కవీ శానుండు పోతన్నయున్
మాణిక్యాంబరభూషితాంగుఁడు ప్రజామాన్యుండు శ్రీనాథుఁడున్
నానాసూనవితాన వాసనల నానందించు నా మూర్తియున్
వాణీహస్తసరోజ లాలితసుధా వాగ్ధారి వీరన్నయున్.

భూనాథాళి శిరోమణీకృత కళాపూర్ణుండు సూరన్నయున్
ఆనందానుభవంబె బ్రహ్మమని వ్యాహారించు పెద్దన్నయున్
ఆనేయం బని భారతంబు తమ విద్యాసైన్య ప్రశిప్రౌఢిమన్
బూనం జాలరొ తెలుసేయ నిపు డీనూతన్నాంధ్రసూర్యాళినాన్.

అనువాదం బన మూలభారత కథావ్యాఖ్యానమాత్రంబుగాఁ
బొనుపారన్ వలెఁగాని నీరసకథా పుంజంబె చందంబుగాఁ
బొనరింపం బని పూనుటొక్కొ జబిరే! పుంభావవాగ్దేవతల్
గన నిన్నాళ్ళకు భారతంబు తెనుఁగుం గావించి రున్నట్టుగా.

పద్యమో గద్యమో భావింపఁగా రాని
పోల్కి వ్రాసిన వ్యాసమూర్తి శాస్త్రి
మన వృత్తములు మార్చికొని భావములు దీసి
పోసిన శ్రీ కృష్ణమూర్తిశాస్త్రి
సంస్కృతాంధ్రమ్ముల సామాన్యులై నట్టి
పండితులను దన పజ్జ నునిచి
కొని యర్థ మవ్వారిఁ గొసరి యెఱిఁగికొని
పర్వముల్ రెంటి నఖర్వగర్వ
మ తనమతము కాఁ దెనుఁగున మరల వ్రాయ
మిణికిన మహాకవి యల లక్ష్మినృసింహా
రావు పాటియైనను మన తెలియుమునందు
నొకఁడు ననువాద మొనరింప నోపఁడొక్కొ.

వ్యాసునకుఁగూడ సంస్కృతభాష గఱపఁ
జాలెడుమనీషియు నధీత శాస్త్రచయుఁడు
వ్యాసమూర్తిశాస్త్రి మనదు భారతంబు
షట్కృతుదముట్ట వ్రాసిన పరిఢవిల్లు.

కాని లేనిపోనట్టి యజ్ఞానమున ము
నింగి తెలుఁగుకయితకై కడంగె మిగిలి
పొలుచుతనకీర్తి బూదిలోఁ గలిపికొనియె
ఛాందసుని కేల [illegible]

వేదము వేంకటరాయుని
మాదిరిగఁ బురాణపండ మల్లయవలెఁ దా
నేదే నొకకావ్యమునకుఁ
గాదో వ్యాఖ్యను బొనరుపఁగా వ్యాసులకున్.

తాము కవిరాజుఁ గవిసార్వభౌము లౌటఁ
స్కాందమునయందు మిగిలిన ఖండములకు
దెనుఁగు వొనరించి శ్రీనాథు తీరు చాటి
యొసఁగి యుండిన నెట్లుండుఁ గృష్ణమూర్తి.

ఒండొరు మీఱుకోర్కె మెయినొక్కటవ్రాసినవాఁడుగాఁడ య
ద్దండుఁడు కృష్ణమూర్తి కడఁ దాఁకెడులో మన మాడకాడకుం
గొండొక విడ్చిపుచ్చిన యకుంఠితభారతగాథ లన్నియున్
గం డమరన్ రచించి చెలికాఁడయి మీఱఁగ నెంచియేసుఁడీ

ఐనను లాభ మేమి? తిరమై మనభారతకల్పకంబు వే
ళ్ళూనఁగ నాంధ్రభూమి నదియుం గదలింపఁగలావు కాకవుల్
పూనఁగ నెంచి యత్నము లపూర్వముగాఁ బొనరించుపట్ల ద
బూనికమై రచించెఁ దుది ముట్టఁగఁ గ్రమ్మఱ భారతంబునే.

చండతరమారుతాహతి క్ష్మాధరముల
యొగిరి చనుచుండఁ దక్కిన నెంచ నేల?
యైన రాటుపోటుల కాఁగి యసము గొనిన
కృష్ణమూర్తిశాస్త్రి యవుఁజూ యేడుగడయ.

సర్వస్వమ్మును భారతాంధ్రరచనా సంసారభారార్థమై
నిర్వాణం బొనరించుకొన్న కవితా నిర్భీకసంచారుఁ డా
యుర్వీదేవకులాబ్ధిరత్నమునవీనోద్భూతగాత్రమ్యాంధ్రముం
బరఁగన్నిక యెదుర్చకున్నఁ దెలుఁగీపాటేనియున్ నిల్చునే.

ముఱిముఱి చీఁకటి తెలుఁగది
యఱిముఱి యపరంగనీక యని సేయంగా
నెఱిమగఁటిమి నిలునంబడి
కిఱుకులు వసు కృష్ణమూర్తికి నొరుసు లీడే.

లక్ష్మమ్మన్ మఱి లక్ష్యముం బెఱిఁగఁ దాఁ
బ్రార్థించి స్వార్థంబుగా
సూక్ష్మగ్రాహియపోలెఁ గైకొని మహా
సూయన్ హృదిం దాల్చి వా
గ్లక్ష్మీవంతు ననున్ విమర్శ సలుపన్
వ్రాసెంగదే 'భారతిన్'
లక్ష్మీపూర్వనృసింహుఁ డౌర! యది యా
రం గానరే మీరలున్.

బాహాబల్ద్రిప్పుచుఁ దిక్కయజ్వ చెఱచెం బాత్రౌచితిం దాను; నే
నోహోహో యన వ్రాసినాఁడను విరాటోద్యోగపర్వంబులం
చీహన్ 'భారతి'లోన వ్రాసిన మహా హీనప్రలాపాత్మునిన్
సాహిత్యార్థవిదూరుని జ్జెనకువా క్సారం బసల్పంబకా.

వివిధోపాయపరాయణుండు రిపుదోర్వీర్యాపహారక్రియా
ప్రవణోద్యోగుఁడు కావ్యరక్షణకళాప్రావీణ్యగణ్యుండు ధై
ర్యవివేకాదిగుణోత్తరుం డఖిల విద్యాజాలసంవేది భూ
ధవుసేనాపతి తిక్కమంత్రికి నసాధ్యం బెద్దియుం గల్గునే.

ఒక్కొక చోఁ గడంగి ప్రతియోధులు మాఱ్కొనునప్పు డెక్కటిన్
నెక్కొని దుర్వివిమర్శముల నీఱొనరించి జగంబు లుబ్బఁ జే
రుక్కున లబ్ధలక్ష్మిఁ గపు లొక్కట మెచ్చఁగఁ జాటి [illegible]తకున్
మిక్కిలి పేరు కీరుతులు మేకొని గైకొనఁజాలు సన్నియా!

ఓట యొకింతయేనియు నయో నరసింహునియెడ్డ లేద; యే
మాటలఁ బోవునే దురభిమానము యెక్కుడు పూనుఁగాక; ర
చ్చోటన సంగరంబు లగు చోప్పులు పెక్కులు పుట్టుచుండఁగ
బోటున కియ్యకోల్ గొనమి పూరుషకారము గాద, నన్నియు

*   *   *   *   *

ఏ నిటు లంటి నా వలవ దింకను నీవును శంభుదాసుఁడుం
గా నుచితంబు సూచి మన కార్యము మీసుజనత్వముం జెడం
గా నొకభంగి సేయక తగం గవివర్గముతోడిసంధి మీ
కైన తెలుంగునన్ వలచి నట్టుల చేయుఁడు నేర్పు లేర్పడన్.

వరమునఁ బుట్టితిన్ భరత వంశము వ్రాసితి మీఱుచున్న భూ
వరునకు మంత్రినైతి జన వంద్యులఁ బొందితి నీతివిక్రమ
స్థిరులగు పుత్త్రిలం బడసితిన్ సహజన్ముల ప్రాపు గాంచితిన్
సరసకవీశ! యన్నిటఁ బ్రశస్తికి నెక్కినవాఁడ నెంతయున్.

నీవును మన్మసిద్ధి యిటు నెయ్యము గారవముం దలిర్ప సం
భావన సేయఁ బట్టినను భట్ట! యొకండు కవిత్వదూరుఁ డే
వేవో వినుర్యముల్ సలిపి యేవపుఁగూఁతల పాడుచేతలన్
వేవురుఁ జూడఁగా సభలఁ బెట్టె స్వతంత్రుఁడు దీని కోర్చునే?

ఈభారతము వట్టి యీడ్చినయాచేతి
వ్రాఁతలు తొలుతగాఁ బత్రికలను
గన నింతలింతలు తునియలై, చెదరి రూ
పఱియున్నఁ గని యుడుకాఱుఁగాక
యలుపాలఁ బొనుపడు నట్టిచిచ్చే యిది
పెనుపొందు నెట్లనఘునకవితఁ

శక్తియు మఱి యాంధ్రసఖుఁడు నన్నియశబ్ద
శాసనత్వమ్మును సాహసాంకుఁ
డనగు నాపటుత్వమును నన్నెచోడుని
ధీవిశాలతయును ధీరతయును
గాల్పనే చెనంటి కలముకడిఁదిపోటు
ల నణఁపకయ యున్న లావు మెఱయ.

నెట్టన యిట్టియల్క మది నిల్పితి రక్కసతాల్మిఁ జిచ్చొడిం
గట్టినయట్లు పెద్దయును గాలము దీనికి నాఱు పెన్నఁడుం
బుట్టదు దుర్విమర్శములు పొల్పఱఁగా నిలఁ గాచునట్టి తోఁ
బుట్టువు లీరుఁ దేజమునఁ బొల్చుచునుండఁగ నెఱ్ఱనార్యుఁడా!

* * * * *

నావుడు నెఱ్ఱాప్రగ్గడ
కేవలకోపమునఁ గన్నుఁగ్రేవల నిప్పుల్
వావిరి రాలఁగఁ బలికెడు
పావనుఁ డగు తిక్కయజ్వఁ బరికించి యనున్.

మ్రుచ్చిర నేలయేఁగలుగ మోదముమాలుచుఁదిక్కనార్యుఁడా!
వచ్చితిఁ దోడుగాఁగ జన వంద్యుఁడు నన్నియ యుండె నీడ నీ
మెచ్చుగ దుర్విమర్శకుల మేకొని తీర్చెదఁగాక వేఱొకం
డచ్చుపడంగ నేర్చునె మహాత్మ! తెఱంగు వహింపుమింకిటన్.

పొలుపరి ఘర్మబిందువులు పొడ్మఁగ నుండినయాంధ్రభీతిరు నీ
పలుకులకంటె ముంగలనె భావములం బరికించినార మా
వల రొజ్జఁగించెఁ దిర్పతియుఁ బాపము దాన గోడాలికుఱ్ఱఁడుం
[illegible] బోనిమునకావఁవిధాతకుఁ గర్త మానొకో.

భాగ్యంబు గదె రసభావుండు తిర్పతి
యాదిగాఁ గవిసమూహంబువలన
నెలమిఁ గృతార్థుఁ డై యేతెంచు టరయంగ
ధన్యుఁడ వైతి పుదారచరిత !
నీధర్మనిష్ఠయు నీతపంబును జూవె
యింతకుఁ గారణం బిద్ధచరిత !
రాజ్యంబుకంటెను బాణ్జ్యకవిత్వంబ
యిష్టమై పరఁగు నీ కెల్లనాఁడు
వేదవేదాంగవిదుఁడవు వివిధయజ్ఞ
కర్త వైతి ధనుర్వేదకర్మఠుఁడవు
ధరణి యెల్ల నేలెదుకావ్యధర్మ మసుర
సులభ మయ్యె నీ కిహపరశోభనములు.

దమమును సత్యశక్తియును ధైర్యనిరూఢియు నిత్యతృప్తియున్
శమమును నీకు నైజములు సన్మతి నర్థవశంబుఁ గామలో
భములును బొంద వట్లగుట భావుకకుంజర ! సత్కవీశనా
మమునఁద్రిలోకపూజ్యమహిమం బొగడొందెద విప్రిధంబునన్.

ఖ్యాతివ్యాజమునన్ సభాస్థలులఁ గింకావ్యాత్మకుండట్లు దు
ర్నీతింగూర్చి యొనర్చినట్టియఘముల్ నిష్కంపధైర్యోన్నమ
చ్చేతస్సారుఁడ వైననీ కొకనికిం జెల్లెన్ సహింపంగ వి
ఖ్యాతక్షాంతులు లేరె పండితులు నిక్కం బిట్టిరే యెవ్వరున్.

ఉల్లము సత్యసంయమము నూనినవాఁడవు నీవు విక్రమం
బొల్లమి గౌరవాధముల యుద్ధతి మైమెయిఁ జెల్లెఁగాక యొం
డెల్లను నేల నీమది నించుక కిన్క జనించినన్ మహీ
వల్లభ! యష్ట యూపఁబడె వారక వైరికులంబు సర్వమున్.

వినుతభవన్ని దేశ మను వేల యలంఘ్యము గాన నిమ్మెయిన్
ఘనభుజవీచివిభ్రమ వికాసముఁ జూపక నిల్చెఁగాక స
జ్జనసుత! చూడ నీ యనుజ సాగరముల్ దఱితోడ విద్విష
జ్జనలయకారులై కడఁగి సర్వజగంబుల నాక్రమింపవే!

ఏనును నన్ని పార్యులును నిక్క విముఖ్యులు నిష్ఠ లోకస
మ్మానితకావ్య! నీదయిన మంజులవాగమృతప్రవాహమున్
వీనుల దోయిలించుచును వేడుకఁ గ్రోలికొనంగ నాత్మలం
బూనెద మస్మదీప్సితము పూర్ణము సేయఁగ నర్హ మెమ్మెయిన్.

జనసుత! మీరు దివ్యులరు సమ్మతి దేశహితార్థ మిమ్మహిన్
జననము నొందినారలు ప్రశస్తపరాక్రమలీలఁ బేర్చి యిం
క నఖిలశత్రునిర్మథన కర్మ మొనర్చి మహీభరంబు దీ
ర్చి నియతిఁ బెక్కుజన్మములు సేసి సుతిం గనినట్టి రెంతయున్.

నీవ విధాత విందు్రిఁడవు నీవ సమస్తజనేశ్వరుండవున్
నీవ యశేషధర్మములు నీవ యెఱుంగుదు నిన్నుఁ బోలఁగా
నీవసుధాతలంబునఁ గవీశ్వరు లెవ్వరు లేరు సత్కవీ
శావలి యెప్డు నిన్నుఁ గొనియాడ బరిస్ఫుటవాక్యభంగులన్.

అతులితదక్షిణాన్వితమహాధ్వరసంఘము లీ వొనర్చుటం
జతురమనీషతాపరిచుర సౌఖ్యులు భూసురముఖ్యు లంచిత
వ్రతులు మహీపతుల్ సుగుణవశ్యులువైశ్యులుభక్తినిన్ను సం
తతమును గొల్తు రీక్షితి సుదాత్తకవిత్వవిభాసి వాటచేన్.

అక్కట లాఁతులైనఁ బగ రైనను ద్రోయన కోర నేల యొం
డొక్క తెఱంగు లేదె యిది యెప్పుదె? సూరికవీశబృందముల్

దిక్కఁడు లేద వేఱ గణుతింపర వానిని; నట్టివాని దూ
ఱెక్కొఁడువాని నెద్దుటకు నేలొకొ యీదురవస్థ తిక్కనా!

పగ యడఁగించు టెంతయు శుభం బది లెస్స యడంగునే పగం
బగ వగగొన్న మాక్కొఁనక పల్కక యుండఁగవచ్చునే కడుం
దెగ మొన లెత్తిపోవఁ బగ దీర్పఁగ వచ్చినఁ గార్య మొందు నే
మిగతిఁ దలంచినం బగకు మేలిమి లేమి ధ్రువంబు తిక్కనా!

మ మ్మెఱుఁగు దెదిరి నెఱుఁగుదు
నెమ్మి యెఱుఁగు దర్థస్థితి నెఱి యెఱుఁగుదు వా
క్యమ్ములపద్ధతి నెఱుఁగుదు
పా మ్మెవ్వఁడ నేను నీకు బుద్ధులు సెప్పన్.

*　　*　　*　　*　　*

అనవుడుఁ దిక్కయజ్వ తలయూరఁగ నూఁచి కలంత యూఁగి నె
మ్మనమునయందు నించుక సుమాళము నూని వచించె నిట్లుగా
ఘనతరకావ్యతాగరిమఁ గాలెదునోయనఘాత్ములార! మీ
యనుమతి మీఱ కే నడతు నైనను గొండొకఁ డాలకింపుఁడీ.

మన నోఁడికారపుఁదీరులు
మన జాతీయోక్తులనెఱి మనభావములున్
మన భాషావైచిత్ర్యము
మన శయ్యా ప్రసాదగుణము మంజులగతులున్.

ఊఁచముట్టుగ నెఱిఁగినయుక్తిది కయిత
గలుగు తిరుపతి వేంకట కవుల తీరు
నాటకముతోడఁ దృప్తి ఘనముగ నొంది
యుద్దవిడనైన మనమీఁదికొక్కఁ డెడను.

వారికి మించిన కవియా
తీరిచి యిటు నేత కితఁడు తెగుటకు మీరే
యారసి చెప్పుఁడ కొంకక
నోరికొలఁది లాడితి నని నొవ్వక మదులన్.

నా విని నన్నయభట్టను
నీ వాడిన తెఱఁ గది నిజ మింతకుఁ దిక్కా
ర్యా! వారక విను మొక్కఁడు
నావచియించెదు నిగూఢ నవ్యార్థంబున్.

ఎఱిఁగియు నెఱుఁగక చేసిన
తెఱఁగునకై యింతలేసి త్రెక్కొఁన నేలా
చిఱుచిఱు కయితలవారల
గుఱుతులు గ్రహియించి యూరకుండుము తిక్కా!

తద్విమర్శనమున కింత తడవ నేల?
యెట్లొ యాతఁడు తెలుఁగునం దింతమాత్ర
మైన శ్రమపడి గ్రామ్యత యంటనీక
వెలుఁగుచున్నాఁడు కానిమ్ము వెలుఁగనిమ్ము.

కడఁగి యొక్కపక్క గ్రామ్యవాదులతోడ
భావకవులు రేఁగి భారతంబు
పరువు పాడొనర్పఁ బరికించుచుండఁగా
భారతాంధ్రకర్తఁ బ్రామ నేల?

అన విని తిక్కన యిట్లనుఁ
[illegible]

అనఘా, నన్నియభట్టా!
విన చేఁదగు వ్రాఁతఁ గూర్చి వినిచెద వేలా!

గ్రామ్యభాషావాదకాముకుల్ వ్యావహా
రిక మగు తెలుఁగు నెఱుకకొలంది
వాడవచ్చు నటంచ్రు భారతంబునయందు
నే వాడినపదము లెల్ల వ్యావ
హారికబదముల యౌనో కావో యొకమా
టరిగి౧ రాయలసీమ కచట నేఁడు
జానపదులు గాదు జ్ఞానులుగూడ నే
నోడికారము గలిగి నోడువువారో
యరసియుండిరయేని యీయరసికతకు
నగ్గ మాడురె? సరకారు లందుఁ గోశ
మరయుపదములె మాసీమ యందు నెందు
నిత్యసంభాషణంబుల నెగడుచుండు.

సారెఁది సకలాంధ్ర మొకరీతి సూత్రిపట్టి
గ్రాంథికంబగు భాషగాఁ గ్రాలఁజేయ
స్థిరతఁ గాంచిన యాతొంటి తెలుఁగుబాస
గ్రామ్యతాదోషమున కొడిగట్టు నెట్లు?

గ్రామ్యవాదులకంటె జగంబునందు
భావకవు లుత్తమోత్తముల్ భారతాంధ్ర
భాషయే వారు వాడుచు వ్రాయుచుంట
ముద్దుముద్దైన చిన్నారి పొత్తములను.

---

౧. నెల్లూరు, గుంటూరు, కృష్ణాజిల్లాలుకూడ రాయలసీమలోనివిగ భాషా సామ్యమునుబట్టి గ్రహింపనది.

శివశంకరశాస్త్రిలవలె
నవనవభావములతోడ నానార్థదముల్
శివకరకావ్యము లల్లెడు
నవకవి నొక్కరునిఁ జూపు నన్నియభట్టా!

ఆతని భావాబ్ధిం బడి
యీఁతాలాడుటయ కాని యితరు లెవండ్రున్
బ్రాఁతి మెయి నతనికయితకు
బ్రాఁతిగ వ్రాయంగలారు భారతమూర్తీ!

రాయప్రోలు సుబ్బరావున కలవడ్డ
తెలుఁగు పలుకుబడులు కలిగెనొక్కొ
వ్రేలు మడిచి చూప వేరలకేనియు
నతని కతఁడ సాటి యన్నిగతుల.

తక్కుఁగల యభావకవులఁ దడవ నేల
ముంగురులుఁ గుప్పసంబుల పొడవుఁ గాంచి
కొని తమకును దామె పొగడి కొనుచు నుంట
యే ఘనతగ నెంచుకొనెడు హీనమతుల.

నా విని శబ్దశాస్త్ర వదనంబునఁ గొండొక లేఁతనవ్వు సం
భావనపూర్వమై వొలయఁబల్కె సుధామధురాంధ్రసూక్తులన్
భావుకవర్య! తిక్కన! స్వభావసుజన్య కళావిలాసు లా
పావనమూర్తి యుగ్మకము పాత్రిమ దీవెనసేయ నింతకున్.

కాని య దేమిపాపమొ యొకానొకఁడేనియు నేఁటిపత్రికా
నూనవిలేఖకోత్తములు నూతనభావకవీశులందులన్

మానితవాక్యపద్ధతియు మంజులశబ్దసుసౌష్ఠవంబునుం
బూనినవాఁడు లేఁడు రసపూరిత భారతభావసంపదన్.

రాజశేఖర కవిరాజు వ్రాసినట్టి
కావ్యమీమాంస మీ రెల్లఁ గాంచి రేని
కాదు విని రేని నెఱిమెచ్చి కవిత లింక
వ్రాయ కొకముాలఁ గూర్చుండ్రు పదిలముగను.

మోదముతోడ నద్ది విని మొక్కలుఁ డెట్టిన పల్కె నిట్టుల
త్యాదరవృత్తితో ననునయం బొనరించుచు వారితోడ; నా
హ్లాద మొనర్చునట్టిరు మహాకవు లెందఱో నేఁడు సత్యసం
వాదులు గల్గఁగా నిటు లవారణవాగ్రణ మేల నన్నియా!

వ్యాకరణజలధి భాష్యకారుఁడై కాఁడు
నన్నియభట్టునై వన్నె కెక్కు
వఝ్ఝలకులకంధి పద్మారి చిన్న సీ
తారామశాస్త్రిలు ధరణిఁ గలుగఁ
గింకవీంద్రఘటాళి కేసరియై పొల్చు
చళపిళ్ల వేంకటశాస్త్రి గలుగ
విద్వత్కవీంద్రుఁ డన్విఖ్యాతి గొనుచున్న
చర్ల నారాయణశాస్త్రి గలుగఁ
బ్రస్తుతకవిసార్వభౌముఁడై వెలుఁగొందు
శ్రీపాదకృష్ణమూర్తియును గలుగఁ
గవిశేఖరాఖ్యమై గాలకుఁడై క్రాలు
వసురాయ కవిమంత్రివరుఁడు గలుగఁ
జతురకవితావిచక్షణుఁడు పాజుండు

లక్ష్మీనృసింహమురారి గలుగ
నాంధ్రకావ్యాదర్శకాంకుఁ డవ్వారి సు
బ్రహ్మణ్యశాస్త్రి ప్రవరుఁడు గలుగ
నాంధ్రవాల్మీకిసీరంధ్రిభక్తివిభాసి
వావిల్కొలను సుబ్బరావు గలుగ
బ్రహ్మాండ మాదిగా బహుపురాణవిధాత
జనమంచి శేషాద్రిశర్మ గలుగ
సరససంగీతమధుర సత్కవిత్వాభి
సుభగుఁ డసంతకృష్ణుండు గలుగ
సకలకలానిధి జాతీయవాది మా
రేపల్లి రామశాస్త్రియును గలుగ
లలితసత్కవితావిలాసుండు ఘనయశ
శ్శోభియౌ జాషువాసుకవి గలుగ
నవకావ్యవిరచనానందుం డనంతపం
తుల రామలింగబుధుండు గలుగ
మంజులసుకవితా రంజకులైన వేం
కటపార్వతీశ్వర కవులు గలుగఁ
నీభక్తియుక్తిమై నెగడెడు పింగళి
లక్ష్మీకాంతకవితిలకము గలుగ
పౌలస్త్యహృదయప్రవక్తయౌ కాటూరి
వేంకటేశ్వరరావు వెలుఁగుచుండ
విశ్వనాథకులుండు పృథుకవి సమారిట్టు
సత్యనారాయణ సరసుఁడడర
అప్పకవీయంపు వ్యాఖ్యాత వేదుల
రామశాస్త్రీందుద్రిండు గ్రాలుచుండ

అభినవతిక్కనవై మించుచున్న సీ
తారామమూర్తితోఁ దనరుచుండ
శివభారతమ్ము వ్రాసిన గడియారము
వేంకటశేషకవీంద్రుఁ డెసఁగ
విఖ్యాత కృతికర్త వెంపరాలాన్వయ
సూర్యనారాయణ సూరివరుల
కవికోకిలఖ్యాతిగాంచిన దువ్వూరి
రామిరెడ్డ్యాఖ్యుండు గ్రాలుచుండ
కరుణశ్రీ కృతికర్తగా ఖ్యాతిగాంచెడు
జంధ్యాల పాపయశాస్త్రి గలుగ
కంబరామాయణకర్త పూతలపట్టు
శ్రీరామరెడ్డియుఁ జెలఁగుచుండ

గాకవిత్వంబు మఱియు నాగ్రామ్యభాష
యడరు నేరీతి నెల్లెడ నాంధ్రభూమి
నెఱుఁగవో యీవు తిక్కార్య యింతమాత్ర
మేమిటికిఁ గలఁతగొనఁగ నెడఁద బెడఁద.

అక్కరణి నెట్టుఁ డాడిన
చక్కనివాక్కులకుఁ దిక్కసచివుం డనియెన్
నిక్కము యెట్టిన నీపలు;
కొక్కటి వినవోయి నాదునుబుసు కుమారా!

భారతోదిత ధర్మముల్ బాదుకొలుప
భవ్యవాక్సుధను నిరుద్ధ భారతమునఁ
జిలికి గ్రాంథికకవిత స్వజీవనముగ
నడరు వేంకటశర్మ పోతన్న లేఁడా!

నా కవిత్వంపుఁ దెన్నుల నంత శ్రద్ధ
నెఱిఁగికొని శాంతిపర్వము నెల్లరకును
సుకర మగునట్లు సలిపిన సూరివరుఁడు
సన్నుతుఁడు గాఁడె మున్నంగిశర్మ తాను.

భారతవిమర్శనంబునఁ బ్రణుతి గన్న
యట్టి కోరాడ రామకృష్ణయ్య మఱియుఁ
గాశిభట్టు బ్రహ్మయ్యయుఁ గారె స్తోత్ర
పాత్రములు ప్రభాకరశాస్త్రి పగిదిఁ దారు.

గేయులు శివరామయ నా
రాయణమూర్తులు వరకవిరాజులు వారిం
జే యెత్తి దీవనమ్ములఁ
జేయుదు వర్ధిల్లుఁ డనుచు స్థిరమతితోడన్.

మాటవెంబడి మాటగా మఱచి తమదు
ప్రస్తుతార్థంబు భాషించు వారిఁ గాంచి
నన్నపార్యుఁడు చిఱుచిఱు నవ్వు నవ్వి
నిశ్చితార్థంబు చెప్పెఁడు నిపుణమతులు.

అనుటయు నెఱ్ఱాప్రగ్గడ
ఘనమగు మోదంబు నొంది కళవళ ముడుగన్
వినయం బనయముఁ బెనఁగొన
ఘనులగు మూర్తిద్వయంబు గనుఁగొని యనియెన్.

ఏకార్యంబున కేనిగాని ధర భూమీశుండె సంస్కర్తయై
లోకైకోన్నతిఁ బాటునేటి యగుటన్ రాజ్ఞిన్ మహారాజులన్

మాకుం బ్రాపగుఁడంచుఁ గోరుదమిఁకన్ మాన్యాత్ములవ్వారిలో
నాకుం జూడఁగ నిర్వురే కలరు నానాకావ్య ధౌరేయకుల్.

ఒకఁడు షడ్దర్శనీవేది యొకఁడు మూఁడు
బాసలందు ముక్కాఁకల వన్నె కెక్కఁ
బోలుతు రిరువురు నభినవభోజు లనఁగ
సూర్యకులజుఁ డొకఁ డొకఁడు సూర్యరావు.

ఆరామవ్రజ చైత్యసద్మ వన దేవాగార సౌఖ్యంబులై
భూరిబ్రహ్మతపస్విసంకులములై పుణ్యాధ్వరారంభ సం
భారోదారములై నితాంతఫలిత బ్రాజిష్ణుసస్యంబులై
యారూఢస్థితి వేరిరాజ్యముల యొప్పారుం బ్రకాశంబుగన్.

ఎవ్వరు సత్యంబు నెప్పుడుఁ బలుకుచు హిం
సావిదూరులు గురుజనహితార్థు
లింద్రియ నిగ్రహులై యెల్లవారలఁ దమ
యట్లకాఁ జూచు ధర్మాభిరతులు
గామంబు తగులరు కర్మంబు లాఱును
సముచిత సంప్రయోజ్యత నొనర్చు
నట్టి పుణ్యాత్ము లత్యనఘులు బ్రాహ్మంబ
యనిశంబుఁ గీర్తించు నార్యచరితు
లార్జవంబు మఱియు నధ్యయనంబును
బరమధనములు సుఁడి వారలకును
వార మనకు నింక వసుధ నేడుగడలై
యాదరించునట్టి స్వాదుమతులు.

పులకలు వొడమఁగ నెట్టన
పలికిన పలుకులకు నడరి పైకొను వేడ్కన్.

విలసిత వాఙ్మాధురి రా
త్రిలకునిఁ బొగడంగఁ దొడఁగెఁ దిక్కన యిటులన్.

తన యెు ప్పెదురఁ గన్నఁ దగిలి యెవ్వరికైన
మలఁగి కన్విమ్ముఁ జూడవలయు వాఁడు
తన వర్తనము విన్న మునిజనంబులకైన
నలవరించుకొనంగ వలయువాఁడు
తన జంటుతన మాజిఁ గనిన మార్తురకైనఁ
బలుమాఱు నగ్గింప వలయువాఁడు
తన వితరణకేళి వినినఁ గల్పకతరు
వులకైనఁ దలయూఁపవలయువాఁడు
అనదలగువారి దుస్థితి నహరహంబు
గాంచి కన్నీరు డించుచుఁ గడవరాని
దైవఘటనముఁ దప్పింపఁ దడవువాఁడు
దీనజనవర్మ విక్రమ దేవవర్మ.

ఆరూపం బవికార మాభుజబలం బత్యంతనిర్గర్వ మా
శూరత్వంబు దయారసానుగత మాశుంభత్క్రియాజ్ఞాన మా
ర్యారంభప్రతికూలవాదరహితం బాయాగి సమ్మానవి
స్తారోదాత్తము విక్రమాంకుఁ డన నేతన్మాత్రుఁడే చూడఁగన్.

అట్టి మహానుభావు మనమందఱ మేకత నాశ్రయించి చే
పట్టుమ రాజశేఖరుఁడ! భారతభాష యడంగకుండఁగన్
గట్టుము పట్టముం దెలుఁగుకన్నెకు వన్నెకు వాసి కెక్కఁగన్
బిట్టు భవద్యశంబు వినిపించెద మెల్లెడ నంచు నందమే.

నావుడు నట్టులే యనుచు నాటిన వేడుక వారు మువ్వురుం
గేవల దివ్యమూర్తులు వికీర్ణసువర్ణవిమానరాజ మాం

ధ్రావనిమీఁదుగాఁ గడచి రా నల పెన్నయుఁ గృష్ణవేణి గో
దావరి యన్మహానదులదాఁటుచుఁ దొల్లిటిస్వానుభూతముల్.

తావులు సల్లువాక్యములఁ దారొకరొక్కర చెప్పికొంచుఁ బీ
ఠావరురాజ్యముం గని కడానిమెఱుంగుల నీనుమేను లెం
త్యే వహియింపఁ బుల్కలు సుధీవరుఁడాతఁడు సేయుగ్రాంధికాం
ధ్రావనదీక్ష మెచ్చుకొని వార్రియు నిఘంటువుతోడిపాటు భూ

దేవు జయంతిరామయఁ బదింబదిగా నుతిచేసిచేసి యా
పై వడిగాఁ విమానమును బర్విడఁజేసి విశాఖపట్టణం
బావల దాఁటి సూటిగ విహారము సేయుచు జేపురాచలే
లావిపినస్థలంబులఁ జెలంగుహరారంగునుగూర్చి వర్ణనల్
వే వొనరించి రిట్టుల నవీన లతాంత మరంద ధారలై
మూవురపద్యభావముల పూరములుం గ్రిమమొప్ప జాలులై
పావననిర్ఝరీజలముపాతములట్టులు పొంగి పొర్లఁగన్.

నన్నియ

భ్రాజితశాతకుంభశిఖరంబులఁ బుష్పితవల్లివేల్లిశో
ర్వీజవనాకృతిన్ విమలవిద్రుమవజ్రవిచిత్రవేదికా
రాజిఁ గరంబు రమ్యమయి రాజిలుఁ బర్వతకంచరంబులన్
రాజకులైకవంద్యకవిరాజులు మీరలు గాంచినారలే.

సకల జీవలోక సంతోషదాయకం
బైన యీ వసంతమందు మనము
జయపురంబు గాంచఁ జనుదెంచు టారయ
బహుళజన్మసుకృతఫలము గాదె.

సరళ తమాల తాల హరి చందనచంపక నారికేళ కే
సర కదళీ లవంగ పనస క్రముకార్జున కేతకీ లతా
గరు ఘనసార సాల సహకారమహీరుహరాజ రాజి సుం
దర నవసందనావళులఁ దత్పురకానన మొప్పఁ గాంచుఁడీ.

కమ్మని లతాంతములకు మ్మొనసి వచ్చు మధు
పమ్ముల సుగీతనినదమ్ము లెసఁగెం జూ
తమ్ముల లసత్కిసలయమ్ముల సుగంధిముకు
ళమ్ములను నానుచు ముద మ్మొనర వాచా
లమ్ములగు కోకిల కులమ్ముల రవమ్ము మధు
రమ్ముగను వచ్చె ననిశమ్ము సుమనోభా
రమ్ముల నశోకనికరమ్ములును జంపకచ
యమ్ములును గింశుకవనమ్ములును నొప్పెన్.

చందనతమాలములయందు నగరుద్రుమము
లందుఁ గదళీవనములందు లవలీమా
కందతరుషండములయందు ననిమీలదర
విందసరసీవనములందు వనరాజీ
కందళిత పుష్పమకరంద రసముం దగులు
చందనపు సౌరభము నొంది జనచిత్తా
నందముగఁ బ్రోషితుల డెందము లలందురఁగ
మందమలయానిల మమందగతి వీచున్.

తిక్కన

ఉర్వీధరంబుల నొప్పెడు జేవుఱుఁ
జఱులకాంతికి నునుమెఱుఁగు వెటి

ధరణీజగుల్మ లతావితానము పల్ల
వములకుఁ గట్టెఱ్ఱవన్నె యొసఁగి
యరుణాంబుజంబుల యంతర్దళంబుల
తళతళ యను జిగి దళము కొల్పి
చక్రవాకద్వయ సంతతి మెఱకల
కొమరారు కెంజాయఁ గొత్తసేసి
తనదు బాలబింబ మనుపమేయ ప్రభా
పటల జటిల గగనభాగ మగుచు
నుల్లసిల్ల జగము లెల్లను విలసిల్లఁ
బూర్వశిఖరి నిందుఁ బొడుచు నినుఁడు.

అభినవ జలధర శ్యామంబు లగునెడ
లాకుజొంపంబుల ననుకరింప
సాంధ్యరాగోపమచ్ఛాయంబు లగుపట్లఁ
కిసలయోత్కరములఁ గేళిసేయ
రాజమరాళగౌరము లగుచోటులు
దఱచుఁ బూఁబొదల చందంబు నొంద
హారిద్రరుచి సమానాకృతు లగుతావు
లడరెడు పుప్పొడులట్లు మెఱయఁ
గలయ నెగసి ధరాధూళి లలితవనము
దివికి నలిగాఁపు వోయెడు తెఱఁగుఁ దాల్చు
మనవిమానము జయపురవనము గడచి
నడఁచు సౌరును గనవోయి నన్నియార్య!

య క్షి న

ధారాపాతనితాంతవేగమున నిర్ధాతీధ్రధరం బాహతం
బై రూపేది మునుంగుఁ దోయములతో సత్యంత గంభీరవాః

పూరంబై జలపాత మిద్ది 'డుడుమా'* భూమిా నభోభాగముల్
వే రూపింపఁగ రాకయుండెఁ గనుఁడా విప్రోత్తముల్ మిత్త్రముల్.

అతులితపుష్పపల్లవ ఫలాన్విత భూరుహభూరివల్లరీ
వితతముఁ జారుకైరవనవీనసరోరుహ షండమండలా
యతసరసీమనోహరమునైన పురోపవనంబునన్ సము
న్నతవిభవుండు విక్రముఁడు వాసము సేసెడి సౌధమల్ల దే.

తేనెలు గ్రోలికోరి కడుఁ దియ్యనికమ్మనిపండు లింపుసొం
పూనఁగ నానియాని పరపొందిన నీడలు మెచ్చి మెచ్చి మం
దానిలశైత్యసౌరభ సమగ్రతకుం గడుఁ జొక్కిచొక్కి యు
ద్యానములందు మారుతసుత ప్రముఖుల్ విహరించుఁ దృప్తులై.

* * * *

అనికొనియాడుచుం బ్రకృతి నల్లనయల్లనఁ దత్పురీవరం
బునకుఁబ్రదక్షిణించి కవిముఖ్యులు మువ్వురువ్యోమయానముం
బ్రణుతవిధంబునన్ జయపురంబున డిగ్గఁగఁ జేయునంతలో
నన, నృపవల్లభుం డతఁ డనన్యమహాగుణశాలి యున్నతిన్.

అలబల మాలకించి వినయాన్వితుఁడై యెదురేఁగుదెంచి భూ
తలమున సాఁగి మ్రొక్కి కవితానిధులార! మదీయజన్మ మిా
యిలపయి సార్థకంబుగ సహేనకృపామతి వచ్చినారలే
పలపలనై మొగంబులిటు వాడుఁదనంబున నున్న వేలొకో.

మిాదు శరీరసౌరభము మిాదు విశాలవిలోచనంబులున్
మిాదు మనోహరాకృతియు మిాదు శుచిస్మితవక్త్రకాంతియున్

---

* 'డుడుమా' వాటర్ ఫాల్సు జయపురమునకు 20 మైళ్ళలోఁ గలదు. దీనినే 'మాచ్‌ఖండ్' ప్రాజక్టు అనుచున్నారు.

మీఁదు విలాసమున్ ముద మమేయగతిం బొనరింప కిట్టు లా
రా! దివులొందుచున్కి కెదియానొకొ కారణమంచు మ్రొక్కుచున్.

రారం డని పాద్యం బిడి
గారవము దలిర్ప వారిఁ గలితఘనమణీ
వారసువర్ణాసనముల
పై రహితోఁ గూరుచుండఁ బ్రార్థించుటయున్.

అలఘుతరంబులై తుహినహారిసుధారుచి నిందురోచిరా
కులశశికాంతవేది పృథుకుంజగళజ్జల నిర్ఝరంబులన్
బొలుపగుఁ దన్మహాభవనమున్ హిమశైలముకాఁ దలంచి వా
రలఘుతరశ్రమంబు తనివారఁగ దేఱి సుఖించియుండుటన్.

చేతులు దోయిలించి నృపసింహుఁడు విక్రమదేవవర్మ సం
ప్రీతిమెయిం గవిత్రయము వింతగ మానుషరూపధారులై
యీతఱి రాఁ బనేమి జగదీడ్యులు మీరలు దివ్యదేహవి
స్ఫీతులు గాక మర్త్యతను విహ్వలతం గననంచుఁ బల్కుడున్.

నన్నియ తిక్కనం గన ననంతవచోవిభవాభిరాముఁడై
కన్నన తిక్కయజ్వ తమకాంచినకష్టము లాదినుండియున్
మన్ననమై వచించి యనుమానము వీడి కడంకతోడుతం
గొన్ని హితోక్తులం దెలుపు కోరికవాఁ డయి యాడె నిట్టులన్.

అది సభయే ప్రియం బెసఁగ నార్యులు నిల్వరయేని యార్యులే
మదిఁ తలఁపంగ వారలు సముంచితధర్మము వల్కరేని యు
ట్టిదియును ధర్మవే తగ ఘటించిన నిక్కము లేదయేని తాఁ
బదిలపునిక్కమే యొకనెపం బిడుచొప్పగునేని విక్రమా!

నీతిపథంబునం బ్రతుక నేర్చుట యుత్తమభంగి శౌర్యసం
జాతములై కరం బలరు సంపద లొందుట మధ్యవృత్తి య
స్ఫీతము లైనభారవహ జీవనముల్ దలఁపం గనిష్ఠముల్
నీతికి బాహ్యుఁ డైనధరణీవరు మెత్తురె సజ్జనోత్తముల్.

*　　*　　*　　*

కయ్యమునక యెప్పుడుఁ గాలు ద్రవ్వుచునుండ్రు
కాకవులును మఱియు గ్రామ్యవాదు
లడరి వారి కండ యగుచుండి రెల్లరు
వీఁక వారి నాఁగు విక్రమేశ!

కారణము లేకయును నప
కారపరత్వమున నొరుల కావ్యంబులకున్
వారనియలజడి గూర్చెడు
వారల నీ వాఁగవలయు వసుధానాథా!

రాజనరేంద్రుఁడున్ మనుమరాజు నృసింహునికృష్ణరాయలున్
భూజనకల్పభూజములు వోవుటఁజేసి తెనుంగుభారతం
బీజగమందు నెందుఁ బ్రణుతించెడువారలు లేమిఁ దొంటి యా
యోజ తొలంగఁగాఁదొడఁగె నోపినయట్టులఁ బ్రోవువిక్రమా!

నన్నెచోడమహారాజు మున్ను పిదప
రాజరాజనరేంద్రుఁడు రాయలు ధర
నేలుచును గైతలను దద్ద నెసఁగఁజేసి
నట్లు యీవు వికస్రిప దేవ యాంధ్రిఁ గనుము.

ఖరకరువంశగౌరవము గాఢపుధర్మమువుఁ బాడిపాత్తునం
గరుణయుఁ బెంపునున్ ధరణిఁ గన్పట్టు నీవలనం బ్రకాశముం

గరము వహించుఁగాత వరకావ్యకళాపరిపోషణంబునన్
స్థిరతరకీర్తి మించి దశ దిక్కుల మిక్కిలి పిక్కటిల్లెడున్.

ఈవే కావ్యము లెల్లఁ గావఁ గుదు రిందెవ్వారి చందంబు లె
ట్లై వర్తిల్లినఁ గీడు మేలుఁ దుది నీయం దొందెడుం గాన స
ద్భావం బారసి లోనిపొత్తు వెలివృత్తంబున్ జనస్తుత్యముల్
గావింపందగు నీక యేవిధమునం గంజాప్తవంశాగ్రణీ.

నీకు వారలఁ దీర్పంగ నేరవచ్చు
నధిపఁ దెలుఁగు నీవశమున యదియ కాన
నీకు వారలఁ దేర్చుట నెఱియ కాదె
సిద్ధ మెవ్వారిఁ దెలి వొందఁజేయ నేర్తు.

పీ రసఁ బండితోత్తములు విప్రవరేణ్యులు భవ్యకావ్యదు
ర్వారులు వీరి రిత్తబవరంబున నాఱడిసాలు సేయ, నె
ట్లూరక యుండవచ్చుఁగడు నొప్పెడుకైతలు వాఁడిప్రాఁతలున్
గూరఁగ నాటినం బుడమిఁ గూలుట కక్కట యోర్వవచ్చునే.

జగతిఁ గల కవీశ్వరులు నీ చరణపీఠ
మర్థిఁ గొలువఁగ భూమిధరావృతోర్వి
యెల్ల నేలుట యొప్పదే హృద్యకావ్య
భాష తెలుఁగుసీమ మరలఁ బాడుకొల్పి.

ఎఱుఁగవె నన్నియభట్టుల
నెఱియును రసవత్కవిత్వనిష్ఠయు మము నె
త్తెఱఁగున ననువర్తించెదొ
యెఱుఁగవె తగుచేవ గలుగు నృపుఁడవు ధీరా!

వార లకావ్యశూరులు భవచ్చరణంబులు గొల్వఁబూని యు
న్నా రటుగాక నీ కది మనంబున కప్రియమేని యింతకున్
నోరులు చించుకో మిటుల నుచ్చచరిత్ర! వచింపు మెద్దియో
నీరుచియించు కార్య మది నేరిమి మీఱఁగఁ బోదు మేడ కేన్.

ఏ నిం తాడితిఁ గవిసం
తానం బిరుతెలుఁగునకు హితము గోరుచు నీ
కైన తెలుంగున సలుపుమ
మానిచి మాయెడఁద బెడఁద మాన్యచరిత్రా!

అంబుదగంభీరధ్వని
డంబుం బురుడించి కడుఁ గడంకం బుంభా
వం బింబుగఁ దాల్చినవా
ణిం బోలుచుఁ దిక్కయజ్వ నెఱి పల్కుటయున్.

ఆకొలువువారు గర మచ
లాకృతి నొకపలుకు లేక యందఱు విం జం
బాఁకిడినకరణి నవశము
దాకారితచిత్తవృత్తులై యుండంగన్.

తన కని పెట్టిన మణిమయ
కనకోన్నతపీఠమునఁ బ్రకాశంబునఁ బె
ల్చునఁ దిక్కన గూర్చుండుడు
వినయం బెడఁ బెనఁగొనంగ విక్రముఁ డనియెన్.

బ్రతుకు చేటు పొగడు వడుట దూఱొందుట
యాగి వేఁడుకొనుట యిట్లు మఱియుఁ

గలుగు సౌఖ్యదుఃఖములు వచ్చు నెడపడి
వాని కింత యేల వగవఁ దిక్క.

నియతతపమును నింద్రియనిగ్రహంబు
భూరివిద్యయు శాంతియుఁ బొందుఁ గలిగి
లోభ ముడిగిన సుకవీశలోకభూష
ణులగు మీకుఁ గాకవులచేఁ గలుగు నెద్ది?

వగ బలము దఱుఁగు రూపఱు
వగచిన మతి దప్పుఁ దెవులు వచ్చుం దూరన్
వగచి నలంగినఁ బ్రియ మగుఁ
బగతుర కనుపల్కు నీవ పల్కితి గాదే.

ఒకరునికై తపోఘ్నును దదున్నతిపాఘ్నును గాంచి యెల్ల నెం
టకును గొఱంత లేక పొగడం దగువిద్యల నొందినట్టిదా
తృకులము కావ్యముల్ చెఱుప నెంచెను కింకవిశిక్షణంబు రా
జకులవిభూషణుల్ నెఱపఁ జన్నని మీర వచించినారు గా.

కావుటఁ దిక్కయజ్వ! తమ కార్యము వీర్యము మీఱ నెత్తఱిం
బ్రోవన చూతు నన్యవిధముం గొనఁబూనకుఁ డీర లింతకుం
బావన మాంధ్రభాషఁ బెను పంగదె యిచ్చుచు నుంటి రూప్యల
త్పావరదానముం దెలియఁ గాంచర యయ్యది తెల్ప నేఁటికిన్.

తిక్కనసోమయాజి! యిటు తీవ్రత దీనత దోషశోషతన్
నెక్కొనఁ బల్కఁగా నగునె నీకు భరం బగు నేది తీర్పఁగన్
లక్కనమేని రానిపెఱ లన్గుఱి చింతగఁ జింత సెల్లునే?
యుక్కివు లైనకాకవుల యుద్ధతి యీ వణఁగింపనేనానో

ఎఱుఁగరొ మమ్ముబోటులకు స్వేచ్ఛయొకింతయుఁ దొంటితీరుగన్
వఱలమి యాంగ్లభూపతుల పాలనఁజేసియ; వారిభావపుం
గుఱుతులు వట్టి ప్రాఁకుచు నకుంఠిత దేశ్యకళావిలాసముల్
మఱుఁ గొనరించుచుండుట యమాయిక భావకవిప్రకాండముల్.

ఎప్పుడో తాము పురాణకాలమునయందే తెల్గుప్రాఁబల్కులన్
విపులంబై తగు భారతంబును మహా స్వేచ్ఛాగతిం గూర్ప నా
యపురూపంపుఁబ్రయోగసంచయముమాఱ్పైపోక యెట్లుండెడుం
గుపితుల్ గాదగునోటు దీని కిటు ప్రాజ్ఞుల్ తూర యోజింపుఁడీ!

నన్నెచోడుని తెలుఁగును నన్నపార్య
తెలుఁగు నీ తెల్గు నెట్టన తెలుఁగు నరయు
కొలఁది క్రొంగ్రొత్తఁ దెలుఁగుల వెలయుచుండ
నాఁటిప్రాఁనుడు లిన్నాళ్ళ కోటువడవె?

ఏ దెటులైనఁగాని తమ రీడకుఁ గొండొకకర్జ మూని రాఁ
గా దనఁజెల్లునోటు స్థిర కావ్యకవిత్వపటుత్వభాష భూ
మీఁదయితుండెఁ గావుట నమేయవిధిం బరిపోషణంబు నే
మీఁదయఁ జేసి చేయుదు నిమిత్తము నూని వినుండు దిక్కనా!

ఏ నొక్కమాట వల్కెద
మానము వహియింప కీరు మాకై తెలుపం
బూనుండు నిజము డాపక
జ్ఞానులు వేఱొండు తలఁచి కలఁగరు గానన్.

గ్రామ్యవాదు లనుచు గర్హించెదరుగాదె
గుఱుగుఱుగామమూరి విడుపుఁ డనరె?

వానిఁ బోనివాని వేనిని విడనాఁడ
వలయునో యెఱుంగనలయు ననుఁడు.

విక్రమదేవవర్మ వినవిందగు వాక్యము లాడెనయ్య ని
ర్వక్రమహాంధ్రభారతపు భాషయె గాక స్రించె భాషయున్
సక్రమపద్ధతిం దెలుఁగు సాముల నెవ్వరు వానియట్లభా
చక్రమునం దెఱుంగఁగల జాణలు లేరని తీర్పఁ డిట్లనున్.

ఆంధ్రభాషానుశాసనం బనఁగ నొప్పు
వ్యాకృతిని సూర్యనారాయణార్యుఁడు రచి
యించె నన రామమూర్తి వచించినపద
వితతియె ప్రధానసాధనం బితర మేల ?

ఎల్ల రెఱుఁగుపాంటె నీకొనె గ్రామ్యాంధ్ర
మంతె కాని గ్రాంథికాంధ్రమునకు
శత్రు వతఁడు కాఁడ సతమతనికి నేము
గూర్చువారమయ్య కువలయేశ !

అన విని సంతసించి విన యాన్వితుఁడై నృపవర్యుఁ డిట్లనున్
ఘనులు మహానుభావుల రఖండమనీషులు తార లిట్లుగా
ననిమొద రంచు నెన్నఁడు నయారె తలంపన సత్తె మింతగా
వినుతురటయ్య తిక్కనకవీ! ముదమయ్యె యథార్థసూక్తికిన్.

తక్కుఁగల గ్రామ్యవాదులఁ
దక్కిన కాకవులఁగూడఁ దక్షిణ మేనుం
దిక్కన యాఁగెదఁ దా మిఁక
మిక్కిలి నిబ్బరము నూని మేళులు గనుఁడా!

నన్నియ యాలకించితే యనారతభారతసంహితాంధ్రమే
మున్నిటికంటె వన్నె గని పొంపిరివోయెడు తెల్గుసీమలం
దెన్నఁటి నెఱ్ఱనార్య! వినితే కనితే యిఁక లోటు లేదుగా
నన్నకనన్న మాదృశుల సాయ మలంతియకా తలంపఁగన్.

ఆంధ్రభాషావిలోలురై యడరునట్టి
కొందఱయ్యలు పట్నాలయందు భావ
కవిత యని మురియుచు నుంద్రు గాని గాంచి
రయ్య భారతము గననియాంధ్రభూమి.

పల్లెపల్లెయందుఁ బట్నాన
భావతాంధ్రభాష పఠనపాఠ్య
యోగ్య మౌచుఁ దనరునోజలెకల వైన
నేనుఁగూడఁ దీని నెగడఁ గనుదు.

అనుటయుఁ గవిత్రయం బను
ఘనతరమోదమున మేను గగ్గురు పొడువన్
దినమణివంశజుఁ డగుటం
బనుపడి నీదగు నుదారవాక్యము చాటున్.

గోనములఁ బ్రోక నీయనుఁగు కూఁతురు నల్లుఁడుఁ బౌత్త్రులాదిగా
మనుదురుగాత బందుగులుమాన్యులుమిత్త్రులుఁబౌరముఖ్యులున్
ఘనధనధాన్యవాహనసుకాంచనరత్నదుకూలకాండముల్
దనరఁగ భానుతారక సుధాకరభూనగసాగరంబుగన్.

ప్రాయమున మీఱి సకలతంత్రములయందు
[illegible]

భాగ్య మందంగఁ గన్న శుభాశయుండ!
యుత్కళాంధ్రాళిల సమదృష్టి నోము మనుజ.

విక్రమదేవవర్మ కవి వీరులతో వచియించె నిట్లు భూ
చక్రము నేలువారి నుతి సల్పుచు గ్రంథము లెల్ల వారి కై
చక్రులుగాఁ దలంచి యిసు సన్మతు లౌటను దొంటిదృష్టిమైఁ
బ్రక్రియ భంగ మొందకయ వచ్చిరి నాకడ కొల్లఁ గాంచ కే.

అమర నొకమాట చెప్పెదనయ్య తమకు
దానఁగల సామరస్యము దార యెఱిఁగి
కొనుఁడు, లోభిత్వమును నాకు గొనకొని తగు
లుపకయ త్రికాలవేదులు విపులమతులు.

ఆయతి విశ్వదాతఁ గన నంతయుఁ బొన్పడు, వంత రాద, ఁగా
పోయినపోకగా సతని పొంతకుఁ బొండు మఱొక్కరీతి నా
శ్రీయుతుఁ డెంచఁబోఁడు తమ సెప్పినచొప్పునఁ బ్రాక్తనాంధ్రమే
యేయెడ వృద్ధిఁ గాంచఁ గను నెంతటికై నను నాతఁ డొప్పఁడే.

ఆంధ్ర భారతీపత్త్రిక లాంధ్రగ్రంథ
మాల విజ్ఞానసర్వస్వ మోలి నాల్గు
భుజములై యడరఁ దెలుఁగుఁ బొలఁతిఁ గాచు
విశ్వదాతను గనకుంట వెలితి గాదె.

అతఁడు చతుర్భుజుం డగుట నందఱ కేఱ్గడ; యంతె గాద; యా
తతమగు వానిశక్తి యదితాఁ దలక్రిందులు చేయు రాజ్యముల్
బ్రతుకులు మావి యెత్తఱిఁ దలంపఁ గవిత్రయమూ సుపత్త్రికా
పతులకరంబులందఁ పడి వన్నెయు వాసియుఁ గాంచఁగా నగున్

రాజులకంటె నాకపురి రాజులకంటెనుగూడఁ బత్రికా
రాజులు మిన్న లెన్నఁ గవి రాజులు వారల నాశ్రయించు టే
యోజఁ దలంచినన్ మిగుల నున్నతిహేతువు; కాన మీర ల
వ్యాజవదాన్యశేఖరు నపారకృపాపరు వానిఁ గాంచరే.

నావుడు వారలు మూవురుఁ
గేవలదాతృత్వగరిమఁ గీరితి గనునా
పావను దారిం గనమిన్
భావములం దుత్తలించి పయనం బగుచున్.

ఈశా! విక్రమదేవవర్మ! యవునౌ నిప్పట్ల నీయట్టిఁ డౌ
దేశోద్ధారక విశ్వదాతబిరుదుల్ దివ్యంబుగాఁ గన్న యా
కాశీనాథుకులావతంసము ధరాకాంతాతికీర్త్యాఢ్యు నా
గేశానుం గని తెల్పి యీఁగెదముగా గీర్వాటులున్ దైన్యముల్.

అని యావెంటన మందహాసముల నాస్యాబ్జంబు లింపారఁగా
ననఘున్ విక్రమదేవు వీడ్కొని రయం బారంగ మూర్తిత్రయం
బును దివ్యంబగు వ్యోమయానమున సమ్మోదంబుమై నేఁగి వా
రనివేగంబున విశ్వదాతఁ గని దుర్గాసౌధభాగంబునన్.

ఏమో చెప్పఁగఁబోవ నింగితవిదుం డిట్లాడె నాగేశుఁ డో
స్వాముల్ మీరు వృథాప్రయాసపడి రా భావ్యంబె? మీ సేవకున్
మైమైఁ జీటి లిఖించి యాజ్ఞ యిడినన్ మన్నింపఁడే? యార! మీ
రేమార్గానఁ జరింపు మందురో యటే యే నేఁగుదున్ నావుడున్.

వారలలోనఁ దిక్కఁ డను బావనవాక్కులఁ విశ్వదాత ! మే
మోరువలేక యాంధ్రము నయోమయవృద్ధికి విక్రమేశునిం

జేరి వచించుకోఁగ నినుఁ జేరఁగఁ బుచ్చె నతండు మమ్ము; మా
కోరిక లీవు గానియెడఁ గూలముముట్టఁగ నేరు దీర్చెదర్.

నీకుఁ గరములు నాల్గాట మాకుఁ గూర్చి
గాఁ్రింథికాంధ్రమ్ము పోషించి కాకవిత్వ
మణఁచి తెలుఁగుతెన్నుల కెటనైనఁ గొఱఁత
వెలయకుండంగఁ గనవన్న విశ్వదాత!

అనుడు విశ్వదాత యతిమోదమునఁ బొంగి
మూగురకును నెఱఁగి పూజ నేసి
తమతలంపు వట్టి తప్ప కింతటినుండి
నడచువాఁడ ననుచు నొడువుటయును.

వార లెంతయు ముద మొంది వానిఁ గాంతఁ
గూఁతు నల్లుని నూఱేండ్లు గొఱఁత లేక
మనఁగ దీవించి వ్రేల్మిడిఁ జనిరి వ్యోమ
యానముపయిని నాగేశుఁ డరయుచుండ.

శమదమ గుణజాలా! చారుయంత్రాళిలోలా!
సుమసమ మృదుశీలా! సూరిసంస్తుత్యలీలా!
శ్రమతమకృషిపాలా! శౌరిపాదాబ్జఫాలా!
ఘుమఘుమ మణిశాలా! గుప్తదానాలవాలా!

---

# వి జ య శ్రీ

పారిశ్రామ నేతా!
సాంధ్రకవీంద్రచంద్ర సమితిత్రాతా!
శ్రీరామకృష్ణ తాతా!
పారుష్య విహీనమధురభాషణపూతా!

"గరగరనైన వంటకము కమ్మనికూరలు నూరుఁగాయలున్
పెరుఁగును బాలునున్ గడుపునిండుగ నీ కిడుకాల మెన్నఁడేన్
దొరకునె? నాయనా! చినుఁగుదోవతియే ధరియించి వీథిలోన్
దిరిగెడు నిన్నుఁ గాంచ మది నీరయిపాఱెడు నాకు మాటికిన్.

తొలికోడి కూయకుండఁగ
ఇలుదీర్చక కూలినాలి కేగుచు వడిగాఁ
బొలమున వంచిన నడుమును
నిలుపక, పదిరాలు చేర్చి నేను గుమారా!

కడుపుకట్టుక యొకపూఁటె కుడిచి నిన్నుఁ
జదువవేసితి బడిలోన శ్రమల కోర్చి
'స్కూలు ఫైనలు' ముగియింపఁ జాలితీవు
పైకిఁ జదివించు శక్తి యేపాటి లేదు.

దొర లొసఁగిన దినభృతి దొరకఁబట్టి
యింతమాత్రంబు చదివించి తేను నిన్ను
నదియలేకున్న నేరీతి నోదవు చదువు?
నీదు పొత్తములకె రాదు నాదు పాటు.

నకనకలాడు నాఁకటను నాలుకచుమ్మలు వాఁఋచుండఁగాఁ
దుకతుకలాడు డెందమునఁ దూలుచుసోలుచు నుత్తలించుచు
గొకిబికిరూపుతోఁ దఱచు కోఁతల కేఁ జనుచుండ దారిలో
వికవిక నవ్వికొంచు నను వెక్కిలిడిచూపుచు పౌరసుందరుల్.

కట్టగుడ్డయుఁ దినఁగూడు గాని లేని
పేదరా లీమె విద్యార్థివేతనంబు
గాంచి తనపుత్త్రుఁ జదివింపఁగాఁ గడంగె
నంట; కంటిరే! కలికాలమంట వినరె!

ఏ కలెక్టరో యగుసంచు నెంచి యీామె
కొడుకుఁ గుఱ్ఱనిఁ జదివింపఁదొడఁగెఁ గాని
గొడ్లకాపరిగా నిడ దొడ్లకడను
లేనికలవారి తలఁపుల కేమి కొదువ!

ఏ పూఁట కాపూఁట నేపాట గడచునన్
తలఁపుతో మలమల మలఁగు నీమె
చలివెలుంగును వేఁడివెలుఁగును వాసంబు
నలిపెడుకొంపలో మలఁగు నీమె
మానంబు కాపాడుకోనైనఁ జాలని
వలువతో సతతంబు మలఁగు నీమె
పసుపుకుంకుమె కాదు పసిఁడిపుస్తెయు లేని
బలితంపుబొందెతో మలఁగు నీమె
మడతకుడుములె ముప్పొద్దు కుడుచు నీమె
యిరుగు పొరుగున వసియించు పురుషులెల్ల
వలదు వలదని చెప్పినఁ దలఁగనట్టి
పట్టుదలతోడఁ జదివించుఁ బట్టి నీమె!

అని నే వినఁగా నిరతము
మనమెరియఁగ దెప్పుచున్న మానక బాబూ!
నిను నేఁ జదివించితిరా!
తని తిరుగక తండ్రి నీవు దీక్షామతివై!

చదివితి పది తరగతులును
ముదిమియుఁ దలకెక్క నాకు మునుపటిబలమున్
బ్రిదిలెను, బ్రతుకుం దెరువెది
యొ, దడవికొని నీవు, నాకు నొక మెతు కిడుమా!

ఈ వొక యింటివాఁడవయి హీనతలేక చరింపుచుండఁగాఁ
గేవల మేను రామపదనీరజముల్ మది నిల్పి భక్తితో
జీవములన్ వెలార్చుకొనఁజేయుచునుంటి తపంబు బిడ్డ! నీ
త్రోవనునీవు చూచికొని ప్రోవఁగదయ్యా!ననున్ ముదంబునన్.

నా కేమి వలదు తండ్రీ!
నీ కేలున బూదికాఁగ నే గోరుదురా!
నీ కొక నాకరి దొరకిన
నా కన్నులఁ జూచి మురిసి నా కనుమోడ్తున్."

అనిబోసేసెడు ఫుత్రునింగనుచు వ్యాహారించి, యోయవ్వ యిం
టను బంచంగల నుల్కమంచముపయిం దాఁవ్రాల్చి కాయంబు వే
కునుకంబాఱుచు గుఱ్ఱువెట్టి కలలోఁ గొంగ్రొత్త యుద్యోగివై
తనయా! పుత్త్రులనెత్తి నాకుఁ గుసి విస్తారంబుగాఁ గూర్పరా!

స్నానమాడంగఁ దడక చాటైనలేని
గుడిసెలోఁ గాపురంబుండి కొడుక! నీకుఁ

జదువు చెప్పించితిని నీవు చంటివాఁడ
వెఱుఁగ విడుములఁ గుడుచు నా తెఱఁగు నంత.

కాళ్ళకు గజ్జెలు కంటికిఁ గాటుక
యుంచి యెన్నఁడు నిన్నుఁ బెంచలేదు
ఒంటినిండా బట్ట కంటినిండా నిద్ర
పోవ నెన్నఁడు నిన్నుఁ బ్రోవలేదు
కడుపారగాఁ గూడు కఱవు తీఱఁగఁ జల్ల
ద్రావఁగా నిడి నిన్నుఁ గావలేదు
తల కింత చమురిడి తిలకంబు దీరిచి
ముద్దారగాఁ నిన్ను దిద్దలేదు
కొఱ్ఱగంజియుఁ బుల్లనిగోఁగుకూర
చోడిజావయుఁ దరవాణితోడి చారు
మాత్రమే పోసి నినుఁ బెంచి మాతృభావ
మెట్లొ యుండాఁక నేను పోషించుకొంటి.

ఊొమ్మన రోఁకలి గట్టుక
కుమ్మరి యిల్లిల్లు దంచి కొలుచులు, నీకే
నిమ్మొయి నాలుగుముక్కలు
నమ్మికఁ జెప్పించినాను నలుగురిలోనన్.

వెలితిపడకుండఁ జదివితి, పెండ్లిచేసి
కొనర! నాతండ్రి! యనినను వినవు, కనవు
బ్రతుకుఁ దెరువును; నే నింక శ్రమపడంగఁ
జాల నేలీల పోషింతొ బాల! నన్ను.

ఏ పాప మెఱుఁగకుండగ
నీ పసితనమందె స్వర్గనిలయము చేరెన్
ఆ పుణ్యవిభుఁడు నీ పిత
నా పాపం బిట్లు పండె నాఁడును నేఁడున్.

తోడిబాలురతోడ నాడుకో జను నిన్నుఁ
జూడలే దొకనాఁడు గూడ నేను
బడిలోని పాఠముల్ నొడివెడు నీ నుడుల్
పడలేదు నా చెవి బడిని నెపుడు
వెన్నెలల్ కాయు నీ విన్నాణపున్ మోము
కన్న దెన్నఁడు లేదు చిన్ననాఁట
హాంతకారిగ నీవు బంతులాడెడు చోటి
చెంతనై నను నిల్వ సంతసమున
పొట్టకై ప్రాఁకులాటతోఁ బొద్దుగుంకు
నాకు, దివినున్న మీ నాన్న కేకగతియె
పట్టెరా! తండ్రి! నీ బాలభావమందు
లేమికిని జావునకు భేద మేమి కలదు!"

అని కలవరించు తల్లిన్
గని, కనుఁగొలఁకులను గ్రమ్మగా నశ్రువులున్
విను వీధివంకఁ గనుఁగొని
చనియెను బురవీధి నతఁడు సరసర నెటకో.

తనతల్లి కలవరింతలు
తనలేమిడి తలఁచుకొలఁది తెలుగుకపోవన్
దనయెడఁద; యేమి తోఁచక
విను ప్రాలినచోటి కతఁడు విసవిస చనుచో.

మధ్యేమార్గమునందుఁ గొంద ఱెవరో మార్గావరోధంబుగా
మిథ్యాలాపులు నిల్చి పిల్చి యతనిన్ మీసంబులం ద్రిప్పుచున్
సుధ్యంశుండటు లున్నవాఁడవపురా శోధింపనీ యాఁగు నీ
నిధ్యానమ్మగుఁ బాపహారి యని పోనీకాఁగి యొక్కమ్మడిన్.

చుట్టునున్ మూఁగి పరికించి చూచి చూచి
జుట్టుపిల్కయు చినిఁగిన కట్టుబట్ట
మాత్రమే యాస్తిగాఁ గల్గి మనెడు నతని
వాలకమ్మున కబ్బురపాటు గాంచి.

గోచిపాతరాయఁడ! నినుఁ జూచి మేము
జోగివనుకోక నీదారి యాఁగినాము
నీవటర! యోయి!! దద్దమ్మ! చావలేక
బ్రతికియుంటివె తల్లికి మెతుకు లిడక.

నీ వుద్ధరింతు వనుచును
పావని మీ యమ్మ చదువుబడిలో వైవన్
ఏవో చదువులు చదివితి
జీవనమున కేమి తేవు ఛీ ఛీ పోరా!

రెంటికిని జెడ్డ రేవణరీతి నీవు
పొలము పనికిని దొరతనము పనికిఁ జెడి
తిరుగుచున్నావు పోరాదె దురము జరపు
దొరల సరసకు నౌకరీ దొరకు నెదియొ.

యుద్ధోద్యోగము చేసిన
బద్ధకమా పోవు ధన మపారము వచ్చున్

శుద్ధమగు జీవితంబును
శ్రద్ధగ మామాటబాటఁ జని సుఖపడరా!

అని హెచ్చరించి విడిచిన
జనముల వాక్యములు హృదయశల్యము కాఁగా
మునుపటికంటెను వడిగాఁ
జను నాతం డెదుట నొక్క చక్కనిచోటన్.

యుద్ధచిత్రంబులను జూపుచున్న యట్టి
యొక్క మాజిక్కులాంతరు ప్రక్కఁజేరి
నిలువఁగాబడి తెరమీఁదఁ బలువిధాలఁ
గానఁగాఁబడు బొమ్మలఁ గాంచుచుండ.

చటులోద్ఘాత ఘటచ్ఛటార్భటి నభోజ్యా మార్గరోధమ్ముగాఁ
బటుధూమ్రాగ్నిశతఘ్నిరాణ్ముఖపరీవాహమ్ము లాశాంతభూ
తటభాగంబులు క్రమ్మిపాఱఁ బయిపైఁ దండోపతండంబులై
రటదాకాశవిమానరాజి మిణుఁగుల్ రాల్పం గ్రుధాకృద్ధ్వనిన్.

మింటన్ మంటలు లేచియేచి విపులామేయ ప్రపంచస్థలీ
లుంటాకంబుగ నాల్గుదిక్కులకు వెల్గుల్ పర్వఁగాఁ గాల్చుటల్
కంటన్ ఱెప్పిడకుండఁ గాంచి మిపులంగామెచ్చి మైపొంగఁగాఁ
బంటింపన్ మనసొప్ప కచ్చటిజనవ్రాతంబుఁ ద్రోపాడుచున్.

కొండొకముందునకుం జని
మండెడు గుండులు విసరు విమానములు భువిన్
బెండులువలె రాలుట కని
దండలపై నప్పళించు దర్పోద్ధతులన్.

యమభటులఁబోని యోధుల
సమయజ్ఞత కాత్మ మెచ్చి సంతోషముతో
రమియింపనెంచి యాగతిఁ
గమలాప్తునిఁ గాంచి విచ్చు కమలము వోలెన్.

మొగము విప్పారఁ దెగువ పెన్‌బిగువు దేఱఁ
దలఁపు లిగురొత్త మేనెల్లఁ బులకలెత్తఁ
బిక్క బిగిమెక్క రోమముల్ చక్కనిక్కఁ
బెదవు లదరంగ భుజములు పొదలిపొంగ.

తల పంకించుచు నిలఁబడి
పొలికలనికి నరుగనెంచి పోలిపోని భుజా
బలమున బ్రతుకంగఁ దలఁచి
యిలునైవెపికఁ జూడననుచు హేరాళగతిన్.

చనిచని యాంధ్రభూపతి హజారమునం బడి క్రొట్టునంతకున్
మణిపురరాజవీధి నొక మందిరముం గని దానిలోపలన్
ఘనతరసాహసాంకులయి కాల్రెడు నూతనయోధరాజులన్
గణనయొనర్చు నొక్క ఘనుఁ గాంచి సలా మొనరించి శీవిన్.

అంబుదగంభీరస్వన
డంబర మింబొదవఁ బలికె డాపక యిటులన్
అంబేదగాను సామీ!
యంబరయుద్ధమ్ము చేయ నర్హుఁడ నయ్యా!

వ్యోమయానంబు నడపఁగా నూహపుట్టి
తమ్ము దర్శింప వచ్చితిఁ దడయ కిపుడు

తత్పదవి నాకు దయచేసి తగినశిక్ష
ణమ్ము నొదవఁజేయుఁడియదె నా తలంపు.

దొరబిడ్డండని యెల్లవారు నను నస్తోకంబుగా మెచ్చఁగా
దురముం జేయుదువ్యోమయానముపయిన్ దోర్దర్పముంజూపుచున్
పరరాజన్యులయోధవారముతలల్ ఛంతాడుదున్ వ్రేల్మిడిన్
స్థిరకీర్తిన్ గడియింతు హైందవజనస్థేమంబు చూపించెదన్.

ఏనాఁడో తండ్రి చనియెను
ఈనాఁటికిఁ దల్లి మిగిలె నే నొక్కఁడనే
యేనాఁట నెవరులేరిఁక
మానక నా పూన్కి నీవు మన్నింపఁగదే!

స్పష్టాహంకృతులుల్లసిల్ల ధరణీభాగంబునన్ నిల్చి నే
ముష్టాముష్టి యొనర్చి పోరు పగఱన్ బూర్ణంబుగాఁ జూర్ణమున్
గష్టంబించుకలేక చేయఁగల నింకన్ మాఱుమాటిఁక మీ
కిష్టంబైనదెదో యొసంగిపని సంతృప్తాత్మునిం జేయుఁడీ!

నన్నడిగి నౌకరీయిడ
నున్నారా! వ్యోమయానయోధునిసలుపన్
విన్నపము మున్నె చేసితి
మన్నింపుఁడు నాదుకోర్కె మాన్యచరిత్రా!

కంపెనీవారుమాగడ్డఁగాలునిడ్డ
కాలముననుండి ప్రభుభక్తి కలిగినట్టి
కొలమునం బుట్టి పెరిఁగిన తెలుఁగుబిడ్డ
నయుఁ! యువయుఁ! యుద్యోగ మరుసమొదవ.

గాలియోడ నడపి గాలికంటెను వేగ
నాల మేను జేయ నాత్మఁ దలఁతుఁ
బల్లెటూరివాఁడఁ బలుమాఱు లడిగితి
నెంచకయ్య! బుద్ధిహీనుఁగాఁగ.

ఉత్సాహము రేకెత్తెను
బ్రోత్సాహంబిడవయేనిఁ బోయెద నెటకేన్
మత్సాహసంబు మెచ్చెదు
సత్సంగుండున్నయట్టి చక్కికి నిపుడే!

పెటపెటార్భటులతోఁ బేలుఫిరంగుల
కావంతయేన్ వెనుకంజవేయ
వరుసగా గుండులు గురియఁగాఁ జొచ్చెదు
మరతుపాకుల కింత మడమతిప్ప
విద్యున్మయంబులై వినువీథి నేతెంచు
బాంబుదెబ్బల కదర్పాటు చెంద
దశదిశాభాగముల్ దగ్ధంబుగావించు
టాంకుబారులకు వడంకఁబోవ
అదరుగుండెయు మఱి పిక్కబెదరులేని
ఉక్కుముక్కగ నను నీవు లెక్కగొనుము
సర్వసేనాధిపతివీవు సాహసాంక!
కోరు నుద్యోగమిచ్చి నా కోర్కె తీర్పు!

గరడీ తేఱిన బాహుదండములతోఁగాన్పించు నా కాయమున్
గరడుల్ గట్టినవీరరక్తమునతోఁగాన్పించు నా వక్షమున్
ధరణింద్రాఁకకలోఁతుగల్గిమడమల్ గాన్పించు నా పాదముల్
వరయోధాగ్రణినౌట కేమిశోదువా! వాఁకువమంనమా! సు.శ.గా.!

నన్నారసి కన్నారఁగ
విన్నపమునుజేయు నీకు; విన్నాణముతోఁ
గన్నాకనేనినేలుము
మన్నీఁడా! నీకు నడ్డు మఱి యున్నదియే!

నూటికినూఱును 'మార్కులు'
పోటీమై దెచ్చుకొంటిఁ బుస్తక మిదిగో
టాటోటుకాదు చూడుఁడు
చాటేమియు లేదు మీకు సంతసమొదవున్.

మొగమున్న దద్ద మున్నది
యిఁగనేఁటికి జాగుచేయ నెదియో చెప్పం
డెగదిగఁ జూడఁగ నేటికిఁ
బగవానిగ నన్ను నిచటివారలు మీరున్.

అన విని మందహాస మనయంబు మొగంబునఁ జిందులాడఁగాఁ
గనుఁగొని వాని నొక్క క్షణకాలము ఱెప్పలువ్రాల్పకుండఁగా
ననియెఁ జమూవిభుండు మఱియాతని ధీరతపట్టిచూడఁగాఁ
దనమనమందు నెంచుకొని దాపఱికం బొకయింత లేకయే.

ఆర్డరిడుదుఁ గాని యరయు మించుక నీవు
ఇంటనొంటిపాట నేడ్పు నీదు
తల్లి యుద్ధమునకుఁ దరలితి వీవని;
పడచువాఁడ వామెపాటు గనుము.

ఈవల నావల నెవ్వరు
కావంగా లేరుగాదె గాదిలి తల్లిన్;

నీ వొకఁడవె తనయుఁడ వని
నీ వల్లనె వింటిఁగాదె.నిలకడ గనుమా!

నావుడు బాలభాస్కరుఁడు నవ్వి వికావిక వానికిట్లనున్
'నావలె నొక్కరుండయిన నందనుఁడుండనివార లెందఱీ
భూవలయంబునంగలుగఁబోవరు వారలనెల్లఁ బ్రోవఁడే
దేవుఁడు; నామతల్లికిని దిక్కతఁడేయయి ప్రోచుఁగావుతన్.

పిల్లలుమేఁకలున్ మఱియుఁ బేదలుసాదులు గొడ్డుగోదలున్
తల్లులుదండ్రులున్ మఱియు దమ్ములునన్నలు మేడమిద్దెలున్
ఘెళ్ళునగూలుచున్నతఱిఁ బ్రేమలు గీములు భూములంచు నే
ప్రల్లదుఁడుండునింటఁ బ్రభువర్య! తలంపుము యుద్ధపద్ధతిన్.

ఇళ్ళునువాకిళ్ళును విడి
చెల్లాచెదరౌచుఁ బ్రజలు చెట్టుంబుట్టై
కాళ్ళకు బుద్ధులఁజెప్పుచు
వెళ్ళుచునుండంగ నేను వెడలనె యనికిన్.

రణభీరుండయి తొల్లి తిక్కన యనిన్ బ్రాల్మాలి గేహాసకుం
జని తానంబొనరింపఁబోవ సతి మంచంబొండు నడ్డంచి వే
సినదచ్చోట మొగానికై పసుపు; తత్ స్త్రీత్వంబురూపించుచున్;
గనుకన్ నే వెనుకంజ యిడ్డ నగరే కాంతాశిరోరత్నముల్.

నాకనుల యెదుటఁ దొల్లిటి
ప్రాకారమ్ములును గుడులు ప్రాసాదములున్
వేకూలుచుంట కాంచియు
నాకేమని కూరుచుంట న్యాయం బగునే!

దొరతనమె ప్రజలు ప్రజలే
దొరతనమని యెంచి యెవఁడు దురమునయందున్
గురు జయము గాంచ నేఁగునో
నరుఁ డాతఁడు పరుఁడు! శుద్ధనరపశువు సుమీ!

అన్నములేకమాఁడి మరియాదకుమ్రగ్గుచుఁ జేయిచాఁపకే
యున్నది కన్నయమ్మ, నను నూరకయుండక నౌకరీయె దేఁ
గొన్నదియంచుఁ జెప్పినది కొంపకుఁ దల్పులునాకులేని లే
కున్నవినూత్నయౌవనుఁడనుత్సుకతంజనుదెంచితిన్ దొరా!

ఉన్నయథార్థసంగతుల నుల్లమువిప్పివచించినాఁడ నీ
కన్న నెవండు నాకు మఱి గానఁగరాఁడు దయార్ద్రభావుఁడో
యన్న! యనుగ్రహించి తగునార్డరొసంగి త్వదీయసేనలో
మిన్నగఁజేసి ప్రోవఁగదె మేలనఁజేసెద నెల్లకార్యముల్ !

రణభేరుల్ ధిమిధిమ్మటంచు మొరయన్ రారజ్యదుత్సాహినై
గణనాతీతచమూసమూహములఁ జిక్కంబట్టి జక్కాడెదన్
రణధీరుండని మీరుమీరు పొగడన్ రాజిల్లి వీరాంకముల్
మణిమాణిక్యము లంబరాదులను సమ్మానంబుగా నొందెదన్ !

తాతలనాఁటిమాన్యములు తప్పక నే గడియింతునంచు నా
మాత తలంచి గౌరవము మంగలమందున వేచి విద్యలన్
నేతగఁజేసెనన్నును మనీషివరేణ్యా! మదర్థ మెట్లుగాఁ
బ్రీతినొసంగితీర్చెదవొ వేఁడుచునుంటి యథార్థవాదినై !

ఏ గుమస్తాపనియొ నాకు నిడెదవేమొ
స్వామి! యట్లైన నీకు సలాముపెట్టి

సెలవు గైకొందు శీఘ్రమే చెప్పుమయ్య !
యెట్టి యుద్యోగమిత్తువో యేలినయ్య !

అర్జునునట్లు నిల్వఁబడి యాహవరంగమునందు శత్రులన్
జర్జరితాంగులన్ సలిపి సారమహాహవ సైనికాళిలో
నూర్జితకీర్తిఁ గాంచ మది యుబ్బుచునున్నది కాని యన్యమున్
నిర్జరరాజవైభవ ! తృణీకృతిచేయు నదేమిచిత్రమో !

అని వాక్రుచ్చెడు యౌవనాంగునుమలత్యాహ్లాదముం గూర్పఁగా
విని యుద్యోగి తటాలునన్ నిలిచి దివ్వొన్నొక్కి ఘంటారవం
బనయంబుం బొనరించినంతనె భటుం డాజ్ఞేమియం చంజలిం
గొని యేతెంచినఁ 'బిల్వు క్లార్కు'ననఁ దద్గోష్ఠినిమగ్నాత్మయై!

ఆలోకించెడు కన్యకామణి నయంబారంగఁ దాఁ బిల్వఁగా
బాలారత్నము మందహాసముఖదివ్యజ్యోత్స్న లంతంతనే
వాలాయంబు తదంతికస్థితుని లేఁబ్రాయంపు బాచయ్యపై
మాలల్ వైచుచువచ్చినిల్చె నెదుటన్ మాస్టీనికిన్ మ్రొక్కుచున్.

మ్రొక్కిన యా కాంతామణి
దిక్కుమొగంబై యతండు తిలకించితివా !
నిక్కపు యోధుండీతం
డెక్కంగా గాలియోడ నీడకు వచ్చెన్.

'అన్యోద్యోగము నొల్లఁడంట కనుగొ మ్మౌనీరునుందియ్యమున్
జన్యోద్యోగమె కాంక్షచేయునఁట కానన్ వీని వైమానికున్
గన్యారత్నమ ! చేసిపుత్తమె' యనంగా నామె చిర్నవ్వుతోఁ
వన్యేభప్రతిమానయానమునతోఁ బత్రింబు తే నేగుచో.

బారెడుదూరమందుఁ గల భాస్కరరమ్యకటాక్షభృంగముల్
బారులుదీఱి యామె తనువల్లిఁ దటాలున వ్రాలి తేనియల్
చేరలతోడఁ ద్రావి పెఱచేష్టలుదక్క క్షణంబులోపలన్
వారణరాజగామినియు వచ్చి కలంబును గాగితంబునున్.

ఇచ్చి వయస్యనంకమున కించుకదూరమునందు నిల్వఁగా
సచ్చరితాగ్రగణ్యుఁ డగు సైన్యవిభుం డపు డా నవీనతో
ఎచ్చట నెప్డు పుట్టితివి? యెవ్వఁడు నీపిత, వర్ణమెద్ది, నీ
కెచ్చట పుట్టుమచ్చగల దిన్నియుఁ జెప్పుము వ్రాసికోవలెన్.

అనవుడును వాఁడు ప్రభువుతో ననియె నిటుల
వేఱె వచియింపనేల నా పేరు నూరు
స్కూలుపై నలుబుక్కిదే చూడుఁ డయ్య!
సర్వమును మీకు దీనిలో స్పష్టపడును.

అన విని యాతని తెలివికి
మనమునఁ గడుమెచ్చివిభుఁడు మన్ననతోడన్
పనియిచ్చిపుచ్చె వెంటనె
తనపున్నెము పండెనంచుఁ దలఁచుచు మదిలో.

వైమానికునిగ నల్పిన
యా మాన్యున కంజలించి యాజ్ఞయె యనినన్
గామితమందారుం డతఁ
డామెతకై రమ్మటంచు నాహ్వానించెన్.

విందునకుఁ దన్నుఁ బిల్చిన
యందునకతఁ డాత్మయందు నచ్చెరుపాటున్

జెందుచు దత్ప్రభుపదముల
కుం దలతాంకంగ మ్రొక్కి కొండొకతలంగన్.

దరహాసామృతవాహినుల్ వఱదలై తత్ప్రాంతమున్ ముంచంగాం
దరళాక్షీప్రభ లాప్రవాహమునకున్ ధావళ్యముం గూర్పంగాం
బరిహాసోక్తులు పల్కరామింగులుకుం బ్రాగల్భ్యముం దేటగా
సరసీజాక్షి తదంతికస్థలి కులాసామీఱంగా నిల్చినన్.

లీలా! పీనిం దోకొని
హేలాయానమ్ముతోడ నింటికి ర మ్మే
నీలో వాహ్యాళికిం జని
కాలక్షేపమ్ముచేసి క్రన్నన వత్తున్.

అని వాకొని సేనాపతి
చనినంతనె లీలతోడం జని యాతండున్
మణిమయసౌధాగ్రమ్మునం
దనకై యేర్పఱిచినట్టి తగుకుర్చీపై.

కూర్చుండ క్షణములోపలం
దీర్చినయుడుపులను దెచ్చి తీర్పరి యీంగా
వార్చి యవు డతండు వానిని
జేర్చిన మోదమునం దాల్చి వెలుంగొందు గదిన్.

ఇంబుగా వ్రేలు నిలువుపటద్దంబులోనం
గోటుహేటును సవరించుకొనుచుండ
లీలగా వచ్చి లీలావిశాలనేత్రి
ప్రక్కనే నిల్చి తినుమని ఫలము లిచ్చె.

ఉలికిపడి వాఁడువచ్చిన యుదిరిబొమ్మ
రూపురేకల నద్దంబులోఁ దళుక్కు-
మనఁగ వీక్షించి క్షణకాలమట్లె నిలిచి
రాగరంజితమన సాకలాగు గాఁగ.

లీలా! ఫలముల నిత్తఱి
నేలా! తెచ్చితి సనుక్షణియించెను గాదా
యీలావరి యిప్పు డివి తిని
యేలీల భుజింతు రాత్రి యిచ్చట మరలన్.

నావిని లీల యిట్టులనె నాయమె నీ విట్టులాడ పోటకీ !
యీవిక మార్చుకోవలయు నింటికడంగల తొంటిమాదిరిన్
పోవలె దూరభూములకుఁ బ్రొద్దుటిపూఁటను రాత్రివేళనున్
చేవలె దిగ్జయంబులను దేశకుఁ దేశకుఁ నాఁడునాఁటికిన్.

కావున రెండుపూఁటలను గమ్మనిబోనము నారగించుచున్
ద్రావవలెన్ మఱిన్ మఱియు దాహవిదారకదుగ్ధనీరమున్
ప్రోవవలెన్ శరీరమును బుష్టినొసంగెడు సంస్కృతింటచే
నీ వపు డర్హ యోద్ధవయి యెల్లెడఁ గాంచెదు పేరుకీర్తులన్.

అలవాటుచేసికొను మిఁక
ఫలరసములుగ్రోలి బలము బలపఱచి కొసన్
కలిమికిఁ దినుటయు నిసుటయు
ఫలమని వినలేదె? బాలభాస్కర యెప్పుడున్.

ఆలీల బలుకు లీలా
బాలామణి పలుకులెల్ల భావము దనుపన్

గేలం దత్ఫలములు గొని
కోరెదనీ వింకఁ జనుము కోమలి యనినన్.

చూపుందూపుల మాటిమాటికి వయస్థుం గాఁడఁగా నేయుచున్
మాపౌనంతకువత్తుఁ గ్రమ్మఱ సఖా! మన్నించు తప్పున్న చో
నాపై చూపిర నీదుప్రేమకుఁ గృతజ్ఞంగా ననుం దల్పుమా!
శ్రీపద్మాత్ముఁడు ప్రోచుఁగాక! అని నిన్ క్షేమంబులన్ గూర్చుచున్.

అని పనివిని చను వనితను
మనమున దడదడలు వోడమ మాటికి గనుచున్
తినుఫలమె తెలియకుండఁగ
దినఁబోడఁగ నతండు కొన్ని తియ్యనిఫలముల్!

తినియెడుఫలములఁగానీ
కనియెడు దృశ్యములఁగాని కమ్మనిరుచులన్
గనకుండఁగ నతఁ డేమో
కనుకలి నిట్టట్టు త్రిప్పు గ్రిమ్మఁగఁ జెమటల్!

కొండొకసే పటులుండియు
నండజనిభయాన పలుకులందలి తీపుల్
గుండెకుఁ దా హత్తించుక
పండులతీపేల యనుచుఁ బొఱఁగ నైచెన్!

అంతలో వాహినీపతి యరుగుదేర
లేవిగాఁ నిల్చి కుడిచేయి లేవనెత్తి
వందనముచేయఁగ నతఁ డపారకరుణఁ
గ్రిచ్చికౌఁగిటఁజేర్చి వాక్రుచ్చె నిటుల!

నినుఁగాంచినయంతట నా
కును నెదఁ జనియించెఁ గొడుకుఁగుఱ్ఱని మీఁదన్
జనకేము పేర్మిముడియేలా కా
పనియిచ్చితి దానఁజేసి భాస్కర నీకున్.

నీ వొక పేదవాఁడ వని నిన్నుఁ గనుంగొనఁగానె తోఁచుటం
గేవల మీ మహోపకృతి నీ కొనరించితిఁగాని లేనిచో
భూవలయంబులో నెవఁడు పొందె విమానముత్రిప్పునౌకరిన్
నీవలె సూక్లులున్పైనలున నెగ్గినవాఁడు తలంచిచూడుమా!

అన్నము పున్నము నెఱుఁగని
విన్నాణపు నీదు నుడుల విని నంతటనే
కన్నాకన్నుకాఁగలవని
మెన్నుట నీ కిచ్చినాఁడ నీ కొలువును నే!

కూరుచుండుము భాస్కరా! కూరుచుండు
మిపుడ వచ్చెద క్షణములో నీవు నేను
విందు కుడుతము లీలయు వెడలివచ్చు
నింతలో నని లోపలి కేగి యతఁడు!

దుస్తులనుమార్చుకొనివచ్చి నిస్తులాత్మఁ
బలుకరింపుచు భుజియించుబల్లకడకు
భాస్కరునిఁ బిల్చి కూర్చుండ; వచ్చి లీల
యాకులనువేసి యందు పదార్థములను!

వడ్డింపఁగ వా రిరువురు
నుఱ్ఱాడని మదులతోడ నొక్కొక్కటియే

యుద్ధాహారములను దా
మడ్డెమియులేక క్రోలి రత్తుటె దొర తా!

వెంటనేయున్న లీలఁ గాన్పించి యనియె
భాస్కరా! చూడు మీలీలఁ బాప మీమె
తొల్లి నీవలె నిజము పేదపిల్ల సుమ్ము
దొరతనమువల్ల విద్యలఁ గఱచెఁగాని!

అన్నమునకె మొగమువాచి యరిగియుండు;
సొగసుగా పైపుగొట్టుట చూచియుంట
పిలిచి యుద్యోగ మిచ్చితి వెలఁదియామె
వెలఁది పలుకుల సతము నా కొలువు సలుపు.

ఏయుగంబునఁ గనుఁగొన్న యేనిగాని
గొప్పవారెల్లఁ బేద లొకప్పు డనుట
తథ్యమనుటకు మీరలే తారకాణ
కాఁగలా రింకఁ బన్నుండుఁ డేగి యనుఁడు.

బాలభాస్కరు మొగమును లీల గాంచి
లీల మొగమును వీక్షించి బాలభాస్క
రుండు కన్నీళ్ళు విడువఁగా రెండు పొండు
పండుకొనుఁ డని యదలించెఁ బ్రిభువరుండు!

వానియానతి మీఱఁగారాని దగుట
ముందుగాఁ జనె లీల యపూర్వలీల
బాలభాస్కరుఁ డంతట వాహినీశు
నంకమున నిల్చి యిట్లనెఁ బొంకముగను!

ఉదయమున లేచి పనివిందు సదయహృదయ!
మీకు వన్నెయువాసియు చేకుఱంగ
నేను వైమానికుండనై యెల్లగతుల
జయము చేకూర్తు మనరాజ్యచక్రమునకు.

లేచివఱువాత నే'ఁబూన' కేఁచియోఁగ
గలను దయయుంచి క్షేమంబు తెలిసికొనుఁడు
మేనిచర్మపుఁజెప్పుల నేను మీకు
నిచ్చినను మీ ఋణంబును నీఁగలేను.

అని వంగి వందనంబును
బొనరించి చమూపతికిని పోయి శయింపం
గనె, తలఁపునఁ బొటిస తన
జననిని దలపోసికొంట జాములు గడచెన్.

పిన్నటనాఁటనుండి నను పెంచిన తల్లిని నొంటిపాటుగా
నిన్నటిరేయి వీడి యిటు నేఁ జనుదెంచితిఁ దెల్లవాఱఁగా
నన్నుఁ దలంచి యేమెయి మనంబున నామె తపించుచున్నదో
కన్నటువంటి తల్లి విడి కర్కశభావుఁడనైతి దైవమా!

కాటికిఁ గాళ్ళు చాపికొనఁగాఁ జను తల్లిని వీడుకొంటయా!
కూటికిఁ బేదనై పరులకొంపలలోఁబడి కాఁపులుంటయా!
సాటికిరాని మేటినయి సర్వసుఖంబులఁ జూఱకొంటయా!
చీటికి మాటికిం జనికి చింతలవంతలఁ దోఁగుచుంటయా!

తౌల్యంబేటికిఁ బెంచ పెంపొనరియు చాలన్ నన్ను గారించు దా
ష్బల్యంబున్ విశనాశి శత్రునికరముల్ ఖండించి ఆపై నన్ను

కుక్కల్యాపద్మములం బొనర్చి యవిమేకూర్తున్ జయశ్రీతలన్
గల్యాణంబగుఁగాతమంచు సుభటుల్ గంటల్ బజాయింపఁగన్.

కృష్ణాంశుండగు రాష్ట్రనేత ప్రజకై యుద్ధారివర్గంబుతో
నిష్ణాతుండయి పోరుచుండఁ గలనన్ నిర్నిద్రభావుండ నేఁ
దృష్ణాతంత్రులఁజిక్కి వంటగృహమం దేరీతిగా నుండుదున్
ఉష్ణీషంబునఁ గట్టవచ్చునె మదవ్యాఘోగ్రశుండాలమున్.

భండనభీముఁడంచు నను బల్క విరోధిశిరోధి తండమున్
జెండెదఁ బిండిచేసెదను జీల్చెద రాల్చెద వ్రిక్కలించెదన్
గండెముతుండమై పడఁగఁ గాల్చెద మాడ్చెద బూదిచేసెదన్
జండగభస్తిమండలము చాయ విమానవిహార హారినై.

అంచు మెయిమెయిఁ దా నిశ్చయించి మించి
లేచి రైలెక్కిపోవఁ గానేఁచియతఁడు
చల్లగా మూటముల్లెయు సర్దుచుండ
నెదుటఁ బ్రత్యక్షమయ్యె లీలేందువదన.

ప్రాతఃకాలిక చంద్రమండల మనన్ భాసిల్లు నెమ్మోముఁతో
జేతన్ రొట్టెలు గల్గు పళ్ళెరముతోఁ జెంగావి హారాంజీరతోఁ
జేతోజాతకరప్రముక్త కుసుమేషీకప్రభామూర్తితోఁ
బ్రాఁతింగొల్పు నొయారపున్నడకతో వర్ధిల్లు వక్షంబుతో.

వచ్చినలీల లీలఁగని భాస్కరుఁడా యుదయార్కరాకచే
విచ్చిన వారిజంబువలె విప్పయిగ్రాలెడు మోముఁదమ్మితోఁ
దెచ్చిన పళ్ళెరంబు గొని తృప్తిగఁ గ్రోలుచు లీల కిట్లనున్.
నచ్చిక మచ్చికల్ గదుర నాణెపుమాటల తేనెలూరఁగన్

ఇనురాకచే ముడ్చికొను కల్వపువుపోలె
వదన మిట్టులు వసివాఱు నేల
నీహారబిందువుల్ నిలిచిన తామర
దళములవలెఁ గనుల్ దనరు నేల
దూర్వాంకురములపైఁ దోఁగు తుంపురలట్లు
చెమ్మటల్ మేనిపైఁ జిమ్ము నేల
పవమానకంపితాశ్వత్థపత్రమువోలెఁ
దనువల్లి వడవడ వణఁకు నేల

అద్దమున మసి తాఁకిన యట్లుగాఁగఁ
దఱచుగా నీదు చెక్కిళ్ళు మెఱయ వేల
యేల? లీల! యీలీల నీలీల చాల
జాలిగొలుపుచునున్నది సరగఁ జెపుమ!

చెప్పకుండిన నే నివి స్వీకరింప
వెడలిపోయెద వెలువెల వేఁగుసదిగొ
రైలు పోయెడు వేళయ్యె లీల! లీల!!
చెప్పు! చెప్పుము! వేవేగఁ జెప్పుమింక!

అనవుడు బాలభాస్కరుని హస్తముపట్టి కరంబు దీనయై
చనవునఁ జెప్పు నా పలుకు స్వామి! పరాకునఁ ద్రోసివేయకే
పొనరుతువంచు నెంచి యిటు పొందికతో వచియించుదాన నీ
మనమున నన్యథా తలఁపుమాను మటంచు వచించె నీ గతిన్.

ఆకాశంబున వ్యోమయానమున నిత్యం బీవు స్తుత్యుండవై
ఛాకల్ పోకలు శత్రుభూములపయిం బాశ్చిష్ణపర్జన్యంబులే

కాకుండం బచరింపఁగావలయుఁగా కాదారులంగూడ న
స్తోకంబౌ శ్రమ యింతపడ్డఁ దుద కేదోషంబు వాటిల్లునో.

నీవై శత్రుల దున్మఁగావలయునే నేర్పున్న చో నెన్ని యో
సేవల్ చేయఁగవచ్చు శత్రుజనముల్ చీకాకుమైఁ బర్వఁగా
గ్రావంబుల్ గదలించు నాయుధములం గావింపఁగావచ్చు సం
భావింపందగు నూత్నయంత్రముల నిర్మాణంబు చేయందగున్.

మంత్రింబు చేర్చి దీకిని
యంత్రింబులఁ జేయు దేని ఆయోధనపుం
దంత్రము వడినడపు మహా
మాంత్రికుఁడ వటంచు నెంతు మంత్రులు నిన్నున్.

యంత్రములు చేయు పాటవం బబ్బఁగానె
నిన్ను మంత్రులు మేధావి యన్న బిరుద
మిచ్చి గారవించెద రెంతో పిచ్చిలించి
కాన నా పలుకూఁదుమా! మానధనుఁడ!

ఏమో చెప్పిన దాఁడుదంచు మతిలో హేయంబుగాఁ జూడకే
నేమంబొప్పఁగ యంత్రముల్ సలుపునానేర్పుం గడింపంగదే
నీ మాహాత్మ్యము తేటతెల్లముగఁగాని మ్మంత యుద్ధంబులో
భూమీమంత్రులు శత్రుభూపతులరూపున్ మాపి నిన్నెంత్రుగా.

నీ నిర్మించెడు మఱలే
మానవతతి జయము గాంచు మార్గము చూపన్
నానా యోధులు నిన్నే
సేనారీతులను మెచ్చి చేతురు నతులన్.

నీవె విమానకర్తవును నీవె విమానము నడ్పువాఁడవున్
నీవె శతఘ్నికర్తవును నీవె శతఘ్నులు పేల్చువాఁడవున్
నీవె సుశస్త్రకర్తవును నీవె సుశస్త్రము లేయువాఁడవున్
గావుట కేఁదలంచి యిటుగా వచియించితినయ్య నెయ్యుఁడా!

ఈ వాక 'యింజనేరు' వయి యెల్లవిధంబుల పైకిరాఁగ నేఁ
గేవల మాత్మఁగోరుటను గేలును మోడ్చి వచింతుఁగాన నా
భావముపట్టిపోయి జనవర్యులకున్ జయమబ్బఁ జేయుమా!
యావల నీవు నేనుఁ గలియంగలమయ్య యథాసుఖంబుగన్.

అని నెనరుదోఁప బలికిన
వనితామణి మృదులవాక్యపద్ధతి కెదలో
ననయంబు మెచ్చుకొనుచును
దిని రొట్టెల 'లీల! చనెద దీవింపఁగదే!'

అంచు నామంత్రణముచేసి మించుఁబోఁడిఁ
బ్రణయదృష్టులఁ గని'పూన' కేఁచి యరుగ
శైలునందెక్కి చనియెను బాలభాస్క-
రుండు భావి భారతజీవదుండు వేడ్క.

చని వైమానికనేతను
గని వందన మాచరించి కాన్పించి యోగిన్
దనయొద్దనున్న యార్డరు
పనిచేయఁగ నాజ్ఞఁగోరి ప్రార్థనచేసెన్.

అతనిఁ గనుగొని వైమానికాధినేత
మాటుపలుకక క్షణకాల మూరకుండి

శిరము పంకించి చిఱునవ్వు చిందులాడ
నమృతనిష్యంది వాక్కుల ననియె నిట్లు.

అత్యగోచర విషయంబులఁ గాన్పించు
'మెక్సురే' మించెడు దృష్టు లీవి
పర్వతంబులఁబట్టి బంతులట్లాడించు
రమణీయ బాహు దండములు నీవి
విజయలక్ష్మీదేవి విశదవిహారంబు
సలుపు విశాలవక్షంబు నీది
ఉక్కుముక్కలఁగూడఁ దుక్కుతుక్కొనరింపఁ
దగిన జంఘాత్తపాదములు నీవి
సూక్ష్మసూక్ష్మాతి నవ్యవస్తుప్రపంచ
నిర్మితింజేయఁగాఁ జాలు నీదు బుద్ధి
కావుటను నిన్ను వేఱొక్క కార్యమందు
నిలుపుచున్నాను భాస్కరా! నేఁడె నేను.

కర్మాగారమునందుఁజేరి మఱలం గావించు నైపుణ్యమున్
దుర్మేధస్సక యింతలేని సుజనస్తుత్యుండవై నేర్చుకో
శర్మంబుంగలిగింపవచ్చు మిపులన్ సైన్యానకున్ యంత్రశా
ణ్ణిర్మాణం బఖిలంబు నీదుశేలపై నే నుంతురా భాస్కరా!

సామాన్యమేధ గలిగిన
యే మానవునైనఁగాని మృధమున్ సలుపం
గా మేము నిలుపవచ్చును
సామాన్యుల నిలుపరాదు జంత్రపుఁ బనులన్.

నీ మొగము తీరు గాంచుట
నీమార్కుల విధము గనుట నియమింప నినున్
వైమానిక సంఘములో
ఈమెయినే చనుము నీవు హిందూపురికిన్.

చాలెడు పలుయంత్రమ్ములఁ
బోలన్ నిర్మించి మాదుపొగడిత గనుమా!
లీలాభావోత్పత్తికిఁ
జాలాయవకాశ మందు జతపడుఁ జనుమా!

అని పనిచిన వినయమ్మునఁ
గనివాని నమస్కరించి క్రన్ననఁ జనియెన్
ఘనరోగి వైద్యుఁడొకె విధ
మునఁ బలికినటులు తనపని పూర్తిని జేయన్.

నాత్యుష్ణంబును నాతిశీతలమునై యాంధ్రావనీరత్నమై
జాత్యుత్సాహవివర్ధనైకగుణమై సంతోషసంధాయియై
స్తుత్యర్హంబయి సర్వసంపదలచేఁ దూఁగాడు హిందూపురిన్
సత్యార్హప్రతిభావిభాసితుఁడు మెచ్చంజొచ్చి తన్నాథునిన్.

కాంచి యభివాదనము చేయఁగా నతండు
చేరరమ్మని భాస్కరు చీటి చూచి
హర్షమొంది కర్మాగారమందుఁ జేర్చె
చేరి భాస్కరుఁ డందుల స్వీయబుద్ధి.

మఱతుపాకులు టాంకులు మహిత గగన
యానములు నాదిగాయెనట్టి యఖిలయంత్ర

సాధనమ్ములు నిర్మింపసాగి తొలుత
నందెవేసినచేయియై యందుఁ బిదప.

యంత్రములు చేయు విద్య నత్యంతదీక్ష
నేర్చి కర్మాలయమునకు నేత యయ్యె
దీక్షితుండు కుశాగ్రధీదీపితుండు
పొందగారాని స్థానంబు లెందుఁ గలవు!

తొలఁగె లేమియుఁ గలిమియుఁ గలిగె మిగుల
నెలకు వేయిరూప్యమ్ములు నిలకడగను
వేతనమ్మును గడియించు నేతయయ్యెఁ
బ్రథమసమయందె శ్రీబాలభాస్కరుండు

వచ్చు జీతంబు తల్లికిఁ బంపుచున్న
పుత్త్రుఁగనుగొనఁ దహతహపొడమి యామె
కొండలంబును వీడదు డెందమందు
ధనము కన్నను బ్రేమయే ఘనము గాదె!

క్షణములో నూత్నయంత్రంబు సలుపునట్టి
ప్రతిభచే వాఁడు ప్రభువులవలనఁ జాల
పారితోషికబిరుదముల్ పడసినాఁడు
పత్త్రికలు వానిఁ గీర్తించి వ్రాసె నాఁడు.

తల్లొకమాఱువచ్చి తనుఁ దప్పక చూడుమటంచు వ్రాయఁగాఁ
జల్లనగుండియల్ చెమటజాఱివణంక శరీరమంతయున్
అల్లన నేగి ఆజ్ఞకొఱ కచ్చటి తత్పతి వేఁడ నాతఁడున్
వెళ్లఁగరాదు యంత్రిముఖ బృందముగావలె యుద్ధభూమికిన్.

ఒక్కఁగడెకాల మిచట నీ వుండవేని
యంత్రతంత్రంబుసర్వంబు నాఱుమూఁడు
కాఁగలదు గాన భాస్కరా! కాదువెడలఁ
గాంచనగుఁ దల్లి వేఱొక్క కాలమందు.

పుత్త్రివాత్సల్యమున వ్రాసిపుచ్చెఁగాని
యుత్త్రరము వేఱెపనిలేదు తత్త్రరంబు
చెందఁగాఁబోక భాస్కరా సెలవుకొఱకు;
పనులుసాగింపు పామ్మిఁక ఘనుఁడ వీవు!

అనిపలికిన దొర పలుకులు
విని యేమియుఁదోఁచ కతఁడు వెలువెలఁబోవం
జనదని తనమనమున గని
చని బసకును గూరుచుండ క్షణకాలములో.

పత్రికలందు నిన్ గుఱిచి వ్రాసినవ్రాఁతలు చూచినాను నా
గాత్రిముపొంగిపోయె నినుఁ గాంచఁగ నువ్విళులూరు డెందమున్
శాత్రవలోకముంగెలుచు చక్కనియంత్రిము లీవు సల్పుటన్
స్తోత్రముచేసె నిన్ ప్రభుత శూరులకేడ్గడవైతి భాస్కరా!

నీటిలోఁజను నోడకూటమ్ము వేటాడు
క్రొత్త్రయంత్రమ్ము కన్గొంటివంట
వ్యోమయానమ్ముల భూమిపైఁ గూల్చెడు
క్రొత్త్రయంత్రిమ్ము కన్గొంటివంట
వేలాదిమైళ్ళుగా వెడలి కాల్చెడునట్టి
క్రొత్త్రయంత్రమ్ము కన్గొంటివంట

మందుబాంబులనార్పి బెండులఁగావించు
క్రొత్తయంత్రమ్ము కన్గొంటివంట
పొగయుమెఱుములుగలిగించి పగరఁగూల్చు
క్రొత్తయంత్రమ్ముగూడఁ గన్గొంటివంట
విసముమసిచేసి మసినైన విసముచేయు
క్రొత్తయంత్రమ్ము నొకటి కన్గొంటివంట.

నా సలహా మన్నించిన
నీ సరసత మెచ్చికొంటి నీ యభివృద్ధిన్
నీసరసనుండి గాంచఁగ
నే సలుపుచునుంటిఁ దపము నిజముగ సఖుఁడా!

అని లీల వ్రాసిపుచ్చిన
ప్రణయార్ద్రపులేఖఁ గాంచి భాస్కరుఁ డెదలో
ఘనమోద మొంది యించుక
కనుమూసుకచూచి వ్రాసెఁ గమ్మ నొకండున్.

ఇన్నాళ్ళకు నీలేఖను
గన్నారఁగఁగాంచినాఁడఁగానీ లీలా
నన్నీవు; నిన్ను నేనును
ఎన్నఁడు గనుగొంటొ తెలియఁగాఁగాదుసుమీ!

క్షణముక్రిందట మాతల్లి కమ్మవ్రాసెఁ
జూచిపొమ్మని సెలవుకై వేచియుంటి
నది లభించెడునాశ యావంత లేదు
తల్లి సేవకుఁ జాలని తనయుఁ డైతి.

అక్కచెల్లెండ్రు సోదరులైన లేరు
పెండ్లికాలేదు నాకింక వివరమేల?
అమ్మకును నేను నాకు మాయమ్మ దిక్కు
కాని యన్యులులేరు లోకాన లీల!

అతఁడు వ్రాసిన యా లేఖ యందఁగానె
తలఁపు లిగురొత్త యించుక కలఁకఁబాటి
తేటి యిటునటు నొకసారి పాఱఁజూచి
చేరి భాస్కరు తల్లికి సేవచేయ,

నిశ్చయముచేసికొని, యామె నిర్మలముగఁ
దా నొనర్చెడు కొలువును మానివైచి
భాస్కరుని తల్లి గల యింటిపట్టు చేరి
వినయవినమితగాత్రయై యనియె నిటుల.

ఓ యవ్వ! నీ కుమారుఁడు
నాయందలి ప్రేమగలఁడు నను నీసేవన్
జేయఁగఁ బుత్తెంచినవాఁ
డీయంగదె చనవు నాకు నింటం దల్లీ!

విజయధ్యానము లెల్లదిక్కుల నివే వీతెంచుడుం గాంచుమా!
ఋజుమార్గంబున బోవువారలుసుమీ హిందూజనుల్ తల్లి! నీ
నిజపుత్రుం డరుదెంచు నింక సమలో; నే నుందు సందాఁక నీ
వు జరాభీతితొలంగి నాకొలువుసం బొందంగదే సౌఖ్యముల్.

ఎవ్వతె వీవని యడుగకు
మవ్వల నా కతలు నీకు నవగతమగులే

అవ్వా! నిను సేవించెద
బువ్విడి నను సాకు రెంపుపూఁటలు తల్లీ!

నీ సాకతమున మనియెద
నీ సరసనె నిరతముందు నిను సేవింపన్
వేసారివిసువుకొన నే
నా సాయము నొడలువంచి యర్పింతుఁ దగన్.

అంచు వచియించు నా సుందరాంగి గాంచి
భాస్కరుని తల్లి యానందబాష్పములను
దండడిగవీడి కౌఁగిలియందు నామెఁ
జేర్చికొని యిట్లు ప్రశ్నించె నేదదేఱి.

అమ్మ నీ పేరు నూరునే నడుగఁగాని
పెండ్లియాయెనె నీకు నా పిల్లవాఁడు
నిన్నుఁబోలిన చక్కని నీరజాక్షి
నింతిగాఁ గొన్న నా కను లెంత తనియు.

అనవుడను లీల తగు మందహాస మొలయఁ
దలనువంచుక మాటాడఁదలఁకుచుండ
అవ్వ యదిగాంచి గ్రహియించి యామెతీరు
కోడలవు నీవె కాఁగల వోడకమ్మ.

అని బుజ్జగించి యామెను
తన కొమరుని కొక్కలేఖ తా వ్రాయించెన్
వనితామణియెవ్వతియో
నను సేవలఁ దనుపుచుండె నందన యనుచున్.

ఆ లేఖ గాంచి యాతఁడు
లోలోపలనవ్వుకొంచు లోకములోనన్
ఈలీలఁ గొలుచు కాంతలు
ఈలోకమునందుఁ గలరె యెందుల ననుచున్.

లేక క్రిమ్మఱ వీక్షించి లీల వ్రాసెఁత
యే యదంచును మది నిశ్చయించి వ్రాసె;
తల్లి! యా కాంత సేవ నీ తనయు సేవ
గాఁ దలంపు మటంచును క్రమలేఖ.

ఆలేఖ గాంచి తల్లియు
లీలావిమలేందుముఖియుఁ బ్రిదులని ముదమం
దోలాడియాడి భాస్కరుఁ
నోలాడింపంగ్ప్రసౌధమొక్కటి యప్పుడే.

కట్టించి చలువరాళ్ళను
పెట్టించి యనేకచిత్రబృందముఁ దలియున్
పట్టినిఁ గనుఁగొన వార్వఁగ
నెట్టనఁ బ్రియురాక లీల నెమ్మదిగోరున్.

అత్తఱి బాలభాస్కరుఁడు సమ్మనుగాంచఁగ రాజునాజ్ఞచేఁ
బత్తనమైన హిందుపురిఁ బాసి రయంబున నేగుదెంచి, సం
పత్తోకయింతలేని తనపాకను దొల్లిటి నుల్కమంచమం
దొత్తిలిపండుకొన్న తలి నొయ్యనఁ గన్గొననెంచి పోవుచో.

పాక గల తొంటిచోటను బైఁడిమేడ
పరఁగియుంటకు సబ్బురపాటు చెంది

తల్లి గనుఁగొనఁ దహతహ పెల్లు రేఁగ
సాధమును జొచ్చి చరచర జనుచునుండ.

కాలకృత్యములకై కదలెడు తనతల్లి
కండగానిలఁబడు నట్టిదాని
సంచరింపఁగశక్తి చాలని తనతల్లి
కన్నమ్మతినిపించు నట్టిదాని
కాలయాపనకుగా కబురులుమెలమెల్ల
బలుకుచు నానందపఱచుదాని
మెల్లగాఁజాచిన తల్లిపాదమ్ములఁ
బదిలముగఁ బిసికిపట్టుదాని
కునుకు తనతల్లి మొగముపై గుయ్యుమనుచు
వాలు నీఁగల నల్లన పైఁటచెంగు
తోడజోపుచు మంచంబుకోడు నాని
కూరుచుండిన ప్రాయంపుఁ గొమరుదాని.

చకితచకితాక్షులను గాంచి సరస కేగి
నిలువఁబడఁగానె లీలయుఁ గలఁగఁబాఱి
యెడఁద దడదడమనుచుండ నెదుట నిలిచి
యేటికోళ్ళను ఘటియించి యిట్టులనియె.

ఓ యవ్వ! కనులు విప్పుము
నీ యర్భకుఁ డిడిగొ వచ్చి నీకడ నిలిచెన్
లేయమ్మ! లెమ్ము వేగమె
చేయును నీసేవ కొడుకె చేయిటునిమ్మా.

అని యామె లేవఁగానిడఁ
గని పుత్త్రుఁడు బాష్పజలము కన్నుల రాలన్

జననీపదములఁ గడుగుచుఁ
బనివడి సాష్టాంగమెరఁగి ప్రక్కకు నిలువన్.

వణఁకుకరములఁ దనయుని తనువు తడవి
చేతులారంగఁ గౌఁగిలిఁజేర్చి చేర్చి
సంతసమ్మున మైమర్చి కొంతసేపు
ఎలుఁగువేఱొకలాగుగా నిట్టులనియె.

నా తండ్రి! వచ్చినావే
యీ తన్విని జూడు మీమెయే గతి నాకై
యీతఁడిదాఁకను సాకెను
ఈ తరుణిని బెండ్లియాడి యెత్తుము సుతులన్.

నీ కడుపుపండఁగానే
నా కన్నులు తనియఁగాంచి నా మనుమల; నే
నాకము చేరంగందును
శ్రీకృష్ణుఁడు కూర్చుఁగాక సేమము మీకున్.

బుద్ధిమంతుఁడవై నీవు పుత్త్ర! చదివి
యింతవాఁడవుకాఁగానె సంతసమునఁ
గంటి మంటిని వేఱేమికాంక్ష లేదు
పుత్త్రకుల నెత్తు మీపూవుఁబోఁడి వల్ల.

నెలనెలకు నీవు పంపిన
బలుధనమును ముట్టకేను బాబూ! యిదిగో
నెలరాల మేడ గట్టితి
నెలఁతయు నీవు సుఖపడుఁడు నిలకడఁగ ననన్.

తల్లీ! నీ యాజ్ఞను నే
నెల్లప్పుడు దలఁదాల్చి యేలెద సతిగా
ఫుల్లాబ్జనేత్రి లీలను
ఉల్లంబునఁ గోరినట్టి యువిదయె, యనఁగాన్.

ఆ పలుకాలకించి దరహాసమరీచులు చిందులాడఁగాఁ
జూపులుతూపులై పరగ క్షోణితలంబును గాలివ్రేలితోఁ
దేపకు రాయుచున్ శిరముఁద్రిప్పక తెప్పలనార్చు లీలతో
నాపె వచించె నిట్టులను సాదరమేదురమైన వాక్కులన్.

ఓ వామనేత్ర ! లీలా !
మా వాఁడెటు నాదుమాట మన్నించె నటే
నీవును మన్నించుము మా
పావనవంశమున కీవె ప్రాప వసంగా.

ఆ వృద్ధురాలి మాటలు
పూవుందేనియలువోలెఁ బుష్టిని గూర్పం
గా వా రిరువురు నత్తఱిఁ
బూవిల్తుఁడు రతియుఁ బోలెఁ బొలిచిరి మిగులన్.

నాఁడు స్వకీయరాజ్య జయనాదము లెల్లెడ మ్రోఁగుచుండ్లు నా
మేడఁ బ్రవేశమున్ సలుప మేకొని నాఁటనె భాస్కరుండు పూఁ
బోఁడిగ లీలఁ గైకొనియె భోరుకలంగెను దూర్యనాదముల్
వాడనిపూవులం గురిసి వారక హారతులెత్తి రంగనల్.

బాచని పెండ్లిఁ గాంచఁజని వాడలవాడలనుండి యెండలో
వాచవియైన పల్కులను వాని యనూసనవీనసంపదన్

పూచిన మోములంబోగడి "పోదుము మేమును బాలభాస్కరా!
నీచెయియూఁతయిచ్చి మము నిల్పుము నీచనినట్టి స్కీమునన్".

అని ప్రార్థింపఁగ భాస్కరుఁ
డనయము ముద మొందె వారినందఱఁ గూడన్
తనువంటివారిసలుపఁగఁ
గనికర మెద నొదవఁ జదురు గల్గుటమిగులన్.

ఎవరివిద్యకుఁ దగినట్టి వృత్తి వారు
నేర్వఁగాఁ దగు నాయంబు నేర్పుమీఱ
సలిపి శ్రీబాలభాస్కరుఁ డెలమి దనదు
బంధువర్గంబు సంతోషవార్ధిఁ దేల్ప.

కొందఱు చని ఉయ్యూరుకు
కొందఱు బెజవాడ కేగి కొందఱు గుంటూ
రుం దరిసియు మద్రాసుకుఁ
గొందఱరిగి నేర్చికొనిరి కోరిన వృత్తుల్.

విజయశ్రీ యను నామము
నిజసౌధమ్మునకుఁ బెట్టె నిఖిలాప్తజనుల్
విజయోస్తని దీవింపఁగ
ఋజుమతి భాస్కరుఁడు రామకృష్ణుని కరుణన్.

ఆ బాలభాస్కరుని దీ
క్షాబలమునఁ జేసి భరతఖండము సవ్య
శ్రీబంధురమై యోజః
శ్రీబంబై వెలసెఁ గీర్తి కిమ్మారితమై.

భాషల్ నేర్చియు సత్కళాగరిమ సంపాదించియున్ భుక్తికై
శోషంబొంది పరాశ్రయార్థము దిశల్ శోధించువీనుల్ నవో
న్మేషంబారఁగ భాస్కరాభి హితసందేశంబునన్ స్వక్రియా
న్వేషుల్ లబ్ధనిజాభిలాషులయి సందీపించి రంతంతకున్.

వృత్తిలేకున్న వారికి వృత్తులొదవె
పిఱికిపందల కండలు బిఱుసువాఱె
భరతభూమికి సంపద లిరవుకొనియె
బాలభాస్కరు పథమెంత భాగ్యపథమొ.

అనుపమగుణహారా! యంత్రతంత్రాబ్ధి ధీరా!
జనగణనుతవీరా! శాస్త్ర విద్యావిహారా!
ఘనకలుషకుఠారా! కావ్యమాలోపహారా!
వినయ బహుళభారా! విశ్వవిజ్ఞానసారా!

# చంపకమాలినీ పరిణయము.

కలుముల నెలవగువాఁడా!
వలఁతియగు తెలుంగురాజు బలుచెలికాఁడా!
కలకల నవ్వెడువాఁడా!
ఎలరుచు మదిగలఁడ! రామకృష్ణ! బలియుఁడా!

కలిమి నెలంతకున్ వలచుగాఁపురమై బువి తెల్లదీవి నాఁ
జెలువగు భద్రాద్రిని జెన్నలారుచు బత్తిఁగొల్చు వా
రలకును బత్తిముత్తులఁ దిరంబుగ నిచ్చెడు రాగవయ్య లోఁ
దలఁచెద నిచ్చనిచ్చలెడఁదం గల కోర్కులు నివ్వటిల్లఁగన్.

ఏతల్లి యేప్రొద్దు నినుమడించిన ప్రేమ,
బమ్మదేవర యింటఁ బరఁగుచుండు
నేయమ్మ కయితమ్ము వ్రాయఁదొడంగినఁ
గనులఁగట్టినయట్లు గానఁబడునొ
యేయప్ప తనుఁగొల్చు నెల్లవారల మది
తమ్మిగద్దియలపైఁ దనరుచుండు
నేయవ్వ వీణియ నింపుగాఁ బలికించు
మొలకలమదిఁ దెల్వి మొలకలెత్తు
అట్టి మాయమ్మఁ బ్రోఁబల్కు పుట్టినమ్మఁ
బలుకులమెలంగు విన్నాణి సలువరాణి
నచ్చుపుంబత్తి నిచ్చలు మెచ్చికొలుతుఁ
గేలుదోయిని నొసటను గీలుకొలిపి.

సన్న్యాసదీక్షను నె
అన్నను సోమన భాస్కరయాజను సూరి పో

తన్నను శ్రీనాథుని బె
ద్దన్న మొదలు కై సరులను దలఁతును మదిలోన్.

తల్లిదండ్రులయాన దాఁటక నెఱవేర్చు
కొడుకుల నడవడి కొఁడయఁ డెవఁడు
పెఱజవ్వనులఁ దల్లి పెరిమెను గనువారి
యొకయాలినోముల కొజ్జ యెవఁడు
తనకన్నమిన్నగాఁ దమ్ముఁగుఱ్ఱలఁ గాంచు
నన్న లెల్లరకుఁ గన్నాకెవండు
బాగోగు తనదిగాఁ బజనచ్చునటులేలు
రాచమిన్నలకుఁ దార్కాణ యెవఁడు
అట్టి నికరంపుమానిసి యైన ప్రొద్దు
వంగసపుఁబొలమున్నిటి పండుచందు
రునకు మేల్మల రామచంద్రునకుఁ దద్ద
బత్తి నీ క్రొత్తపొత్త మప్పన మొనర్తు.

సిరులకు నెలవును విద్దెల
కిరవును నగు తెలుఁగుసీమ నెపుడెడలని రా
సిరిగల్లు గుండవనమనఁ
బరఁగెడి ప్రోలొప్పునేల పడఁతికిఁ దొడవై.

నెలతాలవలెఁ జాల వెలిచాయగల యాల
మెఱుఁగారు కడుబారు మేఁడగములు
పెఱయేలికల పోఁజు చొరరాని వెలలేని
బీఁటపోటులు లేని కోటగములు
తొమ్మిదిరతనాలు సమ్మ రాసులుగాఁగ
హెచ్చు తుఱఁగలించు రచ్చగములు

పున్నెపుమిన్నెటికన్నను మిన్నలౌ
పాటుపోటును లేని వేటిగములు
రమణఁజెలువొందు సలయరదములగములు
క్రేళ్ళు దాఁటెడు పెంపుడు లేళ్ళగములు
మేలుపరుపులు గలుగు జట్కాలగములు
గలిగి యొప్పారు నవ్వీడు నిలకడగను.

అడవియేనుఁగ లీఁదెడు నంత లోఁతు
పాఁతునుం గల్గి వెడఁదలై పరఁగుచున్న
యగడితలఁ గాంచి గుండియ లవియఁ దలఁగి
దవ్వులన యుండి పగతురు తలఁగుచుండ్రు.

పోరణ గండ్లగుండవడిఁ జొచ్చి నెలంతల గన్నుఁద్రొమ్మి బం
గారుమెఱుంగు గుబ్బల నిగారపుఁబైటఁ దొలంగఁజేయుచున్
గారవమొప్ప గప్పురను గందపుఁదావిని గూడిమాడి యే
తేరుచుఁ బిల్లగాడ్పులు తేఁకువ వీడఁగఁ జేయు నెల్లరన్.

కోరిక నా పొర్లెంగల
వారువముల కోడె లేళ్ళు వందెమ్మోడి వే
పాఱఁగ నోడుటఁగాదే
కారాకులఁ దినుచుఁ దిరుగుఁ గానలవెంటన్.

పట్టుపకాసులై పగలు పగ్గెలు గొట్టుచు నెత్తి రాఁగ నె
పట్టున సందునీక పలుబారులు తీర్చి యొడళ్ళురాయుచున్
గుట్టలువోలె దట్టముగఁ గూడిమెలంగెడి గున్న యేనికల్
పెట్టనికోటలై మిగుల బింకముమై నడయాడు నెల్లెడన్.

ఏటునకేఁ బదుండ్రడ పని నీల్గఁగఁజేయఁగఁజాలు జోదు లా
వీటను నాల్గుమూలలను వేలును లచ్చలు దిర్గుచుండఁగాఁ

మాటరిమాసినుల్ మిగులఁ దుంపుచు కొప్పుఁగ నాటు పగ్గెలన్
నోటనుగ్రక్కుకొంచు మది నొవ్వఁదు రక్కజ మప్పి నాడఁగన్

కులుకుచుఁగోడెకాండ్రు తమ గోమునుజూప సిగాను రేగుచో
దలుపుల చాటునుండి వెలతామరకంటులు తొంగిచూచుచున్
దొలకరి మించుతీవలనఁ దోఁచు మెయిన్ జిగి తళ్కుపర్వఁగా
గలఁతురు వారి డెందములఁ గన్నుల సన్నలఁ నెంతజాణలో.

పోఁకచెక్కలు రెండు ప్రాఁబోఁడి! యిటులిమ్ము
మంచిసాములెలెండు మరలరండు
పొన్నపూవుల నెట్లు పోలఁతి! యమ్ముచునుంటి
కొనెడుబేరంబులె కొంటెవాఁడ!
తామరతేకులఁ దాఁకవచ్చునె చెలి!
తగినవారలయేని తాఁకవచ్చు
తేనియనొక్కింత యానిచూతునె నాతి!
యానినంతనె వీడనగునె నీకు
నంచు నా వీటివాడల నన్నికడలఁ
బోఁకలాకులు పూవులు పుట్టతేనె
లమ్ముచుందురు జవ్వను లెమ్మకాండ్ర
పలుకులకు మాఱుపలుకుచుఁ గులుకు లొలుక.

మేడల రాచకన్నియలు మేకొని చక్కనెలుంగు లెత్తుచున్
వీడక యెల్లపొద్దులను వీణియదంతుల వ్రేళ్ళమీటనా
జాడలు కోయిలల్ వినుచు సంబరమందు మునుంగ డెందముల్
పాడఁగ నోరురాక యలవాటొనరించును వారిపాటలన్.

పచ్చికమేసి చన్నవసి పాలుపసంటుల నింపనిచ్చుచున్
హెచ్చుగనుండు కొట్టముల నెన్నియొ యావుల క్రేపు లద్దిరా

పొచ్చెముఁదీర్చు నందఱకుఁ బొల్పుగనా; నీకఁ బైరుపంటదా
పెచ్చు బళారె! పాఁతఱలు బెట్టఁగ నేలయె చాలకుండెడిన్.

అఱిమిఱి నవ్వీటంగల
వరిచేలను గాచునట్టి పడుచులసొబగుల్
తెరువరులు గాంచి మనములు
గరఁగుడుఁగదలంగలేక గదలుదు రచ్చోటున్.

అఱువదినాలుగు సరిదివిద్దెల నేర్చి
బమ్మదేవర నవ్వు పాఱు లొకట
చిచ్చుఱపిడుగుల జేతులఁ జిదిమొడు
ఱాతిగుండెలు గల రాజు లొకట
నాయంబు విడనాడి నేయినూనెలఁ గల్పి
పచ్చెమ్ముచేయని బచ్చు లొకట
పలుతెఱంగులయిన కొలుచులు పండించి
కాటియఁదీర్చెడి కాఁపు లొకట
నేలజోలసువ్వాలల నాలతించి
వట్టిమ్రోడులు చిగురులు పట్టునట్లు
పాటపాడెడువారల బారు లొకటఁ
దనరుచుండెడి నివ్వీటఁ దఱచుగాను.

కడిఁదిమగలైన దవ్వాల పుడమిఱేండ్లు
తనదు మగఁటిమి కోర్వక తఱిని గప్ప
మిచ్చి మనుచుండఁ బజలెల్ల మెచ్చునటులఁ
గుందవన మేలుచుండుఁ గుళిందకుండు.

కఱకంఠుమలయీడు గాలేక వెలియయ్యె
దిట్టరయా నాతేని బిట్టుఁ గాంచి

మున్నీరు తెరలుగా మొఱపెట్టికొనుచుండఁ
గానలేని యాతేని గుట్టుఁగాంచి
పురుడురానని జలి పుడమిక్రిందనె డాఁగె
నెమ్మలే కిడు తేని యీవిఁ గాంచి
వలరాజు సిగ్గుచేఁ దలఁకి కన్పడఁడయ్యె
మెఱుఁగారు నాతేని మేనిఁగాంచి
అంచుఁ బజలు తన్ను నరుదంది పొగడఁగా
లచ్చిమగని నెడఁద నిచ్చలునిచి
యీడుజోడు లేక యీరేడుజగములఁ
నేలప్రొద్దెఱింగి యేలు నతఁడు.

మందువేసఁగి రేయి గుండెలఁ జేయిడి
గూరుకు చెందనివారు లేరు
తోఁకచుక్కలబోని దుడుకుప్రగ్గడ బారిఁ
బడి కీడ్వడిన పేదవారు లేరు
"పన్ను లెక్కవగట్టి తన్నుచుండిరి బాబు!
బ్రతుకలే"మని యేడ్చు వారు లేరు
"క్రొత్తగంజైనను బొఱ నిండదు తండ్రి!
దారేమి?" యని కుందువారు లేరు
ఆతఁ డేలెడి యేసీమ యందు నెందు
రాగవుఁ డొకండు సాటియన్ వ్రాఁతకాని
యతని కతఁడొక్కఁడే సాటి యగును బజల
యిచ్చ గుఱితించి పుడమిని నేలుటందు.

చదువు నూరక చెప్పెడి చదువుబడులు

బీదసాదుల కిడినట్టి పెరటిచేలు
నతనియేల్బడి నూరూర నడరుచుండు.

బిచ్చగాండ్రిల పాలిటి వేల్పుగిడ్డి
పొత్తములుగూర్చువారికిఁ బుడుకుఁ గల్లు
కల్లలాడెడువారికి బల్లెమూర !
యతని గొనములఁ గొనియాడ నలవి యగునె.

పొలివోని తూరతేరు బోఁదోలుటను మింటి
కుంటివాఁ డొకఁడు నీ వంటివాఁడు
వాత్రిఁతకోఁతలలోన వాసిఁగావుట నోంటి
పంటివాఁ డొకఁడు నీ వంటివాఁడు
చెలిమిని నిలుకడ గలిగి యుంటను మంటి
యింటివాఁ డొకఁడు నీ వంటివాఁడు
నెట్టన పట్టిన పట్టు నెట్టుట మంట
కంటివాఁ డొకఁడు నీ వంటివాఁడు
'జియ్య' యని బట్టు వారు జేజేలు వెట్ట
దిట్టలకునెల్ల దిట్టయై యిట్టిఁముగ
గుట్టు మట్టును జెడక యెప్పట్టునందు
బిట్టు మెఱసెడి నా రాచపట్టు తోడవు.

మేలిగొనములదీవి రామెలఁత మిన్న
నిందుమతిని బెండ్లాడె గుళిందకుండు
పేదసాదల కాయమ్మ వేల్పుటావు
వారినెయ్యంబు తియ్యంబుఁ బలుకఁ దరమె!

పొలదిండి చేతిలోఁ జలను జిక్కడ యేని
సుడిమిసూఁతురు కొంత పోలునేమొ

యరపది మగలతో నలరకుండిన యేని
ద్రోవది యించుక తూఁగునేమొ
కలప్రొద్దు నొకచోట నిలిచియుండున యేని
లచ్చి యించుక పోల్కి వచ్చునేమొ
యలుకఁ దెల్పెడిపేరు కలిగియుండద యేని
యమ్మిక పురుషు తా నగునయేమొ
యనుచుఁ జెప్పంగ నొప్పెడి యామె నెన్న
పలుకుల వెలంది మగఁడును బాపఱేఁడు
వలఁతులొక్కింత కారని తలఁచు చుండఁ
జెప్పనేటికి నాయప్ప యొప్పిదములు.

ఇట్లు వెలుఁగొందు నాల్మగ లిరువురొక్క-
నాఁట సెజ్జపైఁగూర్చుండఁబోఁటి మగనిఁ
గాంచి కేల్మోడ్చి కన్నీరుముంచియొత్తు
నల్ల మెరియంగ నిట్లనె మెల్లఁగాను.

పిల్లలఁ గాంచని యెడ నా
యిల్లాలును మగఁడు గూడ నెప్పుడు బద్దెన్
బెల్లుగఁ బడువా రనుచును
దెల్లంబుగఁ దొలిపలుకులు దెలిపెడిని గదా!

కాయంపుఁ దావిని గందంపుఁ దావిగా
నేచాన పీల్చఁగా నోఁచుకొనునా
చెయ్యియడ్డముపెట్టి పయ్యెద చెంగున
నేయింతి బిడ్డని నెత్తికొనునా
యుయ్యాలలోఁ బెట్టి యూఁచి జోలలుపాడి
జోకొట్టి నేఁబోఁటివారుఁ గనునా

పనిచేసి కొనుచుండఁ జనుబాలకై యేడ్చు
కొడుకు బుగ్గ చేడె పుడుకుకొనునొ
యాకెపుట్టువ పుట్టువ యరసిచూడ
నామె చెలువంబు చెలువంబు సామి నమ్ము
మెన్ని సిరులున్న నేమగు నెంచిచూడ
లేబరముగాదె? బిడ్డలు లేని బ్రతుకు!

తబ్బిబ్బుల్ పడి తప్పుటడ్గులిడుచున్ దల్లీ! యటంచడ్డురా
"నబ్బాయీ!" యని ముద్దులాడికొని తా నల్లంత పైకెత్తుచున్
"బబ్బో నాయన! బూచివచ్చె నదిగో బంగారుతండ్రీ!" యటం
చబ్బాలాడుచుఁ గూర్కఁజేయు సిరి యాహా! యెప్డు నాకబ్బెడిన్.

అను నాలిం గని మెదలోఁ
బెనఁగొను నమ్మలికమూఁగి బేలా! యిటులన్
బనిగొని వగవఁగ నేలా!
మునుచేసిన పున్నెమున్నఁ బుట్టరె బిడ్డల్.

అదియును గాకోయుగ్మలి!
తుది నీవన్నట్టి మాటఁ దోఁచెను గంటే?
ఎదపై నెప్పుడుఁ బాపనిఁ
గదియించుట లనెడునట్టి కతలెమ్మయితోన్.

కావునబైదలి! తప్పక
యీవన్నట్టులను గొడుకు నెప్పుడొగాంచన్
బోవలె నిజమ్మిది యగున
యీవంతయు గుందకుండు మన పడఁతుకయున్.

అమ్మకచెల్లరో! యొడయఁడ!
నమ్మకముం గలిగి యుండు నాలీ యంచున్
ముమ్మాఱు పలికి నంతన
యిమ్మెయి గోడుకెట్లు వచ్చు నిప్పుడ తలఁపన్.

కాఁపురమునకు నే వచ్చి కడచె నొక్క-
నలుబదాఱేండ్లు నాకేమి! కలుగుప్రేమి!
బిడ్డ లిఁకమీఁద సరిసరి దొడ్డవారి
యిట్టివిడ్డూరమూర! యెందేని గలదె?

అనెడి తనయాలిఁ గను గొని యంతఁ జనియె
నేమి? పొలఁతుక! యంటివి గోము తఱిగి
నేఁడులేమి రేపుసిరినా నాడు మాట
విన్నదియకాద! చాబాసు! సెబ్బాస!

అనుచు నిఁక నేము ఱేఁడు తా నాడుచుండ
నెగ్గడి యొకండు చనుదెంచి నేర్పుమీఱ
జియ్య! యిదెపరాకనుచును జెయ్యియెత్తి
దవ్వులన యుండి జోతలు తగ నొనర్చి.

సామి! బోయవాండ్రు చాలమందేలకో
వచ్చిమోసలకడ పెచ్చుపెరిఁగి
"కుయ్యో మొఱ్ఱో" యనుచుఁ గుయ్యిడుచుండిరి
యేమికతమొ గాని యెఱుఁగమయ్య!

అనవు డప్పలుక్కు లాలించి యతనిఁ బనిచి
పడకటిలు వీడి యొయ్యన బయలు జేఱి

అమ్మకచెల్లరొ! యొడయఁడ!
నమ్మకముం గలిగి యుంపు నాలీ యంచున్
ముమ్మాఱు పలికి నంతన
యిమ్మెయి కొడుకెట్లు వచ్చు నిప్పుడ తలఁపన్.

కాఁపురమునకు నే వచ్చి కడచె నొక్క-
నలుబదాఱేండ్లు నాకేమి! కలుగు టేమి!
బిడ్డ లేకమీఁద సరిసరీ దొడ్డవారె
యిట్టివిడ్డూరమూర! యెందేని గలదె?

అనెడి తనయాలిఁ గను గొని యాతఁ డనియె
నేమి? పొలఁతుక! యంటివి గోము తఱిగి
నేఁడు లేమి రేపుసిరినా నాడు మాట
విన్న దియకాద! చాబాసు! వెఱ్ఱిదాన!

అనుచు నీక నేము ఱేఁడు తా నాడుచుండ
నెగ్గడి యొకండు చనుదెంచి నేర్పుమీఱ
జియ్య! యిదెపరాకనుచును జెయ్యియెత్తి
దవ్వులన యుండి జోతలు తగ నొనర్చి.

సామి! బోయవాండ్రు చాలమందేలకో
వచ్చి మోసలకడ పెచ్చుపెరిఁగి
"కుయ్యో మొఱ్ఱో" యనుచుఁ గుయ్యిడుచుండిరి
యేమికతమొ గాని యెఱుఁగమయ్య!

అనవు డప్పలుక్కు లాలించి యతనిఁ బనిచి
పడకటిలు వీడి యొయ్యన బయలు జేఱి

# చంపకమాలినీ పరిణయము

మేలిదుస్తులఁదాల్చి నిండోలగంబుఁ
జేరి గూర్చుండి బోయలఁ జీరుఁడనిన.

కిఱ్ఱుచెప్పులు పెద్ద కీచువెదుళ్ళును
గొనవంకకత్తులు కొండసికలు
నిత్తడిపోఁగులు నీఁటెలు బల్లెముల్
బొట్టలుగలకత్తి పోటియొడళ్ళు
గండ్రగొడ్డండ్లను గడుసెలగోలలు
నురిత్రాళ్ళువలలును నుండబద్ద
లొరగట్టుపంచెలు బెరసుగడ్డంబులు
సికిలియోఁక లకోరి పెద్దపొదులు
గలిగి వెఱఁగంది వింతఁగఁ గనులఁగనుచు
వచ్చి బోయలు గద్దియ బద్రముగను
గూరుచున్నట్టి యేలికఁ బాఱఁజూచి
దండములుబెట్టి కొంచెము దరికి వచ్చి.

పిల్లిగడ్డలు మంచి పిల్లసగోవ్రులు
మెకపుబొమ్మలమేలి రకపుఁబండ్లు
వెదురుప్రాల్ తేనెలు వేఁపిముత్తమ్ములు
పికిలిపిట్టలు బలు మెకపుఁదోళ్ళు
గండంపుఁజెక్కలు. పందికొమ్ములు పెద్ద
యేఁదుబందీఁకలు నింగువులును
నెఱజువ్వికట్టలు గురువింద పేరులు
నెమ్మిజుట్లులును దానిమ్మపండ్లు
వెలఁగ, సక్కెరు, టూగిసంపులను దెచ్చి
జేని ముంగలగాఁ బెట్టి రెండుచేతు

లెత్తిఁ దొరగారు! దండంబు లివిగొనుండ"
టంచు బొబ్బల సవరించి పొంచియుండ.

ఏలికయు వారి కాన్కల నెల్లఁ గొనుచు
మెకపుగమి వెఱఁగులు లేక మీరలెల్ల
సుకమునున్నారె మీతీరు చూడనాకు
వేఱొక తెఱంగుగాఁదోఁచె వినుచుఁ డనిన.

బొబ్బ మెకంబులు బెబ్బులు లొకచోట
సివ్వంగు లొకచోట చిఱుత లొకట
కొండ్రముచ్చు లొకట గండుఁబిల్లు లొకట
కాఱెనుబోతుల గమి లొకంట
మనుబిళ్ళు గణఁజులుఁ బెనుకొక్కు లొక్కట
నుడుతలు పావురాల్ మిడుత లొకట
నడవిపందు లొకట యాలపోతు లొకట
వెఱపులేకతిరుగు వఱడు లొకట
సరవిఁ గారించుచున్నవి సత్తెమయ్య!
కల్లలాడంగబోమయ్య! చల్లనయ్య!
దబ్బఱాడిన తేఁడ! మా యబ్బతోడు
అడవిలోని పోలేరమ్మ యడుగుదోడు.

మొలకలెత్తిన వరిచేల మొలక లన్ని
నేలకలనెత్తు బలుచిన్న చెట్టు లన్ని
చిగురుపట్టుచు నున్నయా చెట్టు లన్ని
నేలమట్టముగాఁ జేసె మూలముట్ట.

జొన్న సజ్జలు రాగులు మున్నుగాఁగఁ
గందపెండలముఁ బసుపుఁ గడలు గాఁగ

# చంపకమాలినీ పరిణయము

నెల్లపైరుల దుంపల కొల్లగాను
బాడుపానరించె మెకములు బలిసి తిరిగి.

గొఱ్ఱెపొట్టేళ్ళు పొగరెక్కి క్రుమ్మ వచ్చు
నేమిచెప్పుము మా వ్రాఁత యేలినయ్య!
గుడ్డిగవ్వకుఁ గొఱగాక గడ్డిగఱచి
తిరుగుచుంటిమి గానలఁ దెఱపిఁ గనక.

పోతురాజు కొఱకుఁ బొట్టేళ్ళఁగొట్టించి
యూరుదయ్యములకు నూఱుకోళ్ళఁ
గోసి జాతరలను జేసియుఁ జాలఁగ
విసిగి విసిగి మేము వేసరితిమి.

కాని మెకమొక్కటేనియు వానివలనఁ
జావఁగాలేదు చాలేదు గావుమయ్య
నీటముంచినఁ బాలముంచినను నింక
నీదె భారము గాపాడు నేలఱేఁడ!

తటుకున నీవచ్చోటికి
దిటమున రాకున్న ఱేఁడ! తీసెడి నుసురుల్
ఘుటముబ్బు మెకము లచ్చట
నెటువలె బ్రోచెదవో మమ్ము నెలమిఁ దలిర్పన్.

అనిష్టిబోయలుష్టికుయ్యిడఁగను
గనికర మెదఁ గడలుకొనఁగఁ గనుఁగొని వారిన్
బనుపడఁ జేసెద మిమ్ముల
మనమున వెఱఁ జెందవలదు మాటికి నిట్టుల్.

అనుచు వారల నోదార్చి యందఱకును
బోనములువెట్ట లెంకల కానవెట్టి
వేఁటవెడలంగ వలయు నీ పూఁట ననుచుఁ
జాటఁబంచుచు వీటను నాఁటిక్రొలువు.

చాలించికత్తలానుల
వాలాయము పూనఁబంచి వలలుం గత్తుల్
క్రోలలు మున్నగువానిని
గీలెఱిఁగిన వారిఁ బూన్ప గిల్లాకిడుచున్.

పగ్గడలు దాను మిగిలిన బంటులెల్ల
వెంటనే కోట వీడియు వేఁట కొఱకు
వెడలె నా బోయలను గూడి పుడమిఱేఁడు
మెకములను గూల్చి వారికి మేలు గూర్ప.

నిగనిగల్ నెఱపెడి నిడుద లాటంబును
జిలుగు చేఁతలుగల జీన మొకటి
హురు ముంజిముత్తెముల్ తుఱిమిన పళ్యంబు
పచ్చ పట్టెడ నట్టి పక్కెరయును
బుల్లంటురాళ్ళడ్డ మొగముట్లు తుఱఁగలి
దంగు మెఱుంగులు రంగుపనులు
డాకెలంకున సిరా జీకరాచురు కత్తి
వలపటఁ గ్రొవ్వాఁడి వలపుఁబొదియు
బికిలిపిట్ట తురాయియు వెలుఁగుచుండు
వారువమ్మును ముంగలఁ బరఁగనొక్క
లెంక గొనివచ్చి నిలుపఁగ జంకులేక
రాయఁ డద్దానిపై నెక్కి రహిఁ జెలంగ.

డక్కయు, డవిణయు, డమరును
జక్కళి కాళెలును, డప్పు జాలుల యులివుల్
పిక్కటిలి దెసల నెల్లెడ
నొక్క మొగిన్ మాఱు మ్రోఁగుచుండఁగ నంతన్.

రాజు దలఁచినఁ గాదువేమి? రమణ నిట్టు
లెల్ల బలఁగము దళముగ నేగునప్పుడ
పొంగి పొరలెడు సంద్రంబు పోల్కిఁదోఁచె
నేమి చెప్పుదు నానాఁటి యింపు సొంపు.

గుఱ్ఱపుడెక్కల యదుమున
జఱ్ఱున దుమ్మెగయ రేఁగి చదలంటంగా
నిఱ్ఱింకులింకుచుండెడి
నఱ్ఱాడుచు మింటి వాఁక యత్తఱి నౌరా!

ఇట్లు తఱిమి నడుచునెడ నెదుటఁ బాల
పిట్ట లెగిరి దారినిఁ జూప నిట్టలముగ
మేళ్లు కలుగునటంచు నెమ్మని నడల్ప
వాజి, ఱేఁడు దాని నడల తేజు చూచి.

రసగాలులకు నీడు రాక గొప్ప పటాణి
సిగ్గున పొదలలోఁ జిక్కుచుండు
జోడనలకు వింజోసుగాఁ గాలేక దా
బమ్మదేవర మూపు పడియె నీట
జాలములను గూడఁ జాలఁగా నోపక
ప్రొద్దుబాబా పాఱి పోవు మింట
వాళియ నొకమాఱు వాలుగూడఁగలేక
కఱ్ఱివేలుపు తేజి కాళ్లు ముడుచు

నార! వారువము నడలు వేఱువేఱ
తేప తేపకు మాఱుట పాఱఁజూచి
వేలుపుల వారువమ్ములె వెఱఁగుపడెడి
నెట్టి రాతులు కట్టడ పెట్టినారొ.

ఇట్టులన్ నడువంగ త త్తడి యేపు మీఱుచు వ్రేల్మిడిన్
గట్టులన్ మఱి గుట్టలన్ బడి క్రంతలెన్నియొ దాఁటుచున్
జిట్టికానలఁ జొచ్చి యంతటఁ జెట్టుకొమ్మలఁదాఁక కే
నెట్టుకొంచును బెద్దకానను నేర్పునంబడి పోవఁగాన్.

బోయ నాయకులందఱు మూఁగికొనుచు
ముందఱకు వచ్చి మెకముల మందలున్న
తావులను జూప నాయండు త త్తడి నటు
దఱుము కొంచును వేవేగ నరుగ నెదుట.

చంగుచంగున నోరు సాచి హుమ్మనుచును
బైకి వచ్చుచునున్న బంటుమెకము
లడ్డంబు నిడుపు నా పడ్డలఁ బోలెడు
మను బిళ్లు మీఁదికి మలసిరాఁగ
నొవ్వని వారు నాఁ జివ్వకుఁ గాల్ద్రవ్వ
సివ్వంగి కదుపులు క్రొవ్వుమీఱ
జము నెక్కిరింతను జాడించి కుమ్మెడు
నెనుబోతు తుటములు మునుకొనంగ
మాఱు తిరిగిన యేనుఁగుల్ మాఱు తిరుగఁ
గొండ్రముచ్చులు పల్లును గొఱకుచుండ
గండు బిల్లులు చెలరేఁగి గండు మిగుల
గాంచి రాయండు నిప్పులు కనుల రాల.

వేఁటకాండ్రను లెంకలఁ బెద్ద యెలుఁగు
తోడఁ బురికొల్పి యూరక తూఁటికాఁడ
తెఱఁగుమెయి నూఁచకోఁతగా నఱకుడింక
నేల జాగను బలుకుల నెఱిఁగి సరగ.

కొందఱు విండ్లు బద్దలును గొందఱు వాఁడిగు నీఁటెకోలలన్
గొందఱు విచ్చుకత్తులును గొందఱు చిక్కని పందికోలలున్
దొందరగాఁగఁ బుచ్చుకొని త్రొక్కిసలాడక యన్నిమూలలన్
నందలు వేలు కుక్కలను బందలపై నుసిఁగొల్పి వెండియున్.

మూలమూలల వలలను జాలఁ బఱచి
కేలఁ జప్పట్లు చఱచుచుఁ గేక లిడుచు
నినుకపోసిన రాలక యెల్లకడల
తామె యగుచు మెకమ్ముల దఱిసి యంత.

కాంగ్రు కాంగ్రు మనుచు వచ్చు కాఱుపులుల
నెలుఁగుతోఁ వారలఱితల నీఁటెగములు
నాటఁ గొల్లలుచేయుచు నడువలేక
నడువలేక యుసురులను విడుచుఁ గొన్ని.

బిఱబిఱను గుర్గురనుచును బెఱుసుమీఱి
పరుగులెత్తుచుఁ బైపైకి వచ్చు నడవి
పందిచెవి నట్టె యొకకుక్క పట్టె లాఁగి
మెడసరముఁ జీల్చి చంపెను మొఱఁగుపగను.

కిరుసులనుగొని పఱచుచుఁ గేకలిడుచు
నేనుఁగులనోడలల మీఁద నేయు వాని

నుండి ముత్తియముల్ నేల నిండఁబడియె
నోడితిమటంచుఁ గానుక లుంచె ననఁగ.

వింటిగొనయమ్ము వీనుల నంటినట్లు
లాగి యమ్ములనేయంగ లావు దఱిగి
దున్న పోతులు గిజగిజ తన్నుకొనుచు
నుసురులను బాయుఁ బుడమిపై నొరగి యొరగి.

కొందఱు సివంగులను గోలగమినేయన్
జిందఱగ నవ్వి పలుచెట్లకయి పర్వన్
ముందునకు నేగి యట మూఁగి పొసువంగన్
మందలుగఁ గూలెఁదగ మంటఁబడ నల్లల్.

ఇట్లు చెలరేఁగి వేఁటకాఁ డిట్టలముగఁ
జెట్టుచెట్టును బొదపొద పుట్టపుట్ట
గొందెగొందెయు బడిబడి సందుసందుఁ
గలయఁగ్రుమ్మఱి యంతటఁ గలఁచి కలఁచి.

కత్తళీఁడులు కత్తళా లొత్తకుండ
జెమ్మట లొడళ్ళయందునఁ జిమ్మకుండ
మాఱిమసఁగిన చందాన మన్ను మూఁక
నత్తికొలఁదిని జంపిరి జంకులేక.

కొంద అత్తఱి మేలిక కుఱఁగటగను
వచ్చి జోహారు లొనరించి చచ్చినట్టి
మెకములను జూపి తొడలను మెలపిలాగి
జియ్య! చూడుఁడనుచును దారొయ్యననిరి.

చెంగనాలనుగొట్టుచుఁ జేలలోనఁ
దిరుగు పంపులఁగలవడి కుఱుపు మీఁదఁ
బొడిచినాఁడనుగావుట ముసుసువిఱిగె
సంచుఁజూపుచునుండంగ నంతలోన.

బెబ్బులి యొండు గాండ్రుమని పెద్దఁగ నోరును జాఁచి జేనిపై
కుబ్బుచురాఁగ నెల్లరట నూరక మోములు పుల్లగిల్లఁగా
దెబ్బనువేయలేక కడుఁ దేఁకువమాలి వగర్చుచుండఁదా
నిబ్బరమూని తేఁడు చెయి నేర్పునుజూపుచు నల్లెత్రాటినిన్.

లాగి యిరుకేల నమ్ముల నాఁగకుండ
వేయుఁదొడఁగుడు మిన్నెల్ల విఱిగి యొక్క
సారి ఫుడమికిఁ బడుచున్న చాయ దోఁప
దెబ్బ వెంటన బెబ్బులి దొబ్బవడఁగ.

నేలం బడి తన్నుకొనఁగ
మూలల డాఁగికొనియున్న పోటరిలెంకల్
ఏలిక మ్రోలకు వెఱఁగునఁ
గేలులుజోడించి యురక గీడ్పడియుండన్.

వారి వెఱఁబొందవలదని వేఱువేఱ
నవ్వుకొనునట్టు లువ్వాయి నివ్వటిలఁగ
నగ్గలంబుగ నగ్గించి యంతమీఁద
వేఁటఁజాలింప నానను బెట్టుటయును.

వేఱుతావుల నున్నట్టి వేఁట కాండ్రు
దుపికొము ులు మొకములతోనాము తి

యములు వెట్టిరి దోఁక ద్రోల నాతఁడంత
బడలికలు వాపుకొనుచుఁ బనిచె వాని.

సేదదేఱంగఁ దానొక్క స్వప్నమైని
మేను వాల్చిన యంతలో జేసికార !
కానిపించెను నిద్దురలోన నొక్క-
వేలు పాకత నొరయుచు నాసతిచ్చె.

తొలకరికార్మొబ్బుఁ దూఁకించు నలిగించు
మెఱుఁగుచామనచాయ మేనివాఁడు
చుట్టువాల్ వలమురి పట్టచేతులవెంటఁ
బెఱకేల లేములు పఱపువాఁడు
నిచ్చలునిచ్చమై లచ్చితొమ్మునఁదాల్చి
జడదారిడెందాల జరుగువాఁడు
పాలమున్నీటిలోఁ బాఁపఱాసెజ్జపైఁ
బవ్వళించెడు నెమ్మి పువ్వువాఁడు
నాదుముంగల నగపడి నగుమొగానఁ
గూఁతవ్రేటు దవ్వుననొక కుఱ్ఱవాఁడు
డొంకలోపల నేడ్చుచు డొల్లుచుండె
వానిఁ గొనిపోయి పెంచుమా పాపవోతె.

అంచు సెలవిచ్చి కలలోన నవలి కేగె
నేమిసోద్దెంబొ తగవరు లెఱుఁగఁ జెప్పుఁడ
యనుడువారలు ఱేనితో నాడిరిట్లు
జియ్య ! వెన్నుఁడు ప్రేముడిఁ జెప్పినట్టి
తెఱగు తప్పునె కావున నెఱిఁగి కొండ
మనుడు రాజును వేవేగ నచ్చోటు కదిలి

తటిమినడుచుచు నరిగెడు తటిని నెదుటఁ
గొల్లుమంచును గుండెడి గుబ్బవాఁడు.

కనులపండువుచేయుచుఁ గానఁబడఁగ
లిబ్బిపాఁతఱ దొఱకిన నుబ్బు పేద
వలెను సంతసపడి పసిపాపఁ జేరి
యెసక మెసఁగంగ ముద్దిడి యెత్తికొనుచు.

సంతసంబున నటనున్న హలాంతకారి
మానిసులఁ గాంచి వ్రేల్మిడి బూని యేగి
కొఱుకు దొఱకిన తెఱఁగును విమవకుండ
వీటఁజాటింపఁ జనుఁడని వెడలుపంగ.

ఐదువ లందఱున్ మిగుల నందముగాఁ గయిసేసికొంచు వే
వీదులలోన నిల్వఁబడి పెచ్చుపెరింగి తొలంగకుండఁగా
నాదట సేసఁబ్రాలు గొని యచ్చెరువొందుచుఁ గుబ్బవానిడా
సాదల మీఁదఁజల్లిరి యొయారము మీఱఁగ నొక్క పెట్టునన్

పాఱులెల్లరు దీవెనల్ కడు బదరీమానని యీయఁగా
మాదిఁబోవఁగ జేఁ డజారపు ముందుగుమ్మముదాఁటిరాఁ
జేరరమ్మని చేయిఁజూపుచుఁ జేర్చి బిడ్డను జంక లో
నార! రాయనిదొడ్డచేడియ యగ్గలించెడి ప్రేముడిన్.

అంతజోస్యులఁ బిలిపించి సంతసమున
మూరుతంబును సరిచూచి పేరుపెట్టఁ
డనఁగ వారును రిక్కల నరసి చూచి
యింతమేల్ ఘటికువాని మే మెఱుఁగ మంచు.

మంచిగానముల కొజ్జన్మై మించుగాని
జారుశీలుండు నాఁడగు పేరుపెట్టి
వారలకుఁ జనదనము లవ్వారిగాఁగ
నిచ్చి వీడ్కొల్పి సుకవుల నెనఁగె నంత.

చిన్నారి పొన్నారి చిఱుత పాపఁడు చెలి
తక్కచందురుఁడు నాఁజక్కఁగాను
నాఁడునాఁటికిఁ బెద్ది వీడక విద్దెల
నలువదినాలుగు నరవినేర్చి
జవ్వనంబునఁదద్ద నివ్వటిల్లుచునుండి
గుఱ్ఱాలనెక్కుచు గోముమీఱి
యేనుంగులెక్కుచు నిందందుఁ దిగ్గుచు
నల్లారుముద్దుగా నెల్లప్రొద్దు
పూవువిల్తునిఁబోలెను బొలుపుమిగిలి
తిరుగుచుండెడి కొడుకును మురువు మీఱఁ
గాంచి తమ తొంటిపున్నెంబు నెంచుకొంచు
లచ్చియొడయని మనముల మెచ్చికొంచు.

ఇతని కేతేని కొమరిత యెనయుననుచు
జన్నిగట్టులఁబంపించి జాడ లరసి
యెన్నరానట్టి సంతసం బినుమడింప
నదను గడపుచునుండి రయ్యాలుమగలు.

బలితపుజగజెట్టీ! బంతి తేర్లయ్యపట్టీ!
సిలుగులడఁచు ప్రోడా! చిచ్చుకన్ జెల్మికాఁడా!
కలుములిడెడి వేల్పా! గట్టివిల్లంప దాల్పా!
తొలమికనెడు షేటీ! యేరునీకెందుసాటీ!

చలువపలుకువాఁడా! చక్కనైనట్టివాఁడా!
కలిమిగలుగువాఁడా! కమ్మనొకోల్మువాఁడా!
తళతళమెయివాఁడా! తామరల్ కంటివాఁడా!
అలుకలడఁచువాఁడా! ఆఁకలుల్ బాపువాఁడా!

*
* *

తొలుకాఱుమ్రొయిళ్ళ తళతళ
తులకించెడిమేనివాఁడ! తుందుడుకువొసం
గులఁగూలుచుప్రోడా! మేల్
కొలుచులుగల రామకృష్ణ! గోనములప్రోవా!

అమ్మాడిక్కి రాచకొమరుఁడు
ముమ్మర మగు జవ్వనమునఁ బొంపిరివోవన్
గొమ్మలుపెంపునుజెందఁగ
నమ్మరునకు నెయ్యుఁడైన యామని వచ్చెన్.

బిఱాన యామనిం గనంగఁ బెంపుసొం పెలర్పరా
మరుండు వానిఁ దోఁటలచ్చి మంచిపూవుటెత్తులన్
గరంబుమీఱఁ గాన్కవెట్టి కమ్మనీటివిందులన్
గరంగఁజేసె రెంటుమూఁడు కాళ్ళపోఁజు లార్వఁగన్.

"ఎండల్ మెండుగఁ గాయఁగాఁదొడఁగె మీయిల్లాండ్రు బెన్ బాళియై
నొండేకజ్జములూసకే దిగులుతో నున్నారు మిమ్మారయన్
బొండో హా" యని బాటసారులను వేపుత్తెంచులాగొప్పఁగన్
గండుంగోయిల తెల్లిమూలల సహా గద్దించుచుం గూసెడిన్.

పట్టుపుట్టము గట్టియొప్పెడు పచ్చికన్నెలు వోలె నా
చెట్టులన్నియు లేఁతయాకులఁ జెన్నుమీఱుచునుండె న
ప్పట్టునందునఁ దోఁటలన్నియుఁ బచ్చవిల్తుని వాఁడివాల్
కొట్టులై కనుపట్టి జంటలకున్ సుకమ్మొసగూర్చెడిన్.

ఆకులు పూవులు సగ్గల మూటన్
ప్రాఁకులు క్రిందికి మానుగ వంగెన్
జీకును జెందక చిల్కలు పల్కెన్
వీఁకను వీనుల విందుగ సంతన్.

మేటియామనియను పొలిమేరలోని
చిగురుకొమ్మలు చిలుక వజీరు ఫౌఁజు
విందుఁ గుడుపంగ రమ్మని పిలుచు కరణి
గాలితాఁకున కిటునటు గదలుచుండె.

చిలుకలు తీఁగెయూయెలలఁ జేరి బరాబరి తూఁగి యూఁగ
బలికెడి కల్కిపల్కులల పైదలి తేనియ తేటమాటలన్
దలఁపునుజేసి యొప్పెసఁగ దక్కినపుం వలినాలిగాలిపూ
వులనెఱతావులానియలవోక సికారులొనర్చుతోఁటలన్.

ఉండఁడావైన లేకుండ నుండువారి
కగ్గలం బైన నీడల నలువరించి
తల్లిచాటునఁ బెరిఁగెడి పిల్లలట్ల
హాయి యొడఁగూర్చెఁ జెట్టు లాహా యనంగ.

కూఁకటియైనను గూడని కుఱ్ఱల
పెండ్లిండ్లు జరిపెడి పెద్దవారు

గోచిఁబెట్టఁగ లేని కోడుకుల వడుగులు
దండడిఁజేయుచుఁ దనరువారు
పాలతాలిడికడు బాగఁగట్టినయింట్ల
మూరుతమ్ములుచూచి చేసువారు
నెఱజవ్వనంబున మురియు గుబ్బెతలను
నత్తవారింటికి నంపువారు
నగుచు నగుచుండు గేస్తుల కరున మిడెడు
నామనేవారి కుడివోని హాయి నిడదు
నెమ్మిగములకుఁ దలదిమ్ము నెఱపుఁగాక;
యెల్లవారలఁ దనియింపఁ నెవ్వఁడోపు.

పూవువిలుకాని గోనయమ్ము మ్రోఁత లనఁగఁ
గమ్మనీరును దెనదాని గాణలైన
జమిలిముక్కాలికోదములు జతలుగూడి
వలపు లెఱుఁగనివారికి వలపుగొలుపు.

కెంపురంగులనీను గెంజిగుళ్ళ సొబంగు
కెంగేలు కెమ్మోవిఁ గ్రిందు సేయ
మొల్లంబుగా నువ్వతిల్లు మల్లియమొగ్గ
లెలనవ్వు పల్వరు చెలువులడఁపఁ
జక్కఁగావిచ్చిన సంపెంగపూవులు
మేచాయపొక్కిలి మిసిమి లణఁపఁ
జేఁటులంటనియట్టి మేటి పూగుత్తులు
గుబ్బల మైదావి గోటు చెఱుప
వలపులాంపుల కౌఁగిళ్ళ సలుపుచుండు
నింతులరుటంపు మేలి హాయు లిను మడించి

యడరె సింగారపుందోఁట యామునిదోఁటఁ
గన్నయంతన మగనాంధ్ర తెన్నులివియ.

చారుశీలుఁడు నెయ్యూరు వారువముల
పైని నేరుపు లలరంగ బంతియాట
వీటి బయటసింగారంపుఁదోఁట దాపు
నందునాడుచునుండు నయ్యాదనుసంను.

ఆకసంబున కెగవైచి నట్టి బంతి
తప్పపాటున గ్రిందికి జివ్వుజివ్వ
మనుచు దవ్వునఁ బడునట్టు లరసి యట్టె
మెఱపు మెఱసిన యటు మిఱుమిట్లు గొలుప.

వడివడిగఁ జక్కఁదోలుచుఁ
బుడమికిఁ బడనీక బంతిఁ బుట మెగయంగన్
దడఁబాటులేక కొట్టఁగఁ
దడఁబాటును బొంది రపుడు తక్కటివారల్.

రాకొమరుండు కిలాతము
వాకముగా నడిపికొనుచు బంతాడి తుదిన్
వీఁక వలందిప్పఁ దొడఁగె
నాకుల పడి చెలుల తలఁగి యురయఁగ సంతన్.

తొలుదొల్త నా తేజి తోరంపుఁ బసగుసఁ
జెక్కుజక్కులుగఁ గన్పించియంత
కాతు వాసవము నేర్పరుపలేనట్టి ఠాం
దర నేట వాలుగాఁ బఱవఁజొచ్చె.

నంతట నొడలున నఱుతఁ గ్రాల్ రతనాలు
కొఱవిఁ ద్రిప్పిన మాడ్కి మెఱసి మెప్పె
నాపైని కంటికి నగపడకుండంగఁ
దిరిగెడి చప్పుడు తెలియ వచ్చె
నంత నెయ్యురు వెఱఁగున నాఁగుజియ్యా!
యంచు మొఱలిడ బేరెము నల్ల నల్ల
నాఁపి దిగునంత నచ్చోటి కబ్బరంపుఁ
దేజి నొక్కఁడు నొక్కఁడు తెచ్చి పలికె.

దీని నెక్కంగజాలిన దిట్టకొఱకు
సీమ సీమలఁ దిరుగాడి చివర కిటకు
వచ్చితిని దేవరా! మీరు స్వారిపసను
నచ్చటచ్చటఁ జెప్పఁగా నచ్చెరువుగ

అనుచు నొడవగా నేమేమొ నాడుచుండఁ
దత్తడిని జూచు నెపమున దఱిసి మెడను
దట్టి తూనీఁగలాగున నట్టెదాని
పైకిఁ జివ్వున నెగసిన వారువంబు

కలుచవడి యెగురుచుం గం
తులు వైచుచు మన్నుమిన్నునుం గనకుండన్
జెలరేఁగి పఱచె నెల్లరుఁ
గలఁతనుబడి చూచుచుండఁగాఁ గనుమఱుఁగై.

వెనువెంట నంత పడిపడి
చని నెయ్యురు కొంతదవ్వు పరివరశేల్..

వెనుకకుఁ దిరిగి యెపుఁడేలఁ
బెనఁగొను సుమ్ము శిశుఁ డాత్మ ప్రీతిని నాథా.

ఱెక్కలు గల పక్కిబలెం
డెక్కలి వాయువ మదెట్టదెస కేగనో కో?
యక్కట! తిని కూర్చుండక
చిక్కులఁ జేసేతఁ బిలిచి చిక్కితి మనుచున్

జియ్యాతోడ నీ తెఱఁగెల్ల చెప్పఁగలము
తాను దలపఁగ నొక్కటి దయ్యమొకటి
దలఁచునన్నట్టి సామెత తెలిసివచ్చె
నేమి చేతుము దిక్కెది యింక మాకు.

ఎట్టి నెఱకాతుఁ దరిఁజేర నీని పోగట
వారువమ్ముల నెన్నియో సాదలెక్కి
స్వారిచేయఁడె యెపుడిటువంటి మున్ను
దాఁపరించెనె? తలవ్రాలు దాఁట నగునె.

ఏమి కానున్నదో యద్ది యించు కేని
గాకమానునె? మనమెంత కలఁతపడినఁ
దొంటి పున్నెంబు లవి చినదొరను గాచుఁ
గావుత! మనుచుఁ జెలికాండ్రు కదలి చనిరి.

తేరి చూడఁగరాని తోరంపు పేరెంబు
వారెడు ప్రొద్దుబాబా యనంగ
జేజేలబువ్వను జేకొనఁ బరతెంచు
చుట్లు వాల్ దాలుపు కట్టువనఁగ

మ్రుక్కటి రక్కసుల్ జక్కాడనే తేరఁ
దాఁచుచుఁ జనువేల్పు తత్తడనఁగ
బూచులదొరచేత బూదిగావలరాజు
దిగులునఁ జనువాని తేజియనఁగ
నంతకంతకు నడలెంతొ యగ్గలింప
సాఁచివేయుచుఁ గాళ్ళను సాఁగి సాఁగి
నేలఁ బ్రాఁకుచుఁ గంటికి గాలివోలెఁ
గానరాకుండ వేవేగఁ గడుచుచుండె.

రెండు సెలవులు దెగునట్లు గండు మిగిలి
వాగెలాగిన నాఁగక వాఁడి మిగిలి
తొంటికంటెను మఱిమఱి తొరగఁ జనెడి
నేడ కేగునో? యాచెడ్డ యెక్కిరింత.

అట్టులా గుఱ్ఱము చనఁజన
డిట మఱి నుఱువులను గ్రక్కి తెలివిని చెడి చె
మ్మటగాఱి రోఁజుకొను చొ
క్కటఁ గేళాకూళిదరిని గదలక నిలువన్.

రాచపట్టియు నట్టులా గుఱ్ఱమును డిగ్గి
వేఁడినిట్టూర్పు లెంతయు విడివడంగ
బడలి కనుమూసికొని పండె నొడలెఱుఁగక
యూరు పేరును లేనట్టి మూఁఱుమూల.

అయ్యెడ దయ్యము కతమున
నొయ్యొయ్యన నొక్కరాచయుగలి తానున్

నెయ్యపుఁ జెలికత్తెలతో
నొయ్యారము గులుకఁదోఁట కొసరుగ వచ్చెన్.

అందంబులగు నంది యల చప్పుడొప్పార
రాయంచ నడకల రమణి నడచు
చెడనెడ నెత్తావి సుడియంగఁ బయ్యెద
సగము దూలించి పై మగుడఁ దిగిచి
యలరుఁగ్రొన్నెల తీవవలెను గాఁగిలెడి వింత
చెలువంబు మెఱుపుల జిగిని గెలువ
తెలికనుగవకు నెచ్చెలియై పిసాళించి
చిఱునవ్వు వెన్నెలల్ చెంగలింప
విరియు చీఁకట్లు నాఁగురుల్ విరియఁబాఱ
గబ్బిగుబ్బల బరువునఁ గౌను గదల
మేలిచెయువుల యొప్పులు మెండుకొనఁగఁ
జెలులతో మాటలాడుచుఁ జెలువు మెఱయ.

వచ్చిఁ పువుదోఁట లోపల వరుసగాను
దిరుగ నరిగెడి నదనునఁ దెఱవ లామెఁ
గూడి యగ్గింపఁ బూవులఁ గోసికొనుచు
మెల్లమెల్లనఁ జేరిరి మల్లెకడకు.

మల్లెమొగ్గలఁ గాంచితే మగువనీదు
పలువరుసవోలె మిక్కిలి పసఁదనర్చి
యొప్పుచున్నవి బాపురే! యెప్పులనఁగ
నుండవలెఁగాదె యిట్టులే యొక్కచోట.

అని గుబ్బెత యొక్కతె యు
బ్బున నన రాకూఁతు రెకముడి వీడుట నో

ననబోఁడి ! యెంత జంతదె !
వినుమిట్టుల గట్టజనునె వేయుము ముడినాన్.

అరయుమయ్యాదె సురపొన్న విరిని వెలఁది !
పుటములిడమించు పుత్తడిఁ బోలుచుండె
నీదు లోఁత్రైన పొక్కిలి నీటుసాటి
రాఁ దలంచుటఁ గ్రిందికి రాలిపోయె.

చూడు మోచెలి పూలగుత్తులు సొంపునింపుచు నెందు నే
నీడుజోడునులేని నీ చను లింతలింతలటంచు మో
మోడకుండఁగఁ జూపుచున్నటు లొప్పుచున్నవి చాగుఁరే !
యీడు తామెటులౌను చూడఁగ నెండతాఁకున వాడుటన్.

అని యొక్క చెలువ పలికిన
విని వేఱొక చెలిమికత్తె వేగన్ మొల్లల్
గొనగోళ్ళ దునిమి తుఱుమున
చనవున రాసొబఁగుకన్నె సవరించు నెడన్.

ఔఁగదే యేమి యంటివి చాఁగు బాగు
మాటి మాటికిఁ దద్దయు మట్టుదాఁటు
జవ్వనంబుననో నాఁడఁ జాలకిటుల
నన్ను దూఱుట న్యాయమే? వన్నెలాఁడి !

అనుచు ముడివైచు చానవైపుఁ గనుమ ! చెలియ
గున్నమామిడిఁ బెనఁగొనియున్న జాజి
సంతసమ్మునఁ దలయూఁచు నన్ను నింక
నీవు చెలికాఁడ నెపు డెటు నెనయుదానో !

ఆపలుకు లాలకించియు
నా పొలఁతుకలోన ముకిసి యాతెఱఁగింతే
దోఁపఁగ నీయక పైకిం
పో! పద! గొజ్జంగి పూల బుఱుకుదమనుచున్.

చని కొమ్మ కొమ్మ వంచియుఁ
గొన గోళ్ళన గోయనెంచి గొజ్జఁగి పూవ
ల్లన ముట్టిన యంతన కట!
తన కోటను పగరు వచ్చి దరిసినయట్టులన్.

మల్లరపుఁ దేఁటి యొక్కఁడు
పెల్లెగయుచు వచ్చి, రాచ వెలఁదుక మోమున్
మెల్లంగఁ జుట్టిరాఁగా
బెల్లార్చుచు నచోటు వాసి వేఱొక త్రోవన్.

తోయమువారును దానును
బోయి యెదుటఁ గానఁబడెడు పొందామరలన్
గోయఁగఁ గేళాకూళికి
మాయురె! చనినారలెంతొ మక్కువ మీఱన్.

చని నీళ్ళలోపలం దిగ
వెనుద్రొక్కుచు నొకరినొకరు వెలఁదీ! నీవే
చనుమీ! పూవులఁ గోయఁగఁ
జను మీవే యనుచుఁ ద్రొక్క సలుపెడి మసలన్.

వారిలో పల జాణయౌ పడఁతి యనిమె
నీదు మోమును బోలఁగా నేరకటులు

గుత్తుకలబంటి నీళ్ళ సిగ్గున నడంగు
తామరలజోలి కేగంగఁ దగునె పొలఁతి.

అనుటయు మూడవ నెచ్చెలి
గనుమల్లదె తమ్మి దాని కడకుంజన ర
మ్మన నాదెస మొగమై జను
చును నొకచో రాకొమరుని చూచిబిరానన్.

చెలియరో! కంటివే! యొక చెలువుఁ డెవఁడొ
మేలియుడుపులు దాలిచి మేను మఱచి
యొడ్డిగిలఁబడి కూర్కుచు నున్నవాఁడె
యెంతవింతయొ ? యితఁడెట్టు లిటకు వచ్చె.

అనుటయు బ్రియంవద యనును
గనుకనినటు కదియవచ్చి కనుఁగొని వానిన్
వినికని యెఱుఁగని తోయము
కనుఁడో చెలులార! యంచుఁ గలవర పడఁగన్.

అన్నాతి మాట విని రా
కన్నియ ముందునకు వచ్చి కాంచుచు ననియెన్
గన్నాకు వీఁడెవండో ?
యన్నన్నా! కనఁగనంగ నక్కజ మయ్యెన్.

దగ్గఱకుఁ బోయి చూతమా? తప్పుతప్పు
రాచకన్నియ లట్టుల రట్టడితెర
గెఱఁగియెఱఁగియుఁ జేయుట మఱియుఁ దప్పు
వగలుపడువానిఁ గని సాయ పడమెయెట్లు?

లాఁతులేరును జొరుటకు జేఁతగాని
మనదు నెలతోఁటలోఁ బరుం డిన యతంపు
వేడుగానోపు జూడఁగా వింతయయ్యె
నయ్యకెటెఁగించి వత్తమా యక్కలార !

అన్నమాటకు నడ్డంకియై యొకర్తె
యెంత ఘుగుదవె యగ్గికి నిల్లుకాలు
నప్పుడశె నూయి త్రివ్వుట గొప్పగాను
చెప్పితి వటంచు రాబిడ్డఁ జేరి చేడె.

ఓసీ ! యీతఁడు మిక్కిలి
గాసిలి యున్నట్టు లుండెఁ గాంచఁగ నాకున్
గేసట చెందిన మొక మదె
మాసిన ముత్తియము పగిదిఁ బొలుపేది కటా !

మొగము తెలుఁగును గాంచిన మొలకనవ్వు
గానఁబడుచుండె నెంతటి గాళకుండొ;
రక్కసులగొంగకొడుకఁడొ తక్క నేని
చలువరాయఁడొ? చెలియ కావలయు వీఁడు.

అదియుఁగాకున్న జన్నముల్ పదియునూర్లు
చేసినట్టి దొరకొడుకొ ? చేడె ! గాఁగ
వలయు నిజము కాని యెడలఁ గలఁడె యిట్టి
సొగసువానిని బుడమినిఁ జూడఁగలమె.

అనుచు నేమేమొ పొగడెడి యతివఁ గనరి
తెలిన యిట్లను, నీ తెలివి తెల్లవాఱఁ

జమునవేసిన మునుపున్న మదియుఁగూడఁ
బోయినటు లున్నదిప్పుడు నీ పొలుపుఁగనిన.

చాన ! యాఁకొన్నవానికి ప్రసాద మిడక
మాటలను దఱిఁబుచ్చెడి మాడ్కి నయయొ !
గాసి చెందినవాఁడని గాంచికూడఁ
బాగడఁబోయెదు పొగడఁగాఁ బ్రొద్దులేదె ?

బాగు సెబాసు రండిఁక బడఁతులార!
యరయఁబోవుచు బాగోగు లరయనేల?
వాని యలజడి తగ్గించి పనవుకొంచ
మవల మన యిచ్చ వచ్చిన యంత యనిన.

నల్లవా! నిక్క మాడితివి నాతిరో! నీవనినట్లు ముందుగా
నల్లన వానిదగ్గఱకు నాదటఁ బోయి తెఱంగెఱింగి బల్
చల్లని చేఁతలన్ జరిపి చక్కఁగఁ దేఱిన మీఁద వానిచే
నెల్ల కతన్వినందగు నిఁకెందుల కూరక యాలసింప నాన్.

అక్కరొ! నీ వనినటు లా
చక్కనిదొర చక్కికేగి సరియగు పనులన్
జక్కంగఁ జేసి పోవుద
మక్కటికము లేదె. సందియం బిదియేలా?

ఎఱుఁగుదు నెఱుంగుదును నిను నేఁచునట్టి
దొరుఁడనియె కాదె? తడఁబడుచుంటి విటుల
పగల మునిఁగిన వానిని పైకిఁ దీయు
నెడల పెఱవార లంచును విడుతురమ్మ.

అన విని రాచబోఁటియెద నట్టె తలంచి తలంచి తొద్దయున్
గనికరమూని కూర్మి చెలికత్తెల నెల్లఁ గాంచి యిట్లనున్
మన మిటు వాదులాడ నల మానిసి యేమగునో సరంగనే
మనిసను గూడి వచ్చునో! యన్నువలార! కదుంకుకొన్నసన్.

రాచకన్నియ యిట్టుల రమ్మనంగ
నాను గాదననేరక యంతమీఁద
నందఱును గూడి యచ్చోటి కరుగ నతనిఁ
దేఱఁజూచుచు నిటులను దెలివ యొకతె.

వేఁడి నిట్టూర్పు లెక్కువ వెడలుచుండె
ముక్కుజెరములఁ దద్దయుఁ జిక్కువడిచి
పగతుకేరైన నిట్టులఁ బాపిమిరేమొ?
కాకయుండిన నిట్టేల గాసి వడును?

అన్నన్న! మొగము చందము
పున్నమచందురుని బోలుఁ బొలుపగు నోవమ్మా
వెన్నని పట్టికి నిరవగు
తిన్నియ; రాలచ్చి నెలవు తిన్నని కన్నుల్.

మోడ్చియుండినఁ గన్నులు పొలుపు మిగులు
తమ్మితేకుల యందమ్ము వమ్ముజేయుఁ
జాలియున్నవి, చూడఁగా నేలఁజాలు
నేలయంతయు నీతండె నెలఁతలార!

అనుచుఁ దడవిట్టు లనుచుండ ననుచు రాచ
పట్టి నాకట్టు చెప్పిన యట్టి విూరె

జాగుచేసెద రిదియేల? చాలుఁజాలు
నీళ్ళు గొనితెంపు వేవేగ నేను గూడ.

మెల్లఁగ దామరపాకుల
జెల్లగు వగ తలఁగిపోవ వీచెద మీారున్
జల్లని నీటిని వేగొని
యల్లనఁ జల్లుఁడు మొగంబునందున ననఁగన్.

పోయి తెచ్చెదమమ్మ యో పొలఁతి! నేము
పోలకుండఁగ నాతనిఁ జూచుచుండు
మమ్మ యీాతని బ్రతికించి నట్టి పున్నె
మిపుడ చేపట్టి మేల్గూర్చు నిది నిజమ్ము.

అని వారు నీళ్ళు దేరఁగఁ
జనినంతన రాచపడుచు సంబరపడుచున్
గనురెప్ప వేయకుండఁగ
గనుఁగొనుచును రాచకొమరు కమ్మని మొగమున్.

చెలిమికత్తియ యొక్కతె వలినిదేఱు
నీళ్ళు గొనివచ్చి మొకముపై వ్రేళ్ళతోడ
మెల్ల మెల్లనఁ జల్లంగ మెదలె నతఁడు
వారలెల్లరు సంతస పడఁగనంత.

తామరాకులఁ గొనివచ్చి చామయోర్తు
పాన్పుగాఁ జేసి యాతనిఁ బండఁబెట్ట
రాచకన్నియ యాతని ప్రక్కకొదిగి
కొలఁదికొలఁదిగ నీటిని గొంతఁబోసి.

కప్పురపుటంటి డిప్పలఁ గట్టినట్టి
సురఁటిఁగొని మెల్లమెల్లగ సోలు దేఱ
విసరుటయు నంత నాతంకు ముసురుచున్న
కురులుచేతితోఁ గొండొక సరిగఁదీసె.

దానిఁ గనుగొని చేడియల్ దండనుండి
యించుకించుక యెడముగా నేగఁగానె
యాతఁడును లేచి యటునిటు నరసి యరసి
మిగుల వెఱఁగంది యొక్కపట్టుగఁ దలంప.

తనతొల్లింటి తెఱఁగుదో
చిననెద గుబ్బుం బదెంత చేసిన దనుచున్
గనరాము, దయ్యపుం బను
లనుచును వగగూరి యతఁడు ననుకొనె మఱియున్.

కుందవన మేలు ఊఁడేడ? కుందు లేడ?
సొగసు సింగారపుందోఁటఁ జొచ్చు లేడ?
పేరునూరును దెలియని వింతవారు
పెరిమఁ గాపాడు లేడ? యబ్బురము చూడ.

ఎల్లచో నారాక కెదురుచూచుచునుండు
తలిదండ్రు లెదనెంత తల్లఁకిరొక్కొ?
తోడునీడుల లాఁగు నాడుకోవచ్చిన
చెలికాండ్రు తారెంత తల్లఁకిరొక్కొ?
దండముల్ దొరగారు దండములను బంట్లు
నోలి నన్గనకెంత తూలిరొక్కొ?
నా కాళ్ళ చప్పుడు నాఁగదోఁచిననార్చు
కుందేళ్ళు తామెంత కుందునొక్కొ?

కటకటా! చెడ్డగుఱ్ఱంబు కడకు నిట్లు
పాఱవైచెనే? లాఁతుల వారితోఁట
దయ్యె మింతలు సేయంగఁ దలఁచికొనఁగ
నొడ్డులెవ్వారు దాని మాఱొడ్డఁగలరు.

ఎవ్వరోకో నన్ను గాపాడి రిందులేరె!
కానరారేమి యనుచు నల్లడల సరసి
పూవుటీరంబు చాటున పొలిచి తన్నుఁ
జూచుచుండిన చేడెలఁ జూచి యతఁడు.

ఎవ్వరో మీరు తెలియదో యింతులార!
నన్నుఁ గాపాడి పున్నెము గన్నవారు
మీదు తెఱఁగుల నెఱిఁగించి మేలు గనరె
యనుటయును వారలందఱు సతినిఁ జేర.

కుందవన మను నగుపేరు గొనినవీటి
నేలుచుఁ గుళిందకుండు నానే లికలరు
వారికొడుకను నా పేరు చారుశీలుఁ
డంచు వాకొందు రందఱోయన్నలార!

ఏల చేడియలార! మీరింతగాను
వెఱఁగు చెందుచునున్నార లెఱుఁగఁ జెప్పుఁడి
లాఁతివానిగఁ గనుఁగొని బ్రాఁతిపడెద
రేలయని వేఁడు నా చారుశీలుఁ గాంచి.

వారిలో నేర్పుగల యొక పడఁతి యనియెఁ
దప్పు మన్నించి కాతువేఁ జెప్పఁగలను

మాదు తెలుఁగించు కంతయో మంటిజేఁడ !
యున్న దున్నట్టు దాఁచక యొక్కమాట.

హేలాపుర మను వీడిది
యేలు సుధాకరుఁడు దీని నీ కన్నియ మా
యేలిక కూఁతురు చంపక
మాలిని; నెచ్చెలులమేము, మన్నించు మనన్.

నెలఁతలార! మాటు నేరనేనొనరింప
నందుచేత సిగ్గు నందువాఁడ
సెలవొసంగుఁ డింకఁ జేరగామాయూరు
కలుగుఁగాత మీకుఁ గలిమి యంచు.

మరుఁడు వెదఁజల్ల నెడఁదల బెరిమె చాపు
శీలుఁ డంతటఁ జంపకమాలినిఁ బెడ
మదిని గల కూర్మి వెలిఁజేయు మాద్రిఁ జూచె
నతివయును జూపు బందాల నతనిఁగట్టె.

ఎట్టకేలకు మదినట్టె దిట్టపఱిచి
తొలని చెంగట మేసెడి గుఱ్ఱమెక్కి
తిరిగిచూచుచుఁ జనెనంత దిగులుపడుచుఁ
గానఁబడుదాఁక రాకన్నె కాంచుచుండ.

అచ్చెనటి వారువము తన
యిచ్చకువచ్చినటునాము నేది పఱవఁగాఁ
గ్రచ్చఱఁ బ్రోల్ చేరెను బార
పొచ్చెములేకుండ నంత పొడఁబిన వేడ్కన్.

చెలులు చుట్టలు గాంచి యచ్చెరువుపడుచు
జెలఁగి తన చుట్టుఁజేరి జేజేలు వెట్టఁ
దల్లిదండ్రులు పెమ్మ్రొమ్మైఁ దరియవచ్చి
గాఁగిలిడ మ్రొక్కి జరిగిన కతనుజెప్పె.

నాతింగాఁగలు నలునై యుంటల్
బ్రాతిన్ సంద్రము పయిరాలుంటల్
క్రోఁతుల్ కొండల గొనియుంటల్ నీ
యూఁతంగాదో? యొదవెన్ రామా!

ములెపెములకొటారా! పోఁడుముల్ పెన్బిడారా!
అరుసములకు తావా! ఆమెతల్ వేల్పుటావా!
కలవులణఁచునప్పా! కమ్మనౌ పల్కుకుప్పా!
గరగరయిన పట్టీ! కల్లలేనట్టి జెట్టీ!

* * *

పెఱలకుఁ గీడొనరింపని
కఱదలు కడు నేర్చినట్టి గరగరగలఁడా!
మఱలను నడిపెడువారల
కిటుకులు తొలఁగించు రామకృష్ణబలుప్రుఁడా!

ఆ చాకశీలుఁ డట్టుల
వేచని యుప్పరిగమీఁద వేసుకమీఁటన్
గాచెను మాధవు తోఁపంత
వాచవిగా పంటసముసఁ బలికెను నడలన్.

మాధవుఁడు చాకశీలుని మఱుఁగులేక
చెప్పుమిఁక? నీటిపిల్లలు మున్నిరిగొను

సంతసంబున వేవేగ సుంతయనుచు
నడుగుటయు రాచపట్టి తా ననియె నిటులు

నెచ్చెలి వారువ మట్టులఁ
జెచ్చెరఁజని కేళకూళి చెంగటఁగాఁగన్
నచ్చిళ్ళుగ్రక్కి నిలిచిన
యచ్చటనే యేను డిగ్గి యలసటచేతన్.

మేను మఱచి నేనుండఁగాఁ జూచి యటకు
నా సుధాకరు కూఁతురౌ నన్ను మిన్న
యైన చంపకమాలిని యరుగుదెంచి
నన్నుఁ గాపాడె ప్రేముడి మిన్నుముట్ట.

ఆయెలనాగ యొయ్యారము
నా యన్నులమిన్న సొబగు నాహా చెలువా!
వేయాఱు లిత్తుమన్నను
వ్రాయంగాలేఁడ యెట్టి వ్రాయసకాఁడున్.

చెండ్లా వట్రువ గుబ్బలు
విండ్లా కనుబొమలతీరు, వెలితామరలేఁ
దూండ్లా చేతులు, నాతిం
బెండ్లాడిన వానిదే సుమీ భాగెమనన్.

విన్న పాన్నుఁ దన్ను నన్నున ప్రేమను
మించు మించు నోంచు మెలఁతె సొబగులు
చిప్పరు నప్పరు జవ్వరుఁ జేడియకెమ్మోవి
లేకి త్రోడి సూపు లేవు కనలు.

చందురుంగరఁగించి జాళువాపోడిగల్పి
విన్నాణమున నచ్చు పెట్టినట్లు
గండుమీఁనల మించు నిండు సోగఁదనము
తామర పాకుతోఁ బ్రామినట్లు
పూలగుత్తులనిగ్గు ప్రోవుగాఁ గ్రై సేసి
కుప్పలు వెట్టి నట్లొప్పదనరి
నల్లచీమలనీటు నారుపోసినయట్లు
సాలుగా హొయలుతో జానుమీఱి

మొగము కన్నులు చన్నులు మొలకయారు
కలిగి యొప్పారు నాకన్నెఁ గాంచెనేని
బమ్మకేనియుఁ బుట్టును రిమ్మ తెవులు
కన్న వానికి వాపులు సున్నయగును.

కనుఱెప్పలించుక కదలింతురేనియు
వేలుపుచేడియల్ పోలఁగలరు
అసుగుసఁ బడియెప్పు డసరకుండిరయేని
చిలువపూఁబోఁడులు పోలతురింత
మంచుకొండలమీఁద మసలకుండిరయేని
జక్కులచాసలు సాటివత్తు
రాకసంబున నెప్డాడకుండిరయేని
కిన్నెరగటితెలు వన్నెవత్తురి
బాపురే! రాచకన్నియ పసదనంబు
మన్ను దాలుపుచేడెలా కన్నెగాలి
గోటికైనను బోలిక గూడఁగలరె?
యొక్కయించుక పోలెడి రిక్కలౌర!

సందుగొందుల నెఱ్ఱు పొందియుండెడి నిరుల్
నెఱులు మించినయామె కురులకోడి
పిఱుఁదవెక్కున యెఱ్ఱు వ్రేలాడు సవరముల్
నెఱులుమించినయామె కురులకోడి
తూరుపు దొర తాళ్ళు పూరిమెక్కుడు నెఱ్ఱు
నెఱులుమించినయామె కురులకోడి
మాటిమాటికి నాచు నీటిలో మునిఁగెడి
నెఱులుమించినయామె కురులకోడి
యనఁగ నిఁకనేవి పురుడౌను గనఁగ వినఁగ
చాఁగుపో! యాపెనేలఁగఁ జాలువాఁడె
యేడు రెండులజగముల నేలువాఁడు
మాధవా! తప్పదయ్యాది మఱియు వినుము.

బిత్తరియైన యామెం గదుఁ బ్రేముడిఁజేయఁగనెంచి, బ్రహ్మమున్
జిత్తరువందు నిల్పి దగఁ జేతులనంటక డెందమున్ బలా!
పొత్తుగఁజేసి చేసియటఁ బోసెనొ కా కుసురుల్ మఱేమిగా
దెత్తఱినాకెఁ బోలు నొక యింతిని గ్రమ్మఱఁ జేయకుంటచేన్.

పలికెనా తేనియలొలుకగాఁ గులుకుచుఁ
జిలుకలు సిగ్గుమైఁ జెట్లనెక్కు
నవ్వెనా చెలువాఱు మవ్వంపుఁ జెలులతో
వెన్నెల క్రొన్నన వెల్లఁబాఱుఁ
జూచెనా సోగగా సొగసుగా నిటునటు
వాలుగుల్ నీళ్ళలోఁ దేలియాడు
నడచెనా చకచక కడు నొయారంబుగాఁ
దడఁబడి యేనుఁగుల్ మడఁగుదెసల

నౌర! యీ యింతి సోయగ మహహా వెలఁది
హొయలు, బాపురే! యాచాన యొప్పిదమ్ము
అన్న! యన్నాతి విన్నాణ మెన్నఁదరమె
సలువకైనను వేనోళ్ళ చిలువకైన.

పట్టుకొనఁగానె పూవింట్లు వాడిపోవు
బట్టఁ జిక్కవు జక్కవల్ పాఱిచనుచుఁ
బట్ట గట్టిగనుండును గుట్టలౌర!
ఎట్టులాయింతి చందోయి కెనయునవ్వి.

క్రొన్నెలపో నెన్నుదురల
వెన్నెలపో నవ్వుజవ్వ ప్రిదులనిమేల్ హొం
గిన్నెలుపో చనుగుబ్బలు
తిన్నెలుపో పిఱుఁదుదోయి తెఱవకుఁ దలఁపన్.

నెలఁత జవ్వనపున్ సీమ నిగ్గులైన
కలికి మెఱుఁగాఱు గుబ్బల గడెముదోయి
నెక్కటకుగాను గట్టిన చక్కనైన
మెట్లునాఁగను ముడుతలు మెలఁత కమరు.

చేతనంటిన పాల్గారు చెక్కిళులను
బోలఁగాలేక జాళువా గాలునగ్గిఁ
గ్రాలు నాచెలి మీఁగాళ్ళఁ బోలలేక
మెల్లమెల్లఁగఁ దలలు దామేళ్ళు ముడుచు

నవ్వు పువ్వుల తావుల జివ్వ ముక్కు
ముక్కఁగొను వింతల బొమలవంపు

వంపు లిడుఁదమ్ములకుఁ గనుల్ సొంపు మిగిలి
మిగిలి సంకనుద్రోఁగించు మెలఁత గొంతు.

అన్నెలఁత సోయగంబును
విన్నాణముఁ జెప్పఁ దరమె ? వెలఁది మొగమ్మే
యెన్న దొరకొన్న నాఁడో
గన్నుల నెన్నంగనట్టి గడచెడి నేఁడుల్.

తావిచూడని క్రొవ్విరిపూవు; గోళ్ళ
నంటని చివురు మూచూడనట్టి తేనె;
పూని బెజ్జంబు వేయని మానికంబు
పున్నెములమూట యెవ్వాఁడు పొందుననిన!

జక్కవల పెంటు లోఁడయల జతలు వీడి
వెదకి కానక వలవంత విడుచునట్టి
సిగలు చెలరేఁగి యొక్కంటఁ జెలఁగె ననఁగ
సంజకెంజాయ లెంతయుఁ జదలఁబర్వె.

ఆలకాపరు లాలను దోలుకొంచు
నేలపాటలు పాడుచు నోలి! యోసి!
యంచు నిండ్లకు మెల్లఁగా నరుగుచుండ్రి
పక్కులన్నియు గూండ్లకుఁ బయనమాయె.

మగఁడు గనఁబడకుంటకు బెగడిబెగడి
యతని పగతునిరాకకు నడలి యడలి
విన్నఁబోవుచు రూపఱెఁ జిన్నితమ్మి
యింతియేగద ధారలేని యింతిబ్రదుకు.

పగటి నెచ్చెలి వలవంతఁ బాపుపొంచెఁ
బఱచినట్టి కెంజిగురుల పఱుపా యనఁగ
నాకసంబంత యెఱ్ఱనై యంతలోనె
వేఁడిచే వాడినట్లుగ విరిసె నిరులు.

తఱియను బొజుంగుచీఁకటి గఱితఁగూడి
బయలుపాన్పునఁ గూర్చుండి పంతమెసఁగ
నలరుబంతులనాడుచో నందుఁబడిన
పూవులోయన రిక్కలు పొలుపుమిగిలె.

అప్పులను దీర్చుకొనలేక యడలువారు
బిడ్డలను బెంచలేకేడ్చు పేదవారు
బేరసారాలఁదనివోని బేరు లెలమి
హాయిచెందంగ రాతిరి యరుగుదెంచె.

పిఱికి కండలులేనట్టి బిరుదుమగలె
మనదు తొల్లింటివారలు మనకొయట్టి
యదనులేదనికుందెడు నట్టివారలు
హాయిచెందంగ రాతిరి యరుగు దెంచె.

చేయుచున్నట్టి పొత్తంబు చివరవఱకు
సాఁగునో సాఁగదో గద యూఁగకుండ
సనుచుఁ దలపోయు కైయీసు లాదమఱచి
హాయిచెందంగ రాతిరి యరుగుదెంచె.

తూరుపు ముగ్ధరాలు తన తోరపుఁ దూరపుకొండ కొప్పునన్
దీఱిచి కూర్చినట్టితఱి తీప్పులనుబ్బిము బంతినాఁగ సిం

గారము మీఱఁ జందురుఁడు గన్నులపండువుగాఁగఁ దోచె బెం
డారగఁ బోసినట్లు జగమంతటఁ బర్వెను బంగువెన్నెలల్.

పాలకడలి నుండి పైకివచ్చెడునప్డు
లోననున్న యసలు మేనిమీఁద
నంటుకొనియె ననఁగ నత్తరిబాపురే!
చలివెలుంగులోన వెలిఁగెఁ గందు.

వెన్నెలెల్లయెడల విన్నువాకిలి యందు
పిండి జల్లినట్లు విరిసె నంత
అగ్గలంపు వంత నెగ్గతంబున సిగ్గు
విడిచి రాచపడుచు వెలికివచ్చి.

అరమరలేక తా మొగలియాకు పయిం దగవ్రాసినట్టి యా
పెరిమపుఁ జారుశీలు నెద బెద్దఁగ నెన్నుచు మాటిమాటికిన్
మురిపెముమీఱఁగన్నులకుఁ బొల్పుగ నద్దుచు ముద్దులాడుచున్
గఱిగొఱలేక చూచుకొని కౌఁగిటఁ జేర్చుచు నున్నయత్తఱిన్.

గోరువంకలుఁ జిలుకలుఁ గోదమతేంట్లు
గోయిలలు వెంటనంటుచు గూడిరాఁగఁ
జిలుకతత్తడిపై నెక్కి కులుకుకొనుచుఁ
దుంట విలుకాఁడు వెడలెను దొందఱగను.

వెడలుచు వెడ సింగాణిం
దొడి యలరుల యలుగుగములతో నేర్పు మెయిన్
బడిబడి కొట్టెనుబాలిన్
జడివడి వడఁకంగ నంత చంపకమాలిన్.

కొట్టినతోడనే యొడలు కొండొక కందఁగఁ జన్నుదోయిపైఁ
దెట్టువ గట్టఁ జెమ్మటలు తేఁకువ తూలి కలంకచెందుచున్
బిట్టు వగర్చుచున్ మగువ బింకము పొంకము తాల్మిదూలి దాఁ
దిట్టఁగఁజొచ్చెఁ గిన్కమెయిఁ దివ్యుని వింటివజీరు నిట్టులన్.

మరుఁడా ! కావరమేరా ?
సిరిగలదొరపట్టి ననుచుఁ జెలరేఁగితివా ?
కరకరి బూచుల దొరనినుఁ
గరఁగింపఁడె ? కంటి మంటఁ గసు మఱచితివా ?

పనిగొని యేమియు నెఱుఁగని
సనబోఁడుల నేఁచ నీకు న్యాయమె మరుఁడా !
కనఁబడ కుండఁగఁ బోవుతఁ
గనులుండిన నీదు విల్లు కనుకసిలోసన్.

అన్నెము పున్నె మెఱుంగని
కన్నెల వలపంతఁ బెట్టఁగా సంతసమా ?
కన్నులకుఁ గానఁబడక
మున్నఱికపుచూపుదన్న మొండీ ! లండీ !

అంతనాఁగక యా యింతి కొంతముందుఁ
గానఁబడుచున్న చందురుఁ గాంచిరోసి
యగ్గలం బగు బాళిమై బెగ్గడిల్లి
యినుమడించిన కిన్కమై నిట్టులనియె.

జగములను గాల్చు విసముతో జతగఁబుట్టి
బూచులకు ఱేని యాఁడలఁ బున్వపై స

నీకుఁ గనికరమెక్కడ నిజముఁ గనకె
పలుకు చుందురు చల్లనివాఁడ వంచు.

నల్ల తెక్కను వేల్పులు నమలి నమలి
మ్రింగుచున్నను దఱుఁగక పొంగుచుండు
దోసకారికి నగమెంతొ తోరమనెడు
పలుకు నీయందె గనసయ్యెఁ జలువఱేఁడ.

కనికరములేక పూవిలుకాఁడు కలఁప
వానికినిఁ దోడుగా నీవు వచ్చినావె?
రాజువోలెనె ప్రజలును నీ జగాన
నుందురను మాట యయ్యెది యుక్తదానె!

అందగాఁడవంచు నగ్గలంబుగ నెప్డు
పలుకుచుంటనోటు కలఁతు వెప్పుడు
నన్ను మిన్న నిట్టు లామని యొడయండ!
మొండిచిలుకపిండు దండనుండ.

కోకో, యటంచు నీల్గుదు మాటిమాటికే?
కోయిలా! నీయిల్లు కూలిపోను
గన్నులనిప్పుకల్ గదలంగ నేటికే?
రాచిల్క యూరక అంతులిడుదు
మేనెల్ల గరుపార మీఁదికి రానేల?
వలిపయ్యెరా! నిన్నుఁ బాము గఱవ
తుప్పు తుప్పున కేగి పూఁటఁ గడ్వెడి నీకుఁ
గండకావర సేమి గండు తేఁటి?

నిక్కకూసెసవేటికి నెమ్మి! యీవు
కాసలంబడి తిరిగెదు దానికేల?
మిడిసిపాటింత నెమ్మది మెలఁగు మింక
విసపుఁబాముల నోరార మెసవికొంచు.

చెఱకువిలుకాని కాఁకకుఁ గరఁగి కరఁగి
యగ్గలంబౌ విరాళికి నాఁగలేక
సొబగు దఱుఁగుచు సెజ్జపై సొమ్మసిలినఁ
జెలిమికత్తెలు మిక్కిలి కలఁత నడుచు.

వలిపనులు సేయవలెనంచు వలనుగూడి
కప్పురము మంచిగందంబుఁ గలయఁబూసి,
చల్లనై నట్టి పన్నీరు చల్లి, తూండ్లు
సుట్టి, చిగురుల వీచుచుఁ జూచుచుండ.

వీవనచే సుంత విసరుదమంచును
విసము చల్లెద రేల? వెలఁదులార!
కప్పురంబును మేనఁ గలయరాతుమటంచు
నిప్పుల నిడనేల నెలఁతలార?
పన్నీరు మెల్లఁగఁ బైని చల్లెదమంచు
వేనూనె నిడనేల? వెలఁదులార!
తామరతూఁడుల దండఁజుట్టెదమంచుఁ
బాములఁ జుట్టిరే! పడఁతులార!
తాళఁగాఁజాలఁ జెలులార! తాళఁజాల
నేల? మానుఁడి మీ పనుల్ జాలిలేదె?
నిముసమైనను నేనింక నిలుపలేను
నన్నుఁ గాపాడుఁడీ మీర లన్నులార!

అనుచు నమ్మోడ్కి రాపట్టి యగ్గలముగ
మరునికాఁకకు నాఁగక మండుచుండ
చెలిమికత్తెలు పూవిల్తుఁ గొలిచిరంత
నినునుడించిన బత్తిమై నెడఁద లూర.

ననబోఁడు లిట్లుబత్తిని
ననవిల్తుని వేఁడికొనఁగ నాఁతికి నెదలో
మునుకొను విరాళి వేఁడిమి
నెనువెంటనె కొంతతగ్గ నెలఁదుక తేఱెన్.

అంతట బోజుఁగులు గుందఁగ
సంతసమును బొందఁదమ్మి జక్కవపిట్టల్
రంతులకూరఁగఁ దద్దయు
గొంతెత్తుచుఁ గోళ్ళు కొక్కొరొ కో యని కూసెన్.

తెలతెలవాఱఁగఁ బక్కులు
కలకల వీనులకు విందుగాఁ గూయు నెలుం
గుల మేలుకొలుపులన్ విని
తెలివినిగని రెల్లవారు దెసలున్ దేఱెన్.

కలువచెలిసూడు, నెత్తమ్మి చెలిమికాఁడు
జగములకు విందు, కాఱిరుల్ చనెనుమందు
మింటిరతనమ్ము, పగలేఁపు మేటికొమ్మ
పొడిచెఁ దూరుపుకొండపైఁ బొద్దుఁ గుఱ్ఱ.

పలుక దనుంగుకత్తెలకుఁ బాపటదిద్దదు; చూడదద్దమున్
జిలుకకు ముద్దుపద్దెములు సెప్పదొకించుక; రాకుమారి తాన్

బలుకవె? చారుశీల! మరుబారికిఁ జిక్కితిఁ గావుమీ యనున్
దలఁకుచు వానిఁగాంచినటు తప్పుకొనున్ గడునక్కజంబుగాన్.

ఇట్లు వలవంత పడియెడు నింతిఁ గాంచి
వింత యిదియేమి యంచును వెల్లబోయి
చుఱుకుఁ బలుకుల బెదరించి చూత మనుచుఁ
చెలిమికత్తెలు విసువుచుఁ బలికి రిట్లు.

ఇంతి! యేమింత వలపమ్మ యింత మున్న
రాచకన్నెల నెందఱ నేఁచె మరుఁడు
వారు నీవలె వలవంత వాడిరోటు
పొడిచెనే నీదుమోమున బొట్టిదసంగ.

ఎన్నఁడు చారుశీలుఁ దనియింతునొ; యెన్నఁడు వానికౌఁగిటన్
బన్నగనుందునో యెప్పుడు వాయని ప్రేముడి నాతఁడాడు నా
తిన్నని పల్కులన్ వినుచుఁ; దివ్యునివిల్తుని గెల్వనోతునో
యన్నవలార! తెల్పుడిఁక నాతనిఁగాంచక నిల్వనేర్తునే.

తమ్మిసొమ్ములనమ్ము కమ్మతావులు చిమ్ము
చెమ్మఁ గ్రిమ్మినవాని యొమ్ము మొగము
చిన్నివెన్నెలనెన్ని వెన్ననాఁదలఁదన్ని
నన్నెమీఱిన వాని చిన్నినవ్వు
రంగారు పొంగారు బంగారఘుందీరు
పొంగార్చు వాని సొబంగు మేను
జాసగునేనుఁగునే నగు మానగు
పూనికఁగను వాని యానునడక

కన్నులకుఁ గట్టినట్లుగ నన్నులార!
కానఁబడుచుండె నదెయదె కాంచుఁడమ్మ!
వాఁడుగో వచ్చుచున్నాఁడు పడఁతులార!
యంచు జడిముడి పడిలేచు నట్టెబెదరి.

ఔరా! యెంతటి వలపో
వేరేనియుఁ బిలిచిరేని విసుగుకొనుచుఁ దా
మారేమి పలుకకున్నలి
నీరిడి కనుఁగొలఁకులందు నెంజిలి పడఁగన్,

ఇంతులు చిడిముడిపడి యొ
క్కింతయు సంతసములేక యేగిరి, యాలో
మంతనము సేయనేగెను
గుంతలుఁడును దనదు కొల్వుకూటంబునకున్.

కొలువునఁ గూరుచున్న తన కూరిమి వారిని గూర్చి యిట్లుగాఁ
బలికెను నేఁటిరాతిరిని బందిరి మంచముమీఁదఁ గూర్కుచో
దెల తెలవాఱుచుండు నెడఁ దేటగఁగాంచితి నొక్కచెడ్డదా
కల, యదియేమిచిత్రము గాంచఁగ లేదటువంటిదెన్నఁడున్.

దంతిపై నెక్కి యొక్కఁడు దుర్గుగుదియఁ
జేతఁబూనియుఁ గుంతలా! పోతరమున
నేలినాఁడవు ప్రజలను నింతదాఁక
సాఁగదికమీఁద నడవికి సరగఁజనుము.

ఏగకుండిన పటిఁతేఁడు రాఁగలండు
వచ్చి నైఁబడి యోడింపఁ జచ్చెదంటె

ముంపుగాఁ బొమ్ము నీకేల మూఁడుకాళ్ళ
ముసలి వీనేల నేలఁగా విసుగుగాదె?

ఏలుబడి తుద దొర బద్దకేగు ననెడి
పలుకు వినవొక్కొ? యది రద్దుపఱచుకొనఁగ
నడవులకు నేగి వెన్నుని యపుగుఁ గొలువ
మేలగునటంచుఁ బో నంత మేలుకొంటి.

కావున నేనిఁకఁ దడయక
పోవలెఁ గానలకు నిదియపో నిచ్చ నిఁకన్
దేవలె నొక రాకొమరుని
నావలెఁ బజనేలువాని నాకొమరితకున్.

పెండ్లిసేయంగ డెందము వేగిరించె
మీకుఁ దెలిసిన రాపట్టి వాకొనుండు
వానిఁ బిలిపించి కూఁతును జానుమీఱ
నిచ్చి పెండిలిగావించి యేఁగువాఁడ.

అంచు వాకొన నేలిక యచటి వారు
కుందవనమేలు కుంతలు కొమరుఁ డెంత
యేనిఁ దగినవాఁడని విన్నవించుటయును
నవునవు నది లెస్స యని తేఁ డనుచునుండ.

అంతలోపల నక్కడి కతనికూఁతు
చెలిమికత్తెలు చనుదెంచి నిలిచి మ్రొక్కి
కిలికి తలఁపుల వెఱపునఁ బలుకలేక
నిలువఁబడియుండ తేఁడను నెలఁతలార!

ఏల? మీరలు వచ్చితి రిపుఁడు వెఱువ
నేల? యెందుకు విన్నఁబో యెదరు చెప్పుఁడి
కూఁతునకు సేమమేకద! కొఱఁత యేల?
యెఱుఁగఁ బలుకుఁడి జాగేల? మఱుఁగు వీడి.

అట్లు నేలయేలి కడుఁగుటయును వారు
పూస గ్రుచ్చినట్లు మొదటినుండి
చివరదాఁకఁ గూఁతు చేతలు చెప్పంగ
రాజు సౌర! యంచు రమణ ననియె.

తొయ్యలులార! నా కొమరె తోఁ దను గోరిన చారుశీలునిన్
నెయ్యముఁ దియ్యమున్ గదుర నేఁడిటకుం బిలిపించి పెండిలిన్
జయ్యనఁ జేతు నింక నగచాటులు దీఱఁగ నౌ నటంచు మీ
యయ్య యెఱుంగఁ జేసెనని యాడుఁడి యేనునుగమ్మ వ్రాసెదన్.

అనిన తోడన వారును బనివినుచును
తొరగఁ జంపకమాలిని పలుఁపుకడకుఁ
బోయి నవ్వుచుఁ బలికిరి పొలఁతి! నీదు
నోముపండెను లేలెమ్ము నొవ్వనేల?

తండ్రిగారికి నీపడుపేంద్ర మెల్ల
నెఱుఁగఁ జెప్పఁగఁ దోడనె యింతి! వ్రాసెఁ
జారుశీలుని తండ్రికి జాబు; నతఁడు
నిన్నుఁ బెండ్లాడఁగా వచ్చు నిజమటన్న.

"ముమ్మరమైన బల్వెతల మున్గుచుఁ దేలుచునున్న నన్ను మీ
రమ్మకచెల్ల! యిట్టు లడియాసలు పెట్టఁగఁ బాడియౌనె? పూ

వమ్మలజోదు మిమ్ము నిట కంపెనె, వారికి సత్తిచాలమిన్
నమ్మిన నాతినేఁచుటది నాయమె? దాయనె? మీకు నక్కటా.

వట్టునం గొట్టికొనిపోవు వానిఁ గాంచి
గట్టుపైనుండి మెలఁకువల్ గఱపునట్లు
సెప్పుచుండిరె? తాలిమి సిగ్గులేక
చాలుఁజాలును బొండింకఁ జానలార!

అగ్నిపై నేయి పోసిన యట్లు మీర
లుల్లసపు మాటలాడుచు నుల్లమెంతొ
నొవ్వఁజేయుచుఁ బైనుండి నవ్వువారె
కాని నాకోర్కె దీర్పంగఁ గడఁగువారె?

కూరిమిబోటు లంచు మిముఁ గొండగ నమ్మిన యందుకా యయో
కారము గొట్టుచుండి రిటు గన్నుల నేమని హాయినుందు మీ
గారవ మిద్దియా? తెలిసెఁ గానక నమ్మితి నెమ్మనంబునన్
గోరిన గోరికల్ సరిగఁ గూర్తురటంచును వెఱ్ఱిదాననై.

పుట్టుగుట్టుల నెఱుఁగక పోలఁతులార!
చేరఁదీసినయందుకు సిగ్గు వచ్చె?
గడుపు చల్లఁగ మీ రిఁకఁ గదలిపొండుఁ
తియ్యవిల్తుండె నా వెతల్ దీర్చు నింక.

అనుచుఁ జంపకమాలిని యవయుచుండఁ
గుంతలుని గూర్చి పెండ్లికై కొడుకుతోడఁ
ధరలి రమ్మని కబురంపి తరలివచ్చె
వంతగను కూఁతు నోదార్ప సంత రాజు.

తుళ్ళిపడి పడఁతులెల్లరుఁ దొరగలేచి
యయ్యవచ్చెను గనుమంచు నన్ను మిన్న
కెఱుఁగ జేయఁగ నాపెయు వెఱఁగుజెంది
లేచినిలఁబడ తేఁడునుఁజూచికూఁతు.

చెదరిపోయిన ముంగురుల్ చేరఁదీసి
యద్దమును దీసి కస్తురి దిద్దవేమి?
మాసి యున్నట్టి పుట్టముల్ దీసివైచి
పట్టుపుట్టంబు నెందుకుఁ గట్టవమ్మ

ఈవు కోరిన రాపట్టి నిప్పుడ తల్లి
తీసికొనివచ్చి పెండిలిఁ జేసి నీకు
నాదు గద్దియ నాతని బొదుకొలిపి
యడవి కే నేఁగి ముత్తిని నరయువాఁడ.

అనినఁ జంపకమాలిని యలరిలోన
బలితమైనట్టి వలవంతఁ బాసికొంత
డెందమునయందుఁ గుందును డిందుపఱిచెఁ
గుందవనమునఁ దాను గుళిందకుండు.

ఆ సుధాకరుఁ డంపిన యట్టి కమ్మఁ
బ్రెగడలకుఁ దెల్పి పయనంబుఁ బెండ్లికగుట
కన్ని పనులను జేయింప నాన యిడిన
వారలెల్లరు చాటింపఁ బజలుమెచ్చ.

పచ్చని మామిడాకులను బాగుగ గుమ్మములందుఁ గట్టి యే
పొచ్చెములేని పందిళులు పొంపిరివోనఁగనైచి ముగ్గులన్

హెచ్చుగఁబెట్టి చిత్తరువులెన్నియొ గోడలమీఁద వ్రాయ రా
లచ్చిపరుండునట్టి గదులంబలెఁ గన్పడె వాడ లన్నియున్.

అంత నెకిమీఁడుబందుగుల్ సంతసమునఁ
జేర హేలాపురంబును వారిరాకఁ
దెలిసికొని సుధాకరుఁడప్డుపలుకు నెసరు
లెసఁగ వారికి విడిదిచూపించుటయును.

వారలెల్ల దానముల దైవాఱఁ జేసి
క్రొత్తయుడుపులు దాలిచి కోఱపాఁగ
లందముగఁ జుట్టి మీసల నట్టె త్రిప్పి
పెండ్లికొడుకును గైసేసి వేచియుండ.

అంతఁజేఁడును జోస్యుల సంతసమున
మూరుతంబును జూడంగఁ గోరుటయును
వారు రిక్కల సరిచూచి మూరుతంబు
దగ్గఱాయెనని నొడువఁ దడయ కపుడ.

కొలుచుమీఁదను గన్నియ కూరుచుండఁ
గాళ్ళగోళ్ళను దీయించి కాన్కలిచ్చి
వాయిదంబులు చెలఁగంగ వరుసగాను
తొరగ నైరేనిఁ దెప్పింప సరవి నపుడ.

పేరఁటాండ్రెల్ల నీళ్ళను బేర్మిమీఱఁ
బోయఁ బానకపుకడవ మొత్తములను
విడిది లోనికిఁ బంపించి తడయ కంత
నెదురుగోలును బచరించి రెసఁగమెసఁగ.

అప్పుడేసాళ్ళకావడు లందికొనుచుఁ
పెండ్లికూఁతుఁ బెండ్లికొడుకు వేడ్కమీఱ
నలుగులనునిడి నీరార్చి జిలుగువలువ
లందములుచిందఁగాఁ గట్టిరంత మీఁద.

వింత వింత వాయిదములు పెల్లుమ్రోయ
తీవితో నల్గడల దివ్వటీలు వెలుఁగ
పడఁతుఁజేడియ లాడుచుఁ బాడుచుండఁ
బెండ్లి తిన్నియఁ జేరిరి పెద్దలెల్ల.

కన్నియను బెండ్లికొడుకునా తిన్నెనడుమఁ
బట్ట తెరపట్టి కూర్చుండఁ బెట్ట నంతఁ
బుడమివేల్పులు ప్రాఁబల్కు నుడువులెలమిఁ
జదివి యెడయార దీవనల్ చాల నిడిరి.

తెరను బైకెత్తి మెల్లన తెలివచేత
సన్నికల్లును డాకాలఁ దన్నఁజేసి
వేడ్కలిగురొత్త నొదల వెలఁదులెల్ల
గేలుఁదమ్ముల నందీయఁ గెరలి కెరలి.

ఎన్నరానట్టి కూర్మిని కన్నెయఱుత
నిండుతాలిని చారుశీలుండు గట్టె
నెడఁదసాగయించు చూపుల నింతిఁగనుచు
మేలుమేలని పాఱులు మిగిలిపొగడ.

చారుశీలుని తలమీఁద సకియచేత
సకియతలమీఁదఁ గ్రమ్మఱఁ జారుశీలు

చేత సేసఁ బ్రాల్ పోయించి చెలఁగియపుడ
చీరచెఱఁగులు ముడివైచి చిట్టి వ్రేళ్ళు,

పట్టుకొనఁజేసి యొయ్యనఁ బైకివచ్చి
యాల్మగలకు నారంజోతి నర్పె చూపి
కానఁబడియెన లేదంచుఁ గడఁగియడిగి
దండములఁబెట్టఁజేసిరి తనరుబత్తి.

అంతట సుధాకరుండును నల్లునకును
నేలయును సొమ్ములెల్లను నేలు కొనఁగ
నిచ్చి పాలుఁ దనియింప మెచ్చివార
లేఁగఁగా సుధాకరుఁడును నించు వేడ్క.

గారెలు బూరెలున్ మఱియుఁ గమ్మని నంజుడు లెల్ల కూరలున్
గూరిమిఁ బెట్ట బందుగులు గోరికఁదించును మాటలాడుచున్
నేరము లెంచకుండఁ గడు నెయ్యముమీఱిన వియ్యమందఁగా
వారును వీరునున్ మిగులఁ బాయని ప్రేముడి లేచి రంతటన్.

చందువాపెట్టెలు సరిగంచుచీరెలుఁ
బెద్దమామిడిపండ్లు బెల్లములును
జక్కెరచిలుకలుఁ జక్కని నగలును
నత్తరుపెట్టెలు నంటుజోళ్ళు
గంధంపు చెక్కలుఁ గానులుపేరులు
రతనాలమొలతాడు జాళ్ళనాను
మిరియాలపేరులు మేల్ పట్టుపైకలుఁ
బునుఁగును జవాది బొడ్డుతావి

పెట్టిచక్కఁగఁ దద్దయు వేడ్క మీఱఁ
గ్రంత నడిపి కుళిందుండు గఱితలార !
తీసికొనుడంచుఁ జెప్పుచుఁ బాసి యచోటు
చుట్టలును దాను జాటునఁ జూచుచుండ.

రాచయైదువ లెల్లరు రమణ వచ్చి
వాని నన్నింటిఁ గైకొని జానుమీఱ
లోపలికిఁబోయి బండముల్ సూపిపెండ్లి
కూఁతుఁ గైసేసి పేరిమిఁ గూరుచుండి.

పగడముకోళ్ళమెనఁ బట్టిన మంచము
తుఱుఁగలి తెల్లని దోమతెరయు
గాలితలాడయుఁ గాగ్రొలెడు గవిసెన
యొయ్యన నుయ్యాల లూఁగు గుత్తిచి
కపురంపు బరణియుఁ గస్తురిలప్పయు
నిలువుటద్దమ్ము పన్నీటికోవి
బంగారు పళ్ళెంబు బంగారు కత్తెర
వీణతాంబుర వట్టివేళ్ళసురఁటి
పీఁకెదానియు జవ్వాది పెట్టెగములు
పునుఁగుబరిణెలు సంపెఁగ పూవునూనె
గిండులును గలిగి కన్నుల పండువైన
పచ్చవిల్తునికొలువు టుప్పరిగలోన.

ముంగాలపొంగారు సింగారపుంజీర
చెంగుల్ పిసాళించి రంగుసూప
బంగారుగుబ్బలఁ గంగారు పడనీక
చెంగావికంచెల రంగుసూపఁ

బొంగారురతనాలఁ జెంగలించెడునట్టి
బంగారుకడియాలు రంగుసూప
రంగురంగుల నీని నింగి వెల్గఁగఁజేయు
తొంగలినడకలు రంగుసూపఁ
జిగురువిలుకాని జంత్రంపు మగువ యనఁగ
వలపుఁగులికెడు నా రాచచిలుకకొలికి
నిలువఁగాఁ జేసి కాటుక కలికికనులఁ
జక్కదిద్దుచు బొట్టిడి సకియ లపుడు.

మించు మించెడి నా రాచ మించుఁబోఁడి
కగ్గలంబగు వలపుల నడరఁజేయ
నన్ను మిన్నయుఁ దలవంచి యట్టెనేలఁ
గాలివ్రేలితో రాయుచుఁ గనుచునుండ.

దవ్వులనయున్న యప్పుడు పువ్వుఁబోఁడి
మరుని మరులను జిక్కుచు మమ్ము మఱచి
జారుశీలునిఁ గూడంగఁ గోరి యిప్పు-
డండ నుండంగ జూడక యాలసింతె?

నిన్నుఁబోలిన ముగుదలా నెలఁతలేను
దొట్టతొలుతను సిబ్బితిఁ దొలఁగ మెలఁగి
చిట్టచివరకుఁ బ్రోఢలై చెలఁగిచెలఁగి
చిన్నెవన్నెల సుద్దులు సెప్పువారు.

అనుచుఁ బల్కి ముగుద సర్మిలిఁ దోడ్కొని
పడకటిల్లు సొచ్చి పడఁతు లపుడు
మగువచేతి విడెము మగనికి మగనిచే
విడెముఁ దిరిగి మగువ కిడఁగఁజేసి.

మీకుఁ దెలియని దున్నదే మేలుఁగు డింక
నిచ్చవచ్చిన తెఱఁగులఁ బొచ్చ మింత
లేనియట్లుగ నంచును జానలెల్ల
నల్లనల్లన గదివాసి యరుగుటయును.

చారుశీలుండు చిఱునవ్వు చదలనంట
సెజ్జమీఁదికి నింతినిఁ జేరఁదీసి
యొడలు గరుపాడఁ గోర్కులు తడఁబడంగ
వలపు గులుకఁగ మొగమును గలయఁజూచి.

ముత్తెంపుసరులను ముట్టి చూచెడిలాగు
గబ్బిగుబ్బలు పట్టి కౌఁగిలించి
చెవుల వ్రేలాడుచుఁ జెంగలించెడి నగల్
ముట్టుచుఁ జెక్కుటళుల్ పుడికిపుడికి
యొడ్డాణమును గాంచు నోజను గనుపట్టి
వలుఁదపిఱుంద పొక్కిలియు నిమిరి
వీడెంబు నోటను బెట్టెడు పోలికఁ
గెమ్మోవి తేనియల్ గెరలియాని
కొప్పులో నున్న పువ్వుల యొప్పు చూచు
చందమున ముంగురులు కేల సరిగదిద్ది
మరులు గొలుపుచుఁ దద్దయు మరుని చివ్వ
కియ్యకొనునట్లు చేయుచు నొయ్యనొయ్య.

నాఁడు తోఁటలో నినుఁగాంచి బోఁడి! నేను
వీటి కేఁగిన మొదలుగ నేఁటిదాఁకఁ
గంటికి నిదుర యెఱుఁగక గలవరించి
నిన్నె యెదలోన నిలిపితి నిక్క మనుచు.

నెఱతావుల్ కరమగ్గలంపుఁ దమిమై నేర్పొప్పఁగా ముట్టుచున్
గరగం బాఱినయట్టి డెందమున నా కప్రంపుఁబొమ్మన్ గడున్
మురిపంబొందుచుఁ గౌఁగిలింప నహహా పోఁబడ్డకొన్నానతో
వెరవుంగాంచి యలంచె నా నెలఁతయున్ వేర్వేఱుగా నేలికన్.

చారుశీలుండు నుతిమతి జానతోడఁ
బెనఁగి మక్కువ దీరంగఁ బెద్దపొద్దు
ముద్దులాడుచుఁ బ్రేముడి దిద్ది కురులు
మూఁడు వలపులు వలపించె ముగుద నాఁడు.

అంతఁ దెలవాఱు మున్నె యా యతివ లేచి
చెలిమికత్తెలఁ గూడఁగఁ జేర వారు
పల్లునొక్కులు చెక్కులఁ బరఁగగాంచి
పడతిఁ యిదియేమి వింతయె బాగుబాగు!

ఒక్కరాతిరి లోపల నువిద! యీవు
సొక్కిచిక్కితి విదియేమి సోద్దె మమ్మ!
యనుచుఁ గలకల నవ్వఁగ నాపె సిగ్గు
పెద్దగాఁగ మాటాడక వెళ్లఁబోయె.

ఇట్లు రాకూఁతుఁ జెలికత్తెలెల్ల నవ్వ
రేక రేకలు తూర్పున వీకఁదోఁచె;
ఎల్ల చుట్టాలు తమ తమ యిండ్ల
కరుసములు మీఱగా నప్పుడరిగినారు.

చారుశీలుండు మగువతోఁ జాలపొద్దు
మామనేలనె యేలుచు గోము మీఱఁ

బజల నెల్లరఁ దనియించి ప్రబలుచుండెఁ
బౌరులందఱు జేజేలు కోరి యిడఁగ.

*
* *

జడదారుల రాయని జన్నముఁ బ్రే
ముడి గాచిన రాకొలపుం దొడవా!
దుడుకుందనపుం జెయిదుల్ బచరిం
చెడి తుంటరిమూఁకల జెండు దొరా!

తెలుఁగుఁదనపుబాటా! తెల్వితెల్లంపుకోటా!
సిలుగులణఁచునమ్మా! సేమముల్ గూర్చుసొమ్మా!
తెలుఁగుతలఁపుపేటా! తెల్గురాజ్మాటతేటా!
నలువగలుగునమ్మా! నాణెపుంబట్టుఁగొమ్మా!

---

# పండితరాజ చాటువులు.

భామాజనతాకామా !
కోమల సుగుణాభిరామ గుణమణిదామా !
శ్రీమచ్ఛర దిందు యశో
భామా ! శ్రీరామ కృష్ణపావననామా !

వ్రేళులమీఁద నిల్వఁబడి వేఁడికి గాలికి సీతుబాధకున్
జాలఁగ డస్సి క్రిస్సి మెయి సర్వము గంటులువాఱ నెత్తిపైఁ
దాళఁగరాని భారమును దాల్చి సుధాజలమిచ్చి యెల్లరన్
జాలికరంగి తన్పు నిను సంస్తుతిచేసెద నారికేళమా !

జననము క్షీరకంధి సహజన్ములు కల్పకభార్గవీసతుల్
ఉనికి మహేశుమూర్ధమున నొయ్యన నీ వసివాఱుచుండుటల్
ఘన ఘనమార్గమందు; కులగౌరవమట్టిది యాటచేతనే
తనువును గోసి దేవతలఁ దన్పుదు చంద్రుఁడ ! యెంత దాతవో!

ప్రవిమల రత్నసంచయము పావనశంఖము లచ్చముత్యముల్
పవడము లాదియౌ సరళవస్తువులెన్నియొయున్నవాఁడ వం
చవితధవాక్యులౌ కవులు వ్యాహృతిచేయుట లాలకించి నీ
సవిధముచేర డప్పిగొని క్షారజలం బిడనౌనె వారిధీ?

నిలువఁగ నీడ లేదు శయనింపఁగ సెజ్జయులేదు కట్టఁగా
వలువలులేవు చేత నొక పైసయునేనియులేదు గాదెలన్
గొలుచులు లేవు నీ రసము గ్రోలెడువారికిఁ దాళవృక్షమా
[illegible]

దున్నక మూఁడుకారులను దోరముగా ఫలియించు భూములం
దన్నపయోధరా! కురియు మంతియకాని వృథాప్రయాసగా
నెన్నఁడు నూషరస్థలుల కేఁగి త్వదూర్జితశక్తి వమ్ముగాఁ
బ్రన్నఁదనంబుతోఁ గురియఁబొల్పడఁబోకుము నీకు మ్రొక్కెదన్.

మనుపఁగలేదు కోయిలల మంజుల పల్లవమిచ్చి యెన్నఁడున్
దనుపఁగలేదు నీడలిడి తాపమునొందెడు బాటసారులన్
బనివడి యేమిచేసితని పండ్లికిలించెద విట్లు దాడిమం
బ! నిరుపమాన దాతృతను వర్ధిలు మామిడిఁగాంచి యిస్సిరో!

పరహితకారివై యొరుల భారము మూఁపునఁదాల్చి కానలం
బెరిఁగిన గడ్డిగాదములు ప్రీతిమెయిం గ్రసియించి నీరముల్
సరసులలోన నాని తనజన్మను ధన్యముచేసికొన్న శం
కరువరవాహనంబు నుతిగాంచునుగాదె జగంబులోపలన్.

పాలిడి పిన్నపాపలను బంచితమిచ్చి సమస్తరోగులన్
లాలిత గోమయంబిడి విలాసగృహంబులఁ దేజరిల్లఁగా
నీ లలితంపుప్రాణమది నిల్చినదాఁక నొసర్చి; జీవముల్
తూలియు గోవ! కొమ్ములును దోలు నొసంగెద వెంత ధన్యవే.

వెలుఁగును జూడఁబోక నడువీధి నొకప్పుడు సంచరింపకే
వెలగల కుట్టిమస్థలుల వెగ్గెడు రాజగృహంబులెన్ని యో
కలుగులువెట్టి కూల్చెద వకారణవైరము నూని యేటికే
యెలుక! ఛి ఛీ ఛు ఛూ యనుచు నెల్లరు పెల్లుగ నిన్నుఁదిట్టఁగన్.

తనుఁదా రక్షణచేసికో నొడలిమీఁదన్ గొంచ కెల్లప్పుడున్
ఘనచర్మావృతకంటకపఙ్క్తితతి విఖ్యాతంబుగాఁ దాల్పుటల్

కనినా మతింయకాని యొడ్లకిడు వృక్షశ్రేణి కడ్డంబుగాఁ
జని నీయట్టులు నిల్చుటల్ కన మెటన్ శాఖోటభూజాధమా !

లేచినదాది పొట్టకయి లేకితనంబున నింటనింట నోర్
చాచి చరించి కావుమని సల్పుచు గోలను కానికూళ్ళకై
యాచనచేయు నీవు తులయయ్యెదు వెట్టులు చూతరాజమం
దేచరియించు కోకిలమనీషికిఁ జెప్పుము తీర్థకాకమా !

ఆకుల మాటునందణఁగి యందఱకన్నుల దుమ్ముకొట్టఁగా
మూకత నున్న నిన్నుఁగని మూఢులు తజ్ఞత లేమి భ్రాంతిమైఁ
గోకిలమంచు నెంచిరని కూయఁగఁబోకుము నోరువిప్పి తేన్
లోకము నవ్వు నీపలుకులోఁగల తత్త్వముగాంచి కాకమా !

తెలతెలవాఱుచుండ నలుదిక్కులకుం బరతెంచితెంచి పూ
వుల మకరంద బిందువులు పుక్కిటఁబట్టి ముదాన నేఁగి లోఁ
గలిగిన నెల్లరం దనపి కాదనకొడ్లకు నిచ్చుచుండు నీ
మలఁగని త్యాగబుద్ధికి నమస్కృతు లో మధుమక్షికాగ్రణీ !

పలువిధ చిత్రవర్ణముల భాసిలుపూవుల వ్రాలివ్రాలి సం
కలితమధూళికాజలము కమ్మఁగఁగమ్మఁగఁ గ్రోలిక్రోలి కే
వల నవనీతభావమునఁ బాదపశాఖల వ్రేలివ్రేలి లో
కులఁ దనియింతువెంత నవగుణ్యుఁడవో మధుమక్షికాగ్రిణీ !

ఇల్లిల్లుం దిరుగాడి పొట్టకొఱకై యేవాఁడు ఛీ ఛీ యనన్
ఫుల్లాకుల్ తెగనాఁకి వీధిఁబడి గోముం జూప నీవేటికే
'ఒళ్ళంతా' వదనంబు చేసికొని ఛీ యెక్కింత లేకుండఁగన్
వాల్లభ్య ప్రథగాంచు సింగముపయిం గాల్ద్రివ్వుదో. శ్వానమా

అకరువులందు రక్తిమము నాకృతియందు మనోహరత్వమున్
సకలశరీరభాగముల నాసికఁదన్పెడు వాసనారుచుల్
వికలముగాని మార్దవవివేకము గల్గు శిరీషపుష్పమున్
సికను ధరించు నవ్యకవిసింహుఁడు ధన్యుఁడు ధన్యుఁడన్నిటన్.

పుట్టువు పంకసంకిలితభూమి, నివాసము చూడ నిత్యమున్
గుట్టును రాడనట్టి జలకుండికలో, సహవాసమన్ననో
రట్టడినాచుతో, నిటు లరమ్యపదార్థములందు నేచి నీ
వెట్టులు లక్ష్మినిల్పుటకు హేతువవైతివి తెల్పు పద్మమా !

పంకమునందుఁబుట్టిన నివాసముచేసిన నీళ్ళలోపలన్
గింకిరినాచుతోఁ బెరిఁగి కీడ్పడియున్నను వాసనాకృతిన్
శంక యొకింతలేని నిను సర్వులు శీర్షములందుఁ దాల్తుగా
కంకిలి పెట్టఁబోరెపుడు నజ్ఞతతోఁపఁగఁ బద్మరాజమా !

పరమపవిత్రమై పరఁగు పర్వతరాజమునందుఁ బుట్టినన్
ఉరవడిఁ 'దల్లక్రిందులుగ' హోరునఁబాఱినఁ బీరభూములన్
సురుచిర సస్యజాలముల సుక్కఁగనీయక యెల్లపొద్దులన్
దఱుగక పాఱు గంగ కెన తానెటులౌను రఘురంబు చూడఁగన్.

తుంగహిమాద్రిశృంగములతోఁ దలక్రిందుగ జాఱిజాఱి సత్
భంగము లొందియొంది యిరుప్రక్కలవారికి జీవసంబు శ్రే
భంగినిభంగముల్ గొననిభంగిని, జీవనదానమిచ్చి యు
ప్పొంగెడు గంగకున్ సరియె యొండొక దండుగ పల్వలంబిలన్.

గోరాజాగ్రతలంబునన్ నిలిచి సంక్షోభంబు లేకుండఁగా
గౌరీనాథు యశంబు చాటునని లోఁ గాంతాళముంబూని సౌ

క్రూరాకారుఁడ! కానరేశ్వర! వృథాక్రోంగోమ్ములం ద్రిప్పుచున్
దారుల్ గావకు మిత్తికొంగలుగు నీదౌష్ట్యంబు వీక్షించినన్.

శూన్యములైన హస్తములు శుష్కములైన వచఃప్రసంగముల్
మాన్యులముందు చూపక యమానుషచర్యల జోలిలేని స
మ్మాన్యభవత్ప్రవృత్త మనుమానములేక భజించు వారినిన్
ధన్యులఁజేయు నీ తనవు ధన్యము ధన్యముకానరేశ్వరా!

కొమ్మకుఁగొమ్మకున్ దుమికి కొంకిరిబింకిరి బొల్లిమాటలన్
నమ్మక మొప్పఁబల్కి మదనక్రియ లహ్నమునందెచేసి యా
కొమ్మల పుత్త్రులం దునుము కోతికి నీకొక నీతియున్నదే
యమ్మకచెల్ల! నైజగుణమాఱునె వానరజాతి కెన్నఁడేన్.

పెంటలలోనిగోతులను పేఁడలలోపలనుండు పుర్వులన్
తింటకు సర్వకాలములఁ ద్రిప్పలుచెందెదు కుక్కుటాధమం
బంటక నిన్నుఁ గాళ్ళ నిటునట్టును ద్రోసిన బొగ్గుముక్క వం
చంటునె నీకు దోషమిసుమంతయు నేనియు నింద్రనీలమా!

ముఱిగినగుంటలందు మలమూత్రవిసర్జనభూములందునున్
పెరిఁగిన నీకు నన్యజన పీడనమే యొక విద్యగా సతం
బరుసము నొందుచుందు వపునా నది నైజము నీచజాతికిన్
అరమరలేలయింక మశకాధమ! కూయుము నోరికొల్దిగన్.

రెపరెపలాడి నీరముల రేఁపుచు గట్టులఁదాఁకఁ గొట్టుచున్
జపలత సంచరించిన విసారకులాగ్రణి! యెన్నఁడేనియున్
ద్రపయణఁగించి దేవతలఁదన్పెదె మందరమట్ల పీతిమైఁ
దృపితుఁడెవండు నీవలన నేర్పడఁజెప్పుమ యాలకించెదన్.

అలికులవేణు లంగములయందును వక్రమున గబ్బిగుబ్బలన్
తళుకు మొగంబులందు సురతంబులఁ దాల్చు వాసనా
కలిత సునాభియుక్తమగు కస్తురి లేడికి క్షుద్రసత్త్వముల్
తుల యెటులౌను జూడ నొకతోయమునందె జనించియుండినన్

గొంగళిపుర్వ! నిన్నుఁ గని కొందఱు మందులు నింక నేటికా
బెంగిలఁబోకు భావి నొకవేళను నీవును జిత్రచిత్రవర్ణా
రంగులచిల్కవై కులుకు ప్రాభవముం గనవత్తు వప్పు డీ
వెంగలి విత్తుతొత్తులను వెక్కిరింపఁగవచ్చు నిచ్చలున్.

పోఁడిమిమాలినట్టి వెడబుద్ధుల సుద్దులు పల్కువారు నిన్
వాఁడి మయూఖుఁడంచు బహుభంగులఁ బల్కిన నేమి? నెమ్మిపూఁ
బోఁడి మొగంబువిచ్చి మెయిఁబుల్కలు దాల్చి తేనెవానలన్
దాడఁగఁ జేయు, నయ్యది యదార్థముకంబుగుఁగాదె నిక్కమై

కల్పకమల్లి కాకుసుమకల్పితనూతనహంసతూలికా
తల్పమునందు నాల్గుగలు దర్పకజన్యమునందు శ్రాంతులై
నిల్వఁగలేక మేనులను నిద్దురపోవుచునుండ నల్లి! నీ
యల్పతచూపి కుట్టెదవె యోఁగుము నీపొగరేఁగ నల్పకన్.

గురువులబాధలేక తనకుంగలదానను తృప్తిఁజెందుచున్
ఎర గొనివచ్చి బిడ్డలకు నిచ్చుచుఁ బ్రేముడి నిన్నుఁ దన్పుచున్
పరమసుఖంబు గాంచు ప్రియవల్లభు గన్న కపోతి! యెంతగాఁ
గిరిశునిఁ బ్రేమపుష్పములఁ గ్రిందటిజన్మను పూజచేసితో.

పందీ! యెందుకు ఘుర్ఘురింతువు వృథాప్రాల్మాలి మందుండవై
ముందున్ వెన్కను జూడకుండ, నదిగో భౌయ్ భౌయ్ మటం
చార్చుచున్

క్రిందున్ మీఁదును గానకుండ శునకశ్రేష్ఠంబు నీమీఁదికిన్
చిందుల్ ద్రొక్కుచు వచ్చుచున్నది బలే చేవున్న డీకొమ్మికన్.

విడివిడిగా జనించి పృథివీస్థలి నొంటరిపాటనుండు నా
యడవిని గల్గు వృక్షముల నాకువునంగల నాఁగుఁబాములన్
మడులనుగల్గు సస్యముల మందటిలోని గుఱ్ఱాల నావులన్
గడెయొకలేని నొక్కెడను గల్పిన నిన్ జడధీ! నతించెదన్.

కలిమి నెలంతయుండఁదగు కమ్మని సౌరభమున్న దానవా?
అళులకుఁ దియ్యఁదేనియల నారఁగఁగ్రోలఁగ నిచ్చువాఁడవా?
కలికిమిటారి కత్తియల కన్నులకున్ సరివచ్చుదానవా?
జలజమునంచు నేల తెగసాగెదు నీవును క్షుద్రశంఖమా!

ఖనిజము లెన్నియో కలియఁగా జనియించుటయే భువిన్
ఘనతగ నెంచి మించు నినుఁ గాఁపు గృహంబునఁ జింతపండుతో
ననయముతోమఁ దోమ మెఱయంగల వంతియకాని యిత్తడీ!
కనకమువోలె నైజమగు కాంతిని గల్గి వెలుంగఁ జాలుదే.

పులినితలంబులం దమలపుష్కలవారి, మొగంబు క్రిందుగా
నిలిపి యొకేపదంబుపయి నిల్చి జపం బరమోడ్పుఁగన్నుతో
సలిపెడు నిన్నుఁగాంచి ఘనజాపికుఁ డంచుఁదలంచుచుండు మీ
నులని బకోటమా! యెప్పుడునుం దలపోయఁగఁబోకు మాత్మలో.

వంకరలెన్నియో తిరుగవచ్చు దళంబులు పర్వపర్వమున్
జంకక తాల్పవచ్చు మెయి సర్వము కర్కశచర్మమూనఁగా
శంకిలకుండవచ్చునని చంకలు గొట్టకు యావనాళమా!
శంకరుఁ గెల్వ మన్మథుని చాపమమూదువె తీపికూర్తువే?

భ్రమరా! యేమిది చిత్రమయ్యెఁడుగదే బంగారువర్ణంబుతో
అమలానందముగూర్చు సంపెఁగసుమం బంకాననే యుండఁగా
రమణీయంబులుగాని పుష్పముల నాఘ్రాణింపఁగా నేడకో
యమితోత్సాహముతోడ నేఁగెదు వృథాయాసంబుగానజ్ఞతన్.

గొల్లెంబిడ్డ గృహంబులో నొదిగి గగ్గోల్ చేసి భాండంబులన్
పిల్లీ! మెల్లఁగఁ గన్నుమూసి యితరుల్ నిన్ గాంచరంచెంచుచున్
చల్లాపాలును ద్రావనెంచకు మదే చామోద నిల్లాలు దా
'కళ్ళున్నీ'యిడి చూచుచున్నది నినున్ శాసింప జాగ్రత్తరా!

నిలుపఁగలేదు భూభరమునెత్తి నొకప్పుడు నించుకేనియున్
సలుపఁగలేదు వర్ణనలు సారకవిత్వపటుత్వసంపదన్
గులుకఁగలేదు శంకరుని కుత్తుకభూషణమౌచు నెప్పుడున్
చిలువలతేని కీడెటులు చేయఁగవచ్చును నిన్ భుజంగమా!

అందనియాకసంబుపయి నంబుదమాలికయందె సర్వదా
యుందువుగాని నిన్నుఁగను నుత్సుకతన్ మనమూరి చేతులన్
ముందుకుఁ జాఁచువారికిఁ బ్రమోదముగూర్పవు తళ్కుతళ్కుమం
చెందుల కంత తొందరగ నేగుచునుందు మెఱుంగుతీవరో!

సురుచిరగాత్రిలంగనల శోభితగాత్ర మలంకరించునా?
సురతములందు దంపతులు చొక్కెడుతావులు గుప్పించునా?
పరశివనవ్యదివ్యపదపద్మయుగార్చన మాచరించునా?
పరిమళమించు మల్లెపువు వంతెటుగల్గెను మల్లిపూవుకున్.

అంగడులందు నద్దములయందు మెఱుంగుల దివ్వెవెల్గులన్
రంగుల రంగు చీరయును రైకయుఁదాల్చి వెలుంగుచున్న నీ

వంగనవోలె భావమును హావముగూరిచి పూరుషాళికిన్
అంగజసౌఖ్యముల్ గొలిపి హాయిని గూర్తువె సాలభంజికా!

పలుకుదు విన్నమాటలనె పల్కుఱు లోకుల మోసగింప నీ
పలుకుల పోకడల్ వినని వారలు త్రొల్తను సంతసించినన్
నిలుకడమీఁద నీపలుకు నేరిమి పేరిమి చెత్తయంచు నో
చిలుక! యెఱింగి భావములఁ జీదరచెందుదు రెల్లకాలమున్.

పచ్చగ నున్నవాఁడవని పల్కుల తేనియలొల్కువాఁడ వం
చచ్చపు రాగముం గురియు నాస్యము గల్గినవాఁడవంచు ని
న్నిచ్చదలంచి మెచ్చుకొని రింతియగాని యొకండు నేనియున్
త్వచ్చరితంబు సర్వఫలభంగకరంబని యెంచఁ డోశుకా!

పక్షంబుల్ గలదాననంచును నభోభాగంబు నందుండి యే
వృక్షాగ్రంబునయందొ 'కూరుచుని' గర్వీభూతచేతస్కతన్
పక్షీ! రెట్టలు వేయఁబూనకు స్వయంవర్ధిష్ణు వృక్షాళిపై
కక్షంబూని బలాఢ్యుఁ డెవ్వఁడో నినున్ గారించు విల్లంబులన్.

కొడవలి పెట్టికోసి నినుఁగొట్టి శిలాస్థలిఁ బెట్టి గట్టిగాఁ
గడవల నుడ్కఁబెట్టినను గర్కశమూర్తివిగాక వారినే
కడుపులు నింపి ప్రోచెదవు కారుణికోత్తమరాలివైన నిన్
జడమతియైన మొక్కవలె శాలి! కృతంబునతంబు తెల్పుచున్.

పుట్టినదాది సూర్యకరపోషణముం గని వృద్ధిచెంది యో
రట్టడి పల్లవంబ! సుతరాము కృతజ్ఞత చూపఁబోక యాఁ
కట్టెడవేల యా సవితృకమ్రకరంబుల, లోకబాంధవుం
డెట్టి వినీతిచూపినను హీనులచేష్టల లెక్కసేయునే!

దొంతరరేకులన్ మిన్నులఁ దుంపెసలారు హరిద్రికాంతులన్
ఇంతుల కుంతలాగ్రముల కెక్కిన మాత్రన బంతిపూవ! చే
మంతి సుమంబుతోడను సమానమవౌదువె? నీదుకంపు నీ
మంతిను లిచ్చగింతురె యమాయిక బాలికఁ బట్టు లెన్నఁడేన్.

ఏరా! రాసభ! పండ్లు వెకిలి మహాహీసస్వరంబొప్పఁగా
రారాజుల్ చరియించు రథ్యాపదవీ రాజ్యంబునం గూర్చి తన్
మోరన్సాచి యదేషనిన్ గను జనుల్ మోఁదంగ హ్రీవీడి
వీరీతిన్ నడువీధిలో నటించెదవు! యెంత మూర్ఖ్యంబురా!

పుడమి సమస్త వస్తువులు ప్రోయ్యిడి వండఁగ నెల్ల పుల్లఁగా
నుడుకఁగఁ బెట్ట మెత్తఁబడుచుండుట సాజము కాని నీవలెన్
ఉడికిన 'గొడ్డె' గట్టిపడుచుండుట కానము; పుట్టుగ్రుడ్డివై
యడరెదు నీకు మెత్తఁదనమబ్బునె గొబ్బునఁ గుక్కుటాండమా

చిత్తజుయుద్ధముం బగటఁ జేసెదు నీయపకీర్తి యెక్కె నీ
నెత్తిని, గుత్తుకందగుల, నేలను రాలిన వడ్లగింజలే
బుత్తికిఁ గాఁగ, సిగ్గఱి ప్రమోదము చెందెదవేమి చూచిరో
తొత్తఱికంపుజీవితముతో మను కల్లరి యూరఁబిచ్చుకా!

ప్రతిజనుఁ డేవగించుకొని బాదఁగ మోదఁగఁ జావఁగొట్టఁగా
మతిచెడి యింటనింట నవమానము చెందెదు కుక్కురాధమా
బ్రతికినఁ జచ్చినన్ సకలరాజులమన్ననలందు నేనుఁగున్
గతముతలంపకుండ మొఱగంగ దలవెట్టకు సిగ్గుచేటగున్.

సొబగులుగూర్చు వస్తువులఁ జూచి ముదంబును గాంచ నేత్రవా!
ప్రబలవిరోధి గుండియలు బ్రద్దలు వాఱఁగ జేవురింతువా?

అబలలభావముల్ కరఁగనా గిలిగింతలు పెట్టనేర్తువా?
విబుధులు నిన్ను మెత్తురెటు విచ్చిన మూసినఁ గాచనేత్రమా!

ఎప్పుడో వచ్చెడు వర్షకాలమునకై యీవిప్పుడే ముందుగాఁ
జపలత్వంబును వీడి వంచి తనువున్ శ్రద్ధాత్మ నాసాయమున్
అపురూపంబుగఁ గూర్చుకొందువు సమస్తాహారధాన్యంబులన్
త్రపలేదెంచును నీకుఁ జీమ! భళిరే! ప్రాజ్ఞుండ వీవన్నిటన్.

కంఠంబందున నైల్యమున్న సతముంగావించినన్ నృత్యమున్
ఠంఠంఠా యని షడ్జమస్వరముతో ఢంకా బజాయించినన్
కంఠేకాలుఁడవంచు నెంచరు నినున్ శ్మశానగ్రామమందుండినన్
శుంఠల్ గూడ, వృథాగ నేటికి శిఖీ! శోషిల్లె దీశాంశకై.

ఉఱుములు మెర్పులున్ గలిగి యుబ్బెడు మబ్బులగుంపునీపయిన్
విఱిగి సరాలునన్బడెడు భీతిని బాపికొనంగఁ దీతువా!
చరణములెత్తి దానినాఁపికొన సత్తువచూపకు మెంతవెఱ్ఱి! నీ
చరణములేడ? మేఘముల సంఘమదేడ? తలంచిచూచినన్.

చివురుల పూవులన్ మివుల శ్రేష్ఠములైన ఫలాళితోడనున్
నవనవలాడు వృక్షముల నాశముచేయఁగలావుగాని నీ
జవమును జూపి నీరమిడి సాకఁగలేవుగ చీడపుర్వ! నీ
భవమది కాల్పనా?యిటులు ప్రాభవమందఁగఁ జూడకెన్నఁడున్.

అంబువు నీరు గాలియును జ్యోతియు ధూమమునైన మబ్బుపై
నింబు వహించి శూన్యమున నించుక సేపిటు తళ్కుతళ్కునన్
డంబును జూపినంతటనె టక్కరి చంచల యెవ్వరేని నిన్
బంచిన వేడ్కఁ గౌఁగిలిడి పట్టుకొనం దలపోయ నెంతురే.

ముమ్మరమైన కంపుమెయి ముక్కులు బ్రద్దలు వాఱుచుండఁగ
గుగ్గిమ్మురుచెల్ల వేళలను గుంటలలోపలి పంకభూములన్
గుమ్మరిపుర్వ! యించుకయుఁ గూడను నీ మెయిఁ బంకలేశపు
జెమ్మయు నంటనీయ విది చిత్రముగాఁ దలపోసి చూచినన్.

సన్ననిముక్కుతో మిఱుఁచక్కని నీలకకీరయష్టితో
వన్నెలుచిన్నెలై నడుమవాలిక చీలికయైన తోఁకతో
సన్నకసన్న యౌవనులచారు విలోకనపాత్రమౌ త్వదీ
యన్నెసలారు నీబ్రతుకు చెందును సార్థము ఖంజరీటమా!

మీఁగడపెర్గులోఁ దఱచు మీఁదికిఁ గ్రిందికి గిఱ్ఱుగిఱ్ఱునన్
వేగముగా భ్రమించి కనువిందుగ నాట్యముచేసినంతనే
యేగతినేని నీకు నొకయించుక యేనియు వెన్నలోని యా
బాగులెఱుంగనౌనె చెడవాఁగెద వేటికి వెఱ్ఱికవ్వమా!

క్రూరములైన జంతువులు గొంతులు కోయకయుండఁ బొట్టలో
జేరిన సంచిలో శిశువుఁ జేరిచి కూరిచి సర్వభద్రముల్
పారములేని ప్రేముడినిఁ బాలనచేసి భరించుచుండు కం
గారు మృగంబ! నుతిగాంచెడు మాతృతయన్న నీదెపో!

మానసమందుఁ గ్రీడయటె, మంజుల స్వర్ణసరోజనాళముల్
బోనములట్టె, క్షీరమునఁ బొల్చెడు నీరము వేఱుసేయు వి
జ్ఞానము స్వార్జితార్థమటె సారమతిం దలపోసిచూడ నీ
మానిత జన్మమెంత సుకుమారము, ధన్యము రాజహంసమా!

జల్లెడ! యెంతమౌర్ఖ్యమిది సన్ననినూకను నేలజార్చి పై
పొల్లును రాళ్ళు బెడ్డలును బొట్టను బెటుక గింబుగింబునన్

'ఇల్లును నొళ్ళు' చేసికొని యెంతయు సంతసమొందఁ జూతు నీ
క్రుళ్ళుఁదనంపుఁ గన్నులకుఁ గూడని వాయెనె సూక్ష్మవస్తువుల్.

మధురపదార్థసంతతులు మాన్యములై కనుపట్టుచుండినన్
మధురసమూరు పుష్పతతి మంజులమై యగుపించుచుండినన్
అధరము విప్పి వాని రస మానఁగఁ బోకయదేమి పాపమో
విధుత పురీషరాశిపయిఁ బ్రేముడి వ్రాలెదు మక్షికాధమా !

పచ్చగఁ బచ్చగాఁ గనుల పండువుగాఁ గనుపించుచున్నయా
పచ్చని బీళ్ళఁగాంచి తినవచ్చునటంచును సంబరంబునన్
హెచ్చిన కోర్కెతోఁ బరుగులెత్తకు మోదముగాంచియందులోఁ
జొచ్చిన వెంటనే తనువుసోలఁగఁ జచ్చెదవో కరీంద్రమా !

కూటికి లేక మాఁడినను గొంకవు జంకవు లేకివాఁడవై
చీటికిమాటి క్రొద్దకడఁ జేరి కరంబును జాఁపఁబోవు నీ
బోఁటిని గారవించు ఘనుపుష్కలవారిని మాత్రమర్థివై
నోట స్పృశింతు వెంతటిమనోదృఢిమంబుర ! నీదిచాతకా !

శారదచంద్రచంద్రికలసారము మాత్రమె క్రోలిక్రోలి సం
చారము నీవు దేవతలు సంచరణం బొనరించు చోటనే
సారెకుఁ జేసిచేసి మెయి సార్థకముం బొనరించు కొందు నీ
సారము పక్షపాతఖగజాతి యెఱుంగునె యోచకోరమా !

అమలగుణవిభూషా ! ఆశ్రితాత్యంతతోషా !
శమిశేకృషికఘోషా ! సర్వవిజ్ఞానపోషా !
అమరగురుమనీషా ! ఆంధ్రకావ్యాభిలాషా !
సుమశరసమవేషా ! సూనృతాకూత భాషా !

---

# రసాలము.

శ్రీ దుర్గాంబానాథా
ప్రాదుర్భూతాంధ్రరాష్ట్రవర్ణిత గాథా!
ధీ దివ్యశక్తి జనిత
క్ష్మాదేవీ ఖనిజ కనక శామిత బాధా!

ఓయిరసాలరాజ! చవు లూరెడు నీ ఫల మెన్ని పక్షులా
ప్యాయత మెక్కుచుండు దెస లందు నొకండు భవత్ప్రసంగము
జేయునె? గండుఁగోయిలయొ, నీ నవపల్లవ మాత్ర మాని,
నేమెడ నీయశంబె ప్రకటించెడు పంచమ సుస్వరంబులన్.

***

ప్రసవపాతము.

పూజనీయంబు గోదావరీ జలంబు
జీవనాధార కేదార సేచియగుట
మెఱసి పెంపారి నవనవోన్మేషకళల
సాంద్రతరరుచి గనె విరజాజితీవ.

నాలుగాకులు తొడిగిన కాలమందె
శాశ్వతానంద పదవిని జనని గనుటఁ
గోలుకొనదయ్యె లేఁదీవ కొన్నినాళ్ళు
పల్లవింతురె తలిలేని పిల్లలెందు.

క్షుద్రపల్వల జలములు క్షుధ యడంప
సరళజాతీ కుమారికా చారుమూర్తి

చీడపట్టక చెలువును జెందునెట్లు?
ఘనరసాల కరావలంబనము లేక.

దోహదమ్ములు గొని తులదూఁగుచున్న
మాతృమందిరమందుల మంతుగొనునె?
శారభాక్కీర్ణ సౌవర్ణ సౌమ్యజాతి
క్రమ సహకార మందిరాంగణముగనక.

దగను గొనకుండ ఘోరనిదాఘవేళ
నీకు జోడగు నామ్రిముఁ గూడి మాడి
పావనోదార గౌతమీ జీవనముల
జీవనంబులు దనియంగఁ జెలఁగె జాజి.

పుష్పవతి యయ్యె నఁట తన పుట్టినింటఁ
గమ్మ విరజాజి కొమ్మ తా నెమ్మెకాని
కలిసికొనకయె యాతని కథలు వినుటఁ
బులకరింపవె ప్రియవాక్య కలన లతలు.

అత్తయింటను బొందెడు హరుసమునసో
నాథు కౌఁగిళ్ళఁ జెనఁగు నానందమునసో
గుబురుకొని యాకు దళసరి గొనుటెగాని
పదియు రెండేడు లోకననపడయదయ్యె.

ఇరుగు పొరుగునఁ దనతోడ నెనఁగు తీవ
లల్లిబిల్లిగఁ బతులతో ననఁగి పెనఁగి
పుష్ప సంతానవృద్ధిచేఁ బొంగిపోవఁ
జిక్కివగాయె విరజాజి సిగుచెంది.

రతుల దేల్చినఁ బ్రియుఁడు మమ్రితుల్రలందుఁ
గడుపు ఫలియింపమిని నేమొగాని జాజి
విన్నఁబోవుచు నానాఁడు వన్నె దక్కెఁగె
సహజ సౌవర్ణకాంతియు సన్నగిల్లె.

రమ్యనాథుని గూర్చిన రామచంద్ర!
ముచ్చటకునైన నాకొక్క మొగ్గనిమ్ము
అదియు తామరతంపరై యఖిల ధాత్రి
నంచుఁ బ్రార్థించు నాజాజి మించుబోఁడి.

పత్రములఁ బూజసేయుచు వ్రతము సలుపు
నింతిఁ గని ప్రియుఁడు పరిహాసించుఁ గాని
చీకుఁ జింతయు నించుక చెందఁబోఁడు
తరుణికేగాదె ముందు సంతానవాంఛ.

భద్రమైనట్టి శివరాత్రి వాసరమున
నోషధీనాథు సత్కార యుక్తిఁజేసి
కనె నశోకమతి నొకానొకటి వరంబు
దాన జాజి పుష్పాంకూర మూనె నపుడ.

ఆకు దళసరి తగ్గుచు నచ్ఛమగుటఁ
జెంప లింపుగ నిగనిగల్ నింపుచుంట
సొగసు ననమొత్తుటకుఁ దగు సూచనయుగఁ
జాల ముదమందె జాతీరసాలయుగము.

కరము సోఁకినయంత కమలునోయని మెంచి
పల్లవాంగుళుల పైపైని నిమురు

వడగాలి సుడివీవ వసివాఱునని యెంచి
శీతలచ్ఛాయలచేతఁ దనుపు

దోహదంబించుక తొలఁగెనో యని యెంచి
యోషధీసేవ సంతోషపెట్టు
పారిశుధ్యములేమి బలహీనమని యెంచి
సంవాసిత సుమ రజస్సు చల్లు

పాదమూలంబుగాపాదు భద్రమతిని
నిబిడకోకిలా గీతుల నుబుసుపుచ్చు
వీవఁజేయుఁ బ్రాంతోశీర వృంతములను
తావి ననగొన్న జాజికి మావిగున్న.

కాలము మరియాద నిలిపెడు కోరకమ్ము
పిచ్చికొలిపెడు వాసనా విభవమునకు
మురిపెమును జెందు కాలంబు కొఱకు నెదురు
దార్లుగను భూజయుగమ్ము నక్తందివంబు.

నాల్గు వారాలు గడచెను ననయు బలిసె
విరియు నయిదాఱు దినముల విపులరక్తి
అంత దైవోపహతముగా నయ్యొ రామ
చిన్ని మొగ్గకు నోరసెను సన్నికల్లు.

కఠిన కర్కశ పాషాణ ఘాతమగుట
భావిఫలమగు క్రొన్నన చావు తప్పి
కన్ను లొట్టయి పదినాళ్ళులున్నఁగాని
విచ్చునను నాశ వదలదా విద్రుమములు.

మొగ్గలోనే మణఁగి మొలవోవకుండఁగా
శైత్యోపచారముల్ సలుపఁజేసి
చిగురుటాకుల సెజ్జఁ జేరిచి దుసికిల
కుండఁగా నండఁగా బండఁజేసి

నిర్భరాశావాప్తి గర్భదోహదములు
గడె క్రొక్కతీరుగాఁ గడపఁజేసి
దీపధూపంబుల దృష్టిదోషము వోవ
ఉపచారముల నెన్నొ యొదవఁజేసి

కంటికిని రెప్పవోలెను గాచుచున్న
నాథుఁ డెదను గడు నడువడు నడంక
ప్రీలఁబడి జాజి పనవహ్నృద్భేదకముగ
జాటి పడిపోయె నా మొగ్గ సంజవేళ.

ఓషధీశుండు తెలఁబోయి యురకచూచెఁ
గావవచ్చిన మల్లి కేల్గడిగికొనియె
క్షణములోపలఁ గథయెల్ల గంచి కేఁగె
దైవకృతమున కిల నసాధ్యమ్ము కలదె?

ధర్మశాస్త్రానుసారమై తరుణమునకుఁ
గాలదోషంబు పట్టక గర్భమబ్బె
మొగ్గతలచూపె క్షణములో గ్రుగ్గిపోయె
నంత కింతాయె నింతకు నెంతయగునొ.

* * *

స్త్రీ లు—పూలు

కాళులఁ జేతులం జెవులఁ గంఠములం దతిరీతి వస్తువుల్
దాలిచి కానలందుఁ బరిధానవిహీనత నేఁగువారలున్
మాళులఁబుష్పదామముల మానుగఁ దాల్పఁగఁదత్తరింత్రహో
స్త్రీలకుఁ బూలకుం గలుగు స్నేహమదేమొ యెఱుంగశక్యమే?

పాలకుఁ బిల్ల లేస్త రను భావమునన్ బతిమాలి రైతు, జం
ఘాలతఁజూపి పర్వ్విడు కాలమునందును బుష్ప మొక్కఁడన్
లాలితమై కనంబడఁ బొలంబున నాఁగి గ్రహించి తాల్చు నా
స్త్రీలకుఁ బూలకుం గలుగు స్నేహమదేమొ యెఱుంగశక్యమే?

ఆలయ మల్కి మ్రిగ్గు లిడు నందమెఱుంగరు చీరలేనియఁన్
దాలుచుపాటిగా రతను తంత్రిములేన్ దలపోయఁబోరు వ్యా
లోలతఁ గాంతు రొక్కపువు లోచనగోచరమైనయంత నా
స్త్రీలకుఁ బూలకుం గలుగు స్నేహమదేమొ యెఱుంగశక్యమే?

పాలకు లాజ్ఞఁజేసి తమవల్లభు లింకొక దేశమేఁగుచోఁ
దాళులు పట్టుపుట్టములు దండలు తియ్యని లడ్డువంబులున్
బోలెముగాఁగఁ బంపుఁడవఁ బోవక పూవులు పంపుఁడందు రా
స్త్రీలకుఁ బూలకుం గలుగు స్నేహమదేమొ యెఱుంగశక్యమే!

చేలల నొల్చియిం డనినఁ జేఁదఱచెందరు పెట్టెలోని ర
త్నాలను దీసియిం డనినఁ దప్పక యిత్తురు గాని దొడ్డిలో
లాలితమై యెసంగుపువు లాఁతికి నిండనఁ జిన్నఁబోదు రా
స్త్రీలకుఁ బూలకుం గలుగు స్నేహమదేమొ యెఱుంగ శక్యమే

జోలలు పాడిపాడి కడుఁ జొక్కుచు బిడ్డల ముద్దులాడు చు
[illegible] నేలఁ మహాంతవనంబులలోని కెవఁ డే

బాలికఁ డడ్డుపడ్డ నొకపట్టునఁ బర్విడి తిట్టిపోయు నా
స్త్రీలకుఁ బాలకుం గలుగు స్నేహ మదేమొ యెఱుంగశక్యమే!

వేళ యతిక్రమించె నను వేఁదుఱు చెందను నీళ్ళ పోయుటన్
గాళులు చేతులున్ బడ వికారము గాంచను శీకసన్నియల్
చాళులుచాళులై యెప్పుడుసాఁగి నుమించునొ యంచు నెంచుచున్
స్త్రీలకుఁ బాలకుం గలుగు స్నేహ మదేమొ యెఱుంగశక్యమే!

తాళఁగరాని గాడ్పుల యథాశథలై సుమవల్లు లన్నియున్
వ్రాలఁగఁ జూచిచూచి కరపల్లవ మంటి తెమల్చి రక్తనే
త్రాలఁగవోష్ణబాష్పముఁ దప్పుచు నిష్ప్రహాదెంచుచుండు నా
స్త్రీలకుఁ బాలకుం గలుగు స్నేహ మదేమొ యెఱుంగశక్యమే!

పాలకు నేడ్చుచున్న పసిపాపల చూపులలోని దైన్యమున్
జాలిని గొల్పనట్టి నెఱజాణలు సైతము తీవమ్మియల్
కాలము మీఱె వాడునని కాళ్ళుల వ్రేళ్ళుల నీళ్ళు పోతు రా
స్త్రీలకుఁ బాలకుం గలుగు స్నేహ మదేమొ యెఱుంగశక్యమే!

బాలురు తాతలిండ్లు గని వచ్చెదమంచు వచించినంతనే
చాలఁగ మోదమొంది యొకసంపెఁగదండను దెంపు పొందు ర
త్నాల నొసంగినం గొనక దబ్బున రండని సాగనంపు నా
స్త్రీలకుఁ బాలకుం గలుగు స్నేహ మదేమొ యెఱుంగశక్యమే!

మూలుగుచున్న రత్నమయభూషలు పెట్టెలలోన, నేసవా
శాలకుఁ జాలినన్ని పలరాజు సమిత్తున గెల్వ నూత్న నూ
త్నాల సవాసనావిలసితాచ్ఛ సుమంబులె కోరుకొందు నా
స్త్రీలకుఁ బాలకుం గలుగు స్నేహ మదేమొ యెఱుంగశక్యమే!

వాలికతూపులైన తమపావనదృష్టులె యింగితార్థముల్
హేలగఁ దెల్పుచుండిన నహీనసుమంబులె త్రిప్పిచూపి వ్యా
లోలతఁ జెందునాథుల కలూనముదం బిడి పెల్లుబ్రుళ్ళు నా
స్త్రీలకుఁ బూలకుం గలుగు స్నేహ మదేమొ యెఱుంగశక్యమే?

రాలను రప్పలన్ గొలిచి రాతిరియుం బవ లేకధాటిమై
చాలఁగ దూరమేఁగి నదినస్తకమందు మునింగి యోపికల్
తూలి చరించు యాత్రికలు తోషముగాంతురు పూవులబ్బ నా
స్త్రీలకుఁ బూలకుం గలుగు స్నేహమదేమొ యెఱుంగశక్యమే?

జాలిఁ గరంగ బంధువులు సారెకు వైద్యులు చూచియేఁగఁ జే
లాలయు గంజి త్రావి కనరండని బిడ్డల బిల్చి చెంతకున్
మూలుగుతోడ వారి నొకముంతెఁడునీళ్ళిడుఁడండ్రు చెట్లకై;
స్త్రీలకుఁ బూలకుం గలుగు స్నేహమదేమొ యెఱుంగ శక్యమే?

[illegible]లును వేళయయ్యె వెడలన్వలె నన్నము పెట్టుఁడన్నఁ గం
చాలను వేసికొం డిదిగొ నయ్యన వత్తుము చెట్లకొక్క బా
ల్చాలలి నీళ్ళు పోసి యని శ్రద్ధవహించెడు పేర్మిమూర్తులా
స్త్రీలకుఁ బూలకుం గలుగు స్నేహమదేమొ యెఱుంగ శక్యమే?

పోలఁగ హంసతూలికలఁ బూంచిన పానుపు లెన్నియుండినన్
వ్రాలచఁబోరు మేనులను బ్రక్కలపై నది యేమిచిత్రమో
పూ[illegible]కొన్ని తో[illegible] తమపుట్టినపు రట్టయినట్టె యెత్తు రా
స్త్రీలకుఁ బూలకుం గలుగు స్నేహమదేమొ యెఱుంగశక్యమే?

పోలఁగఁ పేరఁటంబునకుఁ బోవఁగ మల్లియదండ లున్నచోఁ
జాలును [illegible]వస్త్రములు జందిని గిందిని సొమ్ము గిమ్ము ము

త్యాలసరాలు గోరకయ నాదటఁ బోవుచు వచ్చుచుందు రా
స్త్రీలకుఁ బూలకుం గలుగు స్నేహమదేమొ యెఱుంగశక్యమే!

పాలికి నున్న కాఁపు పనిపాటలు చేసినఁ జేయకున్న నా
జోలికిఁబోరుగాని కనసొంపగు మల్లియబోదె యార్ద్రమై
హేలవహింపకున్నఁ గనులెఱ్ఱఁగఁ జూచెద రల్క మీఱ నా
స్త్రీలకుఁ బూలకుం గలుగు స్నేహమదేమొ యెఱుంగ శక్యమే!

పూలె ధనుస్సుగాఁ గలిగి పుష్పశరుండయి, పుష్పధన్వినాఁ
గ్రాలెడు పంచబాణునకుఁ గామిని యాఱవబాణమై విరుల్
శ్రీలలితాంగముల్ గఁ దగుచెల్వున మించుటనేమొ నిచ్చలున్
స్త్రీలకుఁ బూలకున్ విడని స్నేహము లింతగ నాటియుండుటల్.

కాలిలుఁ గనుంగవల్ కుచయుగంబులు మోవులుకాలుసేతులున్
లాలితనాసికంబులు విలాసముఖంబులు చారుగాత్రముల్
పూలనుబోలి తాము పువుఁబోఁడులు గావుటనేమొ! యద్దిరా
స్త్రీలకుఁ బూలకున్ విడని స్నేహము లింతగ నాటియుండుటల్.

***

౨౦ భ్రౌ న్న త్య ము.

ఆపస్తంబుని భట్టబాణకవి విశ్వామిత్రసంతానమున్
భూపశ్రేష్ఠుఁ బ్రతాపరుద్రనృపతిం బుట్టించె నేయాంధ్రి యా
చూపుంగోపులుగల్గుకాంతయెప్పుడున్ శుద్ధాత్మయైయాంధ్రులన్
శేపున్ మాపును గాచుఁగాత సుతులం బ్రీతిం బిసాళించుచున్.

వెళ్లఁబోయెద వేల విశ్వేశ్వరునిఁ గాంచి
హంపీవిరూపాక్షు నరయరాదె

డంబువీడెద వేల టాజుమహల్ గాంచి
యమరావతీస్తూప మరయరాదె

భ్రాంతిచెందెద వేల వారణాసినిఁగాంచి
దక్షవాటికఁ గాంచి తనియరాదె
కళలు వీడెదవేల కాళిఘట్టము గాంచి
నైశాఖిపురిఁ గాంచి పరఁగరాదె

గాంగజలముఁ గనుఁగొని కలఁగెదేల
గౌతమీగంగ కనులారఁ గాంచరాదె
యఖిలసౌభాగ్యములు నీకు నమరియుండ
దెలివిమాలెద వేమోయి తెలుఁగుబిడ్డ!

శాతవాహనహేతి సప్తార్చికీలలు
దండిగా నేఁటికి మండుచుండఁ
గాకతీయుల భుజాగర్వానరక్తి నేఁడు
వాడవాడలయందు నాడుచుండ

వేఁగిదేశాధీశ విస్తార తేజంబు
నలుగడలం దింక వెలుఁగుచుండ
తుభువరాట్పౌరుష జలరాశి యిప్పుడు
నింగిని దాఁకి యుప్పొంగుచుండ

నౌత్తరాహుల దోశ్శక్తి కబ్బురంబు
నంద నేటికి నీవింక ముందు కరిగి
నడుము బిగియించి తొల్లిటి కడిఁదిశక్తి
నడరిపెంపొందు మాంధ్రుఁడా! దుడుకు విడిచి.

ఆఱిపోవఁగలేద యాంధ్రరాజన్యుల
పరికింపఁగారాని పౌరుషంబు
మాసిపోవఁగలేద మనరెడ్డిరాజుల
విజయాంకచిహ్నముల్ వేఁగినాఁటఁ

దొలఁగిపోవఁగలేద వెలమరాజుల ధాటి
యంతఃపురాంగనాస్వాంతములను
గరఁగిపోవఁగలేద కమ్మరాజుల చేతి
కత్తివ్రేటులఁ గాఱు గడ్డసల్ల

సమసిపోలేదు తెలగాల సాహసమ్ము
బ్రాహ్మణప్రతిభ యొకింత పాసిచనదు
ఇన్ని శక్తులు నీలోన నున్నవన్న
నిలిచి పరికించుకోవన్న తెలుఁగుజోద !

అగపడ్డు మెందేని నఖిలసంతర్పియా
విశ్వదాతను బోలు విమలయశునిఁ
గనుపడ్డు మెందేనిఁగాని రాధాకృష్ణు
నంతటి నిఖిలవేదాంతవిదునిఁ

గాన్పించు మెందేని గాలించి పట్టాభి
సాటియా రాజ్యాంగచతురు నితరుఁ
జూపింపు మెందేని శోధించి రామలిం
గారెడ్డివంటి విజ్ఞానఖనిని

కొత్తరాహులె ఘనులని యాంధ్రులుత్త
రిత్తమానిసు లని యేల తత్తరింతు

వీరలందఱు నీవారు కారె యోయి
యాంధ్రపుత్రుఁడ, తెలిసికోవయ్య నిజము.

'దక్షిణాఫ్రిక' నేలి దక్షతఁజూపిన
రెడ్డినాయఁడు తెల్గుబిడ్డగాఁడె
యలప్రయాగక్షేత్రమందుఁ బెంపొందిన
చింతామణి తెలుఁగు జెట్టి గాఁడె

యఖిలప్రపంచవిఖ్యాతుండు శ్రీకోడి
రామమూర్తి తెలుంగురెడ్డి గాఁడె
మధ్యహిందూ దేశ మాణిక్యమై నట్టి
రాఘవేంద్రుఁడు తెల్గు ప్రభువు గాఁడె

రామకృష్ణచౌదరి సాంటి రామమూర్తి
దిట్ట వేంకటపతిరాజుఁ దెలుఁగువారు
కారె? యిట్టియోధులు తెలుంగాణమందుఁ
గలుగ నీ కేమి లోటోయి తెలుఁగుబిడ్డ!

ఆలించినావెందుఁ ద్యాగరాట్కీర్తన
లాంధ్రభూమినిఁగాక యన్యభూమి
నాలకించితి వెందు నధ్యాత్మకీర్తన
లాంధ్రభూమినిఁగాక యన్యభూమి.

రహింవింటి వెచ్చోట రామదాస్కీర్తన
లాంధ్రభూమినిఁగాక యన్యభూమి
మొగి వింటి వెయ్యెడ బొబ్బిలిపాటల
నాంధ్రభూమినిఁగాక యన్యభూమి

వింటి వెచ్చటఁ బల్నాటివీరచరిత
మాంధ్రభూమినిఁ గాకున్న నన్యభూమి
నాంధ్రపద మెంత మధురమో యాంధ్రతనయ!
తెలిసికొని, నేఁటికేనియుఁ గులుకవోయి!

భోజరా జిచ్చోటఁ బుట్టలే దందువా?
యాంధ్రభోజునిమాట యరయుమోయి!
రాణాప్రతాపుండు కాఁ[illegible] డందువా?
శ్రీరామరాజు విశేష మరయు

ఝూన్సిలక్ష్మీభాయి జనియింప దందువా?
మాంచాలచరితమ్ము నెంచవయ్య
తులసిదా సిచ్చటఁ గలుగలే దందువా?
పోతన్న కత తలపోయవన్న

యెందునుంగూడ లో టింతయేని లేదు
ముందునకు వచ్చి నిలబడి సందడిగను
నీదుశక్తిని నీవెంచి నెగడుమోయి?
యమలగుణగణవార, యో యాంధ్రవీర!

వైద్యరా జిచ్చోటఁ బ్రభవింపఁ డందువా?
నాగార్జునుఁడు తెల్గు నాటివాఁడు
వ్యాఖ్యాత యిచ్చోటఁ బ్రభవింపఁ డందువా?
మల్లినాథుఁడు తెల్గు మల్లుఁడోయి!

వ్యాకర్త యిచ్చోటఁ బ్రభవింపఁ డందువా?
పండితరాయ లెవ్వాఁడో చెప్పుమ!

మతకర్త యియ్యెడం బ్రభవింపఁ డందువా?
వల్లభుఁడు తెలుఁగువాఁడు గాఁడె

ఎందునెందుల నీవు గాలించికనిన
నందునందుల మేల్నేతు లాంధ్రులగుట
బెదరుచూపును మఱియు నా యదరుగుండె
లేక చరియించు మాంధ్రుఁడా వీఁకచూపు.

మాడరన్ రివ్యూలు మనకు లే వందువా?
వెలుగొందుఁగాదె త్రివేణివాణి
మాధురీపత్రిక మనకు లే దందువా?
భారతిపత్రిక ప్రబలుఁగాదె

కవిసార్వభౌములు గానరా రందువా?
నాఁడును నేఁడునుం గూడఁ గలరు
దైనికపత్రికల్ దనరార వందువా?
యాంధ్రస్వరాజ్యల నరయరాదె

వారపత్రిక లుండె నవ్వారిగాఁగ
దేనఁగూడను గొఱఁత యేమేని లేదు
నడుము బిగియించి ముంగలి కడుగువెట్టి
యాంధ్రరాజ్యమ్ము నార్జింపు మాంధ్రయోధ!

సంఘసంస్కర్తలు జనియింప రందువా?
వీరేశలింగముతీరు గనుము
పరపతి నిలిపినవారు లే రందువా?
రామదాస్ పంతుల గోముగనుము!

పంజాబు కేసరుల్ ప్రభవింపరందువా
ఆంధ్ర కేసరి మహాత్యాగి గనుమ
జాతీయకవు లిందు జనియింప రందువా?
సూరనార్యుని కళాశోభ గనుము!

రైతునాయకులకుఁగూడ బ్రాఁతిలేదు
రంగనాయకుఁ గనుమ యభంగమతిని!
ఇన్ని సదుపాయములు నీకు నున్న యపుడె
యాంధ్రరాష్ట్రంబు సాధింపు మాంధ్రయోధ!

చిట్టివడాలను జేర్చినపోపుతోఁ
గమ్మనైన పనసకాయకూర
అల్లముకరివేపయాకుతోఁ దాలింపు
గా నొప్పు లంకవంకాయకూర

ఘ్రాణేంద్రియంబుతో రసనేంద్రియముఁ దన్ను
పనమీఱు విఱిచిన పాలకూర
గరమసాలాలతో గమగమవలచెడు
వసలేని లే జీడిపప్పుకూర

బుఱ్ఱగుం జూఁచబియ్యము పూఁతచుట్ట
లాదిగాఁగల దివ్యపదార్థవితతి
యాంధ్రులకెకాని మఱియేరికైనఁ గలదె
సేతుశీతాద్రిమధ్య విశేషభూమి.

కాశ్మీరదేశంబుఁ గాలఁ దన్నఁగజాలు
క్షోనసీమను మదిలోనఁ దలఁచి

ప్రాలేయగిరిమించు వాలాయమును మించు
భద్రిపద్రిదము మహేంద్రాద్రి నెంచి

మేరుధరాధరామేయసంపదఁ గేరు
జయపురాచలముదా హూాయలు నెన్ని
రాముని మాతులు రాజధానీపురి
దక్షిణకోసల మత్స్యులఁ గని

గంగఁ గాళింది శారద భంగపఱచి
పాఱు గోదఁ, గృష్ణను, దుంగభద్ర మ్రొక్కి
నిక్కి పెంపెక్కి యెల్లెడ నెగడుమోాయి
యాంధ్రుఁడను పేరు విజయాంకమూచుఁ దనర!

కాలు సేతులును వంకరలువోవఁగఁ జేసి
వణఁకించు పెనుచలిబాధ లేక
బండఱాళులఁగూడ మెండుగా బీఁటలు
వాఱించు నాతపబాధ లేక

ఏఱు లూళులుఁగూడ నేకమై ప్రవహించు
వట్ట్రోడుతతవర్ష బాధ లేక
పండుగనాఁడైనఁ బట్టెఁ డన్నము లేక
రొట్టెలే తినియుండు రోఁత లేక

చూచితూచినయట్టుగాఁ దోఁచుచుండు
సీతు నెండయు వానయుఁ బూతమైన
యమలరాజాన్నమును గల్గు నాంధ్రభూమిఁ
దలఁచికొని పొంగు మెట నున్నఁ దెలుఁగుబిడ్డ!

*
* *

అ మ ర జీ వి.

ఉపవాస శ్రమ మించుకేనియును నీయుల్లంబునన్ తోఁపనీ
కపురూపంబుగ ఆంధ్రరాష్ట్రమునకై ప్రాణంబు లర్పించి నా
విపుడేనిన్ భవదాంధ్రజాతి యొక్కటై యేతెంచు రాష్ట్రాగమం
బుపరోధింపక యుండుఁగాంచెఁగదవే యో పొట్టి శ్రీరాములూ!

ధన్యంబయ్యెను నీదుజన్మ, తెలుఁగుం దర్బారులో నీశిలా
మాన్యాకారము పాదుకొల్పఁబడుతన్ మాయావులౌ నాయక
మ్మన్యుల్ స్వాత్మపరీక్షచేసుక యిఁకన్ మండ్రాటముల్ మాని నీ
నాన్యంబైన మహాతపస్సునకు జోహార్లిత్తు శ్రీరాములూ!

కావ్యంబు లెన్నియో కల్పించిరేకాని
ఆంధ్రరాష్ట్రము తెచ్చి రయ్యామీరు;
ఎన్నియో పార్టీలు సృష్టించిరేకాని
ఆంధ్రరాష్ట్రము తెచ్చి రయ్యామీరు;

పత్రికలెన్నియో ప్రకటించిరేకాని,
ఆంధ్రరాష్ట్రము తెచ్చి రయ్యామీరు
'జే యాంధ్ర'యనుచు జేజేల్ కొట్టిరేకాని
ఆంధ్రరాష్ట్రము తెచ్చి రయ్యామీరు

ఓయికవులార! నాయకయోధులార!
పత్రికాధిపులార! అబ్బాయులార!
ఱొమ్మువిఱువకుఁ డింక మీ నెమ్మొగములఁ
గాంచి శ్రీరాములదె పకాళించి నవ్వు.

నీ నిర్యాణము రేడియోలు తెలుపన్ నీమాతృధాత్రీ ప్రజల్
నానాదుఃఖ పరంపరాబ్ధిగతులై నాహోయి! శ్రీరాములూ!

నీ నేమంబు ఫలింపఁజేయఁగను శ్రీ నెహ్రూ మహాపండితుం
డీనేయిచ్చెర!యాంధ్రరాష్ట్రము;ఇఁకన్ నీయాత్మ శాంతించుతన్.

* * *

ఆ కాం క్ష.

శ్రీశైలంబును, దక్షవాటియు, శుభశ్రీదంబు కాళాస్తియున్
నీ శూరత్వపుటెల్లలై తనరఁగన్ శ్రీశైలభూలక్ష్మి నీ
యీాశావాప్తికి రాజధానియయి నేఁడే తెంచె కర్నూలునం
దాశాదీప్తిగ ఆంధ్రరాష్ట్ర మిదె లెమ్మా! ఆంధ్ర! జేవెట్టుచున్.

ఉపవాసశ్రమ మించుకేనియును దా నుల్లంబునం దోఁపనీ
కపురూపంబుగ ఆంధ్రరాష్ట్రమునకై యర్పించె ప్రాణంబు లే
యపరబ్రహ్మము పొట్టి రాము లతనిన్ వ్యాజంబులేకుండఁగా
ఎపుడున్ గొల్చుచు ఆంధ్ర! యేలుకొను మోయీ!స్వీయ రాష్ట్రం
బిఁకన్.

కల్పింపుఁడీ మీారు కావ్యంబు లిటుమీాఁద
కవులార! నవ్యాంధ్రకళల దీర్చి
ప్రకటింపుఁడీ మీారు పత్రికాధిపులార!
తెలుఁగువెల్గులు చాటు పలుకుబడులు.

పాలింపుఁడీ మీారు ప్రజలప్రగ్గడ లార!
కూడుగుడ్డలకునై మాఁడకుండ
సేవింపుఁడీ మీారు చిన్నపెద్దల నెల్ల
ఒక్కటేదృష్టి నుద్యోగులార!

చదువుఁడీ మీారు క్రొంగ్రొత్త శాస్త్రములను
రత్నములు పండ తెల్గు పొలాలలోన

ఓయి విద్యార్థులార! మీ ధ్యేయమైన
ఆంధ్రరాష్ట్రంబు నేఁడిదే అవతరించె.

పండింపుఁడీ మీరు దండిగా పంటల
ఈతిబాధలులేక రైతులార !
విరఁజిమ్ముఁడీ మీరు పేదసాదలఁగావ
ధనరాసులనుదీసి ధనికులార !

వెలయింపుఁడీ మీరు బేరసారంబులు
స్వల్పలాభములతో వణిజులార !
పాటింపుఁడీ మీరు బహుళాంధ్రభూమిపై
నీరపూరము లింజనీరులార !

మెట్టుఁడీ మీరు మనపల్లెపట్టులన్ని
ప్రజల యారోగ్యమునుగావ వైద్యులార !
వ్యాజ్యెముల మాన్పుఁడీ న్యాయవాదులార !
ఆంధ్రరాష్ట్రాభివృద్ధికై యఖిలగతుల.

కమ్యూనిష్టులు, కాంగిరెస్సు, లెవరేన్‌గానిమ్ము మా కేమి! మా
రమ్యాంధ్రావని నేలువారు, ప్రజలీ(ప్రాసంగి(క్రొన్నేలపై
శ్యామ్యాద్వైన్యులు, దీప్తకాంచనులునై సర్వార్థసంపన్నులై
కామ్యంబుల్ ఫలియించి వృద్ధికనుచే కాంక్షింతుమ(శ్రాంతమున్.

* * *

అజ్ఞాతము.

కలమును గాగితంబుఁ గొని కావ్యమువ్రాయఁగ మున్న మోస్తు తే
కులపతి నన్నపార్య యని గుర్తుఁడుకుఁ గుంచెఁడు నీళ్లుగార్చు చా

కలమును బాఱవైచి యల కాగితము న్మలివెట్టి చించి హా
విలవిల యేల జేల విలపించెద విట్లు దురంతచింతలన్.

హరి హరి యేమిా పాపము,
వర కావ్యారంభమూని ప్రతిభాశక్తిం
బురిటింట సంధిమాడ్కొని
గలమును గాగితము నవలగా వైచితయో.

కూలంకషామల గోస్తనీజల సంగ
తాయాతవాతపోతములు వీవ
సహకార పల్లవజాల ఖాదనకషా
యితకంఠ కలకంఠ రుతము లొలయ

మందార మకరంద మాధుర్య రసపాన
మత్తబంభరగాన మొత్తుచుండ
ఘనవార నిష్యంద వనకణకందళి
త లతాంత వాసన లలముకొనఁగ

గనులఁ బైకెత్తి కనుఁగొని కయిత చెప్ప
కాకసంబున వైపున కఱ్ఱుసాఁచి
పృథుచరిత్రము పత్రిముల్విప్పి విప్పి
యేల విభ్రాంతిఁ జెందెదో బాలసుకవి!

శబ్దశాసను కావ్యంపుశయ్య రాదు
అంచుఁ దలఁచి కావ్యారంభ మాఁగినావొ
యంతమాత్రాన వ్యవసాయమాఁగ నగునె?
యాఁగిలివిపో యిటేటికి నడలుచుంటి?

మాటలాడవె? యిది యేమి! మాయ యయ్యె!
తొలుత శ్లోకంబు వ్రాయఁగాఁ దలఁచినావొ?
హరిహరహిరణ్యగర్భుల ననెడిచోట
వ్యస్తమా లేకను సమస్తమాయనుచెదఁ

దోఁపఁ బ్రికృతమును మఱచితూలినావొ
హరిహరాజ సమాసంబు తిరిగి వ్రాసి
యేల క్రమభంగ మొదవించె బాలునట్లు
కట్ట! యేమిది యంచును గుట్టుచెడితొ

నూటయెనుబదియా లేక నూఱునెనుబ
దియ యటంచు లోనెఱుఁగఁగా దివిరినావొ?
పదిదినములై దుర్ప్రొష్ఠులుఁ బడపడియను
పద్యము నర్థము తెలిసికో భ్రాంతిపడితొ?

'కోండుక'కు 'గొండిక'కుఁ గల రెండు తెలుఁగు
లైన రూపంబు లెఱుఁగఁగాఁ బూనినావొ?
తెలివు తనివుల రూపము తెలిసికోఁగఁ
దలఁగుతోఁపాటు భ్రమచెంది కలఁగినావొ?

తెలుఁగున సమాప్తపునరాప్తములకు నేమి
కారణమ్మంచుఁ దలపోయఁ గడఁగినావొ?
కాంక్షతో 'దధ, ప్రాసముల్కావ్యమందు
వేయఁగా నెంచి యత్నించి విసిగినావొ?

'నెపము' 'నెవము'ల నేయది నిజమటంచుఁ
దర్కమును జేసి దారిని దప్పినావొ?

‘పన్నిదముసర’ మనుచోట నన్నయేమి
గతి యనుచు దిద్ది ‘సరవ’ ని యతుగఁ దలఁచి

యేటికీ బాధ యంచును నెంచినావా?
క్షత్రమాంధాతృపదముల మైత్రి యెట్లు
ప్రాసములయందుఁ గలదని గాసిపడితో?
‘యేని’ ‘నేని’కిఁ గల భేదమెఱిఁగికొనఁగ

విసిగి వేసారి కడకిట్లు పసిని జెడితొ?
అల ‘జఘుత్సాపేక్ష’ సనుతలమందుఁ
బునరుక్తిదోషంబు పొడముటకేమి
హేతువై యుండునో యెఱుఁగంగరాదు,

అంచును యోజించి యాశ్చర్యపడితొ?
‘నీతదగ్ధము’ గాఁగ నెంజలి పడెడి
చెలికాంద్రఁ గాంచుము శిరము పైకెత్తి
చూడకుంటివయేని చూచువారెల్ల,

‘దుర్నయుఁ’ డవని నిన్ దూఱెదర్ చుమ్మ
‘అన్నిష్టసఖి’ యూఁది యనుచోటఁ బదము
విడఁదీసి చెప్పుమంచుఁ బృచ్ఛచేసెదవా?
‘యొందేని’నుండి నీ ‘కెయ్యేని’ యొక్కఁ

డరుదెంచి చెప్పఁగా నడరంగరాదొ?
యేల యీపిచ్చి నీకిఁకఁ బూనుమయ్య
కావ్యమును లిఖింపఁగా వేగనిప్పుడ
యయ్యయో యిదియేమి కొయ్యపడితివి.

అనుచు నోసూరి యాకవి యండ కేగి
'నడునడనడంకఁ' గారణ మడుగఁ దలఁచి
యతని హస్తానఁ గల పొత్తమట్టె విప్పి
'వెలువెలను బాటి' యేమేమొ తలఁచి తలఁచి

బాలకవిచంద్రుని విచారభావ మెఱిఁగి
'యెన్నఁడున్నని' యెఱుఁగని యిట్టి వింత
కిదియె కారణ మంచును జదివె నిట్లు.

నన్నయభట్టుగారు యజనమ్మొనరించిన చోట జమ్మి చె
ట్టున్నది తణ్కు తూర్పున నహో యిదియాకవిశేఖరా! నినున్
ఖిన్నమనస్కుఁ జేసినది ఖేదమ దేటికి లెమ్ములెమ్మఁకన్
నిన్ననఁ బోలువాఁడిల మనీషి యొకండు కలండె ధన్యుఁడా

కన్ననఁ గావ్యరాజమును గల్పనచేయుము మేలుగా సుఖం
'బున్నది' నన్నపార్యు నెదనుంచియ మ్రొక్కికవీంద్రచంద్రమా!
యన్నడి శ్రోత్రమార్గమునయందుఁ బడ న్ముదమంది లేచియా
క్రొన్ననలెత్తి జొంపమగు కోమలమా నొకజమ్మిఁ గాంచి లో

నెన్నుచు నన్నపార్యు వల నేత్రైఁ దిర్గుచు నేటికోళ్ళల
న్మన్ననతోడఁ జేసి యతిమాత్రపుభక్తిఁ బ్రబంధరాజమున్
'నన్నియ' కంకితం బిడి యనంతరమందును దణ్కు తూర్పునం
దున్న కుటీరరాజమున నుత్సుకుఁడై యతఁడుండు నేఁటికిన్.

................

స్థలమాహాత్మ్య మదెంతటి
వెలకలదో యేరికెఱుక పృథ్వీస్థలిలోన్.

విప్రలబ్ధ.

యావత్కాలము సాంధ్యవేళలను శైత్యాకాంక్షమందాకినీ
శ్రీవేలాతతవృక్షసంతతి శిరోరింఖత్ప్లవంగావలీ
గ్రీవానిర్యదమేయనిస్వనకళాగీర్గేయకల్లోలడో
లావిశ్రాంత మహత్కిశోర జనితోల్లాసాప్తినుంటి న్సఖీ.

అని మాధవు డంపించినఁ
ప్రణయార్ద్రపుఁలేఖ గాంచి భావములోనన్
మును కొనెడు తత్తరంబున
వనితామణి రాధ యిట్లు వాపోయెఁ గటా.

ఆమని రాక గాంచి వలపాఁపగలేక మనోవ్యథార్తనై
యే మనియుంటి ! పచ్చఁగద కృష్ణుఁడు నన్గలియంగ వచ్చుచో
భూమిజశాఖలందున నపూర్వపుపల్లవశయ్యలందునన్
గామితభోగము ల్గొనుచు గాలము గడ్పెదనంచు నింతలోన్.

ఏకేమేకయినట్లు చుల్కనగుపల్కే ముల్కిగా నక్కటా
రాకాచంద్రనిభాస్య! కృష్ణ!యిటకు న్రాకుండఁగా నుత్తరా
లేకాలంబును సాంధ్యసౌఖ్యములనే నెన్నేనియున్బొందితిన్
ఓ కాంతామణి! యంచు వ్రాయ నపురా! యుత్సాహ
మెట్లాయెరా.

వెదుకంబోయినతీవ కాలదవిలె న్వేయేల శ్రీకృష్ణుఁడీ
మధుమాసంబునఁ బూపుటీరముల నా మానంబు ప్రాణంబు దా
ముదితాత్ముం డయి గాచుసంచు దిరుగన్ బూర్వోత్తరం
బెంచ కో
యదువంశాగ్రణి! మోహనాంగ యిటు లన్యాయంబును
జ్జేసితే.

ఆడింపఁగా రాదొ యల్లన తన్నదీ
సికతాస్థలంబుల స్వేచ్ఛగాను
ఊగింపఁగా రాదొ యొయ్యన నాలతా
జాలకవ్యాలంబడోల లందు

పాడింపఁగా రాదొ బరభృతావళితోడ
బంచమస్వనముల బాడుమనుచు
చేయించఁగా రాదొ సేదదీర్పుమటంచు
దాలవృతక్రియల్ తనివితీఱ

నన్నుఁ గవగూడి వృక్షముల్ ననలనెత్త
వేణుగానంబు సేయుచు వివిధగతుల
సంచరింపంగ రాదోయి జాణ! యచట
విపిలబ్ధను నన్నిట్లు వేచఁదగునె.

విడువంబోనిఁక నెచ్చెలీ! యనుచు నే వేంచేసి తేయొంటిగా
నడవింగాచిన వెన్నెలై చనగ నిత్యంబైన నా జవ్వనం
బిడుమున్నికు నమస్సులిత్తతి సఖా! యీవాక్కమారీడకున్
వడిగా వచ్చి కవుంగలీయఁదగవా! నాకోర్కు లీడేర్పవా.

అబలను గావునన్ సఖుఁడ అక్కడికి న్ననుదేఱ నాత్మలో
బ్బబలిన సందియంబుమెయి నాఁగితి నంతియకాని కానిచో
గబురును విన్న తక్షణమ గాలినిమీఱు రయంబుతోడ నీ
ప్రబలవిహారజాలములఁ బాల్గొనరానె బిత్తాన మాధవా.

హారము భారమాయెఁ గుసుమాయుధుఁ డెంతయు గ్రూరుఁ
డాయె నా
కీరము వైరమాయె గడుఁ గేకులపల్కులు ములుకులాయె నా

హారము కారమాయె విరహానల మెంతయు వేఁచుచుంటచే
న్నార! దయామయా! యిటకు నమ్మిసనాతి నలంప బాడియే.

***

గ్రహణ-మోక్షములు.

విలసిత గౌతమీవిమల వీచికలాప విలోలమూర్తియై
నలుగడలన్ స్వకీయ కిరణద్యుతు లుప్పతిలంగ వెల్గుచున్
వెలుఁగుచు నున్న రాజు వినువీథిని నేఁటి నిశీథివేళ ని
ర్మలుని నితాంతముం జెడుగు రాహువు దాఁ గబళించెనక్కటా!

ఎప్పటినుండి పొంచుకొని యెంతయుఁ గ్రిందునుమీఁదునయ్యెనో
యిప్పటికిం గృతార్థత లభించెను బాడుగ్రహాన కెట్టిటో
తప్పక వచ్చుచున్న యల ధన్యుని నేమఱుపాటువేళ నో
ర్విప్పి గ్రసించె నొక్కమొగి విహ్వలతన్ జగమెల్లఁ గన్గొనన్.

దాని మొగమును గనిన పాతకము వోవ
స్నాన మొనరింపవలయు నిజ్జగతి వారు
కబళన మొనర్చి నంతనే గౌరవంబు
వచ్చునే రా జెటులును జై వాతృకుండు.

రాజుపయిం గలట్టి యనురాగముచే నటువంటి వాని నే
యోజ గ్రసించెనో యనుచు నొక్కట మూఁగియుఁగొంత సేపుని
న్నీ జగమెల్లఁ జూచు నది యేయొక గౌరవమొక్కొ యంతనే
పూజితుఁడైన రాజునకుఁ బోవునె నైజకళా విలాసముల్.

కొండొక సేపు బుగ్గనిడుకొందువు గొంతుక డిగ్గవద్దె త
న్మండల మింతకెంతగ ఘనంబుగ నీముఖగహ్వరం బొగిం

జెందుక బైటికిన్ వెడలి చెల్వువహించునో యేరెఱుంగుదుర్
దంపుగ యేమి ప్రస్తుతము తన్ముఖమించుక మాటువడ్డచోన్.

కువలయతోషణుండు నిజకోమల పాదసుధాపరిస్పృష్ట స
త్కవి సముదాయుఁడై వెలయుఁగాఁగల రాజు నభిఖ్య ప్రస్తర
స్రవణ మొనర్చుచున్ ధరణి శాశ్వతమై విలసిల్లుఁగాని నీ
యవమతిమాత్ర పెంపుసెడునా? తమదార యశోమరీచికిన్.

స్వర్భానుం డరయంగ జ్యోతిషమునన్ ఛాయాగ్రహంబై నభో
గర్భంబందున నేగ్రహంబు చెలిమిం గాలూను నో దానిదా
దౌర్భాగ్యంబో సుభాగ్యమో యొసఁగు స్వాతంత్ర్యంబు లే
దెందునున్
నిర్భీకుండు స్వబుద్ధిమై నొసఁగు నెంతేరాజు సౌఖ్యోన్నతుల్.

ఛాయామాత్రఖగంబు పట్టువిడి నిస్సారంబు తోరంబుగాఁ
బోయెన్ రాజుదయించె నంతటఁ దమఃపుంజంబు లాశాంతముల్
మాయన్ లేక నశించెఁ జెల్లచెదురై మూర్ఖుల్ విచారింపఁగాన్
హాయిం జెందిరి సజ్జనోత్తములు తారత్యంత మబ్జాప్తిచే.

మూఁడు గడియల పట్టుకై మురిసి మురిసి
సకల లోకంబు గారించి చనిన యట్టి
పాడురాహువుఁ దిట్టని వారు గలరె?
వరదుఁ జంద్రునిఁ బొగడనివారు గలరె?

* * *

నా కోర్కులు.

జలదము లాకసంబు నతిసాంద్రతఁ గప్పి వినీల కాంతులన్
గలిగి యొసంగువేళ నొకకాసరసీమ మహీధ్రసానుభూ

స్థలముల నాల మేఘుచుఁ బిసాళిగఁ బిల్లనగ్రోవి నూఁదుచున్
జలనము లేక యేఁ బ్రకృతిజాలమునం గలియంగఁ గోరెదన్.

తారలుఁ జంద్రుఁడున్ దివిని దారుచుఁ గ్రమరుచిన్ వెలుంగుచో
వారిధితీరశాద్వల విభాసుర నీలతలంబులందు నే
నే రహిఁ గూరుచుండి తటినీశతరంగ మృదంగనాదముల్
గూరిన భావగీతములుఁ గోయిలపాటలు పాడఁ గోరెదన్.

లలిత వసంత సంపద, నిలాతల మెల్ల లతాంతకాంతమై
లలి విలసిల్లువేళ సుఖలాలసవృత్తిని గోకిలంబనో,
చిలుకనో, భృంగమో యవుచుసృష్టివిచిత్రముఁగూర్చి గానముల్
సలుపుచు నేను బ్రేమమయ సౌధమునం జరియింపఁ గోరెదన్

***

క మ్మ రీఁ డు,

కటకట! కమ్మరీఁడ!! యిటు క్రమ్మఱఁ గొల్మినినూఁదియూఁదిబల్
చటులత నిప్పుగొల్పి కడు సాహసవృత్తిని గాఁచి యిన్ము; నీ
పటుతర బాహుపాండితి నవారణ మారణయంత్ర సంచయం
బిటులు సృజింతె లేఁగఁగ నహీనభయంకర ఘోరయుద్ధముల్.

బొగ్గులు కొల్మిలోఁ బ్రోవిడి యూఁదుచో;
నెగయు పొగలు నింగి నేలఁ గవియఁ
బొగయాఱి జిగిదేఱి భగభగమండుచో;
నగ్నిచ్ఛటల్ దెస లలమి కొనఁగ

సమ్మెట వ్రేటులు పమ్ముచోఁ జెదరెడు;
మిణుఁగుల్ కనులు మిఱుమిట్లు గొలుపఁ

గరఁచుచుఁ జఱచుచుఁ గడువడిఁ గమ్ముచో;
నరులెడందల నడునడునడంకఁ

గ్రీష్మఁ జెమ్మటల్ మేన నక్తందివంబు
నమ్ము లీఁకెలు తరవరు లాయసమున
నేమిటికిఁ జేయుచుంటివో యిట్టివీఁకఁ
గడమపడకుండఁ జెప్పుమో కమ్మరీఁడ!

తొలుదొల్త దేవతల్ పోలదిండి మూఁకలున్;
ఘోరంబుగాఁ బోరఁ గొన్నినాళ్ళు
తరువాత శ్రీరామ దశకంఠ సైన్యముల్
ఘోరంబుగాఁ బోరఁ గొన్నినాళ్ళు

పడపడి కౌరవ పాండవ వాహినుల్
ఘోరంబుగాఁ బోరఁ గొన్నినాళ్ళు
మొనమొన్న జర్మనుల్ ఘను లింగిలీషువార్
ఘోరంబుగాఁ బోరఁ గొన్నినాళ్ళు

ప్రాచ్య పాశ్చాత్యదేశముల్ పాడువాఱి;
దుర్భరాఘోర దుర్భిక్షుఁ దోఁగితోఁగి
యొక్కపెట్టున నల్లాడి యుంటకకట!
కావఁగో నీవు కర్తవు కమ్మరీఁడ!

చెంగును సాహసింపకుము సేయఁగఁబూనిన నెన్నొ యెన్నొ ని
ర్భంగములై సుభిక్ష నిడుఫాల లవిత్రము లాది సాధనా
లంగుగ నుండె; వాన నగు సంగద యేరికి లేదు; గాన నీ
వింగ సృజింపఁబూనుమవి; పృథ్వియు శాంతిలు శస్త్రమారకా!

ఇంకఁగాలే దదే హిమశైలభూభాగ;
పతిత దేవాసుర ప్రతతిరక్త
మారఁగా లేదదే యారామరావణా
హావరుధిరాభిషిక్త వసుమతియుఁ

బోవఁగా లేదవే పొలయానుగృధ్రము;
లాత్రముతోఁ గురుక్షేత్రభూమిఁ
దొలఁగఁగాలే దవే వలపోయు భారత;
సుందరీమణుల మునుంగు లకట!

యిట్టి భీభత్సరంగమ్ము లిన్నియున్నఁ
దలను బైకెత్తి చూడవు తలఁకఁబోవు
ప్రజల సంక్షోభమున కేమి భయముపడవు?
కటికిరాయికో నీగుండె కమ్మరీఁడ!

మానుము మాను మింక ఘనమారణయంత్రములేల చేయఁగన్
మానుగఁ గర్షకోపకరణమ్ములఁ జేయుము నీతిబాహ్యమా
మానవలోకమంతకును మక్కువ గూర్పుము గానిపించు నీ
మానితనూత్నమార్గమిది మాయురె!యంచు నుతింత్రుధీవరుల్.

యుద్ధకళావిదగ్ధులగు యోధులు నవ్వీన నవ్వని మ్మనం
బద్ధముగాఁ దలంచి యిది పావనభారతదేశ మెంతయున్
వృద్ధి నిబద్ధిగాఁ గను సమృద్ధిగఁ బండుట క్షేత్రిరాజముల్
బుద్ధమహర్షి సూత్రము లపూర్వ వికాసము నొందు దీనిచే.

ఓహరి సాహరిం బగర యుద్ధములం దెగటార్ప నాయుధాల్
సాహసవృత్తి నీవు మఱి సల్పక మానితి వేని నాఁటికో

లూహాలె యెల్లడన్ బ్రిబలి యుద్ధతులీ భరతావనిన్ గడున్
మోహముతోడఁ గొందరని మోహమునొందకు శస్త్రమార్గకా!

తాత్పర్యంబున శాంతి సుస్థిరముగా ధాత్రిన్ దగన్ నిల్పఁగా
హృత్పద్మంబునఁ గోరి నీవు మఱి యీ దృగ్ఘోర శస్త్రాదులన్
సత్పుణ్యార్థివి యౌచు మానితవయేన్ సంయార్థులున్ బ్రీతి నీ
పత్పం కేజము లాశ్రయించెదరు కోపాటోపశూన్యాత్ములై.

ఆఱునే క్రోధాగ్ని యతిశాంతి రసపూర;
జలదాళి వర్ష ధారలనుగాక
చెదరునే పరిపంథి జీమూత సంఘంబు;
లతిశాంతి వాయుసంహతినిగాక

కూలునే మాత్సర్య కుంభినీజమ్ములు;
తతశాంతి పరశుఘాతములఁగాక
నమయునే లుబ్ధాహి జాలంబు ఘనతర;
శాంతి గారుడమంత్రసమితిఁగాక

పోవునే యహంకారప్రభూతమద్ది;
శాంతిచేతాళభర్జనసరణిఁగాక
దూరమిది యోజనముచేసి తొలఁగవయ్య
స్వీయపాత్రిక్తన కార్మికవృత్తి నింక.

ఏనాఁడు రైతులందఱు
నీనాడెపు పరికరముల నిక్కపుబుద్ధిన్
బూనెదరో నాఁడె పృథ్వి య
నూనవికాసమ్మునొందు నూతనశక్తిన్.

ఎప్పుడుకోడవండ్లు తొల్మికలినుపకట్టు
లాదిగాఁగలపనిముట్టు లాదరమున
నీవుసేయుదో యావేళ నీవప్రపంచ
మధికశాంతిని బడసెడి నలర జనము.

ఫలభారమునఁజేసి తలవాంచి వినయంబు
చాటెడుశాలి సస్యమ్ముతోడ
గలకలనవ్వుచు నిలువెల్లఁబువ్వులఁ
బరఁగెడు నలనువ్వుపైరుతోడఁ

బ్రీతిపర్వమునసుండి యతిరుచ్యరసపూర
ములుగాఱు పుండ్రేక్షు కులముతోడఁ
గ్రొంగ్రొత్తఫలములు గుత్తుగుత్తులుగాఁగ
నలరారు ద్రాక్షాలతాళితోడ

సకలసస్యాఢ్యయై భూమి జరుగునాఁడు
నిన్నుఁ దలపోసి కేల్మోడ్చి నిఖిలజనము
కలఁతలనుమాట తలఁపక క్రాలుఁగానఁ
బరఁగఁజేయుము కర్షకోపకరణముల.

ఎపుడు యుద్ధేచ్ఛయుడుగునో యీజనమున
కపుడ తొల్లింటి ఋషికాల మరుగుదెంచు
దాన సర్వంసహాదేవి సంతసించి
స్వస్తివచనంబు వలుకుఁ బ్రశస్తమతిని.

అనువుగ ఓంశాంతిఃశాం
తినాఁ జనుపలుకు వినఁబడఁ దెల్లముగాఁగన్

జనములు పాఁడియుఁ బంటయు
ఘనముగ; మనెదరు త్వదీయఘనతఁ బొగడుచున్.

ఏమనుచుంటివోయి! యిఁక నీదృశకృత్యము లాచరింపఁగాఁ
బోము; యటంచునా! భళిరె పుణ్యచరిత్ర! నమోనమోస్తు తే
యేమరుపాటునేని మఱి యెక్కడ నొక్కఁడు యుద్ధ మిద్ధరన్
ఏమెయి నాచరింపకయ యీశ్వరు సత్కృపగల్గి వెల్గుతన్.

సురచిరకంఠివస్త్రపరిశోభిత దివ్య తనూవిలాసినీ!
నిరుపమదీప్యమానమణి నిర్ఝరపర్వతమండల స్తనీ!!
కరములు మోడ్చి మ్రొక్కుదుము కావుము. కావుము. విష్ణుభార్య! మా
చరణయుగాళితాఁకుడును సైఁచి యపారకృపా రసాత్మవై.

* * *

య ము నా ప్రా భ వ స్మృ తి.

అమలాత్ముండును యోధుఁడున్ బృథుజగ ద్వ్యాపారమర్మజ్ఞుఁడా
కమలానాథుఁడు బాల్యచేష్ట లెచటం గావించె సానందుఁడై
ప్రమదానం గని తత్ స్థలంబులు జల ప్రక్షాళితాఘౌఘ యో
యమునా! నీవగు సైకతస్థలు లటం చశ్రుల్ ధరన్ రాల్చెదన్.

పెరిఁగి పెద్దయై యేతీర పరిసరమున
నస్త్రశస్త్రాదివిద్యల నభ్యసించె
నందనందనుఁ డాతీర మంది తీవె
యంచుఁ గన మేను బులకించు నమ్మ, యమున!

భవ్యభవదీయనీలాంబుపటలితోడఁ
దనదుమేచాయ లెంతయు మొనసియాడ

జాములకొలంది యేనీట స్నానమాడు
బాలకృష్ణుండు తజ్జలమాల నీదె.

దేని పావనోదకములచే సనాథు
లైన పాండవులప్రతప్తమానసములు
శాంతిపొందింపఁబడియెనో వంత లుడుగ
నామహానది వీవె కదమ్మ యమున!

నిఖిలజగదంతరవ్యాపి నీరజాక్షుఁ
డైన శ్రీకృష్ణు నుదరమ్ములోన నెమ్మి
నిడికొని యెటకుఁ గ్రుంకిడ నేఁగుదెంచు
నామహాపవిత్రాపగ వౌదు వీవ.

ఆనందాశ్రులు గన్నులన్ వెడల రోమాంచంబుతో నీశ్వర
ధ్యానారూఢహృదంతరాళ యగుచుం దా దేవకీదేవి లో
నే నీతీరమునందు గర్భగతుఁడౌ నిందీవరశ్యాముకున్
నానార్థంబుల వృద్ధి గోరునపుడైనం బుట్టనైతిన్ నదీ!

ప్రాకారసంశోభి తాకాశవాహినీ
నీకాశసత్ ధ్వజానీకములును
కాంతాజనస్వాంత కాంతలతాక్రాంత
ప్రమదావనానూన సముదయంబు

నైజకాంతిచ్ఛటా నైగనిగ్యవిజిత
చంద్రమండల మహాసౌధములును
పరిపంథిఘనకంధి వరమందరాచల
రంగద్వితతచతురంగబలము

కలిగి యొప్పారు కోటలఁ గట్టి రేచటఁ
గోర్కెమై వ్యయపెట్టి కోటానఁగోట్లు ధనము
పాండవులు దండకాటవీ పటలి నఱికి
యామహానదీరత్నమ వమ్మ నీవె!

అట్టి నీ స్వరూపముఁ గాల మట్టిమార్చె
నాపదల కోర్చి నీ కడుపు పగిలిపోయె
గమ్రిముఖబింబ మెంతయుఁ గమలిపోయె
రమ్యభ్రూయుగ్మరోమముల్ రాలిపోయె;

పద్మసన్నిభ నేత్రముల్ వాఁడిపోయెఁ
జారుఫాలస్థతిలకమ్ము జాఱిపోయె
నవశిరీషకోమల దేహ మవసి పోయె
ఏమిచిత్రంబొ యమునరో! యెఱుఁగ లేము.

నీదు తీరమ్మునందున నేఁడు చూడ
నట్టిపట్టణ మొక్కటియైన లేదు
అట్టి యావాస మొక్కటియైన లేదు
అట్టి వైభవ మిసుమంతయైన లేదు.

అట్టి సత్ప్రతాపటిమ మసలు లేదు
అట్టి యోధకదంబమ్ము కట్ట! లేదు
అట్టి త్రిజగదారాధ్యరాజ్యంబు లేదు
అట్టి భక్తచాతకకంద మయ్యో! లేదు.

ఆగమధ్వంసకులగు నా మొగలువారు
దోసకారులు ఘనులు పఠానువారు

పరుషకరవాలధారల నఱికినట్టి
నీదుకాయంబు గాయాల బాధఁజెందె.

చెదరిపోయినముంగురుల్ చెదరియుండ
బెదరుచూపులు చూచుచుఁ బెదవులెండ
స్వస్థతంజెంద లేకిటు శ్వాసములను
దల్లి! యమునరో! విడువంగఁ జెల్లు నమ్మ!

*
* *

**అలసవీక్షణము.**

ముంగిట వేసి పెంచితిని ముద్దులు గుల్కెడు పూలమొక్క 'డే
కింగు' సుమించుచుండు నది కేవలమున్ మరుచేతి వింటులం
చంగనలెల్ల మెచ్చుకొని యద్దుకొనం దమ కన్నులందు స
ర్వాంగములందునూత్న పులకాంకురముల్ పొడసూపుచుండఁగన్

తొల్లిటి పూఁత కాయలయి దోరగ దోరగఁ బండియుండ సం
ఫుల్లమనస్సులం బికిలి పుల్గులు ఱెక్కల నార్చి బ్రాలి యా
ఫుల్లమహీజ శాఖల నపూర్వగతిం జరియించుచుండు సం
పల్లలితాంగి కొమ్మల కుపాయన మిచ్చిన మానికాలునాన్.

కొమ్మలువంచి పుష్పములు కోసెడు కొమ్మల చీరచెంగు లా
కొమ్మల రెమ్మలం దవిలికో నది గానక వెళ్ళుచుండఁగన్
గొమ్మల యూఁపునం దెగి యనోకహమంతట ముక్కలంటెనాఁ
గ్రమ్మను సీతకోక చిలుకల్ పలురంగుల నింగి నింపుచున్.

పూవుల తావులంటి మధు పూరమునం దగ నోలలాడి సం
భావనచేయు చొండొరులఁ బక్షులందలి వింత వింత వ

ర్ణావలితోడఁ బ్రేక్షకుల యక్షులఁ దన్పుచు సంచరించు నీ
తాపరచీరకీరములు స్థావర జంగమముల్ ముదంపడన్.

ప్రాపునఁ గాలుమోపకయ ఫుప్పొడి నోటికిఁ దాఁకకుండఁగాఁ
బావన మామిడిపండ్ల రసపాయులు చిల్కలు ఱెక్కలార్చుచుం
ద్రావుచుఁదన్మయత్వమునఁదాండవమాడుచునుండ తొండొకం
డీవల నావలం గనుచు నెక్కె మహీజము మెల్ల మెల్లఁగన్.

పొంగకుఁడీరు గొంగళులె పూర్వపు జన్మములందు నిప్పు డీ
రంగులఁ దాల్చినా మనుచు నంపిల నేటికిఁ? జిల్కలార! మీ
పొంగులు బూడిగాను జల బుద్బుద సంపదనొందెనందు కీ
భంగము తప్పదం చదిరి పాటన వాని గ్రసించె నక్కటా!

పూలను గాంచుచుం బికిలి పుల్గులఁగాంచుచుఁజిల్క మొత్తముల్
లీలలఁ గాంచుచుం బ్రకృతి లీలకు నబ్బురపాటు చెందుచున్
గాలముఁ బుచ్చుచుండ క్షణ కాలములోపల మొండితొండ యా
భీలకరాళవక్త్రమునఁ బెట్టుకొనెం బలువన్నె చిల్కలన్.

పొంచి పాఁకెడు తొండను గాంచికూడఁ
దెలియనైతి నీతాకోకచిలుకల నిటు
పొట్టఁ బెట్టుకొను నటంచు బుద్ధిజాడ్య
జనితమగు పిచ్చి పైపైని చరణ మిడుట.

ఎఱుఁగవే ధర్మపరుఁడవు నృపకుమార!
ప్రాణదానంబు కన్నను వ్రతము గలదె
రమ్ము రక్షింపుమన్న యాక్రందనంబు
రివ్వుమని వచ్చి చెవిసోఁకెఁ గెవ్వుమంటి.

ఆఁకటి కాఁగలేక దిన మంతయు నెంతయు నోగిరానికై
యేఁకరి త్రున్నివారణము నించుక గాంచెడు తొండనాఁగి య
ట్టాఁకలి పెట్టుటో చిలుక ప్రాణము నిల్పుటొ చేయలేని నా
యూఁకువ,చూచుచూపులనయొక్కట సక్కట!డిందె నెందుకో!

***

ఉ ల్లి కో ళ్ళు.

ఉల్లికోళ్ళండి బాబుగా రుల్లికోళ్ళు
మంచికోళ్ళండి దొరగారు మంచికోళ్ళు
పుచ్చుకొనరండి? యేమండి! పుచ్చుకోరు!
ఇవిగొ చూడండి నచ్చిన ఇచ్చిపోదు.

అనుచున్ గోసఁగి పేదరాలొకతె మధ్యాహ్నాతపోత్తప్తయై
చనుదెంచెన్ గనుదోయి లేమి కిరవై సర్వాంగముల్ చెమ్మటన్
మునుఁగన్ దీనత మాటలందొలుకఁగా మూర్ధంబు కంపింపఁగా
వెనుముల్ గడ్పునఁ గానిపింపఁ బెదవుల్ బీటెత్తి గొంతెండఁగా.

నకనకలాడు నాఁకటను నాలుక చుట్టలువాఱుచుండఁగాఁ
దుకతుకలాడు డెందమునఁ దూలుచు సోలుచు నుత్తలించుచున్
గొకిబికి జుట్టుపైఁ జినుఁగుఁ గోకచెఱంగున చుట్టబుట్టతో
వికచముగానిమోముపయి పెద్దమ నృత్యము సల్పుచుండఁగా.

ఎన్నినాళ్ళయ్యెనో యెఱుఁగఁగా రాకుండె
జడలుగట్టినతలఁ జమురురాచి
ఏనాఁడు కట్టెనో యెఱుఁగఁగా రాకుండెఁ
గంపు గొట్టుచునున్న కట్టుగుడ్డ

ఏ ప్రొద్దు క్రుంకెనో యెఱుఁగఁగా రాకుండె
బురదతో మేనెల్ల బెరడుగట్టె
ఏ పూఁట కుడిచెనో యెఱుఁగఁగా రాకుండె
వెన్ను నంటుకపోయెఁ బ్రేవులన్ని

ఏ నిసిని ఆదమఱచి తా నించుకంత
ఱెప్పవాల్చెనో కటకటా చెప్పఁజాలఁ
గనులు గుంటలు పడిపోయెఁ, గళలు వీడి
వదన నీరేజమును వసివాళ్ళువాఱె.

'తూరుపు తెలవాఱెనదిగ
ఊరంతయుఁ గ్రుమ్మరిలితి ఒక్కరుకూడన్
వారుపుకా స్తిడ రయ్యో!
యీ రేనియు నిండుగొంతుకెండెడు సామీ!

ఈలాటి మాలజన్మము
ఏలా విధియించె బ్రహ్మ యెన్నాళ్ళిటులన్
నాలో నేనే కుములుచుఁ
గాలంబును గడపుదాన గాసిం బడుచున్'.

అనుచుఁ దట్టను వాకిలియందు దించి
చతికిలంబడి కన్నీరు జాలువాఱ
మాఱు పలుకకయుండె ఆ మాలపడఁతి
గండశిలగూడ క్షణములోఁ గరఁగిపోవ.

గోరువెచ్చని వార్పొక గుక్క త్రావి
సొమ్మసిలి లేచికూర్చుండి నెమ్మదిగను

తెప్పలల్లార్చి తనకథ చెప్పఁదొడఁగె
ఎండఁ బాఱినయాశలు పండఁబాఱ.

మాతంగకన్యాకాం మనసాస్మరామియం
చద్దైవతు లేకన్య నభినుతింత్రు
కౌశికుండేకన్యఁ గన్న పుత్రికగాఁగ
నించు వేడుకను బ్రేమించినాఁడు

అల హరిశ్చంద్రుని యాస్థానమున యందు
నేకన్య మిగులఁ గీర్తింపఁ బడియె
కాకతీయ నరేంద్రులే కన్యకామణిఁ
గళ్యాణ వేళల గారవింతు

రయ్య యాకన్య మముఁ గడుపారఁ గనియె
కొలము పెద్దది గొప్పది కొలుతురెల్ల
వారు మము, మేముఁ గొలుతుము వారి నెపుడు
వంగసముఁ గూర్చి యిఁకఁ జెప్పవలయు నేది?

పండించు మాయయ్య వసుమతీ దేవత
లోజమై భుజియించు రాజనాలు
కాపించు మాయయ్య క్షాంతలేశ్వరు లాను
ద్రాక్షా గుళుచ్ఛముల్ దాడిమములు

పంపించు మాయయ్య వైశ్యయక్షాధిపు
లనయమ్ము సమ్మానము దినుసులెన్నొ
అర్పించు మాయయ్య యాగంగపై దోడు
లుప్పొంగు ధేను సద్యోమృతంబు

సేద్యకాఁడగు మాయయ్య చేతిమీఁద
నెండ తెండదు జీవింతొ౯ యెఱుఁగరాదు
కాని కలవయ్యె గ్రుక్కెడుగంజి మాకు
ఏమిచెప్పుదు నయ్యాయో యేలినయ్య.

పెనుమంత్ర గ్రామమండీ!
తినఁబోయినఁ గూడులేక దిన మొక యూరన్
పనిపాటు లేక తిరిగెద
కనికరమే లేద యొక్క కామందునకున్.

కోఁతలు వచ్చెడు దాఁకా
రైతులు మము పనులుచేయ రమ్మనరండీ!
నాతో బిడ్డలు పొట్టలు
చేతులతోఁ బట్టికొంచుఁ జిడిముడి పడఁగా.

బుడమచేలను నువ్వుఁజేల బుడుతలేను
కలుపుతీసుక కాలంబు గడపవచ్చు
నంచు యోజించి 'పాలంగి' కరుగుదెంచి
మూఁడు వారాలు గడిచె నీ పొద్దునకును.

కటకట! యెట్టివర్జ్యమగు కాలమునం దిలు వీడి బిడ్డలన్
కటినిడుకొంచువచ్చితినొ కాని మహాత్మక! నాఁటినుండియున్
చిటుకున వాన చిన్కొకటి చేలపయింబడలేద నేలయున్
పెటిలెను మండువేసవిని వీసరపుచ్చెడు నట్టి యెండచే.

గాలిదిండులు మేయఁజాలిన వరిచేలు
ఒరగి వంకర లౌచు సొరుగులయ్యె

చిలుకతండంబులు కులికి ముక్కుల నొక్క
కొట్టుచే లీనకే యెట్టువడియె

పిల్లకాయలువచ్చి యుల్లసిల్లుచు మెక్క
దోసకాయలు కను మాసిపోయె
బడుగు బక్కలపాలి ఘుడుకుఁగల్తైమించు
గోఁగుకూరలుగూడ వేఁగిపోయె

పచ్చికఅవయ్యో నక్కటా పచ్చగడ్డి
కూడులేకుండ మాఁడు మా గోడు చూచి
పనులులేవని తలపోసి కనికరించి
ఒక్కరై తిడెనండి యీ యుల్లికోళ్ళు.

పట్నములఁగాని యీకోళ్ళు పల్లెటూళ్ళ
నెవ్వరును గూడఁ గొనరంచు నెంచి యేను
తట్ట నెత్తిని బెట్టుక తణుకు వచ్చి
వాడ వాడలలోఁ దిరుగాడి యాడి.

కోళ్ళోబాబులు లేఁతకోళ్ళు ప్రభువుల్ కోకొండు బియ్యాన కీ
కోళ్ళీయంగలదాన రండు త్వరగాఁ గూకాను రండంచు నేఁ
గాళ్లావేళ్ళఁబడంగ నొక్కరయినన్ గాంక్షింపరే పో కటా!
మళ్ళీ రమ్మనినైనఁ బల్కరుగదా మాభాగ్య మేమోకదా!

అంతకును మొండికెత్తి నే నాడకాడ
కేగి చూపుచు నీ కోళ్ళు నింటనింట
బియ్య మిడకున్న నూకలుపెట్టియేని
కొనుఁడు కొనుఁడని బతిమాలికొంటి బాబు!

ముదురుకోళ్ళని యొకతల్లి మూతివిఱిచె
ఎందుకోళ్ళని యొకతండ్రి యీసడించె
పాడుకోళ్ళని యొకయన్న చూడఁడయ్యె
వెధవకోళ్ళని యొకయక్క విసరికొట్టె.

మూఁడు నా ళ్ళాయెఁ గడియాని బుడుతలెల్ల
అన్న మోరామ! యని వార లంగలార్చు
చున్నవా రల్ల పాలంగి యొద్దనున్న
గొడ్లపాకను దలదాచుకొంచుఁ దండ్రి!

నా కేమి గాని బాబూ!
ఆ కూనల బాధయెట్టు లరయుదుఁ దండ్రీ!
ఆకో అల్లము తినఁగా
లేకున్నది, శూన్యమెద్ది లేమిడి కన్నన్ ?

చాకిరీ చేసైన సాఁకుదు నందునా
అస్పృశ్యతాదోష మడ్డుతగులు
వడ్లుదంచైనను బ్రతికింతు నందునా
మఱవచ్చి మానోళ్ళ మట్టిగొట్టె

అప్పును గొనినైన నరయుదు నందునా
తాకట్టుపెట్టగా తాలిలేదు
ముష్టెత్తియైనను బోషింతు నందునా
దోసెఁడు గింజలు దొఱకఁబోవు

చేఁపలైనను లేకున్న జెల్లలైన
అమ్మి కాచెద నందునా యవియు నేఁడు

ఎట్లు బిడ్డలఁ బోషింతు నేమి సేతు
దారి గనరాదు తుదకు 'గోదారె' దిక్కు.

అంచు వాపోయి కన్దోయి నించి నీరు
బిక్కమొగమిడి చూచు నా పేదరాలి
దిక్కుమాలిన మొఱవించు దిమ్మరించె
నొక్కమాఱుగ మేఘుండు దుక్కివాన.

ప్రకృతి శాంతించె, శాంతించె భాగ్యహీన
కొర్రిన్నసలు దొడ్డ నవ్వేఁజె లెన్ను వేసె
గొఱ్ఱెయును, వరి, గోఁగులు గోలుకొనియె
అరబములెల్లఁ దలలెత్తె నంతలోన.

***

శ్రీ వి క్ర మ దే వ వ ర్మ ప ట్టా భి షే క ము.

శ్రీనారాయణుఁ డాదిమూర్తి త్రిజగత్క్షేమంకరుం డచ్యుతుం
డే నీరాజ్యము నొల్ల నొల్లనని యెంతేఁబల్కునా క్రీడికిన్
బూనంబల్కి సుకర్మయోగము మనోమోదంబు సేకూర్చునా
శ్రీనవ్యామృత బోధచేఁ దనుపుతన్ శ్రీవిక్రమాధీశ్వరున్.

అఱు శాస్త్రములందు నందెవేసిన చేతు
లైనట్టి పండితశ్రేణియొకట
కాళిదాసాదుల కావ్యరాజిని గాంచి
పెదవివిఱుచు కవిబృంద మొకట

త్యాగరాట్కీర్తనల్ బాగుగాలేవని

రామరాడ్భూషణు పరిఖ్యాతివిని తోఁచి
రాజను ఘన వందిరాజియొకట

అల యుగంధరుఁబోలు మంత్రులునునొకట
గలిగి మీసభ సతతంబు గ్రాలుఁగాత
భోజకృష్ణరాడానంద భూమిపతుల
దివ్యసభయట్లు విక్రమదేవవర్మ.

పండితులను బట్టి పల్లార్చుచుండెడు
దారిద్ర్యమా! యింకఁ దలఁగిచనుము
కవివరేణ్యులఁ బట్టి కారించుచుండెడు
లోటుపాటా! యింకఁ జాటుకేఁగు

గాయ కేందులఁ బట్టి కంగారుపెట్టెడు
సంక్షోభమా! యింక సాఁగిపొమ్ము
చిత్రకారుల బట్టి చీకాకుపఱచెడు
దౌర్భాగ్యమా! యింకఁ దప్పుకొనుము

జయపురీ సింహపీఠికఁ జరణమూని
దేవదేవుండు విక్రమదేవవర్మ
రక్షణము సేయుచుండఁగ రాత్రిపవలు
నిలువనీడుండునే మీకుఁ దొలఁగిపొండు.

* * *

మేఘసందేశము.

వనదా! యక్షుఁడు వోలె నిన్నిపుడు నేఁబ్రార్థింప భార్యార్థమై
జననీ మూర్తికి రాఘవాంబికకు మతంగసార్వభౌమునకుఁ

గొనిపొమ్మా! పనిగొమ్మ వార్తనపుడుం గూలంకషోత్సాహివై
చనిరమ్మా! యిదెయేటికోళ్ళిడుదు నీశ్యామాంబుముఖ్యార్తికిన్.

గోదాసైకతవేదికా వితతులం గొబ్బిళ్ళు గోరాడి యా
మీఁదన్ నీరములాని తృప్తిఁ గొనుచున్ మెల్లంగ మెల్లంగ నా
భద్రాద్రిన్ దరియంగఁబోయి యెలమిం బద్మాక్షుశ్రీరామునిన్
ఆదారిం జనువేళఁ గాంచనగు నీయానంబు సాగించినన్.

భద్రాద్రిన్ రఘురాము మ్రొక్కి చని యాపై రామగిర్యాటవీ
సద్రూపారుణవల్లికా సుమరజస్సారంబు ఘ్రాణించి య
క్షుద్రిప్రేమఁ జరించు భిల్లయుగళీశోభల్ గనన్వచ్చు ని
ర్నిద్రప్రక్రియ నొక్కమాఱు జలదా! నీవేఁగు 'కోట్పాటికిన్'.

హేలాయానముచేయు నీకచటనే యింద్రావతీ ప్రోదినీ
కూలప్రాపిత బస్తరాఖ్యనగరీ కుల్యాంక హర్మ్యాగ్రభాక్
స్త్రీలోకంబు నివాళులిచ్చు నిరత శ్రీదంబులౌ దృష్టులన్
వాలాయంబుగ వెళ్ళిర మ్మటె మదంబాదేవియుం గాంచెడిన్.

లేదా లోహపథోర్ధ్వగామి వయితే శ్రీసత్యనారాయణుం
బాదాబ్జంబుల కంజలించెదు మహాభాగ్యంబు చేకూఱు నా
పైఁ దారింజన విక్రమప్రభుని 'హావామాహలుం' గందు విం
దేదారేనియు నొప్పిదంబు జలదా! యేఁగంగదే యాడకున్.

ఆరాధింపఁగవచ్చు సింహగిరిపై నప్పల్నృసింహేశ్వరున్
ఆరంగాంచఁగవచ్చు మెచ్చుగను విద్యాపట్టణౌన్నత్యమున్
దూరం బొంగఁగవచ్చు బొబ్బిలిపులుల్ దోర్దర్ప విక్రాంతికిన్

సాలూరెడ్డిగ నంతనే జయపురీక్ష్మాధ్రాటవీ నిర్ఝరాల్
ప్రాలేయాచలగాంగ నిర్ఝరముల న్భావంబునం దోఁచు నా
లీలల్ గాంచుచు విశ్రమించుచును గాళీదాసు కాశ్మీరముం
బోలం జూపిన తొంటిచందము నెదం బొందించుకో పొమ్మిఁకన్.

'నానాసూన వితానవాసనల' కానందించు చక్కాఁసలో
ధ్యానంబుం బొనరించు వేళఁ జలదా! శ్యామాకుచద్వంద్వ మ
చేనాఁ డెంచకు కుంభికుంభయుగమున్ వీక్షించి యీభావముల్
పోని మ్మేటికిఁ బెద్దవాఁడవుగదా! పోవోయి ప్రార్థించెదన్.

చనుచోఁ గానన మల్లికాసుమరసా స్వాదక్రియంజేసి నీ
కనుమూఁతల్ పడవచ్చు భద్రముసుమా కంధారి! యెండేఁగినన్
నిను నన్నున్ మఱి మాతృమూర్తి జనకున్ నీరేజపత్రాక్షుఁడే
కనుఱెప్పన్ బలెఁ గాచు వెళ్ళి కనుమా! కష్టంబు లే దేకికిన్.

జలదా! యీవిటు లేఁగుచోఁ దొలుత 'ఆస్నా' భూములీక్షింతు నా
వల 'కోట్పాడు'ను గందువందుఁ బరిఖాప్రాంతంబునం దూరిలో
పల ద్రాక్షాకృతకాయమాన విలసత్పర్ణాలయోపాంత భాక్
తులసీలక్ష్మిఁ బ్రదక్షిణించు జననిన్ తోషంబునం గాంచుమా!

రాకాచంద్ర నిభాననంబునపయిన్ రాగిల్లసిందూరపున్
రేకల్ పాండుశిరోజమై నిరత సంప్రీతిం "గుటుంబోన్నతిన్
లోకత్రాణయొనర్పుమా" యనుచు నేప్రొద్దున్ నతుల్ సేయు నా
లోకైకప్రణయప్రదాయినికి నా మ్రొక్కుల్ తొలిం దెల్పుమా!

గౌరీమూర్తికి మాతృమూర్తికి నమస్కారంబు గావించి పై

జేరంజీరి నినున్ మదంబ యడుగున్ "క్షేమంబె మావారికిన్
రారా నాయన!" యంచు న త్తతి నిటుల్ వాక్రొమ్ముజీమూతుఁడా.

జననీ! కోటర మీవు చేసిన సుఖస్థానంబు నా నాఁట నీ
డినదాదిన్ హృదినించు కేని కుదు రే లేకుండ నెట్టెట్టులో
'తణుకుం' గ్రామమునందునుండి దినముల్ దాఁటించు జ్యేష్ఠుండు నీ
తనయుం డి త్తతినుండె 'నుండి'పురి సంతాపింప కద్దానికిన్.

అన్నప్రాశన మాచరించి సుత కాయాబంధులం గూడి తా
నున్నాఁ 'డుండి' పురంబులో నొకఁడె యుద్యోగంబుసద్యోగమై
యెన్నండుండునొ యంచు నెంచుచును దల్లీ! వేఱచింతింప కా
పన్నత్రాణపరాయణుండు హరి కాపాడుంగదే యెల్లరన్.

కృష్ణున్ నమ్మినవారమౌట జననీ! యెందేఁగినంగాని త
ద్విష్ణుండోయిఁ ద్వదీయసంతతి మహాభీతిన్ హృదిం దాల్పకే
నిష్ణాతుల్ భవదీయపుత్రులగుటన్ నీకేమి లోటుండ దే
తృష్ణాతంతులఁ జిక్క 'కమ్మరో! సుఖంబేకాదె' మీరెల్లరున్.

తలకో దారిగనున్న నీ సుతులు త్వద్ధర్మంబుసంజేసి యే
యలుకుం జెందరు 'కడ్పుచల్లనగునమ్మా! నీకు లోటేమి? యీ
పొలముల్ పండును లోటుపాటులు నిఁకం బోవున్ మహాబెంగయుం
గలుగంబోదు సుఖింతురెల్లరని' నాకై పల్కు మేఘా! యటన్.

దసరారోజులు చేరవచ్చెడు నటన్ దర్బారు లా జేపురిన్
వసుధానాథుఁడు విక్రమప్రభుఁడు నీవత్సార్థ మాహ్వానమున్
పసిమీఱంగను వ్రాసిపుచ్చుఁ బరిమత్సభ్యాలితో పాటుగాఁ
బొసగంగాంచెడుఁగాక య త్తతి భవత్పుత్రుండు ని న్నంబరో

అని వాకుచ్చి మదంబ కంజలిపుట న్యాసంబు గావించి నేఁ
బనివిందున్ సెలవిమ్ము తల్లి! యను మీబంధుత్వమున్ మెచ్చి మా
జననీరత్నముసల్పు నాతిథసుపూజల్ గొమ్ము జీమూతుఁడా!
యనుకూలుండగు నాధికారియును నీవన్లోఁగి యే తెంచులో.

అనుమానింపకు పోయిరమ్ము సఖుఁడా! ప్రార్థింతు దీనుంజన్న
పనులుండున్ మఱియెన్నొ నీకునయినన్ బంధుత్వముంజూపుచుగా
చని నీ వచ్చెదునంత 'కుండి'కి నడల్ సాగింపకే యాఁగుమీ
'తణుకుం' గ్రామమునందు నచ్చటనె నిన్ దర్శింతు సౌధోపరిన్.

***

శ్రీ వి క్రమ దే వ వ ర్మ గా రి కి వి జ్ఞ ప్తి.

దిఙ్నాగప్రచయోత్తమాంగ లిఖితోద్దీప్తాచ్ఛ సచ్ఛాసనా!
దిఙ్నాగప్రతిమానసార కవితాధిక్కారి తార్యార్చకా!
దిఙ్నారీమణిగండమండన యశోదీప్తాభిధేయాంచితా!
ఋఙ్నానార్థ రహస్యవేది! వినుమీ యీనాడు సంప్రార్థనన్.

శ్రీశ! భవదీయ పట్టాభిషేక సమయ
మందె వచియించుకొనియుంటి నస్మదీయ
సూక్ష్మసంసార చారిత్ర సూత్ర షక్కిఁ
జిత్తగింపుమ! దాని పూర్వోత్తరంబు.

తాతలుభూమి విప్రుల కుదారత దానము చేసినట్టి వి
ఖ్యాత చరిత్రులయ్యు! కనినయ్యయు నట్టిడ నైన నేమి మా
వ్రాఁతలు దుర్విపాక ఫల భాక్కులు గావుట మాన్యమంతయున్
మా తల యెత్తునాఁటికె ఋణంబులపాలయిపోయె విక్రమా!

దిగ్విజాంశసముద్భవా! జయపురీ దివ్యాంగనా వల్లభా!
స్వగ్రామంబగు కారవల్లిని సమస్తైశ్వర్యముల్ వోవఁగా
నుగ్రారణ్య పథంబులంబడి యెదో యూరేఁగి మానంబులన్
బ్రాగ్రీయంబగు రీతినేఁ గడుపఁగా నాలోచనల్ సేయుచో.

నాపాలి పారిజాతము
మీ ప్రెగ్గడ రామకృష్ణ మిత్రుం డగుటన్
జేపట్టి నన్ను రమ్మని
పేపొలమిడి యాదరించె వేవిధములుగాన్.

అది 'పడయా' పొలంబపుట నర్థము దద్దయు వెచ్చపెట్టి నే
పాదనుకుఁ దెచ్చినాఁడను వ్యయంబని యెంచక, దానఁ జేసి యే
బదులొక రెండువేలుగాని పద్దును వ్రాయఁగనయ్యె, నద్ది యే
ప్రదరము గాంచకున్నది పురాకృతపాప ఫలంబు భాతిగన్.

నాలుగేండ్లాయెఁ బొలమున నాఁగలాని
నిరుడు ఫలియించె నీయేఁటఁదటిగెఁ బంట
గర్భభరమున సస్యంబు గ్రాలు వేళఁ
దివిరి ముంచుట నింద్రావతీమతల్లి.

పండియు నిరుడు ధరలేక బాధ పడితి
నెండియీయేఁటఁ బడుచుంటి నేమిసేతుఁ
జెట్టనయ్యకు సిరులెట్టుపుట్టునయ్య !
దీనమందార! విక్రమదేవవర్మ !

తల్లిపాదములుచ్చి ధరణి నక్గిడలేక
దుష్టిమాంద్యము చెంది తిరుగుచుండె

తండ్రి పంటలు లేమిఁ దతమును గృశియించి
శల్యావశిష్టుఁడై సంచరించు

తమ్ముఁడు కృషికుఁడై తఱచు తిర్గుటఁ జేసి
శీతజ్వరార్తుఁడై చిక్కియుండె
వచ్చి బాలెంతయౌ స్వస పాపమాంబిక
భ్రుకుటికూరలకునై మొగము వాచె

భ్రాతృజుఁడును బ్రిజావతియు బడలినారు
కోటపాడుననుండి యీయేఁటియందుఁ
గృపదలంపఁగదయ్యా! రౌహానృపవరేణ్యా!
కావఁగదవయ్యా విక్రమ దేవవర్మ!

నిష్ఠ వింపంగ నేటికి నేను దేవ!
మామకీనంబు సంసారమర్మ మిపుడు
ఉన్నదున్నట్టు చెప్పెద నొక్కమాట
నాదరాక్రాంత చిత్తుఁడై యాలకింపు.

"కావనేగద జయపురీ కనకపీఠిఁ
గాలు నిడినాఁడ నీపడు కష్టమెల్లఁ
దెలిపినాఁడవు, కరఁగితి వలయునెద్ది?
తెలుపుమందువో" వినుమ పృథ్వీబిడౌజ!

కనకాభిషేకంబు కావింపు మనఁబోను
వేయూఱు లిమ్మని వేఁడఁబోను
పల్లకీ నెక్కింప బ్రతిమాలికోనఁ బోను
మోటారుపై ద్రిప్ప మొక్కఁబోను

బ్రహ్మరథంబును బట్టింపుమనఁబోను
శాల్వాలకై చేయి చాఁపఁబోను
గండపెండేరమ్ము గావలెననఁబోను
జిలుఁగువస్త్రాలకై కలఁగఁబోను

ఎంతచెడినను రాచవారింటివాఁడ
నగుటచే దేహి యనలేక యడుగుచుంటి
వేయిరూప్యములప్పిడి వాయిదాలు
వర్ష పంచకమిడుమని ప్రభువరేణ్యా!

వత్సరమునకు రెండేసి వందలుగను
వడ్డితోపాటు తీర్చెద వాయిదాలు
దాఁటకుండఁగ మాటనుదప్పకుండ
సదయ! మాన్యంబు మీకు నే కుదువపెట్టి.

"జన్మపురమును విడనాఁడి జయపురాట
పీఠలంబును బట్టిన వెట్టివాఁడు
ఎటులఁ దీర్చెడు ఋణమని యెంతురేమొ
విశదముగఁ దెల్పుదును విను విక్రమేశ!

నెల కఱువదిరూప్యమ్ములు
గలదయ వేతనము నాకుఁ గవితాభోజా!
పొలమును బండు నొకించుక
కలరెంటను మీదు నప్పు కాదనకిత్తున్.

అప్పు నిడుటకు వీలు కాదందురేమొ
అయిన వేఱొక్క ప్రార్థనం బాదరింపు

వందితానేక సామంత వసుమతీశ!
దీప్త సత్కర్మ! విక్రమ దేవవర్మ!

ప్రభువ! మీకీయవలసిన పన్ను గాంచ
మూఁడువందలయుండె నీయేఁడు నాకు
మేలుఁగోరుచు సద్దిరిమీషనిచ్చి
కావఁగదవయ్య! యర్థార్థి కల్పశాఖి.

ఈ రిమీషనుచే నేను సించుకంత
తెప్పిరిల్లెద నూపిరి త్రిప్పికొందు
నంచు నర్థించుచున్నాఁడ నాదరింపు
హస్తయుగ్మకమును జేర్చి యలికమునను.

అంతకునుగూడ వీలులేదందు రేని
తుదకు వేఱొక్క వేఁడికో లిదియు నేని
తీర్చి దుర్లంఘ్య భవకంధి తీరమునకు
జేర్పఁగదవన్న! మోదంబు కూర్పవన్న!

ఇంతవఱకును నేను మీకీయవలయు
పన్ను చతురంశములుచేసి భావివత్స
రాల నుండియుఁ దీర్పఁగా వాయిలుచేసి
హుకుము దయచేయఁ గదవయ్య! యుర్వినాథ!

పట్టి పల్లార్చుచున్నారు పన్నుఁగట్టఁ
గోటపా టమీనులు మముఁ బూఁటఁబూఁట
వెంటనే యార్డరిడకున్న నింటనున్న
పదుగురముగూడ బాధలు పడఁగవలయు.

పురమును బంధులన్ విడిచి పోయినఁబోతిమి యెట్టకేని మీ
మఱుగును జేరి నిల్చితి మమందముదాన సమాతృకంబుగన్
దోఁఱకెను పెన్నిధానమిఁక దుఃఖములేదు, తొలంగె లేమి, నా
స్థిరమతిఁదల్పు మాతలఁపుచెందుత సత్ఫలమింక విక్రమా!

తాపమొందుచు మిగుల నిదాఘవేళ
స్వాస్థ్యమొందని మాకుటుంబంబు నిరుడు
కాశ్యపీనాథ! యుష్మదాగమనవార్త
తనిపెఁ బ్రావృషేణ్యపయోదకణమువోలె.

తెలుఁగునెఱిఁగిన నెఱదాత యరుగుదెంచి
జయపురీ సింహపీఠిక చరణమూనె
కష్టసుఖములు తెలుపుకోఁగలముమీఁదఁ
బండు భాగ్యమని స్వకుటుంబంబు తలఁచె.

వందినై తమ్ము పొగడఁగా వ్రాయలేదు
ఒక్కమాత్రంపుఁ గష్టము నూహచేయ
సగముచచ్చియే హీరి వీడి స్వామి! మీకు
సరవిఁ దెలిపితి నేఁటి సంసార చరిత.

క్షత్రియుండఁట యభినవ జనకుఁడట్టె
తనదుపాలనమునయున్న తనదు జాతి
దౌ నొక కుటుంబమును సాకి యాదరించి
ఆర్తరక్షణబిరుదంబు నొందకున్నె?

కులముచేతను నత్కళా కలన చేత
బాంధవుండను గాఁబట్టి బావమిచి

చేరఁగాఁ జీరి నామొఱ చిత్తగించి
దీనతనుమాన్పు విక్రమదేవవర్మ!

నాదీనత్వము మాన్పినంతట మహానందంబునుం జెందుచున్
నీదౌకీర్తినిగూర్చి పేర్చి యొకచో నేనుండి విద్వాంసు లో
హో దైవాఱెడు కావ్యరాజమనఁగా నుత్సాహినై ప్రాయమున్
గాథల్ పెక్కులుచొన్పి నిన్ గురిచి అలంకారాంచితగ్రంథమున్.

సార్థకనామధారి రససార రుచిప్రలోభ నా
యర్థము వ్యర్థభావమును నందకయుండఁగఁ బ్రోతువంచు నే
నర్థివిధంబునన్ దెలుప నర్హమె యాచితిమీఱెఱుంగ శే
వ్యర్థపు టర్థవాద మిది యంతయు నంచు దలంప కేలుమా.

ఆంధ్రశ్రీ కుచకుంభియుగ్మక నటద్ధారావళీతారతై
రంధ్రాన్వేషి శిరస్థ నిన్ దుడుపఁగన్ ద్వద్ధ్రింజద్యశోరత్నముల్
ఆంధ్ర క్షత్రియలోక ముబ్బఁగఁ ద్వదీయౌదార్యసంపత్తి నీ
రంధ్రప్రక్రియఁ బ్రస్తుతించి సతమున్ బ్రఖ్యాతిఁ గావించెదన్.

స్వయముగావచ్చి పత్రింబు జదువకుంట
వ్యయమునకు జాలు నాయంబు నందకుంట
రయముమై నన్నుఁ బిలిపించి బ్రీతిఁ గనుము!
నయము మీఱంగ విక్రమానంతదీప్త!

***

పుణ్యఫలము,

ఎతఁడు కళాప్రపూర్ణుఁడయి యీ సకలాంధ్ర కవీంద్ర పాళిచే
నుతులను గాంచునో యతఁడు నూతనభోజుఁడు నీయమహా సభా

స్థిత కవికోటియందొకనిఁ జేసి ననున్ గడు గారవించుటల్
సతతము నేను మత్కృత పురాభవ పుణ్యము గాఁగ నెంచెదన్.

***

సె ల వు.

జయజయధ్వనులతో నయ మొప్పననయమ్ము
వంది బృందము బరాబరు లొనర్ప
నగ్రభాగమునం దుదగ్రవాగ్వైదుష్య
పండితాఖండలుల్ దండిమెఱయ

బలు తేనియలతోడఁ దులతూఁగు నుడులతో
నలరు సత్కవులు నీకెలన వెలయ
నతిమహితాత్ములై యడరు బాంధవమిత్ర
బృంద మెల్లెడల దీపించుచుండ

నోలగంబున్న మిమ్ముల నొనరఁ గనుల
పండువుగఁ జూడఁగల్గిన భాగ్య మబ్బెఁ
దృప్తిచెందితి విక్రమదేవవర్మ!
కాన సెలవిమ్ము తణుకున కేను చనుదు.

పెద్దపిల్ల భీమేశ్వరి వెక్కివెక్కి
యేడ్చె నేవచ్చు వేళ మహీతలేంద్ర!
చిన్న దిందిర గడుసరి పిన్న దగుట
నెబ్బిరపు్మ్ముని బండిలో పెట్టఁ బెట్టె.

కొమరుఁగుఱ్ఱఁడు చిన్నారి యడుగులిడుచు
వాకిటిదాఁక డస్టంబుగా రాఁగ, తలి

ఠార! నాతండ్రి యని చేరఁజీరె నపుడు
వారిఁగనవలె సెలవిమ్ము వసుమతీశ!

ప్రతివత్సరంబు నిటులే
స్తుతమతి వగు నీదు సభను చూచెడు భాగ్యం
బతులితముగ నొదవించుము
క్షితిపా! నే నాత్మ తృప్తి చెందుచు నుందున్.

*
* *

అ శ్రు త ర్ప ణ ము.

ఏ విశ్వదాతతా నేఁ కోఁట ఆంధ్రంబు
వర్థిల్ల లక్షరూప్యమ్ము లొసఁగె
ఏ మహారాజేంద్రుఁ డీ రేడు వేల్చద
రపుమైళ్ళ జయపుర రాజ్యమేలె

ఏ సార్వభౌముఁ డమీనసాల గ్రామ
సింహాసనం బధిష్ఠించి మించె
ఏ కళాపూర్ణుండు హృదయంగమంబుగా
కల్పించె నెన్నొని కావ్యములను

ఆ వినయమూర్తి విక్రమదేవవర్మ
శాశ్వతము కానిదని స్వరాజ్యంబువీడి
శాశ్వతమ్మగు స్వారాజ్యసౌఖ్య మొంద
ఉర్వి విలపింపఁ దాను దివ్యోర్వి కరిగె.

గోదావరీతీర కేదారభూముల నూ
రేగఁ జేసితి నూరనూర

కన్యాకుమారి కాగ్రింబునందునఁ గూడ
అందఁ జేసితి పూలహారములను

కథలు పాటలు మహాకావ్యంబులును
వ్రాసి వ్యాపింపఁ జేసితినీప్రతిష్ఠ
పరులెఱుంగఁగరాని పరమరహస్యంబు
లెఱుఁగఁజేసితి రాజ్యవృద్ధి గోరి

నాకు నీకును నీకును నాకు నెందు
భేద భావంబు లేక యీవేళ వఱకు
ఉంటి మింకిట నన్ను నీవొంటిఁ జేసి
దివ్య సభనుంచు విక్రమదేవవర్మ !

కాననంబుల కేఁగి కానరాకుండఁగా గడ్డి
మేయుదువేల కామగోవ !
మొగముచెల్లక యేల పగలురాత్రియుఁగూడ
భుగభుగలాడెదు పుడుకుఁగల్ల!

పూఁతకాలము నందె పుల్ల విఱిగెదవేల
కావక పండక కల్పకంబ!
ఒళ్ళంత కళ్ళుగా నీళ్ళుగాఱెద వేల
ఆఁకలిదప్పి లేకమరనాథ!

దివ్యుఁడు స్వయంప్రకాశుఁడై తేజరిల్లు
దేవతామూర్తి విక్రమదేవవర్మ !
ఏరి కీర్తుల హరియింపఁ గోరి రాఁడు
[illegible]

నిను రాజ్య పీఠిపై నునిచిన శ్రీ రామ
కృష్ణచౌదరి దుఃఖ మెంత గనునో
నిను కావ్యమూర్తిగా నిలిపిన పండిత
రాజెంత మదిలోన గ్లాని గనునో

నిను నాన్న! యనిపిల్చుకొను రామకృష్ణదేవ్
రాజెంత వంతతో కృశిమ గనునో
నిను నేడుగడగాఁగఁగని మను ఆంధ్రోత్క-
ళకళాలయము లెంత వికృతి గనునో

ఆలి బిడ్డల కెంతగా ఆర్తియగునో
జయపురీప్రజ కెంత విచార మగునో
తెలియకుండదు విక్రమదేవ! నీకు
అయిన మాజోలి నీకేల అమృతమూర్తి!

* * *

వినృ్న ప ము.

1922 సం॥రం నాటి పండితుల స్థితి (ఆశువు).

ఎందఱఁగాంచలేదో యిఁక నెందఱఁగాంచునో నిన్నుఁగాంచితాఁ
జిందులు త్రొక్కుచుండెఁ గడుఁ జిన్నది మాకవితాకుమారి నీ
యందె మనంబునిల్పెనఁట; యమ్మరో! వద్దుపవిభూత్తముల్ సుమీ
యందని మ్రానిపండ్లు కడియాసలు వీడుమటన్న నన్ను నీ

కెందుల కూరకొమ్మ యటకేఁగి వరించియ తీరుదాన నా
యందము చందముం గనిన నట్టె కరంగెడె భూసురోత్తముల్
ఎందఱు రాచకన్నియల నెత్తిన ప్రేముడిఁ బెండ్లియాడ లే
దందఱికంటె నీకెఁడె 'యొయ్యారి' యయంచును ధిక్కరించి నీ

పొందును గోరి యన్నిటికిఁ బొందుగ నన్ని జవాబు లిచ్చుఁ గా
నందగ దీనిచేతి నిదె నమ్మిక నంపుమ రామరాయఁడా!
వందలు వేలు వస్తువులు పట్టుక రమ్మని కోరఁబోదు మా
సుందరి 'తజ్ఞతే' తనకుఁ జూపినఁ జాలని సంతసించు నీ

పొందునుగూర్చి నే నిఁకను బొందుగనుండెద భూసురోత్తమా!
ఇచ్చిన దేమొ పుచ్చుకొని యింతియచాలని సంతసించి పై
వచ్చుఁగదా పరీక్షకిటఁ బారములొప్పను గాంచనంచు మే
మిచ్చదలంచుచుంటి మది యిప్పటికబ్బె ననుగ్రహించి మా

కిచ్చుట న్యాయమో యిడక యీగతి నూరక హెచ్చుజీతముల్
పచ్చిగఁ గచ్చిగా నెపుడు పాఠములన్ బడిలోనఁ జెప్పఁడీ!
బిచ్చము వేయకున్న సతిఁ జేర్చఁ దలిర్పగ బిక్షుకుండు తా
మచ్చికమీఱ దీవనలు మానక యిచ్చునె? యిచ్చెఁబోయదా

మచ్చెపుఁగంటికిన్ హితము మందునకై నను గల్గ నేర్చునే
సచ్చరితుల్ గదా! యెఱుఁగఁజాలరె? దంచినయమ్మకున్ భువిన్
బొక్కినసామ్మె దక్కనను పూర్వులమాట దలంచి మీరికన్
చక్కగ 'ట్యూషనుల్' చెప్పుచుఁ జాలినయంతధనంబుగొంచు మీ

యిక్కకుఁబోవుచున్ మఱియు నిక్కడకుం జనుదెంచుచున్ బలే
కిక్కురు మిక్కురన్క యిఁకఁ గేళిగకాలము పుచ్చ 'ఎడ్వయిజ్'
తక్కకయిచ్చెదో చెపుము! తావక వాఙ్నిపుణత్వ మొప్పఁగా
ఎక్కువ తక్కువెంచకిటు లేమిటొ నేటికి వచ్చినట్లుగా

వెక్కసపాటుతో నుడివి వేగిరమందితి మంచు నీదు లో
నక్కటికంబు వీడఁగదె యాదర మొప్పఁగ రామరాయఁడా!

పొందును గోరి యన్నిటికిఁ బొందుగ నన్ని జవాబు లిచ్చుఁ 7
నందగ దీనిచేతి నిదె నమ్మిక నంపుమ రామరాయఁడా!
వందలు వేలు వస్తువులు పట్టుక రమ్మని కోరఁబోదు మా
సుందరి 'తజ్ఞతే' తనకుఁ జూపినఁ జాలని సంతసించు నీ

పొందునుగూర్చి నే నిఁకను బొందుగనుండెద భూసురోత్తమ
ఇచ్చిన దేమొ పుచ్చుకొని యింతియచాలని సంతసించి పై
వచ్చుఁగదా పరీక్షకిటఁ బాఠములొప్పను గాంచనంచు మే
మిచ్చదలంచుచుంటి మది యిప్పటికబ్బె ననుగ్రహించి మా

కిచ్చుట న్యాయమో యిడక యీగతి నూరక హెచ్చుజీతము
పచ్చిగఁ గచ్చిగా నెపుడు పాఠములన్ బడిలోనఁ జెప్పఁడీ!
బిచ్చము వేయకున్న సతిఁ జేర్మిఁ దలిర్పగ బిక్షుకుండు తా
మచ్చికమీఱ దీవనలు మానక యిచ్చునె? యిచ్చఁబోయి7

మచ్చెపుఁగంటికిన్ హితము మందునకై నను గల్గ నేర్చునే
సచ్చరితుల్ గదా! యెఱుఁగఁజాలరె? దంచినయమ్మకున్ భు
బొక్కినసొమ్మె దక్కునను పూర్వులమాట దలంచి మీరిఁక
చక్కగ 'ట్యూషనుల్' చెప్పుచుఁ జాలినయంతధనంబుగొంచు వి

యిక్కకుఁబోవుచున్ మఱియు నిక్కడకుం జనుదెంచుచున్ ఇ
కిక్కురు మిక్కురన్క యిఁకఁ గేళిగ కాలము పుచ్చ 'ఎడ్వయి
తక్కకయిచ్చెదో చెప్పుము! తావక వాఙ్నిపుణత్వ మొప్పఁ7
ఎక్కువ తక్కువెంచకిటు లేమిటొ నేటికి వచ్చినట్లుగా

వెక్కసపాటుతో నుడివి వేగిరమందితి మంచు నీదు లో
నక్కటికంబు వీడఁగదె యాదరమొప్పఁగ రామరాయఁడా!

యిక్కతమందుఁ జెప్పు నివి యెల్లను గూడను మాదుకప్పుడా
కక్కురితిన్ వచించినవిగాని నిజమ్ముగ రోషపూర్ణ మౌ

వాక్కులుగావుసుమ్ము మముఁ బాలను ముంచిన నీటముంచినన్
అక్కమలాక్షి సాక్షిగను యాచక చాతక వారిదంచ! నీ
చొక్కపురేఖనింబయిని జూఁబడఁగవీడితిమయ్య యింక నీ
చిత్తము మాదుభాగ్యమయ చెప్పగఁ నేఁటికిఁబుట్టుపూర్వముల్

మెత్తనివారమయ్య మము మేలగు'శాల్వలు' పట్టుపుట్టముల్
చిత్త మెలర్ప నిచ్చి సరిచేయుట కేనియు 'డీ. పి. డబ్లు.'వారల్
సత్తువశాఖవారలను సారసనేత్రుఁడ! కాకపోవుటన్
సొత్తుల నిచ్చు వారలిటఁ జూపుచునుందురు తొంటచేతులన్

బత్తెము చాలకుంటఁ దనభార్యను బుట్టిన యింట నుంచఁగా
అత్తయు మామయుం గరము నాఁబడిచేయుచు దిక్కుమాలి సం
బంధము దాపురించెనని పల్కుచునుండుదు రంతెకాదు పో
కొండటు యిర్గుపొర్గులట కొంకును జంకునులేక 'అమ్మకలల్'

పెండల'కాడ' లేచి తమ పేరిమికత్తెలఁ గాంచి "వింటివే
సుందరి! వారియల్లుఁడట స్కూలున మాష్టరటే మతేమిటే"
బొందెయు నల్లపూస యిడిపోయెను మూఁడునుగాదు నాలుగో
వందల యుత్తరాలిడిన వచ్చి కళావతి చూచిపోఁడె యే

మందలమమ్మ యని యాదరమొప్పఁగఁ జెప్పుకొందురు మా
యందముచందమున్ బళిర! యిద్దిర! యిద్దియ రామరాయఁడా!
అత్తలు కొట్టినందులకు నాత్మ వలుందరఁబోము తోడిదా
నెత్తగు దెప్పుకోర్వగలమే యిదె పోఁబడి మాదు బత్కునీ!

సంగరశక్తిలేను; వ్యవసాయముచేయఁగ భూమి సున్న;సంతలో
సంగడి పెట్టి యమ్ముటది యంతకుమున్నె హుళక్కి; పొత్తకాల్
రంగుల వ్రాతనుటన్న సరాసరి కాగితపుం వ్యయంబుకే
టింగులు చాలవయ్య;యొక టే యిఁకనుండి గదయ్య మనన్

బొంగు భుజాన వేసికొని పోవుటయే యది; పోతిపో
మంగళసూత్రధారణము మానుగఁజేసిన యర్ధనారి నే
గంగను గల్పనయ్య యదిగాదు సతీసహితం బటందువో
ముంగలఁ జెప్ప నుద్విత్తిని మూఁగురువృద్ధులు గల్గియుంట ఈ
బెంగలు తీర్ప నీపయిని పెట్టితినయ్య సమస్తభారముల్.

***

పండితరాజపూజ.

తరుణశశాంకమండల నిధానమనం దగు నిండుమోముతో
అరవిరిమల్లెపూల నపహాసము చేసెడు సుస్మితంబుతో
వరిమడి నారుపోసినటు వచ్చుచునుండిన మీసకట్టుతో
సరిగ గులాబిరంగులపసందులఁ జిందెడు కోరపాగతో

విరిసినబంతిపూవు లటు వెల్గుచునుండిన సిల్కుకోటుతో
సురుచిరశుభ్రదీధితుల చుంగులువాఱెడు పంచెకట్టుతో
ఇరువదియేండ్ల ప్రాయమున నీ గుడివాడకుఁ దెల్గుటొజ్జగా
అరుసముతోడ వచ్చి మురియంగనుజేసెను శిష్యజాలమున్.

కఱపెను సత్కవిత్వమును గావ్యములల్లుట శిష్యకోటికిన్
గఱపిన వారిలోఁ బ్రతిభ గాంచిరి వేంకటరత్నమున్, సుధీ
వరు లగునట్టి సూరి భగవంతము నారల వేంకటేశ్వరుల్
వరమతులార! వాని కథ పల్కెదఁ గొండొక యాలకింపుఁడీ!

అడుసుమిల్లి గోపాలకృష్ణయ్య చెలిమి
యొలిదుర్గాంబ దన శిష్యురాలిఁ జేసె
రామకృష్ణుని కా తల్లి రమణియయ్యె
భావితద్భాగ్యమున కదే బాటయయ్యె.

ఉన్నది నాలుగేండ్లయిన నుత్సుకతన్ గుడివాడలోనఁ దా
నన్ని విధంబులన్ తణుకు నందు నివాసముకంటె నాత్మకున్
ఎన్నఁగఁదగ్గ సంతసము నిచ్చట హెచ్చుగఁగాంచి పిమ్మటన్
మన్నన కెక్కఁగాఁదగిన మార్గములెన్నియొ ద్రొక్కెఁ జక్కఁగన్.

కవిరాజ బిరుదమును గొని
అవనీపతి జయపురీశు నాస్థానకవిం
ద్రవరు డయి నూత్నకరముల
యవనిని మాన్యముగఁగొనిన యాంధ్రసుధీశున్

గుడివాడఁ జేర బిలిచియు
గడుమన్ననఁజేసి రచటి గాదిలిశిష్యుల్
ఇడిరెన్నియెన్నొ కానుకలు
గడుబత్తిని పూజజేసి కవిరాజవరున్.

తాతారాయఁడుశాస్త్రిగారికి మహోదారంపు సన్మానమున్
చేతః ప్రీతిగఁ జేసినట్టిఁడు, మనీషిగ్రామణుల్ మెచ్చ, భూ
నేతన్ విక్రమదేవవర్మను ప్రజానీకంబు లగ్గింపఁగా
ఆ తణుకుంబురి సత్కరించిన కళావ్యాసంగుఁ డీతండెకా

ఇట్టి గుణైక భూషణుని ఈడిత సత్కవితాంధ్ర భూమికిన్
పటముగటి మేము గుడివాడను నేడు యధార భూషలన్

పెట్టి తదంఘ్రి పూజనము వేడుకతో నొనరించినాము మా
పుట్టువులెల్ల ధన్యతను పొందఁగ వందన పూర్వకంబుగన్.

***

నా వి ద్యా ర్థి.

నున్నగా దువ్విన పెన్నెఱి వేణితో
బింబఫలాభమౌ పెదవితోడ,
నిండుచందురుఁబోలు గుండ్రని మోముతో
వగ లెఱుంగని చిఱు నగవుతోడ,

పసిమి బంగరు చాయ మిసమిసల్ మేనితో
ఎద కరఁగించెడు నుడులతోడ,
సిస్తుగా పెట్టిన కస్తురిబొట్టుతో
మెఱుగు తీర్చిన పలువరుసతోడ,

అమ్మకరమున కుట్టినయట్టిలాగు
తెల్లచొక్కాలతోడ నా యుల్లమందు
నాఁటి విద్యార్థి రూపంబెనాటి; నేఁటి
సూరి భగవంత మనయంబు చేరియుండు.

***

శ్రీ కా శీ నా ధు ని నా గే శ్వ ర రా వు.

నిలువంగ నేర్చిరి నిలువ నీడయ లేని
ప్రజ లెల్ల సౌధభూభాగములను
భుజియింప నేర్చిరి పులగంపుఁగూడును
దినమేని గడవని దీనజనులు

కులుకంగ నేర్చిరి పలుకుబంగరువుగాఁ
గవు లచ్చు గూర్పించి గ్రంథచయము
మురియంగ నేర్చిరి ప్రౌ ఢైఱుంగనిస్త్రీలు
విజ్ఞానసంపద వెలయఁ గాంచి

డంబు మీఱంగ వేని విశ్రాణనమున
నతనిఁ బొగడంగ వశమె యనంతశాంతి
దాంతియుతుఁడు శారదచంద్రతారయశుఁడు
శాశ్వతార్థప్రదాయి నాగేశ్వరుండు.

***

శ్రీ పురాణము సత్యానారాయణ.

ఈయగలాఁడ రాంకవము లీడకు రండని పిల్వనంపి మున్
చేయఁగఁజేసి క్షౌరమును నేరములేక తలంటిపంపు నీ
న్యాయవివేకబుద్ధికి ననంత నమస్సులు చేతు సత్యనా
రాయణశాస్త్రి పురాణము వేఱ వచింపనేఁటికిన్.

***

కానుక.

దుర్గాంబా దరహాసచంద్రికలలోఁ దూఁగాడుచున్ భూనభో
మార్గంబందుఁ బ్రయాణమున్ సలిపి జర్మన్యాదిదేశంబులన్
వర్గీభూతనవీనయంత్రకళ సంపాదించి మేమందఱున్
పెర్గన్ వచ్చిన, రామకృష్ణ! యిటులే వేయేండ్లు వర్ధిల్లుమా!

ఏమి తెచ్చితి వమ్మ! యింగ్లాండునందుండి
యాస్థానకవి కీయ నైనదాని
ఏమి తెచ్చితి వయ్య! యీవు యూరపు నుండి
క్రొత్త యంత్రము నెలకొల్పుటకును.

ఏమి తెచ్చితి వమ్మ! యీ యమెరిక నుండి
యింటిల్లిపాది ప్రేమించుటకును
ఏమి తెచ్చితి వయ్య! యీవు జర్మని నుండి
యాంధ్రప్రజానీక మలరుటకును

ఏమి తెచ్చితి వమ్మరో! యెఱుఁగఁ జెపుమ?
ఆ జపాను పరిశ్రమ లరసియరసి
యింటిలోనున్న ఘుబలల కింటిలోనె
అన్నమొదవించునట్టి విఖ్యాత శక్తి.

ధరియింప నేర్చిరి చిఱుఁగు బట్టలవార
లింపైన చీని చీనాంబరముల
నివసింప నేర్చిరి అవసథహీనులు
హారి హిరణ్మయ హర్మ్యములను

గడియింప నేర్చిరి కానెఱుంగని వారు
'గ్యాసు' ప్రోవిడి ధనరాసు లెన్నొ
కుడువంగ నేర్చిరి కడి లేని వారలు
కమ్మకమ్మని పులగంపుఁ గూడు;

భోగ మొందంగ నేర్చిరి పొలము లేని
వారు సుక్షేత్ర ఖండముల్ పడయఁ గలిగి
భవ్యభవదీయ సత్కృపావార్ధిఁ దేలి
యెపుడు దుర్గాంబికా రామకృష్ణులార!

స్వాతంత్ర్యోదయమైన భారత ధరాభాగంబు స్వర్ణంబుగాఁ
జేతున్ నేఁడని కంకణంబు గొనె నీ చిత్రాబభ్రంగేశుఁ డో

మాతా! వానికిఁ దగ్గ భార్యవయి సమ్మానంబుతో పాటుగా
ఖ్యాతిం గాంచుము రామకృష్ణుసతి దుర్గాంబన్న పేరొందుచున్.

ఈ వొక కల్పవృక్షమయి యేపును జూపఁగ రామకృష్ణ! నా
నావిధపక్షిజాత మయినారము మేము ఫలంబులానఁగన్
నీ వొక కామధేను వయి నెమ్మినిజూపఁగ దుర్గమాంబ! నా
నావిధవత్సవర్గ మయినారము నేము రసంబులానఁగన్.

***

శ్రీ మాగంటి శీతారామదాసు,

వంతెనల్ నిర్మించి మంతుకెక్కుటయందు
ఉద్ది నీకగునేమొ పెద్దిరాజు
జీ. వో. లకై భీతిచెంద కార్డరు లీయ
సాటియా నేమొ బడేటి నీకు

పాపభీతిని పరిపాలనంబును జేయ
అండ నీకగునేమొ దండురాజు
'శాంతమహాశంథి' సరణిగా గనుపింప
ప్రీతినీకు నగునేమొ గ్రంథిరెడ్డి

ముక్కునకు సూటిగా సాగిపోవుటందు
అయిన నగు నీకు నుపమ రంగయ్య; కాని
పాతశాలలు నెలకొల్పు వరుసలోన
రారు నీకెవ్వరును వంతు రామదాస !

ఇతఁడఁటే 'కౌన్సిలు' కెన్నికై నేతవై
నఁ కీతంముఁను జాతి వతికేఁటి

ఇతఁడఁటే, రాజాజి నెదిరించి యాంధ్రత్వ
మును నిల్పినట్టి యపూర్వవక్త

ఇతఁడఁటే యువకుల కతిమోదమిడెడు వ్యా
యామ కళాలయాధ్యక్షమౌళి
ఇతఁడఁటే తనపేర హేలాపురంబులో
సౌధంబు 'బోర్డుకై' సంతరించె

ఇతఁడఁటే కమ్మఁదనమును మతిని నుడుల
చేఁతలను, జూపుచున్న విఖ్యాతయశుఁడు
అనుచు ఆబాలగోపాల మఖిలజనులు
ప్రణుతిగావింత్రు నినుఁగూర్చి రామదాస !

'ఎవ్వరా కారులో ఏగువారలు చెలీ !'
'హైస్కూళ్ళ పరిసిడెంటు అక్కకాన'
'రామదా సీతఁడే !' 'రామదా సీతఁడే'
'అయిన దేవాలయా లరయ రావె ?'

'తెలివితక్కువదాన! తిలకింపు మూరూర
విద్యాలయంబుల వెలయఁజేసె'
'ఎక్కడి దీ ధనం బెట్లు కట్టించెనే ?'
'రామదాసుకు ధనరాశి కొదువె ?'

'తగునె సోదరీ ! సాహ సౌదార్యధనుల
కర్థమున కేమి ! శ్రీరాముఁ డండ నుండు;'
అంచు నీచేత లగ్గింతు రనుదినంబు
[illegible] రామదాస !'

వితరణగుణరమ్యా! విజ్ఞలోకైకగమ్యా!
అతులితధనగణ్యా! ఆర్జితాఖండపుణ్యా!
హితజనహితకారీ! ఈశ్వరధ్యానచారీ
రతిపతి సమరూపా! రాజకార్యప్రదీపా!

* * *

# దక్షారామ భీమేశ్వర శతకము.

శ్రీ శాంతాంబా పుత్త్రా!
శ్రీశంబరజాతపత్రి శ్రీయుత నేత్రా!
ఆశాంతకీర్తిపాత్రా!
ఈశిత్రంశయుత రామకృష్ణ సుమిత్త్రా!

శ్రీకల్యాణ గుణాకరా! త్రిజగతీక్షేమంకరా! శంకరా!
లోకారాధిత దివ్యనవ్యచరితా! క్రూరాహిత ధ్వంసకా!!
నీకమాత్రివిశాల ధన్యచరితన్ నేర్పార వర్ణించెదన్
ఆకర్ణింపుము వీనుదోయి యిడి దక్షారామ భీమేశ్వరా!

శ్రీనాథాది మహాకవీశుల నుతి శ్రీలొంది పెంపొందు నిన్
నేనా? వర్ణనచేయువాఁడ! నయినన్ నీభక్తియన్ నావపై
నానాజన్మకృతాఘకంధిఁ దరియన్గాంక్షించి యీరీతిగా
నానందాకృతి! పూనినాఁడఁ గను దక్షారామ భీమేశ్వరా!

ఎప్పుడో వేములవాడ భీమకవి తా నెంతేని సద్భక్తిమైఁ
గప్పురంబుం బురుడించు నీదు యశము న్గాంక్షించి వర్ణించుటన్
నిపుణుంగాఁ బొనరించి తట్టి కవితానీకంబులం గూర్పఁగా
నపురూపంబుగ నన్నుఁ బ్రోవుమటు, దక్షారామ భీమేశ్వరా!

చొక్కంబౌ నటనాంతమందు అ-ఇ-ఉణ్ - సూత్రంబులన్బల్కునీ
ఢక్కానాదము లాలకించి మెయిఁ బుల్కల్ వొడ్మఁగావ్యాకృతి
న్జక్కన్ వ్రాసినయట్టి పాణినసుతుండంగాను గాఁబట్టి స
మ్యక్కావ్యంబు లొనర్చు బుద్ధియిడు దక్షారామ భీమేశ్వరా!

గంధర్వోపనిషద్రహస్యములు వక్కాణింప సంగీతమం
దంధప్రాయుఁడ నాటఁ జేసి భవదీయంబైన నాట్యక్రియా
సంధానక్రమ దివ్యగీతముల వాచారూఢిమైఁ బాడ లే
కంధార్కా! నుతి సేతుఁ బద్యముల దక్షారామ భీమేశ్వరా!

వేమారెడ్డి విభుండు వోలె ధనమున్ వెచ్చించి ప్రాకారముల్
స్వామిత్వంబును జాటఁ గట్టుటకునై చాలంగ లేకుంట, నే
నీమీఁదన్ శతకంబు వ్రాసి కొలుతున్ నీవట్ల వీక్షింప వ
య్యా! మమ్మున్ దయతోడ నెప్పుడును దక్షారామభీమేశ్వరా

ఆకుల్ పూవులు దెచ్చి హారమిడుటో యర్పించుటో మ్రొక్కుటో
ప్రాకారాదులు గట్టుటో యలుకుటో ప్రార్థించుటో కొల్చుటో
వాకొంటో మఱివ్రాయుటో చదువుటో భద్రంపు నీభక్తి లో
నైకత్రాణ! యొసంగు మాకెప్డుదు దక్షారామ భీమేశ్వరా!

దక్షబ్రహ్మ విహారభూమి యగుచున్ దైవాఱుటం జేసి యా
దక్షారామ మహాభిధం గనిన తత్ స్థానంబునందుండుచున్
అక్షుద్రక్రియ భక్తులన్ మనుచు నీ యవ్యాజకారుణ్యమున్
అక్షయ్యంబుగ వీనికీయఁగదె దక్షారామ భీమేశ్వరా!

అక్షయ్యంబగు భక్తియుక్తి సతమన్యాపేక్ష లేకుండ నీ
రక్షాదక్షత నెన్నికొంచుఁ గవితావ్రాతంబులం బ్రీతిమై
నక్షీణాహితనాశకాయ నతి ర స్త్వార్యాయ తే, యందు నా
యక్షుల్ దన్పెడు దర్శనంబిడుము దక్షారామ భీమేశ్వరా!

ప్రాతస్సాయములందు దక్షనగరీ ఛాక్సప్తగోదావరో,
తోస్స్రోతఃపూరములందుఁ గ్రుంకులిడి యక్షుల్ విచ్చి నిన్గాంచి హే

పూతాత్మన్ శివ! పాహి పాహి యని సమ్మోదించుభక్తుండుగా
నాతంకింపక చేయవయ్య నను దక్షారామ భీమేశ్వరా!

లీలానృత్య నిమగ్న తావకశిరో రింఖత్సురప్రహాదినీ
డోలాతుంగ తరంగమాలికలలో లోనూఁగు రాయంచనై
కాలంబెల్లను వెళ్ళఁబుచ్చెదు మహాకళ్యాణ వేళార్థినై
యాలోకించెదు దీను వీనిఁగను దక్షారామ భీమేశ్వరా!

వారస్త్రైణము నృత్యమున్ సలుపఁగా వర్ణింపఁగా సత్కవుల్
పౌరస్త్రీలు నివాళులీయఁగ నమోవాకంబు లీ భక్తులున్
హోరాటంబుగ డంబుగా హాయలుగా నూరేఁగుత్వన్మూర్తికిన్
ఆరాధించి ప్రదక్షిణించెదను దక్షారామ భీమేశ్వరా!

'చాలామంది' గలారు దైవతము లీ క్ష్మామండలిన్ లెక్కకున్
వాలాయంబుగ నిన్నుఁబోలె నెవరున్ భక్తాళివాంఛార్థముల్
చాలుంజాలు ననంగనీయరుగదా సంప్రీతిమై వారికై
యాలోకింప వృథా ప్రయాసపడి దక్షారామ భీమేశ్వరా!

భీమంబై సకలప్రజానికర సంపీడాకరంబై మహో
ద్దామంబై చనుకాలకూట విషదుర్గ్రాహంబు పోకార్చి సు
త్రామాదిత్య నిశాచరేశకులులన్ రక్షించి దక్షావనీ
క్షామంబుడ్చిన దేవ! ప్రోవఁగదె దక్షారామ భీమేశ్వరా!

చక్రప్రాప్తికి విష్ణుమూర్తియె నినున్ సంప్రార్థనం జేసి ని
ర్వక్రప్రక్రియ దక్షవాటి నిలువన్ రక్షించి ప్రత్యక్షమై
చక్రంబున్ దయచేసి ప్రోచినటు హృత్సంచారి షట్ శత్రులన్
ఆక్రోశింపఁగఁజేయు చక్రమిడు దక్షారామ భీమేశ్వరా!

నే శేషాహినిగాను నీమహిమలన్ నేర్పార వర్ణింపఁగన్
నే శ్రీశుండనుగాను నీగుణములన్ నెమ్మిం గనుం గొంటకున్
నే శీతాంశుఁడఁగాను నీశిరముపై నిన్ భూషణం బౌటకో
యాశాదూరుఁడ! యెట్లు ప్రోచెదవొ దక్షారామ భీమేశ్వరా!

నే నందీశుఁడగాను వాహనమనై నిన్నే సదా మోవఁగా
నే నాళీకభవుండఁగాను శ్రుతులన్ నిన్నెప్డు కొండాడఁగన్
ఏనా గౌరినిగాను మేన సగపాలైయెట్టులో యాఁచికో
నానందప్రద! యెట్లు ప్రోచెదవొ దక్షారామ భీమేశ్వరా!

సాయం సంధ్యల వేళలం దఱచుగా శర్వాణితో పాటుగా
సాయుజ్యార్థుల యర్థముల్ దనుపఁగా సన్నృత్యమున్ సల్పు నీ
ఛాయల్ గాంచుచుఁ దన్మయత్వమొదవన్ సంసారమున్ గడ్పు నా
హాయిన్ గూరిచి ప్రోవు మీసుతుని దక్షారామ భీమేశ్వరా!

గజచర్మంబును భూతియుం బునుకలు న్గాలాహియుం జంద్రుఁడున్
ద్విజశైవాలినియుం; ద్రిశూలమును సంప్రీతి పృదం బేణమున్
ద్విజరాడ్వంద్యయుమాపురంధ్రియును తీవిన్గూర్ప నెమ్మేనిపై
నజడాకారుఁడవైన నిన్గొలుతు దక్షారామ భీమేశ్వరా!

దక్షబ్రహ్మ యొనర్ప యజ్ఞమతనిన్ దండించి, రక్షించి, త
ద్దక్షాధ్వర్యుల బ్రహ్మవిష్ణుహరులన్ దాక్షాయణిం గ్రమ్మఱన్
అక్షుద్రామల ప్రేమఁబొ్రోచిన త్వదీయావ్యాజరాగంబు నే
నక్షయ్యంబగు ప్రీతితోఁ గొలుతు దక్షారామ భీమేశ్వరా!

కుక్షిప్రోద్భవ నిష్ఠురక్షుభిత దుష్క్రోధాంధకారంబునన్
సాక్షాద్ద్వారికి వారణాసికి వృథా శాపంబు నీఁబోవు నా

రూక్షాలాపుని వ్యాసుఁ గాశి విడువన్ దోర్విబ్బించియున్ వెంటనే
యక్షోభున్భ్రోచనరించి తెంతో దయ దక్షారామ భీమేశ్వరా!

ద్రాక్షా పానక ఖండ శర్కరలతో రంభాఫల శ్రేణితో
గోక్షీరంబులతోడి పాయసముతోఁ గొన్నైతినై వేద్యమున్
అక్షీణోన్నత భక్తి నీకిడుట కే నర్థింతు మత్ప్రార్థనన్
అక్షుద్రాత్యనుకంపఁ గైకొనుము దక్షారామ భీమేశ్వరా!

శ్రీకంఠాయ శివప్రదాయ భవతే క్షేమంకరాయోం నమో
లోకత్రాణ పరాయణాయ భవతే రుద్రేశ్వరాయోం నమః
పాకారి ప్రముఖస్తుతాయ భవతే భద్రప్రదాయోం నమః
స్సాకారాయ యటంచు నిన్గొలుతు దక్షారామ భీమేశ్వరా!

శిరమందున్ నునుపూపచందురుఁడు సుశ్రీదాయియై వెల్గఁగాఁ
గరళచ్ఛాయయె కంబుసన్నిభగళ గ్రైవేయమై క్రాలఁగాఁ
గరమందున్ హరిణంబు దాల్చి జనుల న్గాపాడు నీమూర్తికిన్
హరుసానం దల యొగ్గి మొక్కెదను దక్షారామభీమేశ్వరా!

జ్యోతిర్లింగమయస్వరూపుని నినున్ స్తోత్రంబు గావించి వి
ఖ్యాతఖ్యాతిని, గాంచ నట్టికవులేలా! కల్ల ధాత్రీస్థలిం
బ్రాతస్స్నాయములందు ని న్నెపుడు నేఁ బ్రార్థించి దక్షావనీ
ఖ్యాతిం జాటెద మూలమూలలను దక్షారామభీమేశ్వరా!

సాకారుండు; నిరాకృతిస్థుఁ డని దుర్వ్యాఖ్యానముల్ చేయ కా
లోకింతున్ సకలార్థసంగతభవ దూపంబు చిన్నేత్రమున్
నీకై యర్పణచేసి నిశ్చలమనో నిష్ఠాగరిష్ఠుండనై;
యూఁకల్ పెట్టక ప్రోవు మెల్లపుడు దక్షారామభీమేశ్వరా!

జౌలే నీనటరాజరాజబిరుదం బన్వర్థమై మించఁగా
లీలానృత్యము దక్షవాటపుర నారీలోక మీక్షింపఁగా
కేలుం బ్రొద్దులు సల్పు చుందువట యారీతుల్ విలోకించుచున్
వ్యాలోలించెడు నన్నుఁ దన్పు మిఁక దక్షారామభీమేశ్వరా!

పంచారామవిహారముల్ సలుపు నీ భవ్యాకృతి న్గన్నుల
న్గాంచన్ నోచనె? చంచలాత్ముఁడనె యెందాఁకం బ్రతారించెదో
ప్రాంచద్భూతి విభూషితాంగమది యేలా దాఁగునో యీశ్వరా!
యంచద్భక్తుఁడఁ గానొ ప్రోచుటకు? దక్షారామభీమేశ్వరా!

కాశీసేతుప్రయాణమున్ సలిపి తద్గంగాప్రవంత్యంబుధి
ప్రాశస్త్యంబువులన్ మునింగి యఘముల్ పాయంగఁ బో నేటికి
న్గాశాకారజలౌఘపూరమయి వెల్గన్ సప్తగోదావరం
బాశాపాశవినాశి మోక్షదము దక్షారామభీమేశ్వరా!

ఆకాశాకృతిమూర్తిమూర్ధమునఁ జంద్రాలోకముల్ గాయ నా
కౌకప్రోదిని ధాళధళ్యరుచితో నప్పొంగ శేషాహి వే
వేకంతా లొగి నెత్తి కీర్తి సలుపన్ వీక్షింపఁగా గౌరి న
వ్యాకారంబునఁ బొల్చు నిన్గొలుతు దక్షారామభీమేశ్వరా!

నీవే తల్లివి తండ్రివై గురుఁడవై నెయ్యుండవై చుట్టమై
కావం జెంగట నిల్చియుండఁ గరుణాకారంబునుం దాల్చి మ
మ్మేవాఁ డేమియొనర్చు బాధ; భయ మేమీ లేదుగా మాకు; నీ
యావిర్భావము దుష్టనిగ్రహము దక్షారామభీమేశ్వరా!

శైవక్రీడలు సల్పుచున్ బహుశముల్ శైవాఖ్యలం గాంచుచున్
శైవామ్నాయములం బఠించుచు సుహృచ్ఛైవుండనై నే 'నమో

'శైవత్రాణపరాయణాయ భవతే శర్వాయ' యం చెప్పుదున్
ఆవేశానఁ బ్రదక్షిణించెదను దక్షారామభీమేశ్వరా !

శైవం బన్నను వైష్ణవం బనిన నీ సాకారజన్యంబెకా
భావంబందుఁ దలంచుమానవులకున్ బాధల్ ధరామండలిన్
ఏవీ? యుండవు; భేదరూపునకు నెందే నుండునే భేదముల్
శైవాకారుఁడ! వైష్ణవప్రియుఁడ!! దక్షారామభీమేశ్వరా!!!

ప్రస్తారింపఁగవచ్చు ఛందములఁ దాఁ బ్రజ్ఞావిశేషంబునన్
వస్తుప్రాప్తి తలంచి నీపయి మహా భావంబునం బద్యమే
ప్రస్తావింపఁగ లేక యేమిటికి వ్యర్థాయాస మద్దాన నో,
శస్తశ్లోకము లే రచింతుఁ గొను దక్షారామభీమేశ్వరా !

నిన్నే తల్లిగఁ దండ్రిగా గురువుగా నిర్ణేతగా దాతగా
నిన్నే చుట్టముగా ననుంగుఁజెలిగా నిర్వాణసంధాతగా
హృన్నాళీకమునందు నిల్పి గొలుతున్ హీనాత్ముఁడ నైన మో
యన్నా! నన్ గను తెప్పవోలెఁ గని దక్షారామభీమేశ్వరా!

కవితార్థంబు లెఱుంగఁజాలని నర క్రవ్యాదులన్ వ్యాధులన్
అవురా! యేటికిఁ బుట్టఁజేసితొ గదే యన్యాయులన్ హేయులన్
శివసామ్రాజ్యమునందు నక్షరము కుక్షిన్ లేని వారుండు,వోఁ
గవులై క్రాలెడువారి కేమిగతి దక్షారామభీమేశ్వరా!

నిన్నే నమ్ముచు నిన్ను నే కొలుచుచున్ నిన్నే సదా పిల్చుచున్
నిన్నే మ్రొక్కుచు నిన్ను నే తెలియుచున్ నిన్నే ప్రశంసించుచున్
ఉన్నానో! జగదీశ! తుందుడుకు లయ్యో! చేర రానీకు నీ
కన్నన్ దిక్కెవరయ్య! నాకుఁ గన; దక్షారామభీమేశ్వరా !

తల్లీదండ్రులు దూరభూములఁ బ్రభూ! దైవాఱుటం జేసి నా
తల్లీదండ్రులు నీవయై 'కుశలమా! తండ్రీ!' యటం చడ్గుచున్
చల్లంగాఁ గనుగోకయున్న మములన్ సాఁకం గలా రెవ్వరో
సల్లాలిత్యదయాసుధాకరుఁడ! దక్షారామభీమేశ్వరా!

శాంతంబైన మనంబుతోడఁ గవితా సామ్రాజ్యభద్రుండనై
శాంతాకారు నినున్ భజించుకొనుచో సాంసారికానర్థముల్
పొంతన్ నిల్చి కలంచు చున్నవి యిఁక న్నోర్చుకార్చి యవ్వాని న
శ్రాంతానంద మొసంగి ప్రోవఁగదె దక్షారామభీమేశ్వరా!

వనమం దుండిన వార్ధిలో మునిఁగినన్ బాషాణమే నెక్కినన్
ఘనశైలాగ్రము నెక్కినన్ నడచిన న్నార్చిచ్చు లోలోపలన్
వెనువెంట న్ననుదెంచి తల్లి సుతులన్ వీక్షించి న ట్లోప్పుగాఁ
గని కాపాడెద వెంతప్రీతియొకో దక్షారామభీమేశ్వరా!

ఏదే నాపద వచ్చినప్పుడె నినున్ హీనాత్ములౌ మానవుల్
నీదేభార మటంచు మ్రొక్కుకొని దానిన్ దాఁటి గట్టెక్కి యా
మీఁదన్ నీమహిమంబు నెంచరు,నదిన్ మేలొందఁగా దాఁటి లో
కాధారా! యుడుపంబు గాల్చి నటు దక్షారామభీమేశ్వరా!

కవితల్ నేరిచి కావ్యసృష్టిమహిమల్ గానీను నే మించు నా
కవులం గన్గొని యాంగ్లకోవిదు లిసీ కాదన్న నే మాయె, నీ
భువిపై శాశ్వతకీర్తిమూర్తులగు నాపుణ్యాత్ములన్ ధన్యులన్
గవులం గాలమె మ్రొక్కుచుండుఁ గద దక్షారామభీమేశ్వరా!

మాణిక్యాంబర భూషితాంగియు సుధీ మాణిక్యసంస్తుత్యయున్
గాణిక్యామృత పూత గీత గతయున్ దాక్షాయణీమూర్తి యా

మాణిక్యాంబయు నీవు నాహృదయ సింహాసాగ్ర్యపీఠంబుపై
సానందంబున్ వసియింప వేఁడెదను దక్షారామభీమేశ్వరా!

దుస్స్వప్నంబులు వచ్చి మాటికి మనో దుఃఖంబు చేకూర్చెడిన్
సుస్వప్నంబులు చేసి వానిని మన స్తోషంబు చేకూర్పుమా
యస్వాభావిక భావచింతల మనో వ్యాలోలతం గూర్పకే,
యస్వప్నుండవు నీ కసాధ్యమెది? దక్షారామభీమేశ్వరా!

కుధాకూరము లాడకుండ సతముం గాంక్షించి నీభక్తి నే
గారామారఁగఁ గాలము న్గడపు సత్కావ్యాళి నిర్మాతలన్
గారాగారనిబద్ధులన్ సలుపకే కాపాడుమా ప్రేముడిన్
ఆరూఢిన్ నినుఁ గొల్తు రాత్మలను దక్షారామభీమేశ్వరా!

ఏపాపంబును బుణ్యముం దెలియకే యెట్టెట్టులో కాలమున్
నీపై భారము వేసి కడ్పుకొను కానీనాభవిద్వాంసులన్
రేపున్ మాపును నిందసేతు రకటా నిర్హేతుకేర్ష్యాళువుల్
ఆపాపాత్ముల నేమి యందు మిఁక దక్షారామభీమేశ్వరా!

న్యూనత్వంబును వీడి కొల్చుటకు నే 'నూకాం'బనా కానుగా
'కానిన్' దక్షిణ గోరకుండఁ గొలువన్ 'ఘట్టాంబ'నా కానుగా
పోనీ 'గోఁగులయమ్మ' మండతటల న్బోలంగదే కొల్వఁగన్
ఐనన్ 'మాణిక' నూను వీనిఁ గను దక్షారామభీమేశ్వరా!

మాణిక్యంబులు దెచ్చి యిచ్చి కొలువన్ మాంధాతనా? కానుగా
కానేకాన్ యవనాశ్వరాజు నొసఁగ నట్టాణి ముత్తెంబులన్
గానేకానుగ యుంగరం బిడఁగ నిక్ష్వాకావనీపాలుఁడన్
సానందాత్ముల దీను వీనిఁ గను దక్షారామభీమేశ్వరా!

లయకారుండనినిన్నుఁగొందఱు వృథాలాపంబులన్ దూఱుచున్
స్మయముం జెందుదు రెంత వెఱ్ఱి కట! యశ్రాంతంబు దుష్టాత్ములన్
లయముం జేయుదుగాని భక్తవరులన్ రక్షించె దా యర్థమున్
అయయో కాంచనివారి నేమనుదు దక్షారామభీమేశ్వరా!

రంగద్గాంగ తరంగమాలికలతో రాత్రింకరుం డైక్యమై
రంగాజీవుఁడవైన నీనటన కాహ్లాదించెనో! నాఁగ నీ
తుంగాంగంబున వామపార్శ్వగతయై తోషించుమాతల్లి న
త్యంగీకారముతోడఁ గొల్చెదను దక్షారామ భీమేశ్వరా!

కాంచీకంకణ తారహారకటక గ్రైవేయ భూషావళుల్
లంచంబీయఁగజాలు నర్థము కలాడంగాను, దప్పంటిగాఁ
బంచాస్త్రారికి మేరువాసికి ధనంబా! యేల? సర్వార్థదా!
యంచున్ బల్కెడు వీనిఁ దన్పుమిఁక దక్షారామభీమేశ్వరా!

వేదవ్యాసుఁడు కాశికావిరహమున్ వెన్వెంటనే వీడఁగా
నీదివ్యాకృతి యెంతసంతసము దానెక్కొల్పెనో యింతకు
న్గాదా నాకిడ దర్శనంబది 'నిరాకారుండ' నం చందువే
నాధారం బెటు శూన్యపుష్పమగు దక్షారామభీమేశ్వరా!

శ్రీవిశ్వేశ్వరుఁ బాసివచ్చిన ముని శ్రేష్ఠుండు వ్యాసుండు దా
నీవే దిక్కని నమ్మినందులకహో నిశ్చింతునిం జేసి నా
వీవే దిక్కని నమ్మియున్న నను స్వామీ! యేలరక్షింప వ
య్యా! వందారు సుభక్తపోషివఁట దక్షారామ భీమేశ్వరా!

లోకాచారము మాని కొన్నిటఁ బ్రభూ! రొక్కించి ప్రార్థించితి
న్నాకం జెందక దాన దీను నితని నాపాడవే? పోవనే?

నీకై యర్పణ చేసికొంటిఁ గొనవే నీచాత్మునై వేద్యమీ
యాకుంబోఁకయుఁగాని పద్యతతి దక్షారామ భీమేశ్వరా !

ఎంతోకాలమునుండి చేసితిని నే నెన్నేనియున్ దోషముల్
స్వాంతంబందుఁ దలంపఁబోక యవి యెవ్వారేమిగాఁజెప్పినన్
బంతంబున్ విడనాడిపోవ ? గదవే భద్రాత్మునింజేయవే
యంతేవాసిని నర్చకుండనని దక్షారామ భీమేశ్వరా !

అపకారంబును బుద్ధిపూర్వకముగా నన్యార్థమేఁజేయలే
దుపకారంబునె యోపినంతవఱకుద్యోగంబునం జేసితిన్
జపలాత్ముండనుగాను గార్య విధిలోఁ 'జాదస్త' మాలేదు నీ
యపురూపంపుఁ జరిత్రి నే తలఁతు దక్షారామ భీమేశ్వరా !

న్యాయస్థానపథంబులన్ నిలిచి నే నన్యాయ సాక్ష్యంబులా
యీయన్ లేదు వృథోపభోగములకై యేనాఁడునుంబోను నీ
చాయన్బట్టి చరించుచున్ దినము లిచ్ఛారీతిగాఁ గడ్పు నా
హాయింగూరుచు సుస్థిరాత్మ యిడు దక్షారామ భీమేశ్వరా !

మాయోపాయములెన్ని యోసలుపుచున్ మర్యాదపోనాడుచున్
హేయప్రాభవకామినై యితరులన్ హింసింపఁగాలేదు నీ
చేయిన్బట్టుగనమ్మి సత్కవితలన్ సృష్టించి తుష్టుండనై
యాయామై వేళలఁ బుత్తుఁ గావఁగదె దక్షారామ భీమేశ్వరా !

పోలమున్ బుత్రయుఁ బోయినప్పుడు మమున్బోనీక దుర్వృత్తులన్
బాలమున్ బుత్రయు రామకృష్ణువలనం బూర్ణంబుగా నిచ్చి మా
కులముం బ్రోచిన నీదు దాతృగుణముం గొండాడఁగా నొప్పదే
గులికాశంగి పతంగ' రాతిచర ! దక్షారామ భీమేశ్వరా !

కడుపుంగూటికిఁ జేయిచాఁచి యొరులం గాపాడఁగా వేఁడ తే
డెడదన్ నీపయిభారముంచికొని యెట్లెట్టో సుఖస్ఫూర్తిగా
వెడలంజేసితి రోజులింత దనుకన్ విద్యావివేకంబుతో
నడరంజేయుమితోఽధికార్థముల దక్షారామ భీమేశ్వరా ?

చేతందాఁకినదెల్ల బంగరువుగాఁ జేయించు సత్వంబు నీ
చేతంగల్గుట లోటు మాఁకెచటనుం జేకూఱనే కూఱ దో
యీతాతా? మఱిబెంగయేమిటికి నీవేచూతుగా యన్నిటన్
యాతాయాత ధనేహ యేమిటికి? దక్షారామ భీమేశ్వరా ?

భావాతీతుఁడ వీవటంచు సుజనుల్ వాక్రొంత్రు; నేనమ్మ మ
ద్భావాక్షిద్వయికిం గనంబడెడు నీ వాల్లభ్యరూపంబునే
నే వాలాయముగంటి నన్నుఁ గరుణాహీనాబ్ధి! కాదందురా
నావున్ దూడయుఁ గల్గ గుంజలటు దక్షారామ భీమేశ్వరా.

వేయున్నూటపదాఱురూప్యములు పృథ్వీపాల లోకంబుకై
జేయింజాఁపి యశంబువీడియడుగం జిత్తంబు భ్రష్టంబుగాన్
హేయంబైన నృపాల విత్తములకై యేలావృథాచింత, నీ!
న్యాయంబైనత్వదీయ చింతయిడు దక్షారామ భీమేశ్వరా!

ఆకాశాకృతితోడఁ గెంజడలతో వ్యాళేంద్ర హారాలతో
నాకాశాపగతోడ శైలతనయా వ్యామిశ్రితాంగంబుతో
రాకాచంద్ర విభాసితోన్నత శిరోలంకార రింఛోళితో
వ్యాకంపించెడు నాకుఁగానుపడు దక్షారామ భీమేశ్వరా.

బసవాకారమొ శంకరాకృతియొ యావ్యాథాత్మ్య రూపోద్యదం
బసమీఱన్ సతతంబు నిలుపుకొని

స్గనుమాలంపు వికారచేష్టితముల న్గాలించి పో(ద్రోలు ద్రా
యనకాఁడీతఁడు నీసుతుండెసుమి దక్షారామ భీమేశ్వరా!

'రాజుల్ మత్తులు వారిసేవ నరకప్రాయంబు' నాఁ జెప్ప ధీ
రాజున్ మెచ్చుచు నేల నేలు నెవనిం బ్రార్థింప కర్థార్థినై
భూజానీశ! సమస్తదా!! యనుచునిన్యాజించి వర్ణించెదన్
వ్యాజంబింతయు లేనిభక్తి మెయి; దక్షారామ భీమేశ్వరా!

రాజెవ్వండు గుణాగుణంబుల విచారంబొప్పఁగాఁ జేసితాఁ
బూజల్ చేసె గ వీశ్వరేశ్వరుల; నీ! మూర్ధన్యతా గర్వులన్
వాజం జెందకెవండు భక్తియుతుఁడై వర్ణింప నిచ్చించు, ని
ర్వ్యాజున్ నిన్ విడనాడి, క్షేమకర! దక్షారామ భీమేశ్వరా!

మంత్రిల్ మాన్యులు వారలేకద విశుంభత్కీర్తి దీపింప నే
మింత్రీయన్ ధనధాన్య భూములను స్వామిత్వంబుతోరాజు, లీ
తంత్రింబున్ గ్రహియింపనేరక వృథా దర్పింతు రవ్వారి, నే
యంత్రాలట్టిరువారిఁ గొల్వ నిఁక దక్షారామ భీమేశ్వరా?

పరకాంతా పరకాంచనాదులపయిన్ భావంబు లేకుండఁగాఁ
జిరకాలంబుగ దాఁటివచ్చితిఁ బ్రభూ! చిత్తంబునం దెత్తఱిన్
బొరపాటుల్ ప్రభవింపనీక యిటులే పోనిమ్ము కాలమ్ము పెన్
హరుసానం దలవాంచి మ్రొక్కెదను దక్షారామ భీమేశ్వరా?

చేతుల్ మోడిచి నమ్రభావమున నేఁ జేతున్ నమోవాకముల్
చేతోజాత వికార దోషములు నన్జెందంగ రానీక వి
ఖ్యాత ప్రక్రియఁ దీర్చిదిద్దఁగదవే వ్యాళేంద్రహారుండ! నీ
ఖ్యాతిం జాటుచుఁ బొద్దుపుచ్చెదను దక్షారామ భీమేశ్వరా?

పరభూనాథుల గొల్వనేఁతధర నాపద్ధర్మమై యుంటచే
నొరులన్గొల్చుచు జీవయాత్రకొఱకై యున్నంతలోఁ దృప్తిమైఁ
దిరుగం జొచ్చెదఁగాని లంచములకై తీండ్రింప నెన్నట్టునం
దరుదా ప్రేముడిఁజూపి ప్రోవఁగదె దక్షారామ భీమేశ్వరా?

మోహంబో! మఱి మేహమో! మఱి యిఁకే మూర్ధన్యమో కర్మమో
యీహాన్వీడి భవద్యశోమహిమనే నీరీతి వర్ణించుచో
నాహా చూపులు మాంద్యమొందెడి, నిదేమన్యాయమో యీ ప్రభూ!
సాహంకారుఁడఁగాను బ్రోవఁగదె దక్షారామ భీమేశ్వరా!

కన్నుల్ బాధ శమింపఁజేసితి నమస్కారంబు భూతేశ్వరా!
యెన్నం డిట్టి మహత్త్వమే నెఱుఁగ నెద్దెందేనియుంగూడ నా
పన్నత్రాణ పరాయణత్వమది నాపట్లన్ యదార్థంబుగాఁ
గన్నాఁడన్ నుతిసేతు గైకొనుము దక్షారామ భీమేశ్వరా!

కొండంతాపద మీఁదఁబడ్డ నిను నేఁ గొండాడ వెన్వెంటనే
దండన్ నిల్చి వెలార్చి దాని; సుఖముల్ దైవాఱఁగా నిచ్చె దీ
తండేపాటి ఘనుం డటంచును లఘుత్వాపాదనం జేయకే;
యండన్ నమ్మిన బంటుఁగావఁగదె దక్షారామ భీమేశ్వరా!

గుండెం జేయిడి యొక్కనాఁడయినఁ గూర్కుంజెందఁగానోచనే
కొండల్పోని దురంతదుఃఖములచేఁ గుందించె దెల్లప్పుడున్
బెండుల్వోలె భవార్తులన్నియును వేవేచోపి రక్షింపు; బ్ర
హ్మాండంబుల్ సృజియించిప్రోచుదొర! దక్షారామ భీమేశ్వరా!

మేనం బుల్కలు వొడ్మఁగా నతము నీ మేలైన చారిత్ర మెం
తే నికన్నఁ బ్రిభూతభ కి మెయితో నిటలు ననో, శివా!

నానాబాధలు పెట్టుచుంటి విది యన్యాయంబుగాదే ప్రభూ!
జ్ఞానానందకరుండ! కావఁగదె దక్షారామ భీమేశ్వరా!

ఇల్లా లింట జ్వరార్తియై కదలలే కేరీతినో యుండ నీ
పిల్లాపైమి విరేచనాదికములన్ వేమాఱు కష్టంబుచే
నెల్లన్ వేళలఁ బోరుపెట్టి వరదా! యేకారెకు న్బాలకై
యల్లాడింపక మమ్ముఁ బ్రోవఁగదె దక్షారామ భీమేశ్వరా!

పరిభావోత్థితతావకాక్షిదహన వ్యాపారరూపంబునే
చరకం బాడుజ్వరంబుగాఁ; గనుకనో సర్వేశ! యీవ్యాధి నీ
వరపుత్త్రుం డగుటన్ సహోదరులనే బాధించు టన్యాయమం
చరికట్టంగదె వాని మమ్ముఁ గనుగ, దక్షారామ భీమేశ్వరా!

తల్లిం గొండొకసేపు సంజ్వరముదా దాపంబు నొందించి పైఁ
బిల్లంగూడ నదేవిధమ్ముగఁ బ్రభూ! పీడించెడి న్గావవే!
తల్లిం బిల్లను గూడ రక్షకుఁడవై తప్పున్న మన్నింపు నీ
యల్లారుం గొనముల్ నుతించెదను దక్షారామ భీమేశ్వరా!

జ్వరబాధం దొలఁగించి దారసుతులన్ స్వాస్థ్యంబునొందించి యో
వరదా! రక్షణచేయవే! కినుకయే ప్రార్థింపఁగాఁ బల్కవే!
కరుణాకారుఁడ వీవుకాదె? యిటుల న్గాఠిన్యముం బూనితే
యరుదా నీయనుకంప యెందరిగె దక్షారామ భీమేశ్వరా!

ఏమూమెన్ భవదీయ శంకర పదం బీనాఁట మమ్మేమఁగా
మోమోటూనెనె? లేక వీరలొక సంమూఢాత్ములం చెంచెనే?
స్వామీ! యేమెయి వేఁడినన్ సుఖము లాపాదింపకున్నాఁడ వౌ
రా! మేల్ మేలుర! భక్తరక్షణము దక్షారామ భీమేశ్వరా!

నీమృత్యుంజయనామమున్ దలఁచి నిన్నే దిక్కుగా నమ్మితిన్
బాముల్ వెట్టక దారపుత్త్రికల దా వ్యాధిన్ వెలార్పంగదే!
స్వామీ! శంకర! పూర్ణమాయువిడి వేసాఁకంగదే మ్రొక్కుదున్
ఆమంత్రించెద నీను కుయ్యివిను దక్షారామ భీమేశ్వరా!

శరణంబో శివ! పార్వతీశ! శరణో శర్వా! మహాదేవుఁడా!
శరణంబో త్రిపురాసురాంతక! మహేశా! దేవదేవేశ్వరా!
శరణంబో నిగమాంతవేద్య! శరణో సాంబా! విరూపాక్షుఁడా!
శరణంబీశ్వర! చంద్రశేఖరుఁడ! దక్షారామ భీమేశ్వరా!

అభయం బిమ్ము గజాసురాంతకుఁడ నీహారాద్రి కన్యాపతీ!
యభయం బిమ్ము సనందనాదినుత! దివ్యాకార లింగోద్భవా!
యభయం బిమ్ము చరాచరాత్మక జగత్ప్రారంభ హేతుక్రియా
యభయం బిమ్ము త్వదీయభక్తులము దక్షారామ భీమేశ్వరా!

భూతప్రేతపిశాచబాధలయినన్ భూతేశ! నీనామమున్
జేతఃప్రీతిఁ దలంచినంతన కడున్ శీఘ్రంబుగాఁ బోవుఁగా
దా? తాతా!యిదియేమిపాపమొకొ నిన్నర్చించుచాసాయమున్
ఖ్యాతింగాంచెను నాకె బాధిడితి దక్షారామ భీమేశ్వరా!

నీవేమన్నను వద్దు పొమ్మనిన నేనిన్ విడ్చి పోఁజాలరా!
పోవంజూచునె? చీమ బెల్లముపయిం బోకారునే కాని; సం
భావింపన్ శరణంబు వేఁడితిని శర్వా! నన్ను రక్షింపుమా!
యావర్తించెద నీదుగాథలనె దక్షారామ భీమేశ్వరా!

తొలినేఁ జేసినఁ బాపకర్మముల కింపుం బొందుగావించి బా
ధల పెట్టించటినిగూర్చి వెంటనె యగాధంబైన తద్భక్తిచే

త లయం బొందఁగఁజేతు బాధల ననంతా! యెంత సంప్రీతియో
యలుకుం జెందెదు మమ్ముఁ గాచుటకు దక్షారామ భీమేశ్వరా!

మాణిక్యాంబను బ్రీతిఁగాంచి మదనామ్నాయంబువర్ణించుచున్
మానం బూనెదవేమొ మాదృశుల దా మానంబుగాపాడ; ని
న్నీ! నారాయణ! యెంతమాటనితి భస్మీభూత మీనాంకునిన్
ఆనందాకృతి లోకనాథు నిను దక్షారామ భీమేశ్వరా!

రాముండున్ మఱి నైషధుండు వరుసన్ రాజిల్ల వంశీయులై
భూమిం గ్రాలెడు తల్లిదండ్రులకు నే బుత్రుండనై క్షత్త్రియా
రామాప్తోన్నతశాఖిశాఖలపయిన్ రంజిల్లు రాచిల్కనై
యామోదింపఁగఁ జేసినావుగదె దక్షారామ భీమేశ్వరా!

అవనీ దేవులె కాదు మానివరులున్ ధ్యానించి ధన్యాత్ములై
ప్రవరంబై తగు క్షత్త్రవంశమణినై రాగిల్లఁగాఁ జేసినా
వవురా! యెంతటిపుణ్యమూర్తివి ప్రభూ! యర్థంబె నాబోఁటికి
యవనిన్ రాజపదంబు పెట్టుకొన దక్షారామ భీమేశ్వరా!

శతకాలల్లినవారు క్షుద్రులనుచున్ శాస్త్రజ్ఞులండ్రిద్దిరా!
శతకాలల్లని యట్టి కోవిదులహో క్ష్మామండలిం గల్గిరే?
శతకాలల్లినవారు కారె? కన'ధూర్జట్యా'దులవ్వారి యా
యతకీర్తిం గొఱయేమి కల్గినది దక్షారామ భీమేశ్వరా!

లింగాకార! నమోస్తుతే యనుచు సంప్రీతిన్ దివారాత్రముల్
రంగారన్ నుతియించువారల విచారవ్రాతముల్ డుల్చు నీ
రంగత్ప్రేమము నెన్నుచున్ సుఖముగా వ్రాయంగనీగ్రంథమున్
అంగీకారము చూపినావు జయ! దక్షారామ భీమేశ్వరా!

ఫలమో పుష్పమొ తోయమో తిలకమో వస్త్రంబొ మాణిక్యమో
కలమో కాగితమో త్వదర్పితముగాఁ గావించు భక్తుండు కే
వల కైవల్యపదంబు గాంచుననఁ గావ్యంబెల్ల నీకిడ్డ నా
కలుకం జెందక యేమియిచ్చెదవొ దక్షారామ భీమేశ్వరా!

నిలుచున్నప్పుడు కూరుచున్నయప్పుడున్ నిద్రించినన్ లేచినన్
దలఁతున్ నిన్నెద భక్తరక్షణపరా! దండంబు గావించుచున్
దలఁగంజేయుము పాపకర్మములఁ జెంతం జేరఁగానీక యోం
కలితాకారుఁడ! విశ్వరూపధర! దక్షారామ భీమేశ్వరా!

"ఎన్నో తావులకు మ్రొక్కితిన్ సుతులకై యెన్నో నదుల్ గ్రుంకితిన్
ఎన్నో నోములు నోచితిన్ గొలిచితి న్నెన్నో గుడుల్ గోపురా
లున్నా వీవనియెంచకే, యయిన నా యుత్సాహమ్ముం దీర్పఁగా
నన్నా! పుత్త్రికనిచ్చి ప్రోచితివి దక్షారామభీమేశ్వరా!

ఉన్నారెందఱొ దేవతల్ ధరణిపై నూఱూర వేర్వేఱ భా
స్వన్నామంబులతోడ నందునొకరున్ సంసారసారంబు లా
విన్నాణంపు సుతాళిమాకిడెడు నే విన్నాణమున్ లేక మా
యన్నా! నీ విడినావు మాకుసుత, దక్షారామభీమేశ్వరా!

నిన్నాత్మంగని చొక్కి మ్రొక్కి సుతకున్ నీపేరు నేపెట్టి మా
పున్నెంబెంచుక రాత్రియుం బవలు నీ పూర్వోత్తరోదంతమున్
అన్నన్ నేనును జెప్పుకొంచు దినముల్ హర్షంబునంబుత్తు, మిం
కన్నికన్న నెవండు దైవము మల; దక్షారామభీమేశ్వరా!

వితతఖ్యాతిని మించ నాదుసుతకున్ భీమేశ్వరీ దేవికిన్

శతవర్షంబుల యాయువిచ్చి వరదా సాంకంగదే ప్రేముడిన్
అతిభక్తిన్ నుతియింతు నీచరిత దక్షారామభీమేశ్వరా !

'పైండావారి' విధంబుగా నిరతమున్ బాంధాళికిన్ భక్తిమై
గూడుం గూరలు వెట్టి నీగుడికడం గూలంకషోత్సాహినై
యూడం బాడఁగఁ జాలునట్టిధన మత్యంతంబు లేకుంట నీ
జాడల్ స్తోత్రము చేయుచుందునిటు, దక్షారామభీమేశ్వరా !

ఈశా! యింతకుఁబూర్వ మెన్నిజనులే హీనుండనై యెత్తినా
నోశర్వా! తలపోయ రోఁతగద జన్మోదంతమాకారా! తా
తా! శాంతింపు దురంతజన్మముల నెత్తన్ లేను రక్షింపురా!
యాశాపాశములం దగుల్పకయ దక్షారామ భీమేశ్వరా!

సంతోషించితినయ్య నీదయకు నే స్వామీ! శతగ్రంథమున్
సుంతేనిన్ విడనాడకుండ ముగియం జూడంగ వ్రాయించి నా
వంతే వాసికి నంతరాయభయ మావంతేనిలేకుండ, వే
దాంతభ్యర్చితపాదపంకజుఁడ! దక్షారామ భీమేశ్వరా!

జయమోసాంబ! సదాశివుండ! జయమోగా శ్వరా! మహాదేవుఁడా
జయమోయీశ్వర! దేవదేవ! జయమో సర్వజ్ఞ! శ్రీకంఠుఁడా!
జయమోధూర్జటి! లోకనాథ! జయమోస్థాణూ!విరూపాక్షుఁడా
జయమోభర్గ! త్రియంబకా! జయము దక్షారామ భీమేశ్వరా!

ఫుల్లాబ్జాక్షికి రాఘవాంబికకు సత్పూజ్యుం డమాయుండునౌ
ఫుల్లంరాజను వేంకటేశునకు సత్పుత్రుండు వాగ్వైభవుణిన్
సల్లాలిత్యుఁడు సత్యపూర్వయుతుఁడౌ నారాయణాఖ్యుండు రా
జిలెన్ దీనిఁదఁదరితంబుగను, దక్షారామ భీమేశ్వరా!

అవిరళకృషికర్తా! ఆంధ్రియాంత్రాళిభర్తా!
నవరసయుతమూర్తీ! నవ్యభవ్యాచ్ఛకీర్తీ!
ప్రవిమల ఋజుకర్మా! ప్రాద్రితాఖండశర్మా!
శివకరకరయుక్తా! క్షేమనిష్యందివక్తా!

*
* *

# విక్రమ దేవ శతకము.

శ్రీ సౌమ్యగభీరాంగా !
వాసితహరి చరణ సక్త భక్తి తరంగా !
భాసిత యాంత్రిక విద్యా
వ్యాసంగా! రామకృష్ణ పావనసాంగా !

శ్రీ జయపుర నరనాథా !
రాజన్యకులావతంస ! రమ్యచరిత్రా !
రాజిత వితరణ సురపృ
థ్వీజా ! వైభవ బిడౌజ ! విక్రమదేవా !

పసరములఁ గామధేనువు
రసముల శృంగారరసము రాజులలోనన్
అసమొందుచున్న నీవును
వెసలెక్కకు వచ్చుచుంద్రు విక్రమదేవా !

గాయకులలోనఁ ద్యాగయ
నాయకవరులందు గాంధి నరపతులందున్
గేయుండవైన నీవును
వే యర్చింపఁదగువారు విక్రమదేవా !

తినవలె జీవించుటకే
మనుటకుఁదినరాదుసుమ్ము మానవుఁడెప్పుడున్
ఘనమార్గ మిదియె యనుచును
వినిచిన యాతండె సుకృతి విక్రమదేవా !

విశ్వాసహీనుఁడౌచును
విశ్వంభరయందు మనెడు విజ్ఞునికంటెన్
శశ్వద్ఘన కీర్తిని గను
విశ్వాసముచూపి కుక్క విక్రమదేవా !

తనకున్నది పదిమందికి
దనియంగాఁ బంచియిచ్చి తనిసినవాఁడే
ధనవంతులందు ధన్యుఁడు
వినుతింపంబడునువాఁడె విక్రమదేవా !

సరసా లాపుని మనుజులు
పరికింతురు కోకిలట్లు భావంబలరన్
విరసప్రలాపుఁ జూతురు
విరసంబగు కాకమట్లు విక్రమదేవా !

సిరి గలిగియుండియెవ్వఁడు
దురితంబులుగలుగుపనులు దొరఁగుచునుండున్
ధర నతఁడె పుణ్యాతముఁడని
విరచింతురు కవులు స్తుతులు విక్రమదేవా !

మనవలె సంస్కృతి నిలుపఁగఁ
గనవలె సకలార్థదములు గ్రంథములెల్లన్
చనవలె ఋజుమార్గంబున
వినవలె హరికీర్తనములు విక్రమదేవా !

స్వాతంత్ర్యమె పరమార్థము
స్వాతంత్ర్యము లేనిబ్రతుకు వ్యర్థమునుమీ !

స్వాతంత్ర్యహీను మాంసము
ప్రీతిం గనదయ్య కుక్క విక్రమ దేవా !

కూడును గుడ్డయుఁ బ్రజలకుఁ
గూడంగా నేలువాఁడె గుణగణ్యుఁడగున్
కూడును గుడ్డయుఁ గూర్పని
వేడబు లేలంగనేల విక్రమ దేవా !

పనియేమి చేయకుండఁగఁ
దినియరుగునఁ గూరుచుండు దేబెల బ్రభువుల్
కనుఁగొని శిక్షింపఁగవలె
వినుతింపఁగ విజ్ఞులెల్ల విక్రమ దేవా !

పనిచేయనట్టివారికిఁ
దినుటకు హక్కుండరాదు ధీవరులెల్లన్
పనిపట్టి తిండిపోతులఁ
పెనుపొందగనీయరాదు విక్రమ దేవా !

చదువనివాఁడజ్ఞుండగుఁ
జదివింపఁగవలయు నెల్లజనములఁ బ్రభువుల్
చదువునకగు వ్యయమునకును
విదితాత్ములు వగవరాదు విక్రమ దేవా !

తనదేశముగాపాడెడు
ఘనమతులగు సైనికులను గణుతింపవలెన్
రణమరణ ముత్తమం బని
వినువీధినిఁ జాటవలయు విక్రమ దేవా !

మతవిద్వేషము పెంచెడు
నతనిని దొరతనమువార లణఁచగవలయున్
మతమన దేశం బేయని
వితతోక్తులఁ జాటవలయు విక్రమదేవా !

తన దేశంబున బ్రతుకుచుఁ
దన దేశపుఁ గూడుదినుచుఁ దన కెసరిడఁగా
మనమున నెంచెడువారిని
వినినంతనె చీల్పవలయు విక్రమదేవా !

జీతములు గొనుచు లంచము
లాతత ధైర్యంబుతోడ నందెడివారిన్
జాతీయు లెల్ల మెచ్చఁగ
వేతఱిగిన నఘము రాదు విక్రమదేవా !

దొరతనమును గికురించుచు
సరకుల రెట్టింపుధరకుఁ జాటుననమ్మే
మెఱకుల నురికర్పించినఁ
వెఱవారికి బుద్ధివచ్చు విక్రమదేవా !

బొడ్డున మానికముండిన
బిడ్డలఁ గనినారమనుచు వీఁగెడివారిన్
దొడ్డయని పొగడఁగూడదు
విడ్డూరపు పలుకు లవర విక్రమదేవా !

ప్రజ్ఞావంతుఁడ ననుచును
అజ్ఞుల దరిఁజేర్చి యర్థమార్జించెడి య

ల్పజ్ఞుల శిక్షింపఁగవలె
విజ్ఞతతో దొరతనంబు విక్రమదేవా!

ప్రజచే నెన్నికగాని మును
ప్రజలకు వ్యతిరేకముగను బ్రభుతను నెఱపన్
ఋజుమార్గ ముడిగి నడచెడు
విజాతి మనుజు విడువ వలె విక్రమదేవా!

దేశమె స్వర్గము మోక్షము
దేశమె సర్వస్వమగుట దేశముకొఱకై
దేశీయులు త్యాగము నా
వేశముతోఁ జేయవలయు విక్రమదేవా!

ఒరుఁబోషింపక పారిపునఁ గాశింపక
కరము శరీరంబు వంచి కష్టార్జితమే
పరమాన్నమంచు బ్రతికెడు
వెరవరి నెన్నంగవలయు విక్రమదేవా!

ఉఱుమెడు మేఘము వర్షము
కురియనియ ట్లధమ జనుఁడు కొదుగక వదరున్
కురిసెడు మేఘము పోలిక
విరివిగ నిడు విశ్వదాత విక్రమదేవా!

ధనవంతుల రక్షించుటె
తనవిధియని యెంచి పేదతనమును బాపన్
బనిగొననిదొరతనంబును
వినుతింపరు శాస్త్రవిదులు విక్రమదేవా!

తన నడవడి కనువారల
కును మోదముగూర్చునట్టి కోవిదు నడులే
జనముల మనముల కెక్కును
వినవొల్లరు పెఱలనుడులు విక్రమదేవా!

జాతిద్వేషము చూపెడు
నీతివిదూరులపొగ రది నెలకొనకుండన్
ఖ్యాతిగల ప్రభుత కనుఁగొని
వే తఱిలో నణఁచవలయు విక్రమదేవా!

కాకులనుగొట్టి గ్రద్దలఁ
యాఁకలిఁ దీర్పంగ జూచుటకది నలుసైనన్
లోకానుభవములేని వి
వేకహీనత యగుఁజుమి విక్రమదేవా!

లోలోపల దొరతనములఁ
గూలంగాఁ జేయనెంచుఁ గూళలగనియున్
గూలంగఁజేయకుండుట
వేళాకోళంబయగును విక్రమదేవా!

తనమేల్బడి నేకులమున
ధనహీనతఁ జదువురాని దద్దమ్మలుగాఁ
గనుపింపని శాసనమును
బెనుపొందఁగఁజేయవలయు విక్రమదేవా!

జనములకో మినుములకో
అనుములకో బియ్యమునకో యనిశముబాదక్

కనియెడు జనములఁబో్రవక
వినుతికి నెటులెక్కుప్రభుత విక్రమదేవా!

రణవిద్యానై పుణ్యము
గణనాతీతముగ జాతి గాంచినయపుడే
మనమొందిన స్వాతంత్ర్యము
పెనుపొందును దినదినంబు విక్రమదేవా!

ప్రతిపాఠశాలసైనిక
ప్రతిబింబంబాచుఁగాి్రలు భాగ్యంబొదవన్
మతిమంతులైన మంత్రులు
వితర్కత సలుపవలయును విక్రమదేవా!

రారాజు ననెడు భావం
బేరోజునఁ గలుగకుండు నెవనికి వాఁడే
యేరోజుఁ బూజగాంచును
వీరులచేఁ బ్రజలచేత విక్రమదేవా!

తనకనులముందె యెందఱొ
తినకుండను గట్టకుండఁ దిరుగుచునుండన్
గని గననియట్టు లుండెడు
పెనుదొరతనముంటయేల విక్రమదేవా!

కనకమునకుఁగల విలువను
తృణతుల్యముచేసినపుడె యెల్లజనంబుల్
తినకుండ గడ్డి; సుఖులై
వినయంబున మెలఁగఁగలరు విక్రమదేవా!

దొరతనపు పట్టమొందని
వెరవిఁడి వెజ్జులనుబట్టి విధికృత్యముగాఁ
జెఱనుంచుదొరతనంబది
విరివిగఁ గాపాడు ప్రజల విక్రమ దేవా !

పండించుట యమ్ముటయును
రెండును నొక్కరుఁడెచేయురీతిని దీర్పన్
దండిగఁజేసిన ప్రభుతయె
వెండియు నధికార మొందు విక్రమ దేవా !

పరదాస్యము గావింపక
కరిసనమును జేసికొనుచుఁగాలము గడిపే
నరుఁడే వరుఁడగునన్నటఁ
బెఱవారలు దాసులన్న విక్రమ దేవా !

తనధనమది శ్రమజీవుల
తనురక్తంబనుచు నెఱఁగి తనయులుబోలెన్
గని వారలఁ; దనియింపని
పినుఁగులు నశియింతురయ్య విక్రమ దేవా !

జారులకును జోరులకును
దారియని కట్టుబాట్లు దాఁజేయవలెన్
ధీరతతో దొరతనమదె
వీరత్వంబనఁగఁ బడును విక్రమ దేవా !

ప్రజలే దొరతన మగుటను
కుజనులు మోసంబుచేయకుండఁగ వారల్

నిజ మెఱిఁగి తఱిన తెలిపిన
విజయంబును గాంచుఁ బ్రభుత విక్రమ దేవా !

జనవాణియె దొరతన మగు
జనవాణిని మీఱి ముందుచన లే దెదియున్
జనవాక్యము క ర్తవ్యము
వినుతింగను ప్రభుత కెపుడు విక్రమ దేవా !

పదవులకుఁ బ్రాఁకులాడెడు
సదయాత్ముఁడు ప్రజలకష్ట మరయం డెపుడున్,
పదవులఁ గోరఁడు సదయుఁడు
విదితం బిది యెల్లయెడల విక్రమ దేవా !

సభలనుచును సంఘంబని
రభసంబున ధనములాగి ప్రజలొద్ద సదా
శుభములు గూర్పక కుజనుఁడు
విభుతను ధ్యానొందఁజూచు విక్రమ దేవా !

బూటకములాడి ప్రజలను
ఓటులకై బుజ్జగించి యొంది పదంబున్
టాటోటుచేసి వారల
వేఁటాడును కుజనుఁడౌర ! విక్రమ దేవా !

అన్నమునకు నల్లాడెడు
పిన్నలఁ బెద్దలను గాంచి పెంచెడు నదియే
మెన్నఁబడు దొరతనంబని
విన్నాణులచేత నెపుడు విక్రమ దేవా !

ఏదేశపు వీధులలో
పాదమునకు నంగలార్చు జనములు గలరో
యాదేశవిభుత యెప్పుడో
పేదలచేఁ గూల్పఁబడును విక్రమదేవా!

మనుజునకు రోజుఁగడవఁగ
దినదినమును వలయునట్టి దినుసులనెల్లన్
మనసుగల ప్రభుత తప్పక
వినిమయముగ నీయవలయు విక్రమదేవా!

కులముల పేరిట నెవ్వఁడు
కులుకంగాఁజూచు; వాఁడె కూలంబడుఁజూ!
కులతత్త్వరహితుఁ డొక్కఁడె
వెలుఁగొందును దేశమందు విక్రమదేవా!

హృద్యమగు చదువునేర్చియు
ఉద్యోగంబనెడుపేర నొరులకు సేవన్
సద్యఃఫలాశఁ జేసెడు
విద్యార్థికి మెచ్చురాదు విక్రమదేవా!

తిరియుట మరణముకంటెను
వరమని తామాత్మనెఱిఁగి పండితవర్యుల్
కరిసనము వర్తకంబునొ
వెరవునఁ జేకొంటరొప్పు విక్రమదేవా!

సింగారము గల యువతికి
బంగారపు నగలతోడఁ బనిలేదయ్యా!

మంగలముపోలు యువతికి
వెంగళు లిడ నేల నగలు విక్రమదేవా !

సంగీతము సాహిత్యము
సాంగముగా నేర్చినట్టి సత్కవి యెపుడున్
భంగములు చెందకుండఁగ
బెంగలఁబోనాడి బ్రతుకు విక్రమదేవా !

తెలివెంతయున్న నేమగు
నిలఁబడవలె ధనికునొద్ద నిర్ధనుఁడకటా !
నిలువెల్లఁ జెమటపట్టఁగ
వెలవెలనగు మోముతోడ విక్రమదేవా !

ధనవంతుఁడు తనయూరనె
కొనియాడఁగఁ బడునుగాని కోవిదుఁడెందున్
గొనియాడఁ బడునుగావున
వినుతింపఁగ వలయువాని విక్రమదేవా !

ధనమూలము జగమగుటను
ధనమార్జన చేయుశక్తి తప్పకవలయున్
ధనహీను తెలివితేటలు
విని కని మెచ్చరు కదన్న విక్రమదేవా !

మరియాదకుఁ బడిచచ్చెడి
నరులకు నన్నంబులేదు నటనాన్వితులై
తిరిగెడువారికి నన్నము
విరించి యిడుచెంతవింత విక్రమదేవా !

పరమార్థము నర్థించెను
వరకవి పొగడందు సుమ్ము వందివిధానన్
నరమాత్రుండైన వానిని
నెరవరివగు నిన్నుంబోలె విక్రమదేవా!

కొలనులలోఁ గాల్వలలో
మలముల విష్ఠించుపట్టి మనుజాధములన్
నిలువునఁ జీల్చిన ప్రభువను
వెల హెచ్చును కీర్తి హెచ్చు విక్రమదేవా!

సైరికుఁడే సకల జీవుల
ధారణ కాధారమగుటఁ దత్సైరికునిన్
గారించెను సద్యోగులఁ
బేరుంచక మాపవలయు విక్రమదేవా!

వరిచేలు పండి వ్రాలుట
పరికించుటకంటె వేఱె భాగ్యము గలదా!
వరిచేలె కావ్యసృష్టికి
విరివగు సామగ్రి సుమ్ము విక్రమదేవా!

మరణమున కెవఁడు వెఱవఁడో
దురమున జయమొందు నతఁడె దోర్బలశక్తిన్
మరణమన వెఱచునాతఁడు
పెరటింటనె క్రుళ్ళిచచ్చుఁ; విక్రమదేవా!

పనిలేక దారిబత్తెముఁ
గొనఁదిరిగెడు మంతురులను గొబ్బున జనముల్

గనిపట్టి కూలఁదోత్రితురు
వెనుకటి పదవాసఁజేయ విక్రమదేవా!

అధికారులతోఁ బ్రాపక
మధికముగాఁ గలదటంచు నాడుచుఁ బ్రజలన్
ఉదధిని ముంచెదు వారల
విధిగా శిక్షింపవలయు విక్రమదేవా!

మోఁకాలు దిగని పంచెను
లోకుల వంచింపఁదాల్చు లోభులకగునా?
లోకైకనాయకుండు వి
వేకియునగుఁ గాంధిసాటి విక్రమదేవా!

చెల్లుబడి కలిగియుండియుఁ
బ్రల్లదములు పలుకకుండు ప్రజ్ఞాధనులన్
ఎల్లెడలను బూజింతురు
భిల్లాదులు గూడవేడ్క విక్రమదేవా!

తనభూమియుఁ దనవేషము
తనభాషయు మిన్నలనుచుఁ దలఁచెడు వాఁడే
గణనీయదేశభక్తుఁడు
వినసొంపగు వానిచరిత విక్రమదేవా!

పగ తగ నణఁచిన మనుజుఁడు
జగతీతలమందుఁ దాను జయమును గాంచు
పగ తగ నణఁచని మనుజుఁడు
విగతాసుండగును వేగ విక్రమదేవా!

గుణ కర్మంబులఁ బట్టియె
కనుఁగొన వర్ణములు గలిగెఁ గావున విబుధుల్
గుణవంతుఁడె సత్కులుఁడని
వినయంబున మ్రొక్కవలెను విక్రమదేవా!

పురుషులతోఁ దుల్యంబుగ
గఱితలకును హక్కు గలుగు కాలమునందే
సురుచిరమై కాఁపురమున
విరఁజిమ్మఁగఁ బడును గళలు విక్రమదేవా!

హరిపూజ యతిథిపూజయు
సరసాలాపిని సుగృహము శాస్త్రజ్ఞసుతుల్
వరపుళ్ళు వలయు ధనమును
వెరఁగుగఁ గలవాఁడె సుకృతి విక్రమదేవా!

నెఱికురులును జిఱునవ్వును
గరువపుఁ జందమ్ము గలిగి కలకలలాడే
గఱితలు గల సౌధమ్ములు
విరఁజిమ్మును శోభనములు విక్రమదేవా!

ఇంటికి నందము పిల్లలు
కంటికి నందమ్ము సుమ్ము కాటుక యిమ్మటే
పంటికి నందము తెలుపే
వింటకు నందమ్ము గీతి విక్రమదేవా!

కోడండ్రఁ గూఁతులట్టులు
చూడంగల యత్తలకును సుఖములు పలు చే

కూడును గావునఁ బ్రేముడి
వీడక యట్టు చూడవలయు విక్రమదేవా!

కొడుకులకును కూఁతులకును
విడిముడి సమభాగ మిడెడు విధమున ప్రభువుల్
వడి శాసనంబు చేసిన
బెడదలు పెండ్లిండ్ల నణఁగు విక్రమదేవా!

పాఁడియుఁ బంటయుఁ గలిగిన
వాఁడే ధనవంతుఁడయ్యె వసుధాస్థలిలోఁ
బాఁడికిఁ బంటకు నొరులను
వేఁడుటయే లేకబ్రతుకు విక్రమదేవా!

కొని తినెడు కూరగాయలు
కొని త్రావెడు పాలు నద్దెకొంపను సతమున్
కని సంతసించువారలు
వినుతికిఁ బాత్రములుగారు విక్రమదేవా!

తన పెరటి కూరగాయలు
తన యావుల పాలుపెరుఁగు తనదగు నింటన్
తిని త్రావి తనియువాఁడే
వినుతింపందగిన వాఁడు విక్రమదేవా!

పుట్టుకయే గరువమునకుఁ
బుట్టిల్లని తలఁపరాదు పుట్టదె జలధిన్
గిట్టించు కాలకూటము
[illegible] విక్రమదేవా!

నోరెఱుఁగని పసిపాపల
గారామున బుద్ధిగఱపఁగావలెఁ గానీ
కారాలును మిరియాలును
పేరొందఁగ నూఱరాదు విక్రమదేవా!

పరధనముల కాసింపక
పరకాంతలఁ దల్లులట్లు పరికించి మదిన్
తిరిగెడు నాతఁడె సత్కవి
విరివిగ స్తుతియింత్రు వాని విక్రమదేవా!

అదురును బెదురును గాంచక
కుదురుగ బ్రతుకంగవచ్చుఁ గువలయమందున్
పదిమందికి నోడఁబాటగు
విధమునఁ జరియించునతఁడు విక్రమదేవా!

ధనమున్న లేక యున్నను
మనమునఁ బరితృప్తియున్న మనుజుఁడె ధనియౌ
ధనముండి తృప్తిగలుగమి
వినఁబడుగా లేమి యంచు విక్రమదేవా!

పరమాణుశక్తి గాంచిన
పరమార్థము జనుల జంపఁ బొల్పుసుటోకో
పరమాణురూపుఁ గృష్ణుని
వెరవునఁ గనుఁగొనుటగాని విక్రమదేవా!

పదముల కర్థము భావము
[illegible]

మదిఁ గనికరంబు చూపని
విదితాత్ముల మెత్తు రెవరు విక్రమదేవా!

చదువెంత కలిగియుండిన
సదయాత్ముఁడు కానివాఁడు జనుఁడనఁబడు నే
హృదయంబు లేక పదుగుర
బెదరించెడువాఁడు పశువు విక్రమదేవా!

కాలము విలువను దెలిసిన
పాలకు పరిపాలనమున భద్రము లొదవున్
కాలంబు విలువ నెఱుఁగని
బేలను దెగనాడు జనము విక్రమదేవా!

జినునివలె జనుల దుఃఖము
కనిపాపఁగ నెంచువాఁడె కాంచు యశంబున్
జనతాదుఃఖము వాపని
పెనుపరితన మేటికయ్య విక్రమదేవా!

మృత్యువువలె భీకరమై
నిత్యము దుర్బుద్ధితోడ నెగడెడు ప్రభుతన్
సత్యాగ్రహ సాధనమున
భృత్యుండును గూడఁ గెలుచు విక్రమదేవా!

తన నమ్మిన సత్యార్థము
తనువుండినయంతదాఁక ధైర్యముతోడన్
జనములకు వినుచు నాతఁడు
పెనుపొందును విజయమొందు విక్రమదేవా!

హిందూశబ్దము కర్థము
ఎందు నహింసాపరుఁడగు టెఱిఁగిన యతఁడే
యందఱను జూచి తనవలె
విందయి సత్కీర్తి గాంచు విక్రమదేవా!

ఏసుక్రీస్తు విధంబున
ఈసును విడనాడి నతఁడె యెల్లెడ జయమున్
చేసేతగాంచి ప్రజలను
వేసరకుండంగఁ గాచు విక్రమదేవా!

పరమార్థచింత యుండిన
పరమాత్ముని మనసునందె పరికింప నగున్
గుఱుతెఱిఁగి కాంచువారలు
విరజాజిని తేఁటులట్లు విక్రమదేవా!

సమయోచిత చాతుర్యము
అమలినమతిఁ జూపువారికగు గార్యంబుల్
సమయోచిత చాతుర్యము
విమతులకలవడుట యరిది విక్రమదేవా!

ఏ దేశపు విద్యార్థుల
కా దేశపు భాషలోనె యఖిలార్థంబుల్
ఆ దేశికులే కఱపినఁ
బేదఱికపు భావమడఁగు విక్రమదేవా!

పనిలేక యొరుల యింటికిఁ
జనరా దెన్నండు గూడఁ జనవెంతున్నన్

వినరాని దొసఁగు మాటలు
వినఁజేయఁగరాదు సుమ్ము విక్రమదేవా!

మిన్నెక్కఁబడినఁ గానీ
కన్నెక్కఁగఁబడినఁగాని కాఁబునటంచున్
తెన్నరసి స్వానుభవమున
విన్నాణులు పలుకుచుంద్రు విక్రమదేవా!

కృతిపతి యెవ్వఁడగునో
క్షితిపై నాతండె బ్రతుకు స్థిరతర కీర్తిన్
కృతిపతులు కాని వారల
పితరులు తరియింపరయ్య విక్రమదేవా!

సానం బెట్టిన రత్నము
దానము నొనరించి నట్టి దాతయు కృశతన్
బూనియె జగతీ స్థలమున
వీనున్ మిగులంగలారు విక్రమదేవా!

చనినారెందఱో రాజులు
చనె నెన్నియొ రాజ్యములును క్షణకాలములో
నినుఁబోలెఁ గీర్తిఁగాంచిన
వినయాన్వితు లరుదుగాని విక్రమదేవా!

ఆఱింటిఁ గెలిచి యేడిటిఁ
జేరంగానీక దరికిఁ జిత్తమునందున్
శ్రీరాము నిలిపి కొలుచుట
వేరలు నీ సములు గారు విక్రమదేవా!

ఎంతటి శత్రువునైనను
శాంతముతోఁ బలుకరించి సాయంబిడఁగా
స్వాంతమునఁ దలఁచుచుందువు
వింతగదా నీదుచరిత విక్రమదేవా!

చాలీచాలని బట్టను
వాలాయము దాల్చి నీవు పరిభుతాగరిమన్
లీలకునైనను జూపక
పేలవముగఁ గంటి సిరిని విక్రమదేవా!

చిఱుతిండులు తినవొల్లక
యెఱచిని భుజియింపఁబోక యిహసౌఖ్యంబుల్
పొరపాటునైనఁ గోరక
విరచింతువు సుకృతులెన్నొ విక్రమదేవా!

ఏనుఁగులును గుఱ్ఱములును
మానితయానములు నున్న మక్కువ నెప్పుడున్
వానిపయి నరుగ నొల్లవు
వేనికిఁ గల దీనిరీహ విక్రమదేవా!

కవివై విద్వాంసుఁడవై
భువికిని నాయకుఁడ వగుచు భూపతులందున్
అవునవెడి రాజవీవని
వివరింపం బడితివయ్య విక్రమదేవా!

విజయమ్ము విశ్వదాతా!
విజయమ్ము కళాప్రపూర్ణ! విజయము సుకవీ!

విజయమ్ము తెలుఁగు రాణ్ణుత!
విజయమ్ము మహానుభావ! విక్రమదేవా!

అష్టోత్తర శతముల్ సం
తుష్టిని నీకొసఁగినాఁడ, తుహినాంశురవుల్
సృష్టిఁ గలయంతకాలము
విష్టపమున నీవు నిలువ; విక్రమదేవా!

కవిరాజు త్వదీయాస్థా
నవరుఁడు పెనుమెచ్చ సత్యనారాయణ రా
జవు నన సుకవులు పరిజకై
వివరించి లిఖించె దీని విక్రమదేవా!

దశరథసుతభక్తా! ధర్మచింతానుసక్తా!
విశదవిభవకాశీ! విశ్వకళ్యాణరాశీ!
అశమితహితకారీ! ఆర్యమార్గానుసారీ!
నిశితమతివిభాసీ! నిత్యసంపద్విలాసీ!

***

# జ్ఞానాంజలి.

శ్రీ జయపుర రాజ్య రమా
రాజత్ప్రతిభావిశేష రంజితచరితా!
ధీజన వందిత పండిత
రాజనుతా! రామకృష్ణ ప్రస్తుతకృష్ణా!

అఖిల లోకవాసుఁ డైనట్టి శ్రీకృష్ణు
భక్తి మ్రొక్కి నరుఁడు ముక్తిఁగాంచు
మూఢమతులు దీని మూలంబు దెలియరు
కలిత దివ్యతేజ! తెలుఁగురాజ!

ఆలిమాట విన్న నధ్వాన మగునెల్ల
నాలిమాట వినమి నంతెయగును
గాన మనుజుఁడేమి కావింపఁగాలేఁడు
కలిత దివ్యతేజ! తెలుఁగురాజ!

లోకమెల్ల నుత్త కాకుల మూఁకరా
లోకమునకు నెపుడు లొంగబోఁకు
లొంగి తిరుగు మెపుడు లోకేశునకు నీవు
కలిత దివ్యతేజ! తెలుఁగురాజ!

జగతిలోన నున్న జాతుల నన్నింటి
నమ్మవచ్చుఁ గాని నమ్మరాదు
కూటసాక్ష్య మిచ్చు కూళజాతిని బ్రీతి ॥క॥

వృత్తిలేకయున్న రిత్తగా నుండుము
ప్లీడరీకి నెప్పుడు వెడలఁబోకు
పాపబోధచేసి బ్రతుకంగ నేలరా ॥క॥

భరతదేశమందు భార్య తా భర్తకు
యంత్రిమట్టు లుండె నంతెగాని
కష్టసుఖములందు గాదయాసాఁబాలు ॥క॥

మంచివారలైన మంత్రుల చుట్టును
జెడ్డవారలెప్పుడుఁ జేరియుంద్రు
మావిచెట్టుచుట్టు మలయు కంచెలు వోలె ॥క॥

ఎంతధనము కలిగి యొసఁగునో మనుజుండు
అంతమంది యుసురు లతఁడు దీసెఁ
జిన్నచేపలెన్నొ చెడఁబెద్ద దగుచేప ॥క॥

కవులు పడెడు శ్రమము కవులకే తెలియును
గవులుగానివారి కవగతంబె ?
బిడ్డగనెడుబాధ గొడ్డురా లెఱుఁగునా ? ॥క॥

చెమటయూడ్చి రైతు చేలను బండింపఁ
జూచుచుంద్రు దొరలు చూఱఁగొనఁగఁ
దేంట్లు తేనెఁగూర్పఁ దినఁజూచు నెలుఁగులు ॥క॥

స్త్రీల బుద్ధులెఱిఁగి స్త్రీలను మెప్పింప
రతిరహస్యకర్త చతురుఁడగునె ?

కోరిరత్న మెపుడుఁ గొనువారి వెదకదు
కొనెడువాఁడె వెదకుఁ గోరిదాని
గొప్పవారిఁజేరి కొల్తురా రీతిని ॥క॥

పనికిరానివాఁడె పట్టభద్రుండగుఁ
బూర్వపుణ్యమున్నఁ బుడమియందు
దిబ్బమీఁది రాయి దేవుండు గాఁడొకో ॥క॥

వస్తువాహనముల భార్యల బిడ్డలఁ
జూచినరులు మరియు చంద్రుగాని
చూపు కందరాని సూక్ష్మునిఁ గనలేరు ॥క॥

వేష భాషలేల వెలుఁగొందు జ్ఞానికి
వేషభాషలడుగు వెఱ్ఱివాఁడు
పరమ హంసయేమి పడసెరా వేషాలు ॥క॥

ధరను గల్గుజనులు తనడబ్బు వల్లనే
బ్రితుకుచుండి రనును బామరుండు
జంతుజాల మెవఁడు సాఁకుచు నుండెరా ॥క॥

వెఱ్ఱివానివోలె వెలుఁగొందు సుజ్ఞాని
బాలునట్లు తిరుగు బాటలందు
గాలిసోఁకినట్లు గంతుల నిడుచుండు ॥క॥

ఇతరు దయనుగోరు నతనికి భయముండు
స్వేచ్ఛతోడ బ్రతికి చెలఁగరాదె ?
యితరు నేల కొలువ నీశ్వరుఁడావాఁడు ॥క॥

నీదు దోషమెఱిఁగి నెగడిన పిమ్మట
నెదిరి దోషము వ్యంచు మీవు
దోషరహితుఁ డొక్కఁ తోయజాక్షుఁడనుమ్ము ॥క॥

పెద్దవారమంచు విఱ్ఱవీఁగుచునుంద్రు
పెద్దపదవిగలుగు పెద్దలెల్లఁ
బ్రజల సేవచేయు వాఁడొక్కఁడే పెద్ద ॥క॥

తనదు బాగుఁగోరి తత్త్వంబుఁబోధించు
గురువు తిట్టవచ్చుఁ గొట్టవచ్చుఁ
దల్లిబుగ్గగిల్లి త్రాగింపదా యుగ్గు ॥క॥

ఒకరి మెచ్చుఁగోరి యొనరింప కేపని
నాత్మమెచ్చుకొన్న దాచరింపు
మాత్మసాక్షి కన్న నన్యంబు లేదురా ॥క॥

మేడలందునున్న మేలైన గుణమేమి ?
గుడిసెలందె నీతి గుదిరియుండుఁ
బేరు పెద్దదైన వెలుఁగుండఁగాఁబోదు ॥క॥

జ్ఞానియెపుడు దన్ను జ్ఞానిగాఁ దలఁపఁడు
చిన్నవానికన్నఁ జిన్న ననును
అందుఁగలుగుమర్మ మారసి తిరుగుమా ॥క॥

ఉర్వినొకఁడు నీకు నుపకారమొనరింపఁ
జచ్చుదాఁక వాని జపము సలుపు
చిన్ననాఁటి నీరు చెలఁగి కొబ్బరియీదె ॥క॥

పంచకావ్యములను బఠియించు మాత్రాన
పండితుండుగాఁడు పంచజనుఁడు
భాగవతుఁడెచుమ్ము పండితుఁడనఁ బ్బొ ॥క॥

కోమటింట నెపుడు గోనఁబోకుము మఱువిడి
యప్పుచేసి తినకు పప్పుఁగూడు
పగటివేళ నెపుడు పన్నుండఁబోకుమీ ॥క॥

ఎదుటవాని డెంద మెరియంగ నెన్నండు
బ్రల్లదంపుఁ బల్కు పల్కఁబోకు
పల్కఁబడినచుమ్ము బాగోగు లాడఁగూడదు ॥క॥

పాలికాఁపు వానిఁ బనిచెప్పి కారించి
జీత మిచ్చు వేళఁ జేరఁ జీరి
పిచ్చకుంచమునను బెట్టకు ధాన్యంబు ॥క॥

పాలలోన నీళ్ళు పడఁబోసి యొరులకు
నమ్మఁబోకు మయ్య నమ్మ రెవరుఁ
బిల్లి కనులుమూసి పీల్చిన నేమాయె ॥క॥

పంచముండు వాఁడు పచ్చితురక వీఁడు
అనెడు భేదబుద్ధి నరయఁబోకు
మనుజులెల్ల విష్ణు తనయులే యగుఁజుమీ ॥క॥

జీవహింస యన్నఁ జేఁపల మృగములఁ
దినుచు నుంటగాదు దీనజనుల
కప్పు లిచ్చి వారి నణఁచుటయేచుమీ ॥క॥

న్గాలు వేదములను నమలి మ్రింగంగ వచ్చు
శాస్త్రజాలమెల్లఁ జదువ వచ్చుఁ
గల్లలాడకుండ నెళ్ళుటే కష్టంబు ॥క॥

జగతిలోన నున్న జనుల చుట్టఱికంబు
ప్రేమవల్లఁ గాదె పెంపుసెందుఁ
బ్రేమలేకయున్న వేఱేమి లేదురా ॥క॥

తెలిసినట్టి నరుని దెలియఁ జెప్పంగ వలె
మూర్ఖునకును నేల బోధచేయ
దృష్టియున్నవాఁడె దీపంబుగాంక్షించు ॥క॥

పరుల ధనము విద్య పరికించి యెన్నండు
నీను చెందకయ్య యించుకైన
నీకు లేనిదాని నిందింపఁ బోకుమీ ॥క॥

పిన్నతనమునందె పెండ్లాడఁ బోకుమా
విద్యనాశమొందు విఱుగు గుణము
గుణము విఱిగెనేని గూర్పంగారాదురా ॥క॥

ఎల్ల వేళలందు నీవు సంతోషాన
నగు మొగంబుతోడ నెగడవలయు
సంతసంబె సుమ్ము సద్బ్రహ్మరూపంబు ॥క॥

చాకివాని ఋణము లోకంబులోవేఁడు
దీర్చలేఁడుగానఁ దిట్టకతనిఁ
జాకి లేక యున్నఁ జాకిరీకెవఁడురా ? ॥క॥

కడుపులోనఁ బెట్టి కాపాడి పిమ్మటఁ
జదువుసంధ్యలిచ్చి సాఁకు నట్టి
తల్లికంటె వేఱు దైవంబులేదురా ॥క॥

సత్కవిత్వమీవు సల్పఁ జాలుదువేని
రాజ్యమేల నీకు నీజ్యమేల ?
కవులు లేని జగము గాఢాంధకా గ్రస్తమిది ॥క॥

భరతదేశమందుఁ బరఁగిన పండితుల్
సహనబుద్ధి లేక సంచరింత్రు
సహనబుద్ధి లేని సంసారమించునా ॥క॥

పాఠశాలలందుఁ బఠియించు వేళలఁ
బిల్లవాండ్రు సలుపు నల్లరులకు
గురువు లెప్పుడు దాము గోపింపఁగారాదు ॥క॥

గురుని గాంచి నంత గొణఁగకు లోలోన
గురుఁడు గాఁడె బ్రతుకుఁ దెరువుచూపు
జ్ఞానదీప మిడెడు సద్గురు మ్రొక్కరా ॥క॥

కులముచేత నేను గొప్పవాఁడ నటంచుఁ
బొంగఁ బోకు మెప్పుడు క్రుంగి పోదు
గొప్పవారికెల్ల గొప్పవాఁడీశుండు ॥క॥

ఆత్మదేశమందు నాత్మీయ భాషపై
భక్తిశ్రద్ధలుంచ వలయునయ్య
దేశసేవ మించు దీక్షయొక్కటి లేదు ॥క॥

అన్యకాంత నెపుడు నరయకు కన్నెత్తి
యన్య ధనము కెపుడు నాశపడకు
ఆశలేనివాఁడె త్యాగి సుజ్ఞానియు ॥క॥

అన్నదమ్ములందు నయినచోఁ బోరాట
కోర్టు కెక్క నెపుడుఁ గోరకన్న
కోర్టుకెక్కి తేని గుల్లయౌ నిల్లెల్ల ॥క॥

పదుగు రేగునపుడు పకపకనవ్వకు
బ్రహ్మచర్యమెపుడు వదలఁబోకు
పెండ్లి కాకమున్ను వేయకు తమలంబు ॥క॥

చెడితినన్న వేళఁ జేరరుబంధువుల్
చెలిమికాఁడుపోవుచుఁ జేరఁజీరి
చెలిమిమించునట్టి శ్రీలేదుధాత్రిపై. ॥క॥

సృష్టిలోనఁగల్గు చిత్రముల్ పొడఁగాంచి
మూఢజనుఁడు ముదము పొందలేఁడు
తత్త్వమెఱుఁగువాఁడు తన్మయత్వముఁ జెందు ॥క॥

పనులుచేయునపుడు బాధలకోర్వరా
తొందరనుఁ జెంది దేని జెఱుపఁబోకు
పేదవానినెపుడు ప్రేమించిచూడురా ॥క॥

ముసలివారిఁగాంచి మొగము చిట్లింపకు
చెడ్డవారితోడఁ జేరఁబోకు
తరుణివచ్చినంత తల్లినిదూఱకు ॥క॥

రాజసేవఁజేసి బ్రతుకంగఁ గోరకు
స్వేచ్ఛతోడ బ్రతుకు వెరవుసూఁడు
మితకమైన నేఁత పుట్టముతే గట్టు ॥క॥

సతము లోకమెఱిఁగి చరియించువారికి
గురువుతోడ నేమి ఫలము గలుగు
లోకమెఱిఁగి తేని లోటేమిరా నీకు ॥క॥

మింటినెగురు పక్షి నంటి పట్టగవచ్చుఁ
బట్టవచ్చు మత్స్య వ్యాఘ్రములను
బట్టరాదు నుమ్ము పడఁతుల భావంబు ॥క॥

కట్టఁగుడువ నీకుఁ గలిగినం జాలురా
యధిక ధనముకొఱకు నాశపడకు
మధిక సంచయేచ్ఛ యర్థంబు గాదురా ॥క॥

లోభమునకు నెపుడు లొంగఁగాఁబోకుము
లోభమునను మించు లోచ్చులేదు
లోభివాని మెఱచి రోయును గాకులు ॥క॥

కామమునకు సతము గాకుమీ యగ్గంబు
కాముకుండు మోక్షగామి కాఁడు
కామమునకు మించు గడిదొంగ లేఁడురా ॥క॥

శ్రద్ధతోడ నీవు చదివెడు వేళను
దిక్కుడుంగములకుఁ దిరుగఁబోకు
దెసలవంకఁ జూడ దీక్షకు భంగమౌ ॥క॥

వింటిమిత్రుఁ గాంచి వికసించుఁ బద్మంబు
చంద్రుఁగాంచి కలువ సంతసించు
మైత్రి గలుగు వారి మాదిరి యిట్లుండు ॥క॥

క్షణములోనఁ బోవు సంక్రాంతి మబ్బుల
ట్లల్పజనుల యుబ్బు లణఁగుచుండు
నల్పబుద్ధివాని కజ్ఞాన మెచ్చురా ॥క॥

ప్రొద్దుపోవకుండ నిద్దుర మేల్కాంచి
నిత్యకృత్యములను నెఱపి పిదప
దేవదేవుపూజ దీక్షతోఁ జేయుమా ॥క॥

పంటిలోన నుండు పలలంబు బాధయు
నింటిలోన సలుపు నింతిపోరు
ననుభవించునాతఁ డవనిపై లేఁడురా ॥క॥

చెడ్డవారిఁ గూడి చెరలాడ కెన్నండు
నిన్నుఁ గూడ నట్లె యెన్నుచుంద్రు
తాటిక్రిందఁ బాలు త్రావినఁ గల్లండ్రు ॥క॥

పదము గణము వెదకి పద్యంబు వ్రాసెడు
వాఁడు సుకవిగాఁడు వసుధయందు
యుద్ధమందుఁ బొఱు యోధుండు యోధుఁడా ॥క॥

చంద్రుఁడొకఁడె చాలు సమయింపఁ జీకటుల్
చుక్కలెన్నియున్న లెక్క యేమి
కులము నుద్ధరించు కొడుకొక్కఁడే చాలు ॥క॥

కఱ్ఱయందు లేఁడు కటికి ఱాతను లేఁడు
మట్టియందు లేఁడు మాధవుండు
భావమందె కలఁడు పరికించి చూడరా ॥క॥

అఱుగకున్న వానికన్నంబు విషమగు
జదువకున్న యగును జదువె విషము
ముసలివాని పాల ముద్దియ విషమగు ॥క॥

న్యాయబుద్ధితోడ నార్జించు ధనమది
కొంచెమైనఁగాని కోటిసేయుఁ
గుటిలబుద్ధితోడఁ గూర్చకు ధనమును ॥క॥

కట్టరాదు సుమ్ము కడుపెద్ద లోఁగిలి
పెద్దయెల్లఁ గూడ విలువరాదు
పెద్దపెదవిదానిఁ బెండ్లాడరాదురా ॥క॥

ఇతర కాంతతోడ నేకాంత మాడకు
పాముతోడ నాడఁ బరుగులిడకు
పనులు సేయకుండ బద్ధకింపఁగఁబోకు ॥క॥

కొట్టఁబోకుమెప్పుడు మట్టమధ్యాహ్నంబు
మేఁతమేయకుండ మెలఁగునెడ్లఁ
బసర ముసురనినఁ బండదురా భూమి ॥క॥

కులము కులమటంచుఁ గొందఱు మూర్ఖులు
క్రుమ్ములాడుచుండ్రు కులము కొఱకు
గుణము గలిగెనేని కులముతోఁ బనియేమి ॥క॥

విరసుఁడై నవాని వియ్యంబు నందకు
శక్తిమీఱునట్టి సారె యిడకు
అప్పుపాలఁబడ్డ నావల గతిలేదు ||క||

పాలిడ కెగఁజేపు పసరంబు బాదకు
దానిబిడ్డపాలు దాఁచునద్ది
బిడ్డమీఁదఁ బ్రేమ వేరలకుండదు ||క||

చదువుతోడి పాటు సాములు నేర్వరా
సాము నేర్వకున్న సాగ దెదియు
సామువల్లఁ గాదె సాఁకుట దేశంబు ||క||

బలము లావు నేల ప్రజ్ఞయే యుండినఁ
గల జగంబు లెల్ల గెలువవచ్చుఁ
జంపె నందజాతిఁ జాణక్యుఁ డొక్కఁడె ||క||

తల్లికడుపునుండి తాఁబుట్టునప్పుడు
జ్యేష్ఠుఁడౌచు బుట్ట స్వేచ్ఛ లేదు
స్వేచ్ఛలేని జన్మ చెందఁగా నేలరా ||క||

ప్రియునిఁగాంచఁగానె వెలఁదికి డెందంబు
ఆర్ద్రమగునుగాదె హారుసమునను
జంద్రుకరము సోఁక స్రవియించు నెలరాయి ||క||

క్రూరుఁ డెవ్వఁడేని గొట్టఁగా వచ్చిన
శాంతభావమునన సరిది చెప్పు
శాంతిచేతఁ గాదె జయమొందె క్రైస్తువు ||క||

కన్నె నమ్మువాఁడు సన్న మమ్మెడువాఁడు
కన్నగాఁడు మఱియు కటికివాఁడు
నుర్విమీఁద జూడ నొక్కటే తెగ సుమీ ॥క॥

పద్యమల్లువాని భావంబు చందంబు
హృద్యపఱచు నున్న నించు కవిత
అద్దమందు దీప్తినందు దీపంబట్లు ॥క॥

సత్కవిత్వ మొకటి సంగీత మొక్కటి
నేర్చుకొన్నరావు నిక్కవముగఁ
బూర్వజన్మ సుకృతమునసె యవి లభించు ॥క॥

ఒకని మెప్పుఁగోరి యొనరింపఁగాఁబోఁడు
కావ్య మొక్కటైనఁ గవివరుండు
కోకిలంబు వేనికొఱకు హాయిగఁ బాడు ॥క॥

చాఁపక్రింది నీళ్ళచందాన కాలంబు
తెలియ రాకయుండఁ దిరిగి చనును
గాన వేగిరంబ కావింపు హరిపూజ ॥క॥

ఓపికుండఁగానె యొనరింపు పనులెల్ల
వెనుక నేది కూడ మిణుకలేవు
దీపముండఁగానె దిద్దుకో యిల్లెల్ల ॥క॥

పని యొకండు నీవు పానరించుటకు మున్నె
చెడకయుండఁ జూచి చేసికొనుము
చేయి కాలినంత జెట్లాగు ఫేలబా ॥క॥

ఒడికిఁబోవు ముందె పాఠాలు వల్లించు
మిల్లు గాలునప్పుడు చల్లార్పఁగా దాని
నూయి నెవ్వఁడేని దీయఁగా నెంచునా ||క||

పంటిలోన విషము పాముస కుండును
గంటిలోన విషము జ్ఞాతికుండు
నొంటినిండ విషమె యుండును ఖలునకు ||క||

తల్లివోలెఁ గాచుఁ దండ్రివోలె హితంబు
గఱపు భార్యవోలెఁ గరఁచు మనసు
యశము నించు దెసల ననిశంబు సద్విద్య ||క||

సభలలోనఁ బలుకు సమయానఁ బురుషుండు
బెదురు నదురులేక వెలుఁగవలయు
నదురు బెదురులున్న నపహాస్య మగుఁజుమీ ||క||

దేశములను దిరిగి దీపించుఁ బురుషుండు;
దీప్తి హానిచెందుఁ దిరిగి వనిత;
దేశమెఱుఁగకున్న ధీ యెట్లు పెంపొందు ||క||

ఖ్యాతిగాంచు నరుఁడు కష్టాల వల్లనె
అఱుగఁదీయ నించు మలయజంబు
పుటము పెట్టుకోలఁది పుత్తడి వెలుఁగొందు ||క||

మానవాళి యెల్ల మాధవుసంతుగా
తలఁచువాఁడె విప్రతల్లజుండు
రణముచేయువాఁడె రాచవాఁడగుఁజుమీ ||క||

రోగమున్న యప్పుడు భోగంబుఁ గోరకు
చిత్తశుద్ధితోడ శివుని గొలుము
ఉత్తచేతితోడ నుద్యోగిఁ జూడకు ॥క॥

ఏటినీటి కెదుర నీదఁగాఁ బోకుము
కూడులేక యుంట మాఁషఁబోకు
పాడలేకయున్నఁ బ్రిక్కలెగుర నీకు ॥క॥

సజ్జనులను గూడి సహవాస మొనరింప
వారిగుణము నీకుఁ బట్టువడును
పూలలోని త్రాడు పూలతో వాసించు ॥క॥

చెడుగు మొలక యెత్త ఛేదింపు వెంటనే
వేళ్ళుబాఱ నీకుఁ 'కాళ్లు' చాఁపి
కళ్ళెమిడక యెట్లు వెళ్ళురా గుఱ్ఱంబు ॥క॥

దీక్షలేకయున్నఁ దీఱఁబోదే పని
దీక్షితునినె ప్రోచు దేవుఁడెలమి
దీక్షఁగాదె వ్రాసె దీనిని రెన్నాళ్ళ ॥క॥

సాధువేషమూని సంసారములు గూల్చు
జోగికాళ్ళఁ జేరి భోగవతులు
పొలము లూరులందుఁ బోర్లుదుర్ కుమతులై ॥క॥

అవియె శబ్దములును నవియె భావములైనఁ
బదుగురొక్క కథనె పాడనిమ్ము
కూర్పునేర్పుచేతఁ గ్రొత్తవౌ కావ్యముల్ ॥క॥

పొట్టగడవకున్న ముప్పైత్తు; కాదేని
నిట్ట్రుపాసమేని నెమ్మినుండు
మిల్లమండఁబోకు మెప్పుడు నత్తింట ॥క॥

విద్యయున్న నొక్కఁ విప్రుఁడే కాదురా
శూద్రుఁడైనఁగాని శోభఁగాంచు
విదురుఁ డెన్నఁబడుట విద్యచేతనె కదా ॥క॥

ఎవ్వఁడేని నిన్ను నేదేని యొకమాట
యన్నయట్టు లొక్కఁ డనిన వెంటఁ
జిట్టు బుట్టు మనక చిఱునవ్వు నవ్వుమీ ॥క॥

పల్లెటూళ్ళయందు వాసంబు చేయుచో
నజునినైన వాని యబ్బనైన
గూళజనులుపట్టి కోర్టులకెక్కింత్రు ॥క॥

నగల నాణెములను దగిలించు నన్నాళ్ళ
మగల మగువలెంతో మమతఁగాంత్రు
నిక్కమైనప్రేమ నెలఁతలకుండునా ॥క॥

ప్రియుఁడు ప్రియము గూర్చి ప్రేమించి తిరిగిన
కొలఁది నెలఁత మిగుల వలచిపోలచు
వలపు కత్తెగూడు వాఁడెపో ధన్యుండు ॥క॥

ఆఁడుబిడ్డపుట్ట నందఱు నిందింత్రు
పుట్టు గుట్టులెల్ల రట్టు పెట్టి
[illegible] ॥క॥

ప్రక్క ఒక్క రైతు పండించుకొనుచేను
భాగ్యమున్నదంచు బదులు పెట్టి
లాగఁజూడకయ్య దాఁగదు పాపంబు ॥క॥

చంటిబిడ్డ కేఁడు చనియెడుసందాఁక
భార్యతోడ మాఱు పలుకఁబోకు
పచ్చికాయఁగోఱుక భావ్యంబుకాదురా ॥క॥

జూదగానితోడ వాదంబులాడకు
అంకుటాలితోడ బొంకఁబోకు
కత్తితోడసాము గావింపఁబోకుమా ॥క॥

వాయసమ్మునొద్ద వరశౌచభావంబు
త్రాగుఁబోతునొద్దఁ దత్త్వచింత
పేడివానియొద్ద బీరంబునుండునా ॥క॥

మాటుపెట్టకుండ మందుద్రిమ్మంగెడుస్త్రీయు
చాటుగోటులేని సానిదియును
హాటుబూటులేని యాంగ్లేయుఁడుండునా ॥క॥

మూలగాలివీవ ముసురు తప్పదుసుమ్ము
తుమ్ము రొంపపాలి సొమ్ము సుమ్ము
కొండగాలివీవ కురియదు వర్షంబు ॥క॥

భూమినిచ్చినిన్నుఁ బోషించి నాతని
రామకృష్ణయంచు రాత్రిపవలుఁ
దలఁచుచుండవలయు దైవంబుగానెంచి ॥క॥

భూమినిడ్డవాఁడు పుత్రినిచ్చినవాఁడు
దైవసములటంచుఁ దలఁపవలయు
దాతకన్న వేఱ దైవంబులేఁడురా ॥క॥

గంజిలేకయేడ్చు కాంది శీకులఁగాంచి
జాలిలేక తఱుము క్రూరునకును
గోటులేరులున్న గోఁటేమిలేదురా ॥క॥

జారకాంతఁగాంచి జారుండు మోహించి
సుళ్ళి చిక్కి చచ్చు దిక్కులేక
మంటఁగాంచి భ్రమసి మడియదా శలభంబు ॥క॥

పెండ్లిగాకయున్న వెలయుము వడుగుగాఁ
గులముకొఱఁత దానిఁ గోరఁబోకు
సెంటునందు నుల్లి చేర్చుట తగదురా ॥క॥

బిడ్డలున్న వెనుకఁ బెండ్లాము పోయిన
మాఱుపెండ్లి యెపుడు కోరరాదు
గోడకిడినయండ యూడక యుండునా ॥క॥

పన్నుమీఁదఁబన్ను బాధించి కట్టుచుఁ
గలధనంబుఁబీల్చి జలగలట్లు
దొరల పొట్టఁబెట్టు దోషులనేమందు ॥క॥

పొత్తములను గూర్చి హత్తించు వేళల
సొమ్ముసరిది ప్రేమఁ జూచువెవఁడు
రమణ మూర్తి సతనిఁ బ్రణుతించి మ్రొక్కరా ॥క॥

కన్నతల్లి చచ్చెఁ గట్టుచేఁ దలతెగి
కొడుకు చచ్చె విసపుఁ గూడు మెసవి
తల్లిపిల్లలకును దగవిడుధనమేల ॥క॥

భక్తిగల్గుటకును వయసుతోఁ బనియేమి ?
భగవదిచ్ఛయున్న భక్తి గలుగు
భక్తికలుగునాఁడు ప్రహ్లాదుఁ డెంతుండె ? ॥క॥

ఎత్తువారి యింట నెసఁగెడు బిడ్డండు
పరిభవంబు సైఁచు వాఁడు గాఁడు
ధ్రువుఁడు చిన్ననాఁడె రోషించె గురులపై ॥క॥

సౌఖ్యపడుము మంచు సంసారమునయందుఁ
దలఁచుచుండువారు విరసమతులు
తానమాడ నబ్ధిఁ దరఁగలు తగ్గునా ॥క॥

పిల్లవాఁడె యైన గొల్లవాఁడైనను
జదివినంత కవిత ముదము గూర్చు
ద్రాక్ష నాల్కసోఁక దీవ మూరకుండునా? ॥క॥

తనదు దేశజనులు దనియని పాండిత్య
గరిమమేల దాని పరువదేల?
తండ్రిఁ బ్రోవనట్టి తనయుండు తనయుఁడా? ॥క॥

కాసు వీసమీని మోసగాండ్రను గాంచి
మూఢమతులు తలఁచు మొక్కుచుండు
చలువరాతి కేల చక్కిలిగింతలు? ॥క॥

ఉష్ణదేశమందు నుండెడి వారలు
బూట్లు తొడుగుకొనఁగ నేల?
ఎండ తాఁకు మేను దండిగా మెఱయును ||క||

చేఁత సొమ్ము లేక చేయకు బేరంబు
ఈఁత రాక పోకు మేటి నీటఁ
జేఁత గాని పనిని జేయకు మెన్నండు ||క||

గురుని శిక్ష లేక మెఱయండు శిష్యుండు
తెలివి యెంత యుండి తేజరిలిన
సానఁ బట్టకుండ సరికాదు రత్నంబు ||క||

చాటులంచమిచ్చి యోటర్ల కోసమై
మెంబరగుచు నరుఁడు మెలఁగరాదు
మట్టిబొమ్మ చీరఁ గట్టినఁ బల్కునా ||క||

మెంబరయినవాఁడు మెదపక పెదవిని
గూరుచుంటకంటెఁ గొదువ లేదు
సిగ్గుచేటుగాదె పగ్గచాలని పని ||క||

ఒకని క్రింద నుండు నుద్యోగికెన్నండు
స్వేచ్ఛయుండ దెట్టి వేళయందు
స్వేచ్ఛ నిచ్చు కృషిని చేసికో నిరతంబు ||క||

సజ్జనుండు తాను జలిపెడు కార్యంబు
నెగ్గకున్న మరల నెగడుచుండు
అదుము కొలఁది బంతి యాకసం బంటదే ||క||

చెడ్డవాఁడు తాను జేసెడు కార్యంబు
నెగ్గకున్న వెంట నేలయంటు
మట్టిముద్దనైన మట్టిలో మన్నాను ||క||

శరదృతువునయందు స్వచ్ఛమౌ గగనంబు
నరణిగాఁగ నుండు జ్ఞానియెడఁద
కాళరాత్రిగాదె కూళల హృదయంబు ||క||

గొప్పకులమునందుఁ గుత్సితుం డెట్లు
పుట్టి పెరుఁగఁబోఁడు పుడమియందుఁ
బద్మరాగఖనిని బ్రభవించునా గాజు? ||క||

చదువుకొనెడువానిఁ జదువఁగా నీయక
చెంత కొందఱుండి చెఱుప్రచుంద్రు
మేయు ఖరము జెఱుపఁ గూయు గాడిదలట్లు ||క||

దేశనాయకుండు తివిరి కాఁ గోరుచోఁ
ద్యాగియౌటకన్న దారిలేదు
త్యాగి యోగులకును భోగుల లెక్కేమి? ||క||

భాగ్యవంతుఁ డెప్పుడు పడయంగ నేరఁడు
నిత్యమైన యట్టి సత్యపథము
గొందెనుండు గూబ పొందునే వెలుతురు? ||క||

ఒక్కయతని పాటు పెక్కండ్రు తినుచుండ
నెట్లు వృద్ధిఁగాంచు హిందుజాతి?
బెల్లము రవచుట్టు వేలాడి చీమలా? ||క||

తినగఁ దిండి లేక తిప్పలు పడుచుండి
పూర్వవైభవములు పొగడికొంద్రు
చేతగాని వారు నీ! యేమి కర్మమో? ||క||

కాలనియమముననె గమనించు వారికి
రోగమేల వచ్చు రోజు రోజు
నియమహీనునకును భయమెట్లు తప్పురా ||క||

పసులు నండజములు పసిమీఱ ఋతువేళఁ
గలియుచుండుఁగాని కర్మమేమొ
కూళజనుల కొక్క వేళని లేదురా ||క||

మాతృభాషయందు మాటాడ నేరని
వానివిద్య యేల జ్ఞానమేల?
యింట గెలువలేక యెటుగెల్చు రచ్చల ||క||

మనుజుఁ డొకఁడు దాను మాటాడు వేళను
నడుమ నింక నొకఁడు నుడువరాదు
వ్రాయువాని కలము పట్టుకోరాదురా? ||క||

తినఁగఁ దిండిలేక కనెదరు బిడ్డలఁ
బందులట్లు జనులు వందలుగను
దిక్కులేక తిరిగి తిరిపెంబు నెత్తుచు ||క||

ఆస్తిలేని మనుజుఁ డధిక సంతానంబు
కనుటకంటె నూరకొనుట మేలు
బలుసుకూర దినుచు బ్రతుకువారుందురా? ||క||

హిందు దేశమందు హీనులై బ్రతికెడు
ఒక్కవారు సంతు పడయకుండఁ
దెలిసినంత నట్టు తెలుపుచుఁదిరుగరా ॥క॥

పొట్టకేమి లేక మెట్టవేదాంతముల్
చెప్పికొంచుఁ దిరుగు శాస్త్రజనులఁ
బ్రభువులైనవారు దండింప వలయురా ॥క॥

ఘనుఁడు పలుకువేళఁ గావింత్రు నీచులు
శుష్కవాదములను జోద్యమేమొ
జంగమయ్యఁగాంచి శ్వానంబు లఱవవా ॥క॥

కూడుగుడ్డకేని కొఱగాని చదువులు
చదువనేల? బడికిఁ జనఁగనేల
కాళ్ళుపిసికియైన కాసునార్జింపుమా ॥క॥

కర్మచేత బ్రహ్మ గావించు సృష్టిని
విష్ణువూనె నెన్నొ వేషములను
కర్మవిడిచిపెట్టఁ గాదురా యేరికి ॥క॥

ముక్కుమూసికొంట మోఱకఁదనమురా
ముక్కుమూఁత నేమి మోక్షమబ్బు
తపసుచేతఁ గూడఁ దానగు కర్మంబు ॥క॥

గీతయెల్ల నీవు గిలకొట్టి చూడుమా
కర్మయోగమునకె ఘనత హెచ్చు
కర్మలేకయున్నఁ గాదురా యేదియు ॥క॥

అర్జునుండు శంకనందిన సమయాన
నేమి బోధచేసెఁ గృష్ణమూర్తి
కర్మకొఱకె కాదె కావించె గీతల ||క||

పుట్టినట్టిచోట గిట్టఁగావలెనను
చెడ్డతలఁపు నెపుడు చెందకన్న !
దినము గడచుచోటె జననభూమని యెంచు ||క||

ఇంగిలీషువార లెచ్చటఁబుట్టిరి?
యేలలేదె మనదు హిందుభూమి?
సౌఖ్యమున్నచోటె జన్మభూమగుఁజుమీ ||క||

నీచవృత్తి నెపుడు నెగడఁగా బోకుము
పెద్దచూపె లోనఁబెట్టుకొనుము
సింహ మెప్పుడేని జింకలఁ జీల్చునా? ||క||

గుడ్డిగవ్వయైన గడ్డిపోఁచైనను
విడువకుండ ధనము పెంచవలయు
క్షణముగూడ విడక చదువఁగా వలయును ||క||

రాజపుత్రుఁడౌచు రాణించు నాతఁడు
దైన్యవృత్తిలేక తనరవలయు
దైన్యవృత్తియున్న ధరణీశుఁ డెట్లౌను ||క||

పల్లెపల్లెయందుఁ బంచాయతులు పెట్టి
మనల మనమె యేలికొనఁగవలయు
సఖ్యపడిన జనులు సాగని దేదుండు? ||క||

కృషిని మించునట్టి వృత్తియొక్కఁడు లేదు
కృషికువల్లఁగాదె యెల్లజనులు
కుడువఁగూడుఁ గట్టగుడ్డలు గాంతురు ॥క॥

లంచమడిగి జనుల వంచింపఁ బోకుమీ
లంచగాఁడు మఱియు రంకుటాలు
జాతినొక్కటంచుఁ జాటింత్రు మానవుల్ ॥క॥

కూలద్రోయకున్న ఘోషాయటంచును
జీఁకటిండ్లమూల స్త్రీలనెప్పుడు
గడ్డిగాదె లనెడు కథలుండ వప్పుడు ॥క॥

నగలకొఱకు ధనము తగలఁబెట్టఁగరాదు
తగవులకును గాలు ద్రవ్వరాదు
ఇచ్చివగవరాదు తృణమాత్రమైనను ॥క॥

మెచ్చఁగోరి యెప్పుడు మేలుచేయఁగరాదు
పొగడికలకు నెప్పుడు పొంగరాదు
కుడిచియింట నరక కూర్చుండఁగారాదు ॥క॥

విడువఁబోక జలము విఱిగిన ద్రేలిపైఁ
దీపిమాటలాడు దేబె గనకు
కంచుగరుడసేవ గావింపగానేల ॥క॥

మీసములనుబట్టి మెలివెట్టఁగారాదు
తగని వేషములను దాల్పరాదు
రాజరాజు చెలిమి రాణింపఁ గాఁబోదు ॥క॥

పుట్టినింటఁ బడతి యట్టె యుండఁగరాదు
గుట్టు నెప్పుడు బైటపెట్టరాదు
పుట్టలోనఁగట్టి పెట్టిపోడువరాదు ||క||

పయనమందుడబ్బు పైనిడిపోరాదు
శయనమందు గొడవ సలుపరాదు
అయనమందు నొకఁడె యరుగఁగా రాదురా ||క||

శత్రువలఁతియైన క్షమియింపఁగారాదు
ఏమిచేయుంనచు నెంచరాదు
పాముపిల్లయంచుఁ బాలిడి పెంతురా ||క||

తప్పుపని యొకండు తాఁజేసి లోకులు
చెప్పికొనక యుండఁ జేయుటెట్లు ?
లోకములను మూయ మూఁకుడుకల్గునా? ||క||

క్షుద్రుఁడైనవాఁడు క్షుద్బాధ నేడ్చిన
బట్టెఁడన్నమేని పెట్టఁబోరు
కుక్క యేడ్చెనేని మిక్కిలి పెట్టరు ||క||

ప్రబలుఁడైనవాని బ్రతిమాలి బ్రతిమాలి
విందులాచరింత్రు వివిధగతుల
మావటీఁడు గజముఁ బ్రోవఁడే బ్రతిమాలి ||క||

కాముకునకు సిగ్గు కాంచనార్థికి దయ
కలికమునకునైనఁ గానరావు
చదువు గోరువాఁడు సౌఖ్యంబుగోరఁడు ||క||

కడుపునిండ నిడక పడఁదన్ని వాజిని
బండి తోలువాని బట్టితెచ్చి
కండె తుండెములుగ ఖండించఁగావలె ॥క॥

అధికమైనప్రజ్ఞ యమరిన మనుజుండు
అణఁగి మణఁగి యుండు నవనియందు
పండినట్టివెన్ను పైకుండఁగాఁ బోదు ॥క॥

చేనుపండునంచుఁ జేయకు మప్పును
దానసీకు ముప్పు దాఁపరించు
మెఱపుచూచి చెఱవు చెఱుపంగవచ్చునా ॥క॥

మాఁడిమాఁడి చెట్లు నీడలిచ్చెడునట్లు
నీళ్ళ నిచ్చునట్లు నీరదములు
ఘనులు మేళ్ళుతాము గావింతు రొరులకు ॥క॥

ఇంటికేఁగఁ గానె యిల్లాలు తినుటకుఁ
బెట్టకున్న దానిఁ గొట్టువార
లెట్టి జన్మమెత్తి యేపాట్లు పడుదురో ॥క॥

అధికభోజనంబు నాచరింపఁగరాదు
అధిక సంగమంబు ననువుగాదు
అధిక నీరపానమైనఁగూడదు సుమ్ము ॥క॥

మొదలు చెడ్డబేర మొదవింపఁగారాదు
తెలియనట్టి పనిని దెలుపరాదు
తన్నుమాలినట్టి ధర్మంబు గూడదు ॥క॥

సాహసంబు లేక సాగదేకార్యంబు
సాహసికుని మించు శక్తి లేదు
సాహసానఁ బీత చంపదే కొంగను ॥క॥

ఇష్టమానసముల నెసఁగిన వేళయే
స్వర్గలోక మగును జంపతులకుఁ
దగవు లాడువేళ తప్పక ప్రళయంబు ॥క॥

ఇంగిలీషువారి యేర్పాటులన్నియుఁ
జేయఁగలుగునాఁడె చేయువలయు
నాత్మదేశమేలు నట్టియత్నంబులు ॥క॥

ఆంగ్లజాతిఁగాంచి యాచరించెడునట్టి
కార్యజాతమెంతో కలదుమనకుఁ
దెలిసి తిరుగవలయుఁ దెల్లంబుగాదాని ॥క॥

పూర్వ గౌరవంబు పొగడుక బ్రతికెడు
నట్టివాఁడు వట్టి మట్టిబొమ్మ
వస్త గొప్పఁజెప్ప బండిత పుత్రుండుఁ ॥క॥

పిలువనట్టిపనికి వెడలఁగారాదురా
చెప్పనట్టిపనిని జేయరాదు
కొఱవితోడఁ దలను గోఁకికోఁదీఱదు ॥క॥

నిలిపియుంచరాదు మలమూత్రముల నెప్డు
జబ్బులెన్నొ దానఁ బ్రబ్బుచుండు
నభిఘరించకుండ నన్నంబు దినరాదు ॥క॥

భరతదేశమందుఁ బండెను ధాన్యముల్
పెక్కులుండఁగాను వెఱ్ఱిజనము
తురకకూడు కొఱకుఁ బరువుల నెత్తును ||క||

పట్టుదలను వీడ భావ్యంబు గాదురా
పట్టుదలనుగాదె వ్రాసినావు
రెండునాళ్ళలోన దండిసీశతకంబు ||క||

చాకుముక్కలైన సల్పనేరని వారు
క్ష్మాతలంబులేలు కాంక్షనుండు
ఉట్టి కెగురలేక యుప్పరం బెగురునే ||క||

శుభ్రమైన గుడము శోభిల్లుచుండఁగాఁ
బాడు పంచదార వాడ నేల
భార్యకన్నఁ బడపుఁ బడఁతియే రుచిగదా ||క||

స్నానమాచరింపు చన్నీళ్ళతోడనే
పచ్చికూర తినఁగ భద్రమగును
కాయగూరలందుఁ గలదురా బలమెంతొ ||క||

పచ్చిపాల యందె బలమెచ్చుగా నుండుఁ
బుచ్చుకొనుట లెస్స పచ్చిపాలు
నేయికన్న వెన్న నిజముగా బలమిచ్చు ||క||

కూరలందు మిగులఁ గారంబు గూడదు
పులుసు మిగుల వాడఁ బొలుపు తగ్గఁ
దీపి యందె మిగులఁ దోషంబు గలదురా ||క||

తలఁపరాదు తినఁగ మరబియ్య మెన్నండు
కాఫి టీయుఁ ద్రావఁ గడఁగరాదు
వేఁడి నీళ్ళు త్రావ వెట్టెత్తు నిజముగా ||క||

పథ్యమనుచుఁ వేళ పరిధవిల్లుట లేదు
వలయునంత తినుటె పథ్యమగును
పథ్యమగును జుమ్ము వస్తుజాలంబెల్ల ||క||

కూడు లేక యింట మాఁడుచుండుట కంటె
వలసపోయినైన బ్రతుకవలయుఁ
దెలివియుండెనేని దేశమంతయుఁ బైఁడి ||క||

బుద్ధి బలము లేని భుజబలమేటికి
పాఁడిపంటలేని పల్లె యేల
కూర లేని యట్టి కూడేల రుచియించు ||క||

మందుగుండులేని మారణ హోమంబు
పందిఁ బొడువలేని బంటుతనము
కందిపప్పులేని విందును మెఱయునా ? ||క||

రాటమింటనున్న రాదురా లేమిడి
మాట మంచిదైన మాఱులేదు
చాటులేనివాఁడె సజ్జనుఁడౌ జుమీ ||క||

చన్నుఁబాల నిమట్టి సౌందర్య హాసంచుఁ
బోతపాలు పోయు మాతలెల్ల
ప్రీతి నీతిలేని పీనుఁగు ముండలు ||క||

కలముచేతఁ బట్టి గడగడ లాడించుఁ
గవివరుండు లోక గణములెల్లఁ
గవికి జడియనట్టి భువినెవఁ డున్నది ||క||

వైద్యు లెంతమంది వర్ధిల్లుచుందురో
జబ్బులన్ని ధాత్రిఁ బ్రబలుచుండు
మురికినీరు హెచ్చఁ బురుగులు హెచ్చురా ||క||

కష్టసుఖము లనఁగ గావడికుండలు
ఒకటివెంట నొకటి ప్రకటమగును
ఖేదమోదములకుఁ గేలొగ్గఁగారాదు ||క||

కార్యకారి కెంతొ కాలంబు గల్గురా
కార్యశూన్యునకును గాలమేడ ?
కార్యకారిగామి కార్యంబుగాదయో ||క||

ధనము గల్గువాఁడె దైవంబు గురువును
ధనము గల్గువాఁడె ఘనుఁడు బుధుఁడు
కాన ధనముఁగూర్పఁ గావలె మనుజుండు ||క||

పుట్టఁజేసినట్టి యట్టిఁడే పోషించుఁ
దిప్పలాటయేల తిండికొఱకు
నంచు మాటలాడ నష్టంబు గాదురా ||క||

వాయి, కడుపుఁ గట్టి రోయంగ నెల్లరు
ధనముఁ గూర్పనేమి ఘనతగల్గుఁ
బరుల మోపుమోయు వానికి సుఖమేమి ||క||

దొంగతనముకంటె దోసిలొగ్గుట మేలు
పొలియుటుత్తమంబు ముష్టికంటెఁ
బ్రాణహానిమేలు మానంబువిడుకంటె ||క||

సద్వివేకహీను స్వామిని సేవించి
బ్రతుకుచుండుకంటె వనములందు
మౌనవృత్తినూని మసలుటమంచిది ||క||

మానహానియొకటె గాని నౌకరునకు
నఖిలహానియగును యాచకునకు
నన్నభోజియెవఁడు యాచించు నొరులను ||క||

రోగమేదికూడ లోఁగింపఁగాలేదు
పాములేని భయము పఱుపలేవు
పేదతనమెనుమ్ము పీడించు మనుజుని ||క||

ఆశయొకటిగాదె యర్థికిఁ బేదకు
భేదమౌచునెందు వెలుఁగుచుండు
నాశలేకయున్న నందఱుధనికులె ||క||

ఎఱిఁగి యెఱుగనట్టి యింగ్లీషుముక్కల
నాలిగింటనేర్చి నరులు తాము
ఉభయభ్రష్టులౌచు నూరేఁగుచున్నారు ||క||

పెరటిలోనఁబండు పెండలముండఁగా
"పోర్కు" కొనఁగనేల మూఢమతికి?
పుల్లకూరయైనఁ బొరిగింట రుచియించు ||క||

సద్విమర్శలేక సలిపిన కార్యముల్
మూలహాని తెచ్చు ముఖ్యముగను
ముంగిఁ జంపలేదె మున్నొక్క మనుజుండు ॥క॥

నీతిలేనివాఁడు నిందలపాలగు
నీతి గలుగు వాఁడు నెగడుఁ గీర్తి
నీతిలేక యున్న నీకేమి లేదురా ॥క॥

ఒకరి పనినిగూర్చి యూరేగు వేళలఁ
బైన ఖర్చు నిడ్డుఁ బద్దు వ్రాసి
వారిముందుఁబెట్ట వదలురా బరువెల్ల ॥క॥

పరిజ్ఞలేక యేల బలుబుగ్గ మీసాలు
పెంచి తిరుగుచుండు వెఱ్ఱివాఁడు
బారెఁడేసి లేవె నీరిలో రొయ్యకు ॥క॥

వఱపు కఱవు లెపుడు వచ్చునో తెలియఁగా
ధాత కేనిగాని తరముగాదు
భాగ్యరేఖ నరుఁడు పడయుట తెలియదు ॥క॥

కరుచు చేసికొనెడు జ్ఞానంబు గలిగిన
యతని కెంతయున్న నధిక మగును
అతిగ వ్యయముసేయు నాతఁడె నిజుపేద ॥క॥

వచ్చు ధనము రెండు వంతులుగాఁ జేసి
సగము ధనమె ఖర్చు సలుపవలయు
మూఁడు పాళ్ళకంటెఁ గూడదు ఖర్చిడ ॥క॥

వ్యసనములకు లొంగు వానికి నరకంబు
స్వాగతంబు నిచ్చు క్షణము క్షణము
వ్యసనములను గెల్చు వాఁడెపో ధన్యుండు ||క||

తీర్థయాత్రలంచుఁ దిరుగాడ నేటికి
జ్ఞానమున్న యట్టి మానవుండు
ఆత్మశుద్ధిలేని యాత్రల నేమగు ||క||

చిన్నతనమునందుఁ జెప్పిన నీతులు
పిల్లవాని యెడఁద యెల్ల హత్తుఁ
గ్రొత్తకుండ రంగు గూర్చిన వెలుఁగొందు ||క||

కాలు జాఱెనేని క్రిమ్మఱఁ గూడును
నోరు జాఱెనేని తీరిరాదు
మౌనమూను వానిమాట మాణిక్యమౌ ||క||

భూతి నొసలి నడుమ బొట్టిడ నేమాయె?
గుడిసెలందుఁ దూరు కుటిల జనుఁడు
కొంగ జపము సల్పుకొనుటెందుఁ గంటిమి? ||క||

నీచుఁ డెప్పుడేని నెగడఁడు ఘనుఁడౌచు
ఘనుఁడు నీచుఁడగుచుఁ గ్రాలఁబోఁడు
ఉల్లి యుల్లి సుమ్ము మల్లి మల్లియ సుమ్ము ||క||

గురువులొక్కరీతిఁ గఱపిన పాఠాలు
మంచివారియందు మించి మెఱయు
క్షేత్రమును బట్టి చెలువొందు విత్తులు ||క||

పనులఁ దోమకుండఁ దినరాదు వేనిని
గనులు త్రిప్పి స్త్రీలఁ గాంచరాదు
ఘనులయొద్ద నెపుడుఁ బనిలేక పోరాదు ॥క॥

పరుల కాజ్ఞ యిచ్చి పరఁగుట కంటెను
బరునియాజ్ఞ మెలఁగ భద్రమగును
లొంగి తిరుగువాఁడె లోకాలఁ గెలుపొందు ॥క॥

ఏ దినంబు కార్య మా దినంబున యందె
నిలువయుంచకుండ సలుపునట్టి
మనుజుఁ డెపుడు గాంచు మఱిమఱి విజయాలు ॥క॥

మంచిపనులు సేయఁ గంచియులెన్నియో
దారి కడ్డమగుచుఁ దగులుచుండు
వాని సరకుగొనని వాఁడెపో జయమొందు ॥క॥

ధర్మకార్యములను దగ సల్పువారికి
విఘ్ననాథు లెదుట వెలయుచుంద్రు
విఘ్నములను దాఁటి విజయంబు గొనవలె ॥క॥

ఎప్పుడేని గాని యేదేని వాగ్దాన
మిచ్చువాఁడు ముందె యెంచవలయు
ఎంచి చేయు పనికి నేహానియును రాదు ॥క॥

చిన్నపనికి గాను జెన్నపట్నముదాఁకఁ
దేప తేప కురుక తిరుగరాదు
తిరుగ నేర్చినట్టి చరణంబు కుదురునా ॥క॥

పెద్దవేషమూని పెండ్లిండ్లకోసమై
పద్దు వ్రాయుచుంద్రు బచ్చులింటఁ
దప్పు నొప్పులేని దద్దమ్మ లెందును ॥క॥

దోసతోఁటవోలెఁ దులతూఁగు నింటనె
కన్య నీయవలయుఁగాని యెప్డు
బిడ్డ గొడ్డులేని వియ్యంబు గూడదు ॥క॥

పూసలందుఁ ద్రాడు పోలిక మనుజుండు.
పొసఁగ మెలఁగవలయుఁ బుడమియందు
విఱ్ఱవీఁగి తిరుగ వీటిడియందురు ॥క॥

ఒక్కఁడేడ్చుచుండ నొక్కఁడు నవ్వఁగ
జగము చరితమెల్ల జరుగుచుండుఁ
బొద్దు గుంకుచుండఁ బొడమదే జాబిల్లి ॥క॥

ఇచ్చకాలు చెప్పి యెసఁగెడు వారలే
రాజులొద్ద దఱచు రాణగాంత్రు
చీము నెత్తురున్నఁ జేయరు ప్రభుసేవ ॥క॥

అచ్చుయంత్ర వితతి పెచ్చుపెరిఁగినట్లె
చెత్తపత్త్రములును జెందె వృద్ధిఁ
గుక్కగొడుగులట్లె కొన్నాళ్ళ కవి ప్రమగ్గు ॥క॥

కట్టుజుట్టుఁజూచి కంగారు పడరాదు
గుట్టు, మట్టు తెలిసి కొనెడుదాఁకఁ
బెద్దగంగడోలు వృషభాసకుండదా ॥క॥

అందగాఁడుగాని యర్భకుఁగనుగొని
యొరులునవ్వఁ బితలు మురియుచుంద్రు
కాకిబిడ్డకాదె కాకికిరత్నంబు ॥క॥

కులమునందు నొకఁడు గుణవంతుఁడుండినఁ
గులమువారలెల్లఁ గొమరుగాంత్రు
కోడలెఱుపుద్రైనఁ గోవెల్ల నెఱుపౌను ॥క॥

కవిని బైదుఁబెట్టఁ గాదురా వ్యాకృతి
కవిని బట్టియద్ది గ్రాలుచుండుఁ
గవుల కంకుశంబు గానఁగారాదుపో ॥క॥

ఇల్లుదాఁటకుండ నెన్నెన్ని విషయాలు
చూచినట్లువ్రాయు సూరివరుఁడు
సూర్యుఁడైనఁ గనని చోటులు కవిగాంచు ॥క॥

జ్ఞానిఁ గాంచఁగానె వానికి మ్రొక్కుమా
చిన్నపెద్ద యంచు నెన్నఁబోకు
ఏగుఁగెంతయున్న నెఱచి నిందింతురా ॥క॥

రెక్కలుద్భవిల్లి పిక్కటిల్లు చెదలు
పోల్కిఁగాఁగ జగతిఁ బొడముచుండ్రు
బుల్లిబుల్లిగాంధు లెల్లెడ నీనాఁడు ॥క॥

ఒక్కకానికైన నుద్యోగి కాఁగోరు
రెక్కయార్చి బ్రతుకఁ డొక్కఁడైన
బొరియనుండు నెలుక పోవునా బయటికి ॥క॥

డొక్కశుద్ధి కొఱకు నక్కరాలొక రెండు
నేర్వఁగానె మొఱకు నిక్కుచుండు
బొల్లు వెన్నుపైకిఁ బొటమరించుకయుండు ॥క॥

కాళ్ళుపైకిఁ బెట్టి గగనంబు సాఁపఁగాఁ
దీతువు జతనంబు తివిరి సేయు:
బుడమినుద్ధరింప మూర్ఖుండు దలపోయు ॥క॥

కుడిచి కూరుచుండఁ గూడదు వేనికి
దొసఁగు లెన్నొ దానఁ బొసఁగుచుండుఁ
బడిన మచ్చదుడువ బ్రహ్మకు వశమానె ॥క॥

ఓగులోనె యోగు లొడఁగూడుచుండును
ఇంచు కేని రాదు మంచి యపుడు
గోరుచుట్టుమీఁద నే రోకలిపడును ॥క॥

భార్యతోడఁ బడక బైరాగియగువాఁడు
దిక్కులేక చచ్చుఁ దిరిగి తిరిగి
మంద పీసు కోఁతి మడియదా వెఱ్ఱెత్తి ॥క॥

రాచబాటనుండి పక్కఁగాఁ బోవలె
నడుమ నచుడువాఁడు పడును బాధ
ఉడుప మెక్కియుదధి యుత్తరింపఁగరాదు ॥క॥

పెద్దసభల కీవు వెడలి కూర్చుండుచోఁ
దగిన యాసనమె కొసఁగవలయును
అనువుగానిచోట నధికత్వమేటికి? ॥క॥

చిన్నతనమునందు శృంగార గ్రంథముల్
చదువఁబోకు నీదు మదిచలించు
నీతిలేని నవల చేతఁబట్టఁగరాదు ||క||

ఈఁగ వల్ల నెల్ల రోగముల్ పరిభవిల్లు
నీఁగ వాలినట్టి యిల్లులేదు
ముటికి లేకయున్న ముసరరావీఁగలు ||క||

భద్రమగుచు నుండ భాస్కర లవణాన
నింగిలీషు మందు నేల వాడ ?
మహిని బెరటి చెట్టు మందుకు రాదుగా ||క||

పాలు పంచదార బహువిధ భోజ్యముల్
కరము దినుచు రాచ కార్యములను
జూడనట్టి జేంబ్లు క్షోణిభారముగదా ||క||

అద్దమందు వదన మగపడునట్లుగాఁ
దానె పుత్రుఁడౌచు ధరణిఁ బుట్టుఁ
దన్నుఁదిద్దుకొన్నఁ దనయుండుగుణియౌను ||క||

చెవికి నోరుగట్టి చెనఁటులు బోధించు
చెడ్డమాటలకును చెవులనొగ్గి
మంచివారినెల్ల మరలింత్రు ప్రభువులు ||క||

అధిక గుణములున్న యాతని యొద్దను
జెడ్డయొక్కటున్నఁ జెఱుపుగాదు
చంద మామయందు జానొందదేమచ్చ ? ||క||

నరుని బాగుచేయ నారాయణుండు తా
వివిధ కష్టములను బెట్టుచుండుఁ;
గొడుకు కురుపుఁగ త్తిఁ గోయఁడే జనకుండు ||క||

పుత్రుగన్న వాఁడు పుణ్యాత్ముఁడని చెప్పు
గ్రంథజాలమేక కంఠముగను
నూఱుమందిలేరె కౌరవేశ్వరునకు ||క||

గురువునందు భక్తి గుదిరిన వానికె
శాస్త్రజాలమెల్ల సరవినబ్బు
నేకలవ్యుఁడెట్లు వృద్ధిగాంచెనో చూడు ||క||

కార్యసాధకుండు కావించు పనులను
ఒక్కదానివెంట నొక్కటిగను
ఓపికున్న వాని కుర్వి బంగారమౌ ||క||

చేవలేనియట్టి లావేమి లాభంబు
చేవగల్గు పనులు చేయవలయుఁ
జేవలేని బ్రతుకు సీకాకు కాదొకో ||క||

ప్రశ్న మొకని నడుగఁ బ్రశ్నోత్తరమొకండు
చెప్పుకంటె వేఱ సిగ్గులేదు
తెలివి తక్కువైన దీర్ఘమౌ నాఁకలి ||క||

ఒకఁడు వ్రాయునట్టి యుత్తరం బెన్నండు
తొంగి చూడరాదు దొంగ యట్లు
దొంగబుద్ధివాని దూషింత్రు లోకులు ||క||

పురుషుఁ డన్యకాంతఁ బొందఁగా వచ్చునా?
మెలఁత మగని విడిచి మెలఁగరాదె?
ఏమిసంప్రదాయ మేమిశాసన మిది? ||క||

కార్యఫలము నొందఁ గాంక్షించు మనుజుండు
తేఁటి తేనెగొ్రలు తీరుగాను
ఎదరికందకుండఁ గృషిచేసికొనవలె ||క||

పరమశాస్త్రములను బరిపూర్ణుఁడగు వాఁడు
తొణఁకు బెణఁకులేక తుఱఁగలించుఁ
గుండనిండ నీరముండినఁ దొణఁకునా ||క||

అందముండఁబోవ దైనింటి వారికి
ధనము సున్న యగును దాతలకును
బుద్ధిలేని వారె పుడమినిఁ బాలింతు్రి ||క||

సంఘసభలు తఱచు జరుగుచునుండిన
దోషజాలమెల్లఁ దొలఁగిపోవు
సంఘశక్తికన్న శస్త్రంబు లేదురా ||క||

మాటిమాటికేల మందులు ప్రమింగఁగాఁ
బ్రకృతిచేతఁ బోవు బాధలెల్ల
బ్రకృతి మించునట్టి వైద్యుంఁడు లేఁడురా ||క||

వయసు వచ్చినంత వంకరకాళ్లైన
దిన్నఁదనముచేతఁ దేజరిల్లుఁ
బాకివాఁడు మెఱయు భాగ్యంబు కల్గిన ||క||

నేమమింతలేని నామంబు లుంచిన
వెంగళప్ప యంచు వెక్కిరింత్రు
నేమమున్నవాని నిందింపఁగాఁ బోరు ||క||

ఎదిరి మాయఁజేయ రుదురాక పేరులు
గంగిరెద్దువోలెఁ గట్టనేల?
భక్తవరుని కేల బాహ్యావేషంబులు ||క||

సర్వలోకములకు జననియై భాసిల్లు
నమ్మవారికేల యజల బలులు
తల్లి పిల్ల మెఱచి తాఁదిన నెంచునా ||క||

ఆడి తప్పరాదు హరిహరాదులకైన
నాడి తప్పువాని గాడిదంద్రు
మాటపడుటకంటె మరణంబు మేలౌను ||క||

కాల్వగట్టులందుఁ గాలిబాటలయందుఁ
బచ్చగడ్డిమీఁద నుచ్చ మలము
విడిచిపెట్టరాదు వెఱ్ఱివాఁడైనను ||క||

అధిక వినయముండు నాతని నెన్నండు
నమ్మి యుండరాదు సుమ్ము ధాత్రి
నధిక వినయముండు నాతండె ధూర్తుండు ||క||

ఒకనిఁజెఱుప నాత్మ నూహించు నాతండు
తప్పకుండఁ జెడును ముప్పుమీఁడి
తాను ద్రవ్వు గోతఁ దాఁబడు నిక్కంబు ||క||

ఎవ్వఁడేని మనుజుఁ డేదేని పాపంబు
చేసెనేని యద్ది చెఱచువాని
నిప్పు గల్లు కట్ట నీఱగు నిక్కంబు ||క||

చెడ్డవారితోడఁ జేరిన వారికిఁ
గీడు తప్పకుండ మూఁడుచుండు
బంధ మొందెఁ గంధి పంక్తికంఠుని గూడి ||క||

అగ్నియందుఁ బడ్డ నబ్ధిలోఁ బడ్డను
పర్వతాగ్రమందుఁ బడినఁగాని
పూర్వపుణ్యఫలము పురుషుని రక్షించు ||క||

సాహసంబులేక సాగదే కార్యంబు
సాహసంబు వదలఁ జనదు సుమ్ము
సాహసాన వ్రాసె శతకంబు రెన్నాళ్ళ ||క||

వారకాంతలుండు వైవాహికోత్సవ
మందు ముందు నడువ వందలుగను
ద్రోపులాడు జనులు దోషంబు నందరా ||క||

వారకాంత లన్నఁ బడిచచ్చి వారికై
పొలము పుత్రలమ్మి పోసి ధనము
కూడులేక తుదకుఁ గుండెదర్నీచులు ||క||

వారకాంత నొసట వ్రాయఁగా లేదురా
పడుపువృత్తిచేతఁ బ్రతుకు మనుచు
సంస్కరింపరాదె సానుల సుజనులు ||క||

రామ రామ రామ యేమి పాపమొగదా
మానవమ్మి బ్రతుకఁ బూనుకొనుట
మానవమ్ముకంటె మడియుటే మేలుగా ||క||

ఆటవెలఁదులార! యీ గానకళఁ బ్రోవ
స్రష్ట మిమ్ము జగతి సృష్టిచేసె
నంతేకాని మానవమ్ముగాఁ గాదమ్మ ||క||

భావమునకు నచ్చు వారినిఁ బెండ్లాడి
ప్రణయరాజ్య పట్టభద్రిలగుచు
ఖ్యాతి నందరాదె గాణలా వేశ్యలు ||క||

పల్లు త్రోముకొనఁగఁ బల్లెటూళులయందు
"బ్రిష్షు" లెందులకును వాడవలయు
వరడు పులిని జూచి వాఁతపెట్టు కొనినట్లు ||క||

సారమింతలేని సంసారమునయందు
సారభూత యొక్క సతియె సుమ్ము
పతికిఁ దగిన సతియె పరఁగిన స్వర్గమా ||క||

"సోక్రటీసు" వంటి శుద్ధ వేదాంతికి
మొట్లమారి దాని పొందుఁ గూర్చి
మాలదైవమేమి మడిమాన్యములుఁ బొందె ||క||

శతుని వంచవలయు శౌర్యంబుచేతనే
మంచితనముచేత మరలఁబడఁడు
లొట్టిపిట్టతూల రోకలిచేఁ బోవు ||క||

సాధ్యపడని పనులు సాధింపఁగా రాదు
పట్టుదల వహించి జట్టుపట్టి
బోడిజుట్టునెట్లు మోఁకాళ్ళ ముడివైతు ॥క॥

నృపుల సమ్ముఖమున నెరసులెంచఁగ రాదు
దాన నిజము ముప్పు దాపరించు
నింటి దీపమనుచు నెవ్వఁడు ముద్దాడు ॥క॥

తనదు లోటులున్నఁ దగఁగప్పిపుచ్చుచు
నెదుటివానిలోటు లెంచరాదు
తీఁగతీయఁగానె తీగెళ్ళబా డొంకెల్ల ॥క॥

పదుగురొక్క పనిని బాగ యోజించుచో
నందునొకనిఁబిలిచి ముందునకును
జెంతఁజేరియెపుడుఁ జెవికొఱుకఁగ రాదు ॥క॥

తేనె యిడినకత్తి తెఱఁగున దీపించు
వానిజోలికెప్పుడు వలదుపోవఁ
గందురీఁగఁబట్టఁ గఱవదా చేతిని ॥క॥

కార్య మేదియేని కాసంతకాఁగానె
సంతసాన నెప్పుడు గంతులిడకు
మిల్లు నలుకఁగానె యెల్లాను పండుగు? ॥క॥

మందబుద్ధివాఁడు మంత్రియైయుండిన
రాజతంత్రమందుఁ బ్రముఖుఁడగునె?
తెప్పసాకగుణము తెలిసికోఁగల్గునె? ॥క॥

జరుగఁబాటుగల్గు జనునితోఁ బోరాట
తక్కువయ్యెకెపుడు తగదుసుమ్ము
పేదవానికినుక పెదవులచేటురా ॥క॥

కాలగతినిబట్టి కలుగకమానదు
ఘనులకైన లేమి కనుల ముందె
పూవులమ్ముచోటఁ బుడకలమ్ముటగల్గు ॥క॥

సత్కవిత్వమల్లఁ జాలినఁ జాలురా
రాజ్యమేలు తలఁపురాదునీకు
రాజకంటె ఘనుఁడురా సత్కవీశుండు ॥క॥

ఆతతాయినెప్పు డాదరింపఁగరాదు
ముక్కు చెవులుగూడఁ జెక్కవలయు
రాలరువ్వువానిఁ బూలరువ్వఁగరాదు ॥క॥

ఎట్టిరూపు గోరి యీశ్వరుఁ గొల్తువో
యట్టిరూపుతోడ నతఁడు పొల్చు
నెట్టిపేరఁ బిలుతొ యట్టులే యో యను ॥క॥

పంచదారతోడ వర్తకుఁ డెన్నెన్నొ
చిత్రవస్తువులను జేయునట్లు
విష్ణువెల్లకడల వెలయురా వేర్వేఱ ॥క॥

కనక మొక్కటైనఁ గరఁగించి చేయుట
వేఱువేఱుగతుల వెలయునట్లు
భిన్నరూపములను విష్ణుండు వెలయురా ॥క॥

తానుజేయు దోసఁగు తప్పని చెప్పెడు
వాఁడులేని యట్టి పట్టణంబుఁ
బాప మెఱుఁగనట్టి వాఁడెపో సాధువు ॥క॥

ఇనుక, పంచదార యేకమై యున్నచోఁ
జీమ పంచదారె చెంగిలీయు
చెడుగువీడి మంచి సేకరించు బుధుండు ॥క॥

చెడ్డవస్తువూడ్చి దొడ్డదానిని గూర్చు
చేటవోలె సుగుణి చిత్తమెప్డు
సుస్వభావముననె శోభిల్లుచుండురా ॥క॥

వ్యసనసక్తకంబు వదలిన యప్పుడె
జడతవీడి నరుఁడు జ్ఞానియగును
రాగి యెన్నఁడేని యోగిగా మాఱునా ॥క॥

జగము మెచ్చుకోరి సత్కార్యముల నెన్న
నరులు తఱచుగాను నడుపుచుంద్రు
కష్టమింతరాఁగఁ గాళ్ళను చాతురు ॥క॥

స్ప్రింగుమంచమట్లు వంగుచు లేచుచు
నుంటగాని జనుల కండఁబోదు
తిరముగాఁగనుండు దేవదేవుని భక్తి ॥క॥

సాధుసన్నిధికిని జనియున్న యప్పుడె
లౌకికుండు మెఱయు వీఁకతోడఁ
గొలిమినున్న యప్పుడె వెలుఁగొందు నినుమట్లు ॥క॥

ఊతఁగొంచి యెంతో యుత్సాహముసఁ బోయి
చేపలెన్నో యందుఁ జిక్కుకొనును
జగమునందు నట్లె జనుఁడును జిక్కురా ॥క॥

సన్ననూకనేల జాఱిచి జల్లెడ
ముతకనూకఁ గొనెదు విత్తముగాను
మంచివిడిచి చెడ్డ మన్నించు నీచుండు ॥క॥

చమురులేక యెట్లు నసిమీఱ దీపంబు
వెలుఁగఁబోదో యట్లు పృథ్వియందు
మాధవుండులేక మనుజుండు బ్రతుకండు ॥క॥

రాతిపై నినీరు ప్రీతితోఁబోసిన
నెట్లుగర్భమునకు నేఁగఁబోదో
యట్లె మొఱకునాత్మ నంటదు సద్బోధ ॥క॥

నరునిదేహమందు నారాయణుండు దా
నంటియంటకుండ నడరుచుండుఁ
బిచ్చికారిఁగట్టు వెలయదా భిన్నమై ॥క॥

మట్టిముద్దమీఁదఁ బెట్టవచ్చును ముద్ర
రాతిమీఁదఁజెందు లాఁతివిధము
భక్తునంటుబోధ పామరు నంటదు ॥క॥

మనుజుఁడెట్టిరీతి మనవలె నందువో
యట్టిరీతినీవ యరుగవలయు
నీకుఁగానిదాని నేర్పకు మేఁటికి ॥క॥

ప్రాఁకియలమిక్కొన్న చీఁకటి పదుప్పులు
చిన్నదీపముననె చెదరునట్లు
భగవదాజ్ఞచేతఁ బాయురా పాపాలు ॥క॥

స రి గ మ ప ధ ని స లు సరిగవీణెనుగూర్చి
పాడుటెంతొ శ్రమమొ మతముగూర్చి
చెప్పినట్లుతాను జేయుటకష్టంబు ॥క॥

చెడ్డమంచికంపు స్వీకరించియుగాలి
వానినంటకుండఁ బరఁగునట్లు
క్షితినినంటకుండ సిద్ధుండు తిరుగురా ॥క॥

మతముమీఁదభక్తి మలసిన యాతఁడు
ఇతరమతమునెప్పు డేవఁగనఁడు
సర్వసమతలేక జ్ఞానంబు మెఱయదు ॥క॥

కోడలధికభక్తి గురువులఁ జుట్టాలఁ
గొలుచుకొనుచు ధవుని గొలుచునట్టు
లాత్మదేవుఁగొల్చి యన్యుల దూఱకు ॥క॥

చాకివానియొద్దఁ జాలబట్టలుగల్గు
నొక్కటైనవాని దుండఁబోదు
స్వీయముచింతలేని జనుఁడెసూ చాకలి ॥క॥

పాపమెన్నఁడేని దాఁపఁగా దాఁగదు
మూలమూలలంటి పోవుఁగాని
పాదరసముదిన్నఁ బట్టదా నోళ్లు ॥క॥

బంకమట్టి ధాత్రి బహుభాండరూపముల్
పొందునట్లు హరియుఁ బొందుచుండు
మూర్తులెన్నోవాని మూలంబు నెఱుఁగురా ॥క॥

గొప్పవాని కెపుడు గోపంబు గలుగదు
కలిగెనేని క్షణము నిలువఁబోదు
నీటిమీఁదివ్రాలు నిలుచునా తిరముగా ॥క॥

భాగవతుని గాంచ భక్తి జ్ఞప్తికివచ్చు
దానముక్తిగలుగుఁ దప్పకుండ
గాంధిఁగాంచ దేశ గౌరవం బుదయించు ॥క॥

బంధ ముక్తిలేక పరఁగుచు మనుజుండు
చేరు చోటుగనక చీకుచెందు
బంధ ముక్తుఁడొక్క పరమేశ్వరుఁడెచుమ్ము ॥క॥

గురువు లెందఱేని దొఱకుదుర్ ధాత్రిపై
నర్హ శిష్యుఁడుంట యరిదిగాని
గురువు శిష్యవిధము గుఱుతించి తిరుగురా ॥క॥

యోగివర్తనంబు యోగికే తెలియును
యోగిగానివాని కూహయెట్లు ?
నూలువర్తకుండె నూలు నాణెమెఱుంగు ॥క॥

స్వార్థ రహితులైనవారి యత్నంబులు
కొఱఁత లేకయుండఁ గొనలుసాఁగు
సదులయందునెట్లు నాఁచుద్భవించురా ॥క॥

చిన్నబిడ్డవోలెఁ జెన్నారు భక్తుండు
వస్తువాహనములు వానికేల
కుత్తుకెత్తియార్చు నత్తగాడ్డవనిపై ॥క॥

శుష్కవాదములను సారెఁదిచేయు నతండు
భక్తిరసము చవిని బడయకుండుఁ
దేనెగోలినట్టి దేఁటి "జుమ్మ" నుగాదె ॥క॥

ద్రాక్షఫలము రుచిని దానెఱింగినవాఁడు
చింతపండుమీఁదఁ జిత్తమిడఁడు
బ్రహ్మమెఱుఁగువాఁడు బాహ్యంబు కోరఁడు ॥క॥

పద్మనేత్రు కృపకుఁ బాత్రుఁడైన నరుండు
కోరఁబోఁడు వస్తుకోటినెపుడు
కోరునెట్లురాజు కోమలి నీచను ॥క॥

భక్తుఁడైనవాఁడు వైరాగ్యచింతచేఁ
దన్నానంగు భగవదర్పితముగ
విడిచిరాక చీమ మడియదే శర్కర ॥క॥

తన మతంబెగొప్ప దనుకొను మూఢుండు
పెఱమతమ్ము లెఱుఁగు విధములేక
కూపమందునున్న కూర్మంబు పోలిక ॥క॥

బరువు కలుగువైపు వంగును త్రాసున
బరువులేనివైపు పైకిఁబోవు
సుజన కుజనులిట్లు శోభిల్లుచుందురు ॥క॥

గీటురాతిమీఁద గీసిన తోడనే
పైఁడి యిత్తడియును బైటఁబడును
సుజన కుజనులందు నిజమిట్లు తెలియురా ||క||

ఒక్కరీతిగానె యుండురా వసుధలో
జ్ఞానిబోధలెల్లఁ బూని గనిన
చిలుక పలుకులెల్ల దలఁప నొక్కటెరీతి ||క||

ఐంద్రజాలికునకు నాప్తుల మన్ననల్
కలుగనట్లు మతము గఱపువాని
నాదరింపరెందు నాప్తులౌ జనములు ||క||

సత్యమైన జ్ఞాన ఝంఝానిలము రేఁగ
వర్ణభేదమడఁగు వసుధయందు
గాలివాన రేఁగ క్ష్మాజ భేదములేదు ||క||

పాపియైనవాఁడు భగవంతు నమ్మిన
రూపుమాయు వాని పాపసమితి
సూర్యరశ్మిసోఁకి శోషిల్లు గుంటలు ||క||

మెఱుకమీఁదఁ జేప మెలఁగెడు నట్లుగ
సత్సమాధియందు జ్ఞానియుండు
జ్ఞానిజాడ తెలియ శక్యంబుగాదురా ||క||

జాఱుపాట్లులేక జనుమెందు లేఁడురా
భక్తిమార్గమందుఁ బంచజనుఁడు
పడకయుండనెట్లు నడచురా బాలుండు ||క||

బాతునీరమందుఁ బలుమార్లు మునిఁగినఁ
జెమ్మ దానికింత చెందఁబోదు
సిద్ధుఁడట్టె జగతి జీవించుచుండురా ॥క॥

సంచితార్థమెల్ల జలజాక్షుసన్నిధి
ధారవోసి జ్ఞాని ధన్యుఁడగును
రైలువేయు వాఁడు లక్షలు వెచ్చించు ॥క॥

మలిన దర్పణమున మార్తాండు కిరణములు
సారకయుండునట్లు మొఱకు నెడఁద
బోధమించుకేనిఁ బొలుపొందఁ బోదురా ॥క॥

అచ్ఛదర్పణమునయందు నిను కరముల్
సొచ్చినంత మిగుల శోభఁగాంచు
మంచివాని యెడఁద మించురా సద్బోధ ॥క॥

సత్కవిత్వమిట్లు సలుపఁగా నెవ్వాఁడు
అడ్డులేనిధార యధిక కరుణ
నిచ్చినాఁడొ వాని నెంచరా సతతంబు ॥క॥

వేషధారియైన విద్యార్థి కేపాటి
చదువుకొనుటయందు శ్రద్ధయుండు ?
ముసిఁడిపండునందు పసయేమి యుండురా ॥క॥

పయనమేఁగువేళఁ బామరుల్ కొండఱు
విధవ యెదురుగాఁగ వెళ్ళఁబోరు
విధికృతంబునందు విధవలు లేరురా ॥క॥

ధనముతోడ నెవఁడుఁ దల్లిగర్భమునుండి
పుట్టలేదు తుదిని బొంది చనఁడు
నడుమవచ్చు సిరికిఁ దడఁబాటులేలరా ॥క॥

నెత్తిమీఁద ఘటము నిల్పి నృత్యముసేయు
వాని భావ ముంఘు దానియందె
భక్తు హృదయ ముండుఁ బరమాత్మునిమీఁదనే ॥క

నీచుఁ డొక్కవేళ నెగడిన పైపైని
చెడుగునందె వాని చిత్తముండు
శవముగాంచి వ్రాలు సరగున గృధ్రంబు ॥క॥

ఘనత నొందియున్న మనుజుండె యొకవేళఁ
జిన్న చెడ్డపనికిఁ జీకుఁజెందుఁ
బులుపు సోఁకినంత విఱుగవే క్షీరముల్ ॥క॥

కమ్మ, రెడ్డి, రాజు, కాఁపను భేదముల్
గలుగ దేశ సభలు వెలుఁగునెట్లు ?
దేవుదృష్టిలోన లేవురా భేదముల్ ॥క॥

పల్లెపల్లెయందుఁ బరపతి సంఘముల్
వెలసి మెఱసెనేని పేదవారు
కూడులేక యుండ మ్రాఁడరు ధాత్రిపై ॥క॥

కూటి కుండయొద్దఁ గుదురుగాఁ గూర్చుండి
వంటచేయ ధాత వ్రాయలేదు
స్త్రీల నొసట వారిఁ జీకాకుపెట్టకు ॥క॥

ఊహాకందరాని యుద్యోగములఁ గూర్చి
వ్యర్థమైన శ్రమము పడఁగరాదు
అందనట్టి పండ్లు కట్టులెత్తఁగనేల ||క||

స్వీయభాషయందె స్పీడసల్ వాదించు
భాగ్యమాంధ్రభూమి పడయునాఁడు
నిక్కమైన స్వేచ్ఛ నెలకొను నానాఁడె ||క||

కార్యకరణమందు కంగారుపడరాదు
తొందరొందఁ బనులు డిందు సుమ్మి
కారునడుపువాఁడు కంగారు చెందునా ||క||

వరవిమానమందుఁ బయనించునట్టుగా
నవ్య భారతమున నరులకెల్ల
జీవితంబులేఁగు శీఘ్రగమనముతో ||క||

శాంతి దాంతు లుడిగి సకలమానవులకుఁ
బోరులధికమయ్యె నూరనూరఁ
గోర్కె హెచ్చుకొలఁది కుట్రలు హెచ్చురా ||క||

వెంటఁ బడవలెన్నొ వేల్పలాడఁ బొగరోడ
గొనుచు నేఁగునట్లు జనులనెల్ల
మాయ కంధినుండి మళ్ళించుకొను హరి ||క||

అర్థమెఱుఁగకున్న హరినామకీర్తన
మనుజుఁ దప్పకుండ మనిచితీరు
మనుచుఁగాదె మందు తనపేరు తెలుపకే ||క||

ప్రాణమున్న నరుని వలతు రెల్లరుగూడ
శవముఁగాంచ నెవఁడు చనును జగతిఁ ?
పక్షి లేనియట్టి పంజరమేటికి ? ||క||

గురువునమ్మకున్నఁ గుదురదు జ్ఞానంబు
గురువుమనుజుఁడనుచుఁ దలఁపఁబోకు
గురువు గురువు గురువు గుఱుతించి మ్రొక్కరా ||క||

అవనిభక్తుఁడొకఁడె యవధాని యనఁజెల్లు
నెన్నిపనుల నాతఁ డెనఁగిన హరి
పూజసతము జరుపు; బుద్ధి చెదరనీక ||క||

ఎవ్వఁడెట్టు లెంచు నీశ్వరుఁ డట్లుండు
వడుగు స్తనము గాంచి కుడుమనుకొను
కవి తలంచు నిమ్మ కాయలటంచును ||క||

వసుధకన్న వేఱు పఱుపు లక్కఱలేదు
పడియ నీరెయగును పానకంబు
కరమె దిండు సుమ్ము జ్ఞానికి శయనింప ||క||

మంత్ర మౌషధంబు మానావమానముల్
ధనము సంగమంబు దానములును
నాయు వింటిగుట్టు చేయకు వెల్లడి ||క||

ఉదర పూరణంబె మదినెంచి తిరుగకు
సార్థమేమిదాన జన్మమునకుఁ ?
గాకి కన్న నీకు ఘనత యేముండుగా ? ||క||

నామ మిడినయంత నారాయణుఁడుగాఁడు
భక్తిలేనియట్టి పామరుండు
తలను'టోపి' దాల్ప దాసరి దొరయౌనె ॥క॥

సత్యమార్గమందుఁ జరియించువానికిఁ
గంటకంబు లెచటఁ గానరావు
చెప్పులిడ్డ కాళ్ళఁ జెఱచునా వేఁడిమి ॥క॥

ఖ్యాతిగోరి దేని గావింపఁగా రాదు
కోర్కెయున్న నణఁగు గుణము లెల్లఁ
గోర్కెలేనిసేఁత పేర్కొను తనయంత ॥క॥

మూర్ఖు లెద్దియేని బోధించి చెప్పిన
సరగ నద్ది యెపుడు సలుపఁబోకు
దున్న యీనె ననఁగ దూడఁ గట్టఁగఁ బోకు ॥క॥

కావ్యమందు నొక్క కాసంత తప్పున్నఁ
గావ్యఘనత యెల్ల గంగఁ గలియు
బొల్లియున్న మేను బొలుపెట్లు పొందురా ॥క॥

ఒక్కపనిని జేయుచుండుచో నది మాని
మాఱుసేయరాదు మాఱుసేఁత
రెండునాళ్ళపూఁట నిండెనే శతకంబు ॥క॥

ఆలోచన

జగతిలోనఁ దాను జన్మించు టేటికో
యేమి సలుపవలెనో యెల్ల యపుడు
దెలిసి తిరుగువాఁడె దీపించు లోకాన ॥క॥

మనుజుఁ డెపుడు దాను మాటాడు ప్రతిమాట
యోఁచి యోఁచి మఱియుఁ దూఁచి తూఁచి
పలకవలయు దాన భద్రంబు లొడఁగూడుఁ ||క|

ఆఁచి యుంచలేఁడ యాలోచనలు లేని
నరుఁడు తనదు నాల్క కరము దాన
మానహాని గలుగు మర్యాద నశియించు ||క||

ఫలము తలఁపకుండఁ బనిచేయఁగా నెంచు
వంచకుండు చెడక వఱలు నెట్లు?
కానకుండ గోయి కంచెను దాఁటుటా ||క||

మంచి యోజనలకు మనసొగ్గు మానుజుండు
సత్యపథముచేరి చక్కఁగాను
చేటుజెందకొందు మాటికి సౌఖ్యముల్ ||క||

అ ణఁ కు వ.

తానె తెలివి గలుగు ధన్యుండ ననుచును
గర్వమొందు నరుఁడు గాసిచెందు
నొకనిమించు తెలివి యొకనికి నుండురా ||క||

తాను మూర్ఖుడంచుఁ దలపోయు సుజ్ఞాని
చెడ్డ గర్వమునకు శిక్షచేయు
గర్వ మణఁగఁగానె కళ్యాణములు గూడు ||క||

సాధువర్తనంబు జ్ఞానంబునకు వన్నె
కూర్చుచుండు మిగులఁ బేర్చుచుండు
శుభ్రమైన బట్ట సుందరాంగికిఁబోలె ||క||

నీతిమంతు పలుకు నిజమును గై సేయు
మితము భాషణంబు మిగుల నతని
తప్పిదముల నుండి తప్పించు మెప్పించు ॥క॥

తనదు తెలివి నమ్మి దర్పంబు చెందక
చెలిమికాని పలుకు చెవులఁ జేర్చి
మంచి ఫలితములను మనసారఁ గొనవలె ॥క॥

తనదు పొగడికలను వినఁబోఁడు నమ్మఁడు
చంక లెగురనీఁడు జ్ఞాని నంచు
నణఁగిమణఁగియుండు నధికుండు ధాత్రిపై ॥క॥

వినయమునను గొప్పగుణములు శోభిల్లు
మేలిముసుఁగునందుఁ బ్రాలుగాచె
సుందరాంగకముల సౌందర్య మెంతెయు ॥క॥

గర్వి దెసలఁ గాంచి కరముల నూఁచుచు
నొరులు తన్నుఁ గాంచ నూహచేసి
మేఁకపోతువోలె మెలఁగుచు నుండురా ॥క॥

పేదవారిఁ గాంచి ప్రేమింపఁగాఁ బోక
నెత్తి నెగురవేయు నిక్కి గర్వి
పెద్ద లతనిఁ గాంచి పెదవులు విఱువరా ॥క॥

శీలమున్నవారి సిద్ధాంతముల గర్వి
గడ్డిపరకలట్లు గణన యిడక
తనదు యోజనములె తాఁబట్టి ప్రేలాడు ॥క॥

దంభరాశి యగుచుఁ దనుఁ దాన పొగడుక
పరులవలన నట్టి పదవి పొంది
తుదకు బ్రతుకుచేటు ఘోరంబుగాఁ గాంచు ॥క॥

పూనిక

వగవరాదు చిన్నపనికోస మెన్నండు
ముందుపనిని గూర్చి మురియరాదు
ప్రస్తుతమును గూర్చి ప్రయతింపఁ గావలె ॥క॥

ఈ క్షణంబు నీది యిఁకమీఁది కాలంబు
గర్భమందు నేమి కలదొ నీకుఁ
దెలియఁబోదుగానఁ జలుపుమా యోగంబు ॥క॥

దేనిఁజేయ నీవు పూనితో యద్దాని
శీఘ్రకాలముననె చేసికొనుము
నిలువయుంచఁబోకు కల పని క్షణమేని ॥క॥

ఒద్దికంబె నీకు బాధలు, లేమియుఁ
గలుగఁజేయుచుండు నిలుకడగను
మంచిపనులచేఁత మఱి సంతసం బిచ్చు ॥క॥

శ్రద్ధ యనెడు బలము రానీమ కొఱఁతల
శ్రమము పడెడి వారి జయము సిరియు
విడక కొలుచుచుండు వేయివిధంబుల ॥క॥

ఎవఁడు ఒద్దికంబు నవలఁగాఁ ద్రోయునో
వాఁడె ధనము, నుచ్చపదవి, ఖ్యాతి
గౌరవంబుఁ బొందుఁ; గాంచఁడు కొఱఁతల ॥క॥

బద్ధకంబువీడి బహుచాకచక్యాన
జీవితంబుగడవఁ జేయువాఁడు
ఇంద్రపదవినొంది యిహలోక సుఖమొందు ||క||

సద్గుణలిప్స.
శ్రేయమొందనీకు చిత్తానఁ దలఁతేని
నీదునూహలెల్ల నింగిదాఁకఁ
బెరఁగఁజేసి కరము వృద్ధినిఁ గాంచుమా ||క||

ఇప్పుడు నింగినంటు వృక్షంబు నొకయప్డు
నేలనణఁగియుండి నెగడెఁజుమ్మ
ఆకురాలఁజెట్టు లంకూరములనెత్తు ||క||

నీదు కృత్యమందు నీవె యగ్రిస్థాన
మందఁ దలఁతువేని యన్యజనుల
నిన్నుమించనీకు మెన్నకు నెఱసుల ||క||

మంచిపనులనిన్ను మించెడు నాతని
దూరదృష్టిలేక తూలనాడి
యణఁగఁ ద్రొక్కఁబోకు మన్యాయవర్తివై ||క||

మంచిదారినొరుల మించనెంచెడువాఁడు
ఉత్సుకతను బనుల నొనరఁజేసి
పటువు పంతమిడిన వాఁడుగా జయమొందు ||క||

అడ్డులెన్నియున్న ననసూయుఁడగువాఁడు
వృద్ధిచెందితాళ వృక్షమట్లు
ఖరకరాచ్ఛకాంతిఁ గన్నుల నిలుపును ||క||

గొప్పగొప్పవారి గూర్చి రాత్రులయందు
సూక్ష్మబుద్ధివాఁడు స్తుతియొనర్చి
పగళులందుఁదాను వర్తించు నారీతి ||క||

సద్గుణములలిప్పఁ జాలనుండినవాఁడు
పన్నగపలసెన్నొ పన్నిపన్ని
వానినొనరఁజేసి ప్రఖ్యాతిఁగాంచుమా ||క||

ఈర్ష్యయున్నవాని హృదయంబు కలికయి
క్రక్కుచుండుఁ జేదుఁ బ్రక్కవాని
ప్రాభవంబువాని స్వాస్థ్యంబు చెఱచురా ||క||

ఈర్ష్యకలిగి యొరుల 'హే'యను నాతండు
క్రుళ్ళిక్రుళ్ళియింటఁ గుమిలికుమిలి
కంటఁదడినిబెట్టి మంటిపైఁ బొరలురా ||క||

పరునిమంచివానిఁ జెఱచును; ద్వేషంబు
క్రౌర్యమతనియెడఁ గాంచుసతము
చిత్తశాంతివాని చెంతకు రాఁబోదు ||క||

మంచితనముమీఁద మఱిప్రేమ యుండదు
ఈర్ష్యగలుగువార లెంచుచుంద్రు
పరులుగూడఁ దమ్ము వంటివారేయని ||క||

తన్నుమించువారి నెంచుచు గుంచింప
వారుసలుపుట్టిన పనులకెల్ల
జెడ్డయర్థములను జెప్పు నీర్ష్యాళువు ||క||

కలిగియుండు చాల మెలఁకువ తుంటరి
తనము చూపుటకును దఱచునీర్ష్య
చెందియుండునట్టి చెన్నంటి మనుజుండు ||క||

ఏవ చెందియుండు రీ ర్ష్యాళుఁ గనిజనుల్
తన కుతంత్రములనె తానుజచ్చు
తనదు నల్లికలను జనిపోదె సాలీఁడు ||క||

దూ రా లో చ న.

కోరిచేయుమెపుడు దూరయోజనములు
సద్గుణముల కవియె సాధనములు
మానవునకు నవియె మార్గదర్శకములు ||క||

నీదునాల్క కీవు నెఱికళె మిడియుంచి
పెదవులకును రక్ష పెట్టవోయి
దాన శాంతికెపుడు హానివాటిల్లదు ||క||

ఒరుల తప్పిదముల నూహించినగు వేళ
నీదు తప్పిదముల నెమకిగనుము
నడువఁగలిగి నగుము పడువాని గతిగాంచి ||క||

వదరఁబోతు తనము వలదురా యెన్నండు
తాపమునకు నద్ది రూపమగును
మానమునకుఁజాలు మాణిక్య మెందుండె ||క||

వదరఁబోతుతనము వ్యధనుగల్గించురా
సంఘమునకు నెల్ల క్షణములోన
మాని ప్రల్లదములు పరిహాస్యమూలముల్ ||క||

నిన్ను నీవయెప్పుడు నెన్నుకోఁ బోకుము
ఎదిరికద్ది మిగుల సేవఁగొలుపు
నితరుఁ దూలనాడుటే హాని గూర్చురా ||క||

సరసమాడరాదు పసిమీఁటియెన్నండు
మృదువుమీఁటఁ దొంటి మితత చెడును
నాల్క నాఁచుకొనెడు నరుఁడుత్తముండురా |క||

దుర్వ్యయంబు సేఁత దుఃఖమూలంబగు
వయసులోనఁ గూర్పవలయు ధనము
వార్ధకమున కదియె పనికి వచ్చునుగాదె ||క||

చెడ్డపనుల కెల్ల క్షేత్రంబు లోభంబు
మితము వ్యయము సేఁత మేలిగొనసు
నీదుశ్రద్ధ యెల్ల నీపనిపై నుంచు ||క||

ఆటపాటలన్న హర్షంబు కనుఁజెంది
ధనము వ్యయము సేఁత తగవుగాదు
కనక హీననరుఁడు గవ్వకు కొఱఁగాఁడు ||క||

సిరుల పెంపు నీదు స్థితిఁ గప్పఁగానీక
మితము వ్యయము గూడ మిరింగునట్టి
కోరికలను దరికిఁ గూర్పకే తిరుగుము ||క||

లేనిపోని సౌఖ్యమూనఁ గానెంచినఁ
గొంతకాలమునకు వంత చెంది
జీవనమ్ము లేక చీకాకు పడవలె ||క||

పెఱల యనుభవముల గురితించి జ్ఞానివై
భంగములను గాంచి భంగముడిగి
దినము దినము మిగుల దీపించి తిరుగుము ||క||

సత్పరీక్షచేసి సరినమ్మ పెఱవాని
కారణమ్ములేని కలఁత నొంది
యందఁబోకు మెపుడు నపనమ్మకమ్మును ||క||

న్యాయవర్తనుండె యాదర్శకుఁడు నీకు
హృదయ మందువాని నెల్ల యపుడు
ద్రవ్యరాశివోలె దాఁచియుంచి కనుము ||క||

కీడు మేళ్ళు మఱియు చీడలు దుఃఖముల్
లేబరములు నొక్కరీతినుండు
జనుల కెల్లవానిఁ జెనకువాఁడె సుగుణి ||క||

స్థైర్యమొకటె కష్టజాలంబు సహియించి
నరుని దరికిఁజేర్చుఁ బరువుఁజేర్చు
నోంటవేఁడి యాఁకలోర్చి చను నెడారి ||క||

ఉన్నతాత్ముఁ డెపుడు ఖిన్నుండు గాఁబోఁడు
చెడ్డదైవమునకు చేతు లొగ్గి
విధివిలాస మతఁడు వివిధంబుగా నెంచు ||క||

స్థిరుని గష్టరాశి కలవరపఱుపదు
దెబ్బదెబ్బ కతఁడు తెప్పిరిలును
ఒప్పునఁ గల కొండ నుదధి కలంచునా ||క||

స్థైర్యమూను వాని చరణాలపైఁ బడు
విధివిధాన మెల్ల; వెలయు నతఁడు
కొండకొప్పు వోలె దండిగా శిరమెత్తి ॥క॥

చేరి యెదురుకొనుచు జీవితక్లేశముల్
కదన పీరునట్లు బెదురులేక
వానిఁ దొలఁగఁ ద్రొక్కఁ బనుపడు జయములు ॥క॥

పైని బడెడు కష్టపంక్తి దానొత్తిడి
క్రింద నొర్మి దింపు పొంది స్థిరుఁడు
దుస్సహతల నెల్లఁ దొలఁగించుకొను చుంపు ॥క॥

పిఱికివాఁడు తనదు పిఱికితనమ్ముచే
భేదతనమునకును బెండు వాఱు
తిట్లు మొట్లు వాఁడు తినునట్టి వంటకాల్ ॥క॥

కీడు సోఁక వంద గిజగిజ లాడురా
దారితెన్ను లేక దడను జెంది
గాలితాఁక రెల్లు గడగడలాడదా? ॥క॥

కష్టములకుఁ బంద కటకటంబడుచుండు
దుఃఖములకు మిగులఁ దూలిపోవు
వేఱ యాశలేక పీధిని బడిపోవు ॥క॥

సంతుష్టి.
మనదు నునికి నెడఁద మనవాంఛితమ్ములు
సద్దయా స్వరూప చారుమూర్తి
తగినయట్లు యిచ్చి తనుప్పురా బెంగేలః ॥క॥

పరములైన యట్టి వాంఛితమ్ములకును
న్యాయమైన యట్టి యత్నములకు
ఫలము ప్రాప్తి గలుగ భగవాను దయయుండె ॥క॥

నరుఁడు గర్వమునను మఱి తప్పిదములను
గలఁతపాటువల్లఁ గాంచుచుండుఁ
గష్టదుఃఖములను గడఁగానఁగా లేక ॥క॥

విధికృతంబు గూర్చి వెగటొందఁగా రాదు
సుఖము లేదు భాగ్యశోభవల్ల
సంకటాన్వితములు చర్చింప భోగముల్ ॥క॥

విసుఁగుఁ నొందబోఁడు వెగటొందఁగాఁబోఁడు
శాంతిలేని దుఃఖసమితిఁ గనఁడు
తనదు కష్టపాటు తలపోయురా పేద ॥క॥

పైకి సంతసమునఁ బరఁగెడు నరుఁ గాంచి
నాకు లేదటంచు నవయఁబోకు
వానిలోని దుఃఖవార మే మెఱుఁగుదు ॥క॥

కోర్కితోడఁ దృప్తి గొనుటయే జ్ఞానంబు
భాగ్యవృద్ధితోడ బాధ హెచ్చు
మనసు తృప్తినున్న మాణిక్యముల మూట ॥క॥

అధిక భాషలేల యకలుషానందంబు
మనుజు మాత్రునకును మందు కేని
దొఱకదంచు నమ్మి తిరుగురా సతతంబు ॥క॥

జలజనేత్రుఁ డెన్న సౌశీల్యమనునట్టి
పరుగు పందెమిడియె నరులకందు
నెగ్గువాఁడె చెందు నిత్యసంతోషంబు ॥క॥

ప్రత్యాశ — నిరాశ.

భావి లాభకాంక్ష ప్రత్యాశ కల్పించు
విరిసి విరియనట్టి విరులపోల్కి-
నెడఁద బెడద గూర్చు నెల్లచోట్ల నిరాశ ॥క॥

నీదు కృత్యమీవు నెఱవేర్చు పట్టున
నానజంట కెడఁద హర్ష దుఃఖ
ములను బొందకుండఁ దిరుగుమా ధీరత ॥క॥

సజ్జనుండు మృతికి జంకఁడు గొంకఁడు
ఱొమ్ము చఱచినచ్చుఁ గ్రుమ్ములాడఁ
దప్పులేనివాఁడు తలఁకునా హరికేని! ॥క॥

చిత్తశాంతివీడి తత్తరిల్లఁగఁ బోకు
మాశమీఁదనాశ నతుకుపఱచి
బుర్రిఁగుడు పడఁబోకు మూఢవిశ్వాసాల ॥క॥

భయము వల్లఁగాదె భంగమార్గాల్వాలు
భయము చెందనేల భక్తిమతికి ?
ధైర్యమూని చేయఁ దగనెగ్గు పనుల్లెల్ల ॥క॥

సంతోష దుఃఖములు.

హృదయ మెఱుఁగనట్టి ముదమొందఁగా బోకు
కుములఁ జేయునంత కుందుగనకు
మధిక హర్ష దుఃఖ మస్వాంబు గాదురా ॥క॥

సొదలు చెప్పువారి సొదలకు నిల్లైన
చెడుగు తోవఁబట్టి నడువరాదు
చెట్ట తనము నిన్ను క్షీణింపఁగాఁజేయు ॥క॥

కష్టజాలమెల్లఁ గంజాక్షు కరుణగా
నెంచువాఁడెయోగి యెంచిచూడ
కష్టములకుఁ గుర్రింగఁ గారాదురాయెప్డు ॥క॥

నరుని జీవితానఁ దఱచుగాఁ గష్టాలు
సంభవించు వాని సరకుఁ గొనక
తిరుగువాఁడె చూడ ధీరుండు వీరుండు ॥క॥

ఈదురంచుఁ దఱచు నేడ్చెడి మానవు
సిరులు చేరఁబోవు సిలుఁగు లొాదవు
సిలుఁగు లొాదవవాఁడు జీర్ణించిచచ్చురా ॥క॥

పిడుగు నెత్తిమీఁద బడుచున్న యప్పుడుఁ
దలఁక కధికతుష్టిఁ దలనునొగ్గి
స్థిరతఁజూపువాఁడె క్షేమంబులనుగాంచు ॥క॥

అతనికోప మతని నణఁచురా చెడగొట్టి
చుట్టుముట్టి యిండ్లఁ బట్టణముల
బడఁగఁగొట్టు పెద్ద సుడిగాలివోలెను ॥క॥

ఊరకుండు మీవె యుద్రేక మొదవుచో
నెట్టి పనిని గూడ ముట్టికొనక
కడు తుపానులోనఁ గంధిపైఁ బయనమా ॥క

కోపమునకు శిరము నేప్రొద్దు నొగ్గను
మానవుండు చెడును మాటలోనె
కోపి యోపలేక కోల్పోవు శక్తుల ॥క॥

అలుగు జ్ఞానహీనుఁ డవహేళనములకు
ప్రాజ్ఞుఁ డవలఁ ద్రోయు వానినెల్ల
గోప మణఁచుకొంటె గుణమేమియును లేదు ॥క॥

క ని క ర ము.

కరుణగల్గువాఁడు కనికరమున్ బూల
పేదవారిమీఁద వెదనుజల్లు
మాధవుండు పూల మహినిండఁ జల్లఁడా ॥క॥

కనికరమునుగల్గు జనుఁడోముఁ బేదల
కరుణలేనివాఁడు కటికవాఁడు
కటికవానినేల కరఁగించు ఛాగాత్రి ॥క॥

ధవుఁడు లేక: మఱియుఁ దల్లిదండ్రులు లేక
కట్ట గుడ్డలేక క్రాలువారిఁ
జేరఁ జేరి కరుణ జీవన మొసఁగుమా ॥క॥

పేదవాఁడు వ్యాధి బాధితుఁడై యుండఁ
గనియుఁ గననియట్లు చనఁగఁబోక
చేఁతనైన చేఁత చేయురా దయఁబూని ॥క॥

గుంట కనులతోడ నింటింటఁ దిరుగాడు
పేదవారిఁగన్న నీదుమనసు
కరఁగి నీరుగాదె కరుణాప్రవాహమై ॥క॥

న్యాయము మితభోగ త్యాగవినయములు
చెఱుపకుండ నీవు చేయుదేని
సిరులు నీకు నెప్పుడు సిలుఁగులఁ గూర్పవు ||క||

భావమందు శుద్ధి పల్కులఁ దీపును
పరువమందు నెంతొ మురిపెమునను
సొగసు చూపుగలుగు సుదతికి మ్రొక్కరా ||క||

శుభ్రవస్త్రమూని సోమరిగాకుండ
మితముగాఁగఁ దినుచు సతము సరళ
భావమైన సతికి భావాన మ్రొక్కరా ||క||

గీతములనుపాడి కీలించి పూవులు,
ఔచి తెఱిఁగి పలికి యణఁగి యుండి
సౌఖ్యశాంతులున్న సతులకు మ్రొక్కరా ||క||

చెడ్డనడత లేక గడ్డుతనములేక
వినయశీలములను వెలయు స్త్రీల
కన్న వేఱుస్వర్గమున్నదా యెటనైన ? ||క||

గలుగకుండఁ బనులు పొరిగిండ్ల కేఁగక
మగనియడుగులకును మడుగు లొత్తి
నిందలుడిగి తిరుగు నెలఁతకు మ్రొక్కరా ||క||

ఆడి పోయకుండ నాఁడుబిడ్డలఁ గూర్చి
యత్త కెఱఁగి మగని యాజ్ఞఁబూను
తరుణికన్న వేఱ దైవంబులేదురా ||క||

ప్రణయమూర్తి యువిద పన్నీటిపువ్వంటి
జవ్వనమును వ్యయము సలుపఁబోక
చక్కనైనదారిఁ జనవలె మనవలె ॥క॥

కలికుఁజూపు గలుగు మొలకులఁ గనఁబోక
వారు పల్కుకొంటె పలుకువినక
శీలవతిగ బ్రతుకు స్త్రీరత్నముత్తమ ॥క॥

నోరు విప్ప నపుడు శ్రీరంగనీతులు
చేత చేయునపుడు చెడిపెపనులు
గలిగి తిరుగరాదు కాంతల కెన్నండు ॥క॥

చుట్టనోటఁబెట్టి చొల్లును గార్చుచుఁ
దిరుగరాదు చుమ్ము తీవబోఁడి
తేనెబానలోనఁ దేయాకు నిడరాదు ॥క॥

పలుకులందుఁ దేనె తలఁపుల మృదులత
బట్టకట్టునందుఁ బరమరక్తి
కలుగునట్టి కాంతఁ గనుఁగొని మ్రొక్కరా ॥క॥

ప్రణయమునకు నిండ్లు పరిశుభ్రతకు దిండ్లు
సరసమున్న పండ్లు చెఱకు తుండ్లు
చదువుకొన్న చెంగ్లు సరికొ్రొత్త పూఁబోండ్లు ॥క॥

సుగుణరాశియైన సుదతి నర్థాంగగాఁ
బడయఁ గల్గువాఁడె భాగ్యశాలి
నాఁడెఁ దల్లియనెడు సర్భకుల్ ధన్యులు ॥క॥

గాంధి తిలకువంటి గారాబు బిడ్డలఁ
గాంచి దేశగరిమ మించఁజేయు
తరుణికన్న వేఱె ధన్యురా లెవ్వతె ॥క॥

దేశమునకెగాదు దేవునకునుగూడ
జన్మకారణంబు సతియకాదె
సతుల మతుల నెఱిఁగి సాఁకురా సతతంబు ॥క॥

విద్య నిచ్చు తరుణి విత్తమ్ము నిడుసతి
యగుటఁ జదువు ధనము మగువసొమ్ము
అట్టి స్త్రీకి మ్రొక్క నఘములెట్లుండురా ॥క॥

జాతు నెఱిఁగి మఱియు సత్త్వాలఁ గనుఁగొని
గార్హ్య పత్య మీవు గడపె దేని
స్వర్గమట్టులుండు సంసారమంతయు ॥క॥

సారహీనమైన సంసారమందున
సుఖము పొందనెంచు సుజనవరుఁడు
తన్నుఁబోలె సతిని నెన్నుకోవలెఁ జుమీ ॥క॥

సుగుణరాశియైన సుదతిసద్భర్తయుఁ
బుత్రకులును గూడఁ బుణ్యతములు
తల్లులకును దల్లి తరుణికి మ్రొక్కరా ॥క॥

పొమ్ముగలిగి మఱియుఁ బొందికయును గల్గి
యిల్లు దీర్చునట్టి యింతికంటె
వేఱె త్రాత మెవరు వివరించిచూడఁగా ॥క॥

కార్యకౌశలంబు గలిగిన పూఁబోఁడి
భార్యయగుటకన్న భాగ్యమెద్ది?
స్త్రీలజాతు లెఱిఁగి యేలుకో నేర్పుతో ॥క॥

గురువులకును గురువు కోమలి యే సుమ్ము
ఆదిగురువెయైన యమ్మ కెఱిఁగి
పూజచేసి తేనిపోవురా పాపముల్ ॥క॥

కష్టములనుగూడఁ గళ్యాణములు చేసి
భర్తకష్టములను బాపివైచి
పరిణయ నాకమందు పరుఁదేల్చు స్త్రీధన్య ॥క॥

ఎడఁద నెడఁదయందు నేకంబుగావించి
కష్టసుఖము లొకటిగాఁగ సలుపు
రామగన్నవాఁడె రాముండు ధాత్రిపై ॥క॥

చిత్తశుద్ధిగలిగి శీలంబు మంచిదౌ
సుదతిఁ బెండ్లియాడ శుభము లొదవు
నాప్తురాలుగాని యర్ధాంగిఁ గోరకు ॥క॥

లేనిపోనినింద మానినిపైఁ బెట్టి
కష్టపెట్టుచుంట కాదునీకు
తల్లి చెల్లెలట్లు తరుణిని గాంచరా! ॥క॥

ఒప్పిదమున భార్య తప్పిదమునుదీర్చి
చక్కఁబఱచుకొనుట చనును బతికిఁ
గార్యమునను దీర్పఁగడఁగుట దోషమౌ ॥కం॥

ఇంతికుండు సహజమ్మృదులత తలపోసి
సున్నితంపు సొబగు నెన్నికనిన
మందలింపఁబోఁడు మర్యాదవిడి భర్త ||క||

తల్లిదండ్రులట్లు తరుణియుఁ బురుషుని
పేర్మిఁ బాలుగొనుట, వెట్టిమొట్టి
తగవు లెన్నొకలుగుఁ దత్త్వంబు తెలియురా ||క||

వెన్నెలందుఁదేలు కన్నెల సొబగును
పిల్లలందుఁగల్గు విన్నఁదనము
దెలిసి మురియువాఁడె వరకవియనవొప్పు ||క||

గాజుగ్లాసులోనఁ గళలూరు దీపంబు
కరణిఁ, గవులయందుఁ గవిత మెఱయుఁ
బరులు దానివెలుఁగు పరికించి మనవలె ||క||

గుడులు గోపురములు గూలినఁ గూలినఁగూలును
సత్కవిత్వమెపుడు చచ్చిపోదు
అక్షరములుక్షరమునందునా యెపుడేని ||క||

సత్కవిత్వమల్లఁజాలినఁ జాలురా
రాజ్యమేలు తలఁపు రాదునీకు
రాజుకంటె ఘనుఁడురా సత్కవీశుండు ||క||

జయతు జయతు నిత్యం వెల్లపూడ్యన్వవాయో!
వితరణగుణధుర్యో రామకృష్ణాభిధేయః
జయతు జయతు నిత్యం దుర్గమాంబాద్వితీయ
స్సకవిజనవిధేయ స్సెల్లురాట్కాన్యగేయః||

## పండితరాజు వచనకృతులు

ఉత్తర రామాయణము 1943
గోరువంక 1948
మొగలిరేకు 1948
గాంధిశీలము 1948
నవకథావలి 1947
మనస్విని 1947
రత్నసుందరి 1947
ప్రతిజ్ఞ 1951
విజ్ఞాన సాగరుఁడు 1934
రతి రహస్యము
తపోభూమి 1945
నవజీవనము 1949
ఆంధ్రౌన్నత్యము 1954
వ్యాసావళి 1930

## తెలుఁగురాజు కృతులు

రెండవభాగము

(త్వరలో)

1 పతిభక్తి
2 రాజానందము
3 హరికారికావళి
4 పద్యకథలు
5 కీచక వధ
6 కరుణకము
7 జ్ఞానాంజలి (రెండవ భాగము)

—• ప్రచురణకు •—

"శ్రీ విక్రమ విలాసము"

తణుకు.

రాయల ముద్రణాలయము, తణుకు — 1954